

# నాలుగవ యుగాదిసంచిక

## ప్రజోత్పత్తి సంవత్సరము

ప్రథమ బ్రాహ్మణేతర కాన్ఫరెన్సు అధ్యక్షులుగ నుండిన లెఫ్టినెంటు కర్నల్ సర్ మహారాజా

**వెలుగోటి శ్రీ గోవిందకృష్ణ యాచేంద్రుల బహదూర్ కే. సి. ఐ. యి.**

వేంకటగిరి మహారాజావారి గౌరవార్థముగ ప్రచురితమైనది.

ఇందు

ఆంధ్ర విద్వన్మహాజనులు రచించిన

మత, సాంఘిక, రాజకీయ, సారస్వతాది నానావిషయవ్యాసములును

బహువిధములగు చిత్రపటములును గలవు.

పత్రికాధిపతి

**రావుసాహేబు పింజల సుబ్రహ్మణ్యము శెట్టి ఎం. ఎల్. సి. గారిచే**

మదరాసు స్వకీయ "సమదర్శిని" ముద్రాలయమున

ముద్రింపబడి ప్రకటింపబడినది.

| చందాదారులకు | మదరాసు. | ఇతరులకు |
|---|---|---|
| వెల రు. 1—0—0. | | వెల రు. 1—4—0. |
| పోస్టుఖర్చులు 0-5-0 | **1931-1932** | పోస్టుఖర్చులు 0-5-0 |

# విషయసూచిక

# చిత్రపట వివరణము

## త్రివర్ణ చిత్రములు



## ఛాయాచిత్రములు

1-వ పటము:—వరుసగ:- ఇర్విన్ ప్రభ్వీగారు, ఇర్విన్ ప్రభువుగారు, విల్లింగ్డన్ ప్రభ్వీగారు, విల్లింగ్డన్ ప్రభువుగారు. సాదరముగ భారతవర్షమును పాలించి 1931 మార్చి 17వ తేదిని తమ రాజప్రతినిధి పదవిని విల్లిగ్డన్ ప్రభువుగారి కొప్పగించి స్వదేశమునకు వెడలిరి. విల్లిగ్డన్ ప్రభువుగారింతకుముందు బొంబాయి మదరాసు రాష్ట్రములకు గవర్నరుగా నుండి, కొలదిదినములు తాత్కాలిక రాజప్రతినిధిగ భారతవర్షమును పాలించి యావల కెనడాలో రాజప్రతినిధిగ నుండి అన్నియెడల ప్రజాగౌరవమును చూరగొనిరి.

30-వ పేజీ ఎదుట

2-వ పటము:—1. గౌ|| ది. బ. బొల్లిని మునిస్వామినాయుడు బి.ఏ. బి.ఎల్. గారు మదరాసు ప్రభుత్వ ప్రధానామాత్యులు - జస్టిస్‌పక్ష నాయకులు, చిత్తూరు జిల్లాబోర్డునందును, పురపాలకసంఘమునందును అనేకసంవత్సరము లధ్యక్షులుగనుండి వీ రొనరించిన ప్రజాసేవకు ప్రభుత్వమువారు దివాన్‌బహుదూర్ బిరుదము నొసగి సన్మానించిరి. 2. గౌ|| పి. టి. రాజన్‌గారు బార్-అట్-లా మదరాసు ప్రభుత్వ ద్వితీయామాత్యులు. ఆగర్భశ్రీమంతులు, మధురానగరవాసులు, ఇగ్లండున 14 సం|| లుండి స్వదేశమునకు వచ్చినవెనుక 1920 లో నూతనసంస్కరణవిధానమున శాసనసభ్యులయి జస్టిస్‌పక్షమునకు 'ప్రధానవిప్పు'గ నుండినవారు. 3. గౌ|| ది. బ. యస్. కుమారస్వామిరెడ్డియార్ బి.ఏ. బి. ఎల్. గారు, చెన్నప్రభుత్వ తృతీయామాత్యులు. కొన్నిసంవత్సరములకు పూర్వము వీరి పూర్వులు నెల్లూరిప్రాంత స్వీయమండలమును వీడి దక్షిణమున నాంధ్రప్రతిభను ప్రతిష్ఠింప నేగిరి. వీరు పాలంకోట పురపాలక సంఘమునకును, తిరునెల్వేలి జిల్లాబోర్డునకును అనేకసంవత్సరము లధ్యక్షులుగ నుండి చేసిన ప్రజాసేవకు ప్రభుత్వమువారు వీరికి దివాన్‌బహదూరు బిరుదు నొసగి గౌరవించిరి. 4 ది. బ. ఏ. ఎం. ఎం. మురుగప్పశెట్టియారుగారు, మదరాసునగర ప్రధానపౌరులు (షెరిఫు), సుప్రసిద్ధ నాటుకోట నగరత్తార్ సంఘజులగు గొప్ప వర్తకులు- దానశీలురు. మూడుసారులు మదరాసు శాసనసభాసభ్యులుగను మదరాసు కార్పొరేషన్ సభ్యులుగను ఉండి చేసిన ప్రజాసేవకు ప్రభుత్వమువారు వీరికి దివాన్‌బహదూర్ బిరుదము నొసగి గౌరవించిరి.

31-వ పేజీ ఎదుట

3-వ పటము:—రౌండుటేబిల్‌సభా ప్రతినిధులు:- 1. సమావేశాధ్యక్షులుగ నుండిన బ్రిటిషు ప్రధానామాత్యుడు రామ్సే మాక్డొనాల్డుగారు, 2. ఇండియామంత్రియగు వెడ్జివుడ్డు బెన్నుగారు, 3. సమాహారసంఘమున కధ్యక్షులగు సాంకే ప్రభువుగారు, 4. సర్ తేజబహదూరు సప్రూగారు, 5. శ్రీ భోపాల్ నవాబుగారు, 6. శ్రీ బికనీరు మహారాజావారు.

52-వ పేజీ ఎదుట

4-వ పటము:—రౌండుటేబిలు సమావేశ మదరాసు ప్రతినిధులు:- 1. సర్ ఏ. పి. పాత్రోగారు, సుప్రసిద్ధ జస్టిస్‌పక్ష ప్రముఖులు. అఖిలపక్ష సమావేశాధ్యక్షులు; 2. శ్రీమతి సుబ్బరాయన్ సతీమణి-కుమారమంగలం జమీందారిణిగారు-విద్యాధికలు, 3. రా. బ. ఏ. టి. పన్నీరుసెల్వం బార్-అట్-లా గారు- వీరు తంజావూరులో జిల్లాబోర్డుఅధ్యక్షులుగ నుండిరి. రా||టే|| సమావేశమున కేగినవారిలో క్యాథలిక్కుక్రిస్టియన్ వీ రొక్కరే; 4. ది. బ. ఆర్కాటు రామస్వామి మొదలియారు బి.ఏ., బి.ఎల్., ఎం. ఎల్. ఏ. గారు, సుప్రసిద్ధ జస్టిస్‌పక్ష ప్రముఖులు. ప్రథమ అఖిలభారత బ్రాహ్మణేతర సమావేశమున కధ్యక్షులుగను, మదరాసుకార్పొరేషను కధ్యక్షులుగ నుండిరి, 5. పర్లాకిమిడిరాజావారు, సంస్థానాధీశులు నుదారులు నయి రాయల్ వ్యావసాయికసంఘమున సభ్యులుగ నుండిరి; 6. సర్ సి. పి. రామస్వామి అయ్యరుగారు మదరాసు ప్రభుత్వమున లామెంబరుగనుండిన సుప్రసిద్ధులు. 7. కే. టి. పాల్ గారు (ఇపుడు దివంగతులయిరి) వై. ఎం. సి. ఏ. కార్యదర్శిగనుండి గ్రామపునరుద్ధరణమునకును సహకారోద్యమమునకును చాల శ్రమపడిరి; 8. రా. బ. కే. శ్రీనివాసన్‌గారు- ఆదిద్రావిడ నాయకులు; 9. ది. బ. మోచెర్ల రామచంద్రరావు బి. ఏ. బి. ఎల్. గారు, పెక్కుసంవత్సములు ఎం. ఎల్. సి. గను, ఎం. ఎల్. ఏ. గను, ఏలూరు పురపాలకాధ్యక్షులుగ నుండిరి.

53-వ పేజీ ఎదుట

5-వ పటము:—1. శ్రీబొబ్బిలిరాజావారు సంస్థానాధీశులు; వితరణశీలురు; మదరాసు శాసనసభా సభ్యులు; ఆంధ్రకళాపరిషత్తునకు ప్రోధాన్యలరుగ నియమితులైరి. 2. రా. బ. పి. టి. కుమారస్వామిశెట్టి బి. ఏ. గారు, మదరాసు కార్పొరేషను కధ్యక్షులు. పచ్చయప్పకళాశాల ట్రస్టుబోర్డున కధ్యక్షులు; 3. శ్రీ రాజా విక్రమదేవవర్మగారు-జయపుర సంస్థానాధీశులు. విద్వత్కవిప్రభువులు, సంస్కృతాద్యనేకభాషాపారంగతులు, దేశజ్ఞానాభ్యుదయాభిలాషులు, ఆంధ్రకళాపరిషత్తునకు ప్రతివత్సరము నొక లక్షరూకల విరాళము నొసంగిన మహాదాతలు ; 4. గౌ|| బి. రామచంద్రారెడ్డి బి. ఏ. గారు మదరాసు శాసనసభాధ్యక్షులు, ఆంధ్రభాషాప్రియులు, నెల్లూరుజిల్లాబోర్డున కధ్యక్షులుగను, బహుకాలము మదరాసుశాసనసభాసభ్యులుగ నుండిరి; 5. సర్ ఎస్. రాధాకృష్ణగారు - జగద్విఖ్యాత వేదాంతవేత్తలు, ఆంధ్రకళాపరిషత్తునకు వైస్‌ఛాన్సలరుగా నెన్నుకొనబడిరి. జినీవా అంతర్జాతీయ వైజ్ఞానికసమావేశ సభ్యులు.

76-వ పేజీ ఎదుట

6-వ పటము:—1. జయసింగ్ లాల్ కే. మెహతాగారు సురాజ్‌మల్ లల్లూభాయి కంపెనీలో భాగస్వాములు. 2. శివపురము జమీందారులగు పి. వి. మానిక్కంనాయకర్ బి. యి. గారి పుత్రికలు. వీరు వరుసగ కుమారీ పుంజిమానిక్కం (ఇంటర్మీడియట్), కుమారీ జీవమానిక్కం బి. ఏ., కుమారీ గుణమానిక్కం (సీనియరు బి. ఏ.) గారలు. 3. పి. గోపాలస్వామి నాయుడుగారు హానరరీ మేజస్ట్రీటు, రత్నవ్యాపారులు, ఆడంబాకం జనోపకార శాశ్వతనిధికి డైరెక్టరులు. 4. ఆంధ్రవిశారద తాపీ ధర్మారావుగారు బి. ఏ. విజయవిలాసాదిప్రబంధములకు వ్యాఖ్యాతలు, గ్రంథరచయితలు. 5. శ్రీ పానగల్ రాజా పార్థసారథిరాయణింగారు బి. ఏ. కీ|| శే|| పానగల్ రాజావారి సోదరులు, సంస్కృతాంధ్రభాషావిశారదులు. 6. వేణునాథకోన్ యఫ్. సి. ఇ., ఎం. ఆర్. ఏ. ఎస్. గారు యాదవప్రముఖులు. 7. ఎస్. ఎన్. మారియప్పగారు గురుబసవకంపెనీ తాలూకు సుప్రసిద్ధ నశ్యనిర్మాతలు. 8. కీ|| శే|| పాలేటి మునిస్వామినాయుడుగారు, రాజమంద్రి, సైదాపేటలయందు ప్రభుత్వ ట్రెయినింగుకళాశాలలలో చిత్రకళాధ్యాపకులుగ నుండి యుపాధ్యాయమండలియం దభిమాననీయులైరి.

71-వ పేజీ ఎదుట

7-వ పటము:—1. శ్రీ చెట్టినాడు కుమారరాజా బి. ఏ. ఎం. ఎల్. సి. గారు, జస్టిస్‌పక్ష 'ప్రధానవిప్పు'గ నున్నారు. 2. సర్దార్ వల్లభభాయి పటేలుగారు 1931 వ సం|| కాంగ్రెసుసభ కధ్యక్షులు. 3. కీ|| శే|| పండిత మోతీలాల్ నెహ్రూగారు. 4. చెన్నపురాంధ్రమహాసభ నాటకశాఖ, అధ్యక్షులు రా. సా. పింజల సుబ్రహ్మణ్యముశెట్టి ఎం.ఎల్.సి. గారు; 5. జస్టిస్‌పక్ష ప్రముఖులు సమదర్శినీపత్రికా సంపాదకు లగు రా. సా. పింజల సుబ్రహ్మణ్యముశెట్టి ఎం.ఎల్.సి. గారిని వేటపాలెముపౌరు లభినందించుట.

100-వ పేజీ ఎదుట

8-వ పటము:—వ్యాసకర్తలు:-1. మారాబత్తుల సూర్యనారాయణగారు, 2. కవితావినోద అల్లంశెట్టి అప్పయ్యగారు, 3. విమర్శకాగ్రేసర కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు, 4. ఇట్టింకి నరసింహమూర్తిగారు, 5. నాగపూడి కుప్పుస్వామయ్యగారు బి. ఏ. 6. కాశీభట్ల కృష్ణరాయశాస్త్రిగారు, 7. కల్యాణానందభారతీ స్వాములవారు, 8. యలమంచిలి శ్రీరాములుగారు, 9. కొత్తపల్లి సూర్యారావుగారు.

101-వ పేజీ ఎదుట

# ప్రస్తావన

తుఫాను వీఁచి చల్లాఱినది. మహాసంగ్రామము సంకులమొనరించి సంధిరూపమున విశ్రమించినది. అపూర్వమగు నొక్కకంపము భూమి నూఁపి విరమించెను. తీవ్రనిరోధనవిధాన ముపసంహృత మయ్యెను. ప్రచండశాసనావళి పరాకు నూనెను. శాసనాతిక్రమణ దళములు శాంతించెను. కారావాసముల కేగిన దేశసేవాపరాయణులగు స్త్రీలును బురుషులును వేలకువేలుగ స్వేచ్ఛాయుతులయి మగిడి వచ్చుచున్నారు. అసమ్మతి ప్రకటనమునకును సత్యాచారఖండనమునకును జరుగు సభలు స్వనాయక స్వాగత సమావేశము లయ్యెను. విడివడిన దంపతుల కలయికలతోడను, నెడబాటునందిన తల్లిపిల్లల ముచ్చటలతోడను, వియోగముగాంచిన నాయకానుచరుల సల్లాపములతోడను దేశీయ వాతావరణ మంతయుఁ గలకల లాడుచున్నది. సావధానులయి వినువార లుండుటంజేసి కోకిలములు కలకంఠము లయ్యెను. ఆఘ్రాణించి యానందించు తీతీక జనుల కుండుటచేత వాయువు గంధవాహ మయ్యెను. చూచి చొక్కఁగలవారలు గలుగుట నీకాలము వసంత మాయెను. ఇట్టి శుభోత్తర మగు ముహూర్తమున మే మాంధ్రమహాజనుల కిట్లు నూతనవర్షోచితాభివాదముల నర్పింపఁగలుగుట యదృష్టమే. మొన్నటిదనుక నీ నూతనవత్సర మింత సంతోషప్రతిపాదకముగ సమారంభ మగునని యనికొనియున్నవారము గాము. కావుననే యీ పరివర్తనమును దైవికముగ భావించుచున్నారము. ఆ పవిత్ర భావమును దైవశక్తియు మా యభివాదములయందు నెలకొని, యాంధ్రజనుల నితోధికయశోవిరాజితుల నొనర్చుగాత మని యభ్యర్థించుచున్నారము. ఈ ప్రమోదావసరమున మాశ్వాసము నామ్రాదివివిధపుష్పనిచయపరిమళముతోడ జతనుపఱిచి, మా యభివాదమ్ములఁ బుంస్కోకిలకాకలీకలాలాపముతోడ మేళవించి, యీ మా వినూత్నవత్సరాది సంచికను వసంతకాల వివిధవర్ణ సుమమంజరులతో పొత్తుగలిపి యుగాదియోగ్య బహుమానంబుగ మా పాఠకమహాశయులకు భక్తిపూర్వకముగ నివేదించుచున్నారము. ఈ ప్రజోత్పత్తి సంచికాకుసుమాంజలి నంది యాంధ్రులు తా మానందించి మమ్ము ధన్యుల నొనరింతురుగాత.

ఈ సంతోషసమయమున భారత రాజకీయాంతరిక్షమునఁ దేజఃపుంజములయి వెలుఁగుచుండిన రెండు తారక లస్తమించుట యపారమగు దేశదుఃఖమునకుఁ గారణ మయ్యెను. దివంగతు లగు

**అస్తంగత తారాద్వయము**

పండిత మోతీలాల్ నెహ్రూగారి వియోగమున భారతదేశ మెంత దురపిల్లెనో తెల్లమే. అట్టి భోగియు, నట్టి త్యాగియు, నట్టి యనుభవభూషణుండును, నట్టి సామరస్యపోషణుండును, నిట్టి క్లిష్టసంధిసమయమున నుండఁజాలకుండుట భారతవర్ష మొనరించిన నోములకొఱంతయేగాని వేఱుకాదు. మౌలానా మహమ్మదాలీగారి యుదార భావములును, ప్రజాగౌరవమును, ననుచరభాగ్యమును నేఁటి క్లిష్ట సమస్యావసరమునందుండిన భవిష్యత్ రాజ్యాంగవిధాననిర్ధారణ మెంతయో తేలికయయి యుండియుండును గదా! కొలఁదిదినంబులు దేశీయాశయములకు గొంత విరుద్ధముగఁ బ్రవర్తించుచున్నారను నూహ కెడము నిచ్చినను మౌలానాగారు లండనునగరమునం దుగ్గడించిన యభిప్రాయములు నాడిన భవిష్యత్ సూచక వాక్యములును వారి విశాలహృదయప్రవృత్తిని విశదమొనరించె నను టకు సందియముసులేదు. అట్టి తారాద్వయాస్తమయమున గలిగిన కొఱఁతఁ దీర్ప నాయకు లొక్కభావముతోడ నుద్యమింతురుగాక యని యాశించుచున్నారము.

నాయకు లెట్టులున్నను దేశీయవికాసమున కింక నవాంతరము గలుగఁజాలదని యభయ మొసంగుచుండు నొక్కవిషయము నిట దడవకుండుట పాడిగాదు. అయ్యదియే నారీజనసముత్సాహము. మహిళాజనప్రబోధ మొక్క పెద్ద

**నారీజనోద్యమము**

సముద్రతరంగమువలె ప్రపంచమునం దంతటఁ బాఱి, భారతవర్షమునఁగూడ నేఁడు పొరలఁ జొచ్చెను. టర్కీయందును ఈజిప్టునందును తుదకు చీనాయందును గల్గిన మహిళాజనోద్యమ మశ్రుతపూర్వము. భారతనారీజనసముత్సాహ మా యపూర్వవిజృంభణమునుగూడ త్రోసిరాజు నొనర్చెను. చేఁపువచ్చినపాలను చిఱుతల కిడుచుండు పచ్చిబాలెంతలుగూడ నుద్యమరంగమున కుఱుకుచుండుటఁగాంచియే బ్రిటనులోని లేబరు మంత్రివర్గమువారు తమ ప్రతికక్షుల నెదిరింప సాహసించిరి. భారతనారీమణులయం దింత యుత్సాహ మేనాఁడు గలిగెనో యానాఁడే యీ యుద్యమ మనివార్యమని ప్రపంచ మెఱుఁగవలయునని ఘంటాపథముగఁ బల్క ధైర్యము బ్రిటిషుప్రభుత్వమునకుఁ గలిగెను. ఈ యత్యద్భుత మహిళాజనప్రబోధమునకు మే మిదే చేతులెత్తి జోత లొనరించుచున్నారము.

అతివిస్తరము కేవల మప్రస్తుతము

ఇయ్యది వర్షద్వయ సంధికాలము. దీని నధిరోహించి యిటు గతమును పరిశీలించుటకును, నటు లాగతము నూహించుటకును నవకాశమున్నది. అదిగో! ప్రజోత్పత్తివత్సరము. అఱువదివత్సరముల యాత్రను ముగించి స్వగృహమును జేరువాని

**సింహావలోకనము**

వలె నత్యుత్సాహమున మొగ మంత జేసికొని వచ్చుచున్నది. సగౌరవమ్ముగఁ బ్రత్యుత్థాన మొసంగి స్వాగతాంజలి నర్పించుచున్నారము. ఇదిగో! దీర్ఘ నిశ్వాసములను బుచ్చుచు ప్రమోదూతవత్సరము వీడ్కోలును గైకొనుచున్నది. ఇన్నిదినములును మనతోఁ గలిసి ముచ్చటల నాడియు రచ్చల కెక్కియు గడపి నేఁడు విడువవలసివచ్చెనుగదా యను చింతయా యీ మందగమనమునకు కారణము? లేక తన యం దిమిడియున్నవిషయముల భారమా? ప్రపంచ, బ్రిటిషు సామ్రాజ్య, భారతవర్ష చరిత్రములు మూఁడింట నొక్కరీతి నీ ప్రమోదూతవత్సరము తన ప్రశంసను స్థిరముగ నొనరించుకొనెను. ఈవర్షమునందు ప్రపంచపరిస్థితులు పోల్చికొన దరముగాకుండునట్లు మాఱెను. రాజాధికారములును నిరంకుశపరిపాలనములును తిరోధాన మందఁజొచ్చెను. ప్రజాస్వామ్యమునందలి యభి

లాష ఖండములయందు తీవ్రగూపములనుదాల్చి రక్తపాతమున కును ప్రాణహానికిని నవకాశము నిచ్చెను. పరిణామవార్తలు విద్యుత్ సమానవేగమునఁ బర్వఁజొచ్చెను. సర్వఖండములయందును స్వపరి పాలనాభిలాష దుర్నివారమయి ప్రస్ఫుటముగఁ గానవచ్చెను.

పరోక్షముగ నుండు నైరోపాఖండ సంగ్రామమువలనను ప్రత్యక్షముగనున్న నానాజాతిసమితిసత్ప్రవర్తనవలనను ప్రపంచ ముఖ్యబలములకు యుద్ధవైముఖ్య మభివృద్ధి కాఁజొచ్చెను. ప్రపంచ మంతయు నాగరకతతో విరాజిల్లుచుండు నీ

**యుద్ధవైముఖ్యము**

దినములయం దాదిమానాగరకుల వధాప్రసక్తి యేల ? న్యాయాన్యాయములను విచారణసేయ నానాజాతిసమితివంటి సంస్థ యుండ నింక యుద్ధసాధన విసర్జనము నకుఁబూనుట మంచిదిగదా యను నూహకు దారికలిగెను. ఆ యూహారూపమే నౌకాసమావేశము. ఐదుబలములకు నంగీకార మగు విధానము చిక్కకుండుటవలన మొదట మూఁడుబలములు మాత్రము సంధిసూత్రముల నేర్పఱచుకొనెను. తక్కిన రెండు నిపుడు సంధిత్రోవకు వచ్చుచున్నవి. యుద్ధాభిలాష నిట్టులతిక్ర మింపఁగలుగుట నిక్కముగ నాగరకతావిజయమని యనక తప్పదు. కాని హృదయపరివర్తనము కలిగినంతదనుక యుద్ధసాధన విసర్జన బుద్ధి బలీయముగఁ బొడకట్టనేరదు. అట్టి మానసికోపాయము భారతవర్షము సూచింపఁజాలునేమో యనియే జగమంతయు మొన్నటి భారతీయోద్యమము నంత పరిశీలించి చూచుచుండుట. ఏలయనిన, నీయుద్యమమే సఫలమయినయెడల, నింక విజయమున కాయుధములు సాధనములుగాక త్యాగమును సత్యాహింసలును నుపాయము లగునుగదా! అట్టియవకాశముగలిగి ప్రపంచమున నన్యాక్రమణమును బరపీడనమును నశించునుగాక యని మానవ కల్యాణాభిరతులు వాంఛించుచున్నారు. ప్రపంచమునందలి యుదార శేముషీసంపన్ను లట్టిదానికొఱకే ప్రయత్నించు చున్నారలు.

ఈ వత్సరంబునఁ బ్రపంచవిజ్ఞానము వికాసపథంబున నొక్క పెద్ద యంజ వేసినది. వాయుప్రసంగములను వాడుకలోనికి దెచ్చి యు, విమానవిజృంభణమును విశేష మొనరించియు, నీ యబ్దము మానవవ్యుత్పత్తిని మఱింతచేసెను. లండను నగర

**విజ్ఞానవికాసము**

మున స్వగృహమునందుగూర్చుండి యమెరికాలోని మహాసమావేశమునకు దృష్టిగోచరుఁడయి యుప న్యసించుచు నూతనభవనములను దెఱవ మానవమాత్రునకు సాధ్యమయ్యెను. వందలకొలఁదిగ యాత్రికుల నెక్కించుకొనిపోవు వాయునౌకల కవకాశము గలిగెను. ఈ సందర్భమున బ్రిటిషు ఆర్. 101 వాయునౌకాభంగమునుగూర్చియు నందు విగతాసు లయిన వాయుమంత్రి ప్రభృతానేకవైమానికాఖండలులను గూ ర్చియు నెన్ని భిన్నత నందకుండ నుండఁజాలము. ప్రపంచవిజ్ఞాన వికాసమున భారతవర్షము తనవంతు ప్రశస్తి నార్జించె ననుట కెంతయు సంతసించుచున్నారము. సర్ సి. వి. రామన్‌గారు తమ యమోఘశాస్త్రపరిశోధనలకుగా నోబెల్ బహూకరణము నందఁ జాలి ప్రపంచ ధన్యవాదములఁ బొందిరి. మహర్షి రవీంద్రనాథ టాగూరుగారు తమ విజ్ఞానవిధానములను లోకంబుల కెఱిఁగించి భారతవర్ష భవ్యనామమును బ్రకాశింపఁజేసిరి.

జగత్ సంగ్రామానంతరము నానాజాతుల దృక్పథమంత యు నార్థికవాణిజ్యాదివిషయములయందు బర్వఁజొచ్చెను. యుద్ధ వ్యయమును సరిపెట్టుకొనుటకును దేశగౌరవమును గాపాడుటకును, అన్ని దేశములు నార్థికాభివృద్ధి నందవలయునను

**ఆర్థికాభిప్రాయ ప్రాబల్యము**

తలంపు నందుటవలన నిర్మాణ వాణిజ్యముల యెడల శ్రద్ధ బహుగుణీకృత మయ్యెను. హెచ్చు పెరుగుచు నన్నిదేశముల నావరించికొని వచ్చు చున్న నిరుద్యోగ మను విపత్తునుండి తప్పించుకొనుటకుఁ బ్రయత్నిం చుట యన్నిఖండములవారికి నన్నిదేశములవారికిని ముఖ్యకార్య మయ్యెను. ఆ కారణమున నవకాశమున్నంతవఱకు తమతమ దేశీయనిర్మాణములను వృద్ధిచేసిరి. పంటలను శాస్త్రసాహాయ్య మున నభివృద్ధి నొనరించిరి. తమకు వలయు నిర్మాణముల నన్నిఁటిని తామే చేసికొను తలంపున నుద్యమించిరి. నిర్మాణ మిట్లెన్ని యో రెట్లుగఁ బెరిగిపోవుటచేత నింతకు బూర్వము నిర్మాణైక జీవులగువారల కిక్కట్టులు సంప్రాప్తమయినవి. సర్వతోముఖ ముగ వ్యాపించుచున్న నిర్మాణోజ్జృంభణమున మొదటి నిర్మాణ స్థానముల ధరలకన్నఁ దక్కువధరల కా వస్తువుల నమ్మఁజాలు దేశము లనేకము లయ్యెను. కావుననే దేశమునందలి సౌఖ్య మా దేశవాణిజ్య సౌకర్యములమీఁద కేంద్రీకరించినది. తప్పక మా వస్తుసమితిని మీరు కొనవలయునని నిర్బంధించుట సక్రమముగఁ గానరాదు. స్వేచ్ఛాయుతులయి వారు తమ సరకులకై రారు. ఈ సమస్య బ్రిటనునందు చాల తీవ్రభావము నందెను. అధినివేశము లును వలసరాజ్యములు నభిమానమును జూపిననేగాని బ్రిటిషు పరిశ్రమలకును వాణిజ్యమునకును దీఱని కొఱంత వాటిల్లునట్లు గానవచ్చెను. కావుననే బ్రిటిషు సామ్రాజ్య భార ధూర్వహులు సామ్రాజ్యసమావేశము నొకదానిని జరిపిరి, అధినివేశములన్నియు నా సమావేశమునందు పాల్గొనెను. ఆ సమావేశవేదికలఁ బ్రక టితములగు నభిప్రాయములను బరిశీలించిన వాణిజ్యము నార్థిక రక్షణము నెంత యధిక ప్రాధాన్యము నందెనో తేటకాఁగలదు. అధి నివేశములు తమతమ జాతీయపతాకముల నిర్ణయించుకొనవచ్చును. తమ కిష్టముదప్పిననాఁడు సామ్రాజ్యమునుండి విడివడుట కధికారము నందియుండవచ్చును, మాతృరాజ్య ఋణభారమును దీర్ప నెంచక పోయినఁ బోవచ్చును, గాని వాణిజ్యసౌకర్యములను మాత్రము కొఱఁతవడనీయరా దను నాతుర మెంత ప్రస్ఫుటముగఁ గాన వచ్చును! మాతృరాజ్యాధికారముకన్నను, స్వసంఘగౌరముకన్నను, పాలనాధికారస్వత్వముకన్నను, వాణిజ్యము నార్థికవిషయములును బ్రధానతరము లయ్యెననుట విశదము. ఈ మహాసూత్రమునే మొన్నటి సామ్రాజ్యసమావేశము వేయినోళ్ల చాటుచున్నది.

మాతృరాజ్యాధినివేశములకు బరస్పర ముండఁదగిన గౌరవ మర్యాదలకన్నఁ, బరరాజ్యములయందు స్వాధికార ప్రతిష్ఠాపనము కన్న, మహాసంక్షోభకారకములగు విప్లవములకన్న నార్థికస్థైర్య మునకయి లోకమంతయుఁ బరితపించుచున్నది.

**ఆర్థికమాంద్యము**

ఇందులకు గారణము సర్వవ్యాప్తినిఁ గాంచుచున్న యార్థికమాంద్యమేగాని వేఱుకాదు. ఏ దేశ మునఁగాంచిన నర్థాభావదురవస్థలే కానవచ్చుచున్నవి. ఏ రాజ్య

మును బరిశీలించిన నాయవ్యయపట్టికలు లోటును జూపునవిగనే యున్నవి. ఏచ్చోట నారసినను నూతనములగు నాదాయవిధానములకొఱ కన్వేషణలు జరుగుచునేయున్నవి. ఏయెడఁ బరికించినను వ్యయకర్తనప్రయత్నములు విదితము లగుచునేయున్నవి. ఎగుమతులు తగ్గిపోయెను. దిగుమతులు సన్నగిల్లెను. నిర్మాణము విశేషించెను. నిరుద్యోగము ప్రకోపించెను. నాణెములు కఱవాయెను.

కుశాగ్రబుద్ధులగు రాజ్యాంగవేత్తలు నర్థశాస్త్రనిపుణులు నింత యలజడికి కారణమేమి యని వితర్కింపసాగిరి. ప్రపంచమున నిర్మాణములగు వస్తుసమితి చెల్లునట్టి పెద్ద యంగడులు రెండు గలవు. అయ్యవియే చీనాయు భారతవర్షమును. ఈ రెండు పెద్ద విపణులయందును వేఱువేఱు కారణములవలన నసాధారణపరిస్థితులు సంఘటిల్లెను. కావున నేఁటి విపత్తింత యొత్తిడినిఁ గలిగించుచున్నదని యనేకులు తలంచుచున్నారు. ఈ కారణముగూడ బ్రిటిషువారిని భారతవర్ష సఖ్యమునకుఁ బ్రేరేపించి వేగిరించుచున్నది. భారతదేశోద్యమ ఫలితము లప్పుడే లాంకషైరు లోనగు పారిశ్రామికస్థానముల కర్మాగారములయందు గానవచ్చుచున్నవి. ఇందులకుఁ దోడు ఫ్రాన్సువారును రషియావారును దమకుఁ జిక్కిన ధనము నంతటిని దాఁచుటకుఁగూడఁ బ్రయత్నించుచున్నారని తెలియుచున్నది. ఈ రీతిని ధనమును కైవసముగ నుంచికొని ప్రపంచమునందలి యార్థికవిషయములనెల్ల కీలుబొమ్మలవలె నాడింపవలయునని యా దేశముల యూహ. దీనినిఁబట్టి చూచినను ఫిరంగులకన్నను, నౌకాబలముకన్నను, విమానదళముకన్నను, నార్థికాధికారమెక్కుడగుచున్నదని స్పష్టముగాఁగలదు.

భారతవర్షమున నేఁడు సజీవులయి యున్నవారల స్మరణమునం దిట్టి వర్ష మింకొకటి లేదు. బహువిధమతములతోడను నానావిధ భాషలతోడను ఛిన్నభిన్నముగఁ గానవచ్చుచుండిన దేశమంతయు నొక్క యుద్యమమునకు లోనయినది. ఒక్క మహాశయమునకే శరణ్యమయ్యెను. ప్రజ లందఱును, వీరు వారను విభేదము నెఱుంగక, యొక్క యుద్యమమునకే నడుములనుగట్టిరి. దేశీయకల్యాణచింతన మొక్కసారి జాతీయాస్తిమజ్జాగతమయి యందఱ నూఁపెను. మితవాదులు వారి యభ్యర్థనావిధానమును, జాతీయవాదులు దమ తీవ్రవిధానము నొక్కసారి సునిశిత మొనరించిరి. మితవాదనాయకులు హితోపదేశములకుఁబూని, ప్రభుత్వమువారు నానాఁ డొసంగుచువచ్చిన వాగ్దానములను క్రియారూపముగ నొనరింపకున్నఁ దీఱ దని నొక్కిచెప్పిరి. ప్రభుత్వవిలంబనము ననాదరణముగ భావించుటచేత దేశీయులవిశ్వాసము కృశించుచున్నదని నచ్చఁబల్కిరి. మాటలు తేనెలొల్కుచున్న కార్యములు స్వీయలాభాన్వేషములేగదా యను నసంతృప్తి ప్రాకికొనుచున్నదని నిజమును జాటిరి. తుదకు వీరి తీవ్రవిమర్శనములను గాంచి యాంగ్లేయులు "మితవాదులే యిట్టులాడుచుండిన నింక జాతీయవాదులెట్టులు విమర్శించుచుందురో గదా!" యని యాశ్చర్యమున ముక్కులపై వ్రేళ్ల నిడికొనిరి.

భారతవర్షోద్యమము

ఇంక జాతీయవాదులన్ననో, యభ్యర్థనముల నిష్ప్రయోజకత నీక్షించి ప్రభుత్వమువారి యౌదాసీన్యమును బరికించి యొక యపూర్వశ్రుతమగు విధానమునకు బూనిరి. సత్యము నహింసను ప్రధానసూత్రములుగ నెన్ని గాంధీమహాత్ముని మహానాయకత్వమున నీ శాసనధిక్కరణ మహోద్యమము సమారంభమయ్యెను. భిన్నాభిప్రాయములతోడ ప్రపంచములందలి జను లా చిత్రమును జూచుచుండిరి. ప్రతిఘటనాపరాయణులయి ప్రభుత్వమువారును తా మవలంబింపవలసిన విధానమును కూడఁబలికికొనిరి. తుదకు గాంధీమహాత్ముఁ డాతీరమున నుప్పునేతి 'మీరందఱును కానిండు' అని యాజ్ఞనిచ్చునరికి దేశమునందలి యుత్సాహమంతయు కట్టలను ద్రెంచికొని పొంగి పొరలి యాసేతుశీతనగము నొక్కసారి ముంచివైచెను. ఉన్మాదుని యల్పచేష్టగ నెంచుచుండినవా రందఱును మహాశ్చర్యమున మునిఁగిరి. ప్రభుత్వమువారు తలఁచినదానికన్న నీ యుద్యమవిజృంభణ మెన్నియో రెట్లెక్కుడుగ నుండెను. నిరోధనవిధానమును ప్రయోగించిరి. శాసనధిక్కారులను బలవంతముగఁ జెదరఁగొట్టు నుద్దేశమున లాటీలను, కొన్నియెడల తుపాకులనుగూడ, ప్రయోగించిరి. ప్రచండశాసనముల నొకదానివెనుక నొకదానిని శాసించి యుద్యమము నరికట్టనెంచిరి. కాని కారావాసమునే కాంక్షించువారును, కష్టమునే కోరి యనుభవించువారును, త్యాగమునే యవలంబించినవారును నయి దౌర్జన్యమువొంతబోకుండు నీ ప్రతిపక్షులపై నా యాయుధములును ప్రచండశాసనములును నిరర్థకములయ్యెను. ఎదుర్కొని పోరాడువారల శతసహస్రములనయిన నవలీల నుక్కడంపఁగల ప్రభుత్వసన్నాహమంతయు నీ దౌర్జన్యరహిత దేశసేవకుల నావంతయు నిరోధింపఁజాలకుండెను. తుదకు మూఁడుకాళ్లముసలివారును, ముసుఁగులలోని ముదితలును, పాఠశాలల కేగు పసిపాపలును నీ యుద్యమమునకు సుముఖులయిరి. ప్రపంచమంతయు వేయిగన్నులఁజేసికొని యీ నూతనవిధాన జయాపజయములను చూడఁ గుతూహలు లయిరి.

పొంగి పొరలికొనుచు వచ్చుచుండిన యీ మహోత్సాహమున కుప్పుఁజేయుట యను నొక్కకార్యము చాలకుండెను. అటవీసత్యాగ్రహము, విదేశవస్త్రబహిష్కరణము, మద్యపాననిషేధప్రచారము, తాటిగెలలనఱుకుట, హర్తాళములు, ప్రభాతఫేరీలు, పతాకాభివందనములు, నిషిద్ధగ్రంథపఠనములు లోనగు ననేకముఖముల నీ యుత్సాహము ప్రవహింపసాగెను. ఇయ్యదియే సమయమని విప్లవవాదులు తమ రాక్షసవిహారములను ద్విగుణీకృతముగ నొనరించిరి. కాంగ్రెస్‌వారును గాంధీమహాత్ముడు నెంత ప్రార్థించినను వీరియాగడము లణఁగలేదు. దేశ మట్టుడుకున ట్లుడుకఁజొచ్చెను. ప్రపంచ వాణిజ్యాది సుఖప్రవృత్తి కొంతవఱకు స్తంభించెను. భారతీయపరిస్థితులు దుస్సహమగుచున్నవను నభిప్రాయము భారతీయ మితవాదులకును బ్రిటిషుప్రజలకు నుదయించెను.

ఇట్టి మహాక్లిష్టసమయమున భారతవర్షాధినేతగనుండిన రాజప్రతినిధి ఇర్విన్‌ప్రభువతంసుఁడు తన యుదారహృదయముతోడను, దూరాలోచనతోడను, భారతీయాశయ సానుభూతితోడను, నుభయదేశ కల్యాణాభిలాషతోడను మహోన్నత పథమునఁ బ్రవర్తించి తన నామమును సువర్ణాక్షరయోగ్యముగ నొనరింపఁగల మహాత్ముఁడు. ఈ ధన్యుని మహాప్రయత్నమువలన రౌండుటేబిల్

ఇర్విన్‌ప్రభుని యాశయము

సమావేశపు యతనము జరుగుటయు దానఁగలిగిన సద్యఃఫలములు ను నింకను దేశీయుల మానసముల వినూతనములుగనే యున్నయవి.

ఈ నడుమ సర్ తేజబహదూర్ సప్రూగారును, ఎం. ఆర్. జయకర్ గారు నొనర్చిన రాయబార ప్రయత్నములు, నా సందర్భమున కారామందిరములనున్న దేశనాయకులకును రాజప్రతినిధి ఇర్విన్ ప్రభువుగారికిని జరిగిన వాదోపవాదములన్నియు నభునాతనములు. సంధిప్రయత్నవైఫల్యము తాత్కాలికముగ సంతాపకారణమయినను, ఇర్విన్ ప్రభుప్రేరిత రౌండుటేబిల్ సమావేశఫలితముగ నీ రాయబారములు పునరుద్ధృతములయ్యెను. దేశీయనాయకులు కారావాసవిముక్తినిగాంచి రాజప్రతినిధితోడ తుల్యగౌరవమున ముఖాముఖి సమాధానమార్గము నారయఁజొచ్చిరి. గాంధీ ఇర్విన్ మహానుభావులు పరస్పర ధన్యవాదములతో నొకయొడంబడికను గావించుట నిన్నమొన్నటి విషయము. ఇట్టి సమాధాన సమయములయందు జయాపజయముల నెంచ నూహించుట నిరర్థకము. కాంగ్రెసువారు రౌండుటేబిల్ సమావేశమునందు పాల్గొంచురను ముఖ్యవిషయమే మనకు గావలసినయది. అఖిలభారత కాంగ్రెసు కార్యనిర్వాహక సంఘమువారు నా యొడంబడిక నామోదించుటవలన కరాచీలో దాని యంగీకారము కృతనిశ్చయమే యయ్యెను.

రౌండుటేబిల్ సమావేశమున కొక స్త్రీ ప్రతినిధిని పంపినదియు, దేశోద్యమ సమరమున మొట్టమొదట నారీకారావాస గౌరవము నందినదియునయి చెన్నరాష్ట్రము ధన్యతఁగాంచెను.

చెన్నరాష్ట్రము జస్టిస్ పక్షము

ఈ రాష్ట్రమున నీ యేఁడు శుభప్రతిపాదకమగు నొక్క పరిణామము సంభవించుట పరిచితవిషయము. దుర్బలమయి ప్రజాంగీకారభాగ్యము నందకుండఁ బఱగుచుండిన మంత్ర్యాంగ మంతరించినది. ప్రజాగౌరవబలమును, దేశసేవాబుద్ధిబలమును, నపారసంఖ్యాబలమును, నన్నిటికిం గొప్ప, సంస్తవనీయానుభవ మహాబలమును గల జస్టిస్ పక్షము మంత్రివర్గ మధికారస్థానము నలంకరించెను. ప్రజాసామాన్య కల్యాణకాంక్షులును సర్వజనసమానగౌరవదృష్టులు నగు నీ నూతన మంత్రివర్గపాలనమునం దీ రాష్ట్రమిలోధికశుభంబులం గాంచుననుట కావంతయు సందియ ముండనేరదు.

భవ్యవిజ్ఞానసముపార్జనమునందును, దేశోద్యమరంగములయందును, నారీజనోజ్జీవనభాగ్యమునందును నాంధ్రు లింకొక్కరికిఁ దీసిపోయినవారుకారని యావద్భారత ప్రశస్తినిగాంచి ధన్యులయిరి. పురాతనేతిహాసప్రోక్తమగు నాంధ్ర

ఆంధ్రులు—

తేజమును నేటి తెలుఁగువారు సార్థక మొనర్చి

ఆంధ్రరాష్ట్రము

రసుట యెల్లరకు నానందదాయకము. ఈ దేశసేవాపరాయణత యశిథిలమయి యనవరత ముండునుగాక యని యీశ్వరు నారాధించుచున్నారము. ఇట్టి ప్రఖ్యాతి ననాదినుండియు గాంచుచు పంచప్రాంతమండలములలో నధికసంఖ్యాకులుగ నున్న యాంధ్రమహాజనుల కొక్క ప్రత్యేకరాష్ట్ర ముండవలయు నను నూహ సకారణమే యగును. భాషాప్రయుక్త రాష్ట్రనిర్మాణసూత్ర మిపుడు సర్వజనాంగీకారమగుచున్నది. ఆ ప్రయత్న మిపుడు మరల రేకెత్తుచు ననతికాలమున ఫలప్రాప్తిఁ గాంచు లక్షణములఁ బ్రకటించుచుండుట ముదావహము. ప్రత్యేకరాష్ట్రభాగ్యమునకు నామరూపముల నొసంగి యీ ప్రజోత్పత్తి వత్సర మాంధ్రమహాజనులను దనియించును గాక యని కోరుచున్నాము.

ఆంధ్రజనాదరణమున మే మీ నాల్గవ యుగాదిసంచికను బ్రచురింపఁగలిగియుండుట కెంతయు సంతసించుచున్నారము. దీనియం దెప్పటియట్ల విద్యాధికులును శేముషీధుర్యులును కళోపాసకులును రచించిన బహువిధవ్యాసము లాంధ్రజనుల కంగీకారయోగ్యములుగ నుండుటయేకాక దేశీయవిజ్ఞాన మే రీతిని వికాసము నందుచున్నదో సూచించుచుండును. ఇట్టి వ్యాసరాజములను పద్యరత్నములను చిత్రపటములను మా కొసఁగి మా సంచికాప్రయత్నమును సఫలమొనరించిన విద్వన్మణులకు గృతజ్ఞతాంజలుల నర్పింప నుత్సహించు చున్నారము.

ప్రజోత్పత్తి సంచిక

సర్వలక్షణ సమన్వితమును జనాదరణ విరాజితమునగు నీ ప్రజోత్పత్తి యుగాదిసంచికను సుప్రసిద్ధ సంస్థానాధీశ్వరులును నాంధ్రభాషా చిరకాలసంపోషకులును, ప్రథమ రాష్ట్రీయ బ్రాహ్మణేతర మహాసభాధ్యక్షులుగనుండిన లెఫ్టినెంటు కర్నల్ సర్ మహారాజా వెలుగోటి శ్రీగోవింద కృష్ణ యాచేంద్రులు బహదూరు కే.సి.ఐ.ఇ. వేంకటగిరి మహారాజావారి గౌరవార్థముగఁ బ్రకటింపఁగలుగుటయు గడుంగడు శుభావహము. శ్రీ మహారాజావారి యౌదార్యమును బ్రజాసంపోషణాభివాంఛయు రాష్ట్రజనుల కందఱికిని చిరపరిచితములు. సైనికకలాశిక్షణమునం దాఱితేఱి లెఫ్టినెంటు కర్నల్ గను మదరాసు గవర్నరుగారికి గౌరవాంగరక్షకులుగ నుండి తక్కుంగల జమీందారులకు సైనికశిక్షాకుతూహలమున మార్గదర్శకులయిరి. విద్యావ్యాప్తికొఱకును బ్రజోపయోగముకొఱకును మహారాజావా రొనరించిన సత్సాహాయ్యమునకు మెచ్చి ప్రభుత్వమువారు వీరికి కె.సి.ఐ.ఇ. యను నున్నతబిరుదరాజము నొసఁగి సన్మానించిరని యెల్ల రెఱింగినవిషయమే యగును. వేంకటగిరి పురాతనసంస్థాన మాంధ్రభాషాపోష కొసంగుచువచ్చిన సంపోషణము నాంధ్రకవిపుంగవులకుఁ జూపుచుండిన యాదరణమును నాంధ్రవాఙ్మయమున సుస్థిరముద్రితములు. ఇట్టి యుదారులు మా యీ సంచికకుఁ గృతిభర్తలుగ నుండ నంగీకరించినందులకు మేము శ్రీ మహారాజావారికిఁ గృతజ్ఞతాభివందనసహస్రముల నర్పించుచున్నారము. శ్రీశుఁడు మహారాజావారి కాయురారోగ్యైశ్వర్యముల నవారిగ ననుగ్రహించును గాక.

కృతిసమర్పణము

ప్రజోత్పత్తిమహాబ్దము ప్రజామోదమున కాకరమయి సకలశుభప్రదమయి యలరారుఁ గాక.

స ర్వే జ నా స్సు ఖి నో భ వం తు.

పింజల సుబ్రహ్మణ్యము శెట్టి,
సంపాదకుఁడు.

# ప్రజోత్పత్తి

కవితావినోద అల్లంశెట్టి అప్పయ్య గారు

నవరసాలకిసాలనివహాశనోన్మత్త
    కలకంఠకులకుహూకాకలకలములు
మల్లీమతల్లికామకరందపానస
    మ్మోదితభృంగీనినాదములును
జలధరాగమనాతిసంభ్రమోద్రిక్తమా
    యూరీగభీరకేకారవములు
పుష్పితఘనలతాపుంజడోలాచల
    ద్వాతజాతానల్పవనరుతములు
గవిసి రోదసిఁ బర్వ మంగళనినాద
గతుల నెదురేగి తనకు స్వాగతమొసంగు
చైత్రలక్ష్మీవిలోకనోత్సాహవశత
నరుగుఁదెంచెఁ బ్రజోత్పత్తిహాయనంబు

# నూతనాబ్దము

## కవితాస్వాగతములు

బులుసు వేంకటరమణయ్య గారు

వచ్చెఁ బ్రజోత్పత్త్యబ్దం
బుచ్చైర్గతిఁ జెలగి జగతి కున్నతిఁ గూర్పన్
హెచ్చెము లేని ముదంబున
మెచ్చఁ జగ మెల్ల దీప్తి మించిన కీర్తిన్.

మలయగంధవహుండు మందోల్లసద్రీతి
వీఁచి వింజామరల్ విసరుచుండ
శుకశారికలు స్తోత్రనికరముం జదివించి
వందిమాగధఫక్కి వాసి కెక్క
కోకిలాంగనలు కోకోరవంబుల మించి
గాయకాగ్రేసరు గరువ మడఁప
సహకారములు పుష్పసంతతి వర్షించి
ఆచారలాజల నవఘళింప
ఆ ప్రమోదూతవత్సరం బరువదేండ్ల
మోము చూపక మెచటికో పోవునట్లు
చేసి స్వప్రాభవంబును జెప్పికొనెడి
తమకమున వచ్చె నీ ప్రజోత్పత్తి యిపుడు.

కోయిలపాట నూత్నకళ ; గొజ్జఁగిపూవుల నవ్యసౌరభం ;
బా మెలమావి క్రొంజిగురునం దొకతళ్కు ; మదోల్లస ద్విరే
ఫాయత ఝుంకృతిన్ సొగసు ; అబ్జమునం దొక వింతసంతనం ;
బా యపుణ ప్రదీప్తినొక యందము విందొనగూర్చె నెంతయున్

౨

దోమా వేంకటస్వామి గుప్త గారు

చిత్తమెలర్పఁగా వినతిఁజేయుచు, మే మిదె నీకు స్వాగతం
బిత్తుము, సర్వలోకసముదీర్ణమనోవికసత్ప్రికార ము
వ్వేత్తుగ నీదు రాకను రహించెడి ! నట్టులె యొప్పతన్
బ్రజోత్పత్తి సువర్ష మా ! నిరతతత్పరభావము నీవు పూనఁగన్.
పేరు ప్రమోదమయ్యుఁ గుఱిపించెఁ బ్రమాదము లెన్నియేని, నీ
ధారుణిపైఁ ద్వదగ్రజుఁడు ; తద్దయు నీ విఁకఁ జాల మేలుఁ జే
కూఱఁగఁజేయ, సోదరునకుం గల దుర్యశ మీఁగి, " కష్టవుం
దీఱగు వెన్కనా శుభము తీర్చు విశేషముదం " బఁటన్న మా
టారయ సోపమానమగు నయ్యె! ప్రజాభ్యుదయాబ్దరత్నమా !
సంతానంబునుగోరి, తొల్లిని దపస్సంతానముల్ ప్రానమ
త్సంతానమ్మగు దేవుఁ గూర్చి సలుపం దైవాజ్ఞ, నేఁ డన్నఁ ద
త్సంతానమ్ము జనింపుగాక యదిభూసన్నుత్యమై మించఁ గా
వింతుర్ప్రార్థన ! లందుకోసరము సంప్రీతిన్ మదిం బెంచి, స
త్సంతానంబులఁగొల్పి పేర్గను ప్రజోత్పత్తీ ! సమర్థంబుగన్.

3

క్రొత్తపల్లి రాజలింగ కవి గారు

తొలుదొల్తఁ బ్రభవాఖ్య నలరి యనంత మా
కాలంబునం గొంత గడవుఁ దెలుప
నారుకారులును రెండారు నెలలుఁ బుచ్చి
విభవమై తొలికీర్తి వెలసి మున్న
శుక్లాఖ్యనటువలె శోభఁ జెందియుఁ బ్రమో
దూతవై నిన్నను దొలఁగి నేఁడు
సత్ప్రజోత్పత్తి వై చనుదెంచినావు మా
కతిముదం బయ్యె నీ యాగమనము
కాని యీ వున్న దొక యేఁడె కనుక యిచట
జాతిమతకక్షలున్ బక్షపాతములును
మాయలును మోసములు మరి మత్సరములు
నణఁగఁగాఁజేసి పాలింపు మనని నీవు.

దేశభక్తిని నిల్పి దేశసేవను సల్పు
గోపాల శ్రీకృష్ణ గోఖలేల
పట్టుపిడని స్వభావమున దేశక్లేశ
ములు హరించెడు బీజములు గ్రహించి
పండించుటకు ఖడ్గవాదంబు స్థిరపర్చి
నట్టి మేధాశాలు లగుతిలకుల
పూని దేశక్షేమమునకు యత్నంబు లొ
నర్చు దాదాభాయి నౌరజీల
కవిభక్తగాయకాగ్రణు లయ్యు మరిఁ జిత్ర
కారులైన రవీంద్రకవివృషభుల
రిపుజనవ్రాతదోర్వీర్యాపహారక్రి
యాప్రవణోద్యోగు లగుచు సకల
దేశవాసులచే నుతింపఁబడుచు మ్రొక్కు
లాచరింపఁబడుచు ననుదినంబు
శమదమాదిసర్వ సద్గుణసంపద
నలరి ముకుటపీఠికాది లక్ష
ణములులేని ధరణిరమణుల గాంధుల
మరియు సృష్టిఁజేయుమా శరత్తు.

జనము లన్యోన్యవైరములను ద్యజించి
స్నేహమున మెలంగెడునట్లుజేసి మరియు
రాజుపై భక్తి ప్రజలకు బ్రజలపైని
ప్రేమ రాజున.కున్నట్లు నీ మహత్త్వ
మున బ్రజోత్పత్తి సేయుము బుణ్యా మొదవు.



# ఏఁడాది

దిగుమర్తి సుందరరావుగారు సి. ఇ.

వచ్చుచున్నది క్రొత్త సంవత్సరం బఁ
టన్న నేదియో నూత్నభాగ్యంబు గల్గు
ననుచు నేమేమియో యనుకొనుచు నుంటి ;
తెల్లవాఱిన యంతనె తెల్లమాయె
నేమియుంగాని దది వట్టినామ మంచు.
నిప్పువేఁడిమి తగ్గిన చొప్పులేదు
కటికిచీఁకటి కన్నులఁగప్పు మాన
దబ్ధికల్లోలవీచిక లణఁగియుండ
వంతరింపదు కాఠిన్య మకట ! శిలల.
ప్రాఁతదుఃఖంబు లెయ్యవి పాసచనియె,
నూతనానంద మెయ్యది చేతి కబ్బె.
నిన్ను నొక పెద్దచేయఁగా నెన్ని యన్న
లందఱును బేరుపెట్టి ' ఏఁడాది ' యనుచు.
జలకమార్చిరి, క్రొత్తదువ్వలువ లొసఁగి
రొడలు గైసేసి మావిపచ్చడులఁ బెట్టి
రాటపాటల నానంద మందఁజేసి,
రంతమాత్రానఁ బెద్ద వెట్లగుదు వీవు ?
సంతతభ్రాంత మగు కాలచక్రమందు
నేదినం బొకయుగమున కాది గాదొ
యేక్షణంబున కల్పాంతవీక్ష లేదొ

కాంచి నీయోగ్యతను విచారించికొనుము.
నిన్నుబోలిన దినము లెన్నెన్నొ యున్న
ఈయదృష్టంబు నీ పాలనే ఫలించె ;
ఒకరొకరిభాగ్య మిట్టుల యుండుఁగాడె.
నల్వు రన్నారు పెద్దఁ గానా యటంచు
నీవునుం దలపోసినఁ బోవు పరువు.
జనులొసంగిన మర్యాద కనువుగాఁగ
సత్ప్రవర్తనఁ జని మాదు స్వాగతంబు
నందుకొను ప్రజోత్పత్తి ఏఁడాది నీవు.
స్వార్థదూరుల యాపదల్ వాయునేని
సత్కవీశ్వరులకు లేమి సమయునేని
సత్యమున కెట్టిభంగ మెసంగదేని
ఆత్మ సర్వభూతములందు నలరునేని
జగతి సోదరభావంబు నెగడునేని
' మంచి మాతల్లి ' యని నిన్ను మరవ మెవ్వరు.
అట్లుగాకుండ వ్యత్యస్తమైనయెడల
ముక్కుమొగమని యనక, మోమోటఁ గనక,
పేరునన్‌బిల్తు ' మిది నేతిబీర ' యనుచు ;
కాచికొ మ్మింక కార్యమ్ము చూచికొమ్ము :
క్షేమ్ము సౌఖ్యమ్ము : లేకున్న వమ్ము సుమ్ము.

## ౨

శ్రీమతి తా. సరస్వతమ్మ గారు

ఒత్తె నవీనశంఖ మదిగో వినఁజాలరొ యూంధ్రులార, తా
నెత్తెఁ బతాకరాజము సమీహితసిద్ధికి చూడరో, ప్రజో
త్పత్తి మహాబ్దశేఖరుని పాలనవైభవమంచుఁ గంచు మె
ల్గెత్తి వచించు జాంఘికుల నేల ముదంబున నాలకింపరో.
పులుఁగుల కూజితం బనను : పోషిత పర్వజనాళివాక్యముల్ ;
అలికులవర్తనం బనను : హోళిఁ జరించెడివారి వేడ్క ; కో
కిలకలనాదమం చనఁ : బ్రహృష్టకళాకలగానమాధురిన్ ;
లలితకిసాలమం చన : ఘనంబయితోఁచు నవోదయంబునున్.
భారతవర్షభాగ్య మభివర్ణనయోగ్యముగా నొనర్చు, మా
కోర్కెలెల్లఁదీఱ సమకూర్చు జయంబు ప్రయత్నరాజి, బం
గారపుటక్కరాల సుభగత్వముగాంచుము నూత్నవర్షమా !
పేరు ప్రతిష్ఠ నిల్పికొను వేయియుగంబులు సంస్తుతింపఁగన్.
ఊరకె వచ్చుచున్నవని యొక్కట గొంతెమకోర్కెలెల్ల నే
గోరను ; చూడు, మాఁకటికిఁగూడును గట్టఁగగుడ్డ లేక య
ల్లాడెడు నాససహోదరుల నందర ; నక్కట ! జాలిగల్గెడున్ :
వారలఁ దేర్చి చేయు మిఁక నల్వురిలో తల లెత్తునట్లుగాన్.

# కవిరాజు గీతాలు

త్రిపురనేని రామస్వామి చౌదరిగారు బార్-అట్-లా

కంచికోటల కంచుతల్పులు ఖంగుఖంగున మ్రోఁగునప్పుడు
తంజనగరపు కోటగోడలు చెంగుచెంగున నెగురునప్పుడు
తిరువటంబునఁ జేరసేనలు కెవ్వుకెవ్వున నఱచునప్పుడు
మధురకోట యగడ్తలన్నియు జివ్వుజివ్వున దాఁటునప్పుడు
తెలుఁగువారలు పిఱికివారలొ
తెలుఁగుబిడ్డా! తెలిసికొనుమా.

తెలుఁగువారల యాటపోటులు తెలుఁగువారల నీటుగోటులు
తెలుఁగువారల పోటుమాటలు తెలుఁగువారల యేటుపాటులు
తెలిసిమెలఁగిన గోలుకొండ విజాపురంబును నాముదాపురి
నడిగిచూడుము యేమిచెప్పునొ తెలుఁగువారల ప్రాఁతకతలన్
తెలుఁగువారలు పిఱికివారలొ
తెలుఁగుబిడ్డా! తెలిసికొనుమా.

ఓరుగంటిని దండువిడిసిన దేవగిరి యాదవనృపాలుని
ఓరుగంటనుఁగాంచి యప్పుడె దేవగిరిదర్వాజవఱకున్
తఱిమితోల్కొని పోవఁబోవఁగఁ బూరిమేయఁగ నభయమిచ్చిన
తెలుఁగుదొరసానైన రుద్రమదేవికీర్తిని లోకమెఱుఁగదె?
తెలుఁగువారల యాఁడుబిడ్డల
తెగువ బిగువులు తెలిసికొనుమా.

వీరరసమే వెల్లివిరియఁగ వెనుకతగ్గని పల్లెనాటన్
కాలిబంటుల కాలిక్రిందను నలిగిపోయిన దండుబాటన్
అరులమూకను జెఱలఁబెట్టిన యరిదియగు మాచెఱలకోటన్
పేరుఁగ్రుచ్చియుఁ బిలిచియడుగుము తెలియవచ్చును తెలుఁగువ్రేటున్
ప్రాఁతకతలను బాడకుండినఁ
దెలుఁగుబిడ్డా! పరువుదక్కునె?

ఢిల్లిసురతాన్ ఫౌజుదారులు ముట్టడింపఁగ మూఁడుమారులు
తురకకత్తులు దాకినంతనె చుంయిచుంయన గంటునెత్తురు
పొంగిపారలఁగ నోరుగంటను ద్రోలివేయరె ఢిల్లిదాఁకను
దెలుఁగుకత్తులు తురకబిడ్డలఁ దెంపుపెంపున నెల్లదాఁటఁగ
పెద్దవారలఁ బిలిచియడుగుము
తెలియఁబఱుతురు తెలుఁగుధాకను.

రెడ్డిదొరలును కమ్మదొరలును వెలమదొరలును కాపుదొరలును
రాచదొరలును మొక్కవోవని పౌరుషంబులఁ బోరసలిపియు
గౌతమీనది కృష్ణవేణిని తుంగభద్రను సహ్యజానది
నెత్తురొలికిరి కాలవశమునఁ గత్తిఁగడిగిరి మూలఁబెట్టిరి
ఇంతమాత్రనె మఱచిపోకుము
తాత తండ్రుల పన్నెచిన్నెలు.

మఱచిపోకుము మఱచిపోకుము మన్నెదొరలను తెల్గునాటను
మఱవకుండఁగ మూఁడుప్రొద్దులఁ బాడుచుండుము వారిపాటను
తేటమాటలఁ దెలియఁజెప్పుము దిక్కులన్నియు మాఱుమ్రోఁగిన
తెలుఁగువారల పేరుపెంపును దెలియకుండఁగ నుండఁబోకుము
తెలుఁగుబాలుఁడ! యింపునించుము
తెలుఁగుబాలుఁడ! పేరుపెంచుము.

# రౌండు టేబిలు సమావేశము

## కట్టుదిట్టములు

వేమవరపు రామదాసు పంతులు గారు, బి ఏ., బి ఎల్.

ఇండియాదేశమునకు స్వరాజ్యప్రణాళికను తయారుచేయుటకు ఆంగ్ల, హైందవప్రముఖులతో కూడికొనిన రౌండు టేబిలు సమావేశము యిదివర కొకసారి కూడి కొంతవరకు సమస్యలను చర్చించి, కొన్ని ముఖ్యసూత్రముల నంగీకరించి, మిగిలియున్న కార్యక్రమమును పూర్తిచేయుటకు త్వరలో తిరిగి సమావేశము కానున్నది గదా! మొదటి సమావేశాంతమునుండియును బయలు వెడలిన చర్చలవలన మన స్వాతంత్ర్యసంపాదనమున కడ్డుదగుల నున్నవారి దృక్పథము మనకు కొంతవరకు గోచరించినది. రాజ్యాంగ విధాన సమస్య, సైనిక సమస్య మొదలగు ముఖ్యవిషయములు కొంతవరకు వెనుకకు వెళ్లినవి. ఇండియాకు స్వపరిపాలనాధికారము నేడుకాకున్న మరికొంతకాలమునకైన కలుగజేయక తప్పదు గనుక రాజ్యాంగవిధానమును సంస్కరించుటలో హైందవుల ఆశయ ములను అంగీకరింపవలయు ననియే ఆంగ్లేయరాజకీయపక్షముల వారు కొంతవరకు మనస్సులు సమాధానపఱచుకొనినట్లు తోచు చున్నది. అయితే రాజ్యముకంటె ప్రధానమైనది జీవనాధారమైన ద్రవ్యముగదా! అట్టిద్రవ్యము ఇండియాతో ఆంగ్లదేశము జరుపు చున్న వాణిజ్యమువలనగదా సమకూరుచున్నది! ఆ వాణిజ్యము రాజ్యాంగబలముతోగదా జరుపగలుగుట! అట్టిబలము తగ్గినచో ఆంగ్ల వాణిజ్యవిలాసము వన్నెతగ్గక నిలిచియుండగలదా! అందుచే రాజ్యాధికారము హైందవప్రజాయత్తము చేయుటకు పూర్వము ఆర్థికసంబంధమైన కట్టుదిట్టములను కొన్నిటిని భద్రపరచుకొన వలయును. లేనిచో ఇంగ్లాండుకు మహానర్థము వాటిల్లగలదు. ఈరీతిగా ఆంగ్లరాజ్యనీతిపారంగతులు వితర్కించుచున్నారు.

ఇట్టి కట్టుదిట్టములను కోరుట న్యాయమా కాదా యని విమర్శించుటకుపూర్వము వానివలన నిజమైన ప్రయోజనము సమ కూరకలదా యని యోచించుట సమంజసము. పాశ్చాత్యదేశముల యొక్క పారిశ్రామిక నీతియు, వాణిజ్యవిధానమును యింతవరకు ఒకేసూత్రముమీద నాధారపడియున్నవి. ఆ సూత్ర మేదియనిన, ప్రాగ్దేశములు వాని వస్తుసామగ్రికి సర్వకాలము పాశ్చాత్యదేశ ములమీద నాధారపడియుండును. ప్రాగ్దేశవాసులలో ఆర్థిక, పారి శ్రామిక, వాణిజ్యసంచలనము దుర్ఘటము. అందుచే పాశ్చాత్య ఖండవాసులకు నిరుద్యోగ సమస్యగాని, నిర్వ్యాపార క్లేశముగాని యుండవు. ఐరోపామహాసంగ్రామమువరకును యిదియె పాశ్చా త్యుల నమ్మకము. హిందూదేశము చైనాదేశమును చేరి ప్రపం చమునందలి యావత్ప్రజలో సగమునకు వాసస్థానములు. ఈ రెండు దేశములలో ప్రపంచమందలి జనసంఖ్యలో సగభాగము నివ సించుచున్నారు. తక్కిన సగభాగమె అయిదుఖండములలో గల యితర దేశము లన్నిటిలో నివసించుచున్నారు. తక్కిన ప్రాగ్దేశముల మాట ఎట్లున్నను యీ రెండుదేశములవారు పాశ్చాత్య పారి శ్రామిక కర్మాగారములనుండి యుత్పత్తియగు సామగ్రిని కొనక తామే తమకు వలయు వస్తుసంచయమును నిర్మించుకొనదలచిన నాడు పాశ్చాత్యులు వారితో వారే పోటీసలుపుకొని ఒకరిదేశపు సామగ్రిని మరియొకరిదేశముమీద కురిపించుచుండవలయునుగదా! ప్రాగ్దేశములలో యిండియాకంటెను, చైనాకంటెను చిన్నదైనను, అన్నివిధముల ఎక్కుడు పలుకుబడిగల జపానుదేశము ఆంగ్లేయుల వస్తువులను కొనుటకు బదులుగా యిండియా, చైనాదేశములలో సహా ఆంగ్లేయ వర్తకులతో పోటీచేయుచున్నది. అందుచే ఆంగ్ల వాణిజ్యముయొక్క నిరంకుశత్వము రౌండు టేబిలు సమావేశ ములో నేర్పరుపబడు కట్టుబాట్లచే నిలువబెట్టదగినదిగాదు. ప్రాగ్దేశ ముల సంచలనముతో ఆంగ్ల వర్తకభానుడు అస్తమించును. సూర్యుడు ప్రాగ్దిశ నుదయించి పశ్చిమమున నస్తమించునను యథా ర్థమును పాశ్చాత్యులు యికనైన నమ్మవచ్చును.

ఈ కట్టుదిట్టములవిషయములో ఆంగ్లేయుల దృక్పథము అతి సంకుచితముగను పరిహాసాస్పదముగను తోచక మానదు. గాంధి యిర్వినుగార్ల సంధి ప్రకటితమైనదిమొదలు పార్లమెంటులో ప్రతి రోజును సభ్యులలో నెవరో యొకరు ఇండియామంత్రిగారిని ఆ సంధి యొక్క సద్యఃఫలితములనుగురించి ప్రశ్నించుచునే యున్నారు. అందరిప్రశ్నలకు ఒకటే మతలబు. సంధికితర్వాత లాంకుషైరు బట్టలకు ఆర్డర్లు వచ్చుచున్నవా? ఇండియాలో బ్రిటిషువస్త్రములు విరివిగా ఖర్చగుచున్నవా? దినదినము మాకు ఎంతసరకు అమ్ముడు పోవుచున్నది తెలుపుచుండురా? ఎన్నిమార్లడిగిన నివే ప్రశ్నలు. ఇండియామంత్రియొక్క సమాధానము లీ ప్రశ్నల కనుగుణములు గనే యున్నవి. ఓపికపట్టుడు, త్వరలోనే మనబట్టలు యిండియా వారు విరివిగా కొందురు అని బెన్నగారు తమ ప్రాశ్నికుల ననుదినము అనునయించుచుందురు.

కట్టుదిట్టములను కోరుటకు మరి రెండు ఇతర కారణములు రౌండు టేబిలుసమావేశములో నిరూపింపబడినవి. అందు మొదటిది యిదివరకు ఆంగ్లప్రభుత్వమువారిచే అంగీకరింపబడిన ఆర్థిక బాధ్యత లను హైందవప్రభుత్వము నిర్వహింపవలయుననుట. ఈ బాధ్యతలు ముఖ్యముగ రెండురూపములు దాల్చియున్నవి. గవర్నమెంటువారు యిండియాదేశపు హామీమీద చేసిన ఋణము; యిండియాలో మిలిటరీ సివిలు ఉద్యోగములలో యిదివరకు యుండినట్టియు యిపు

దున్నట్టియు ఐరోపీయులకు చెల్లించవలసిన పెన్షనులు జీతములు. ఇప్పు డున్నట్టియు, యిదివరకు సేవచేసినట్టియు ఐరోపీయుల వేతనములు, పెన్షనులనుగురించి ఎట్టిఆక్షేపణయు హైందవనాయకులలో ఎవరును చెప్పియుండలేదు. ముందు అన్యదేశీయుల నాయుద్యోగములలో నియమించుటయు, నియమించినచో వారి కీయదగు వేతనములను నిర్ధారణ జేయుటయు హైందవప్రభుత్వమువారి స్వేచ్ఛానువృత్తికి లోబడియుండవలయును. ఇక యిండియాదేశము యొక్క ఋణమనిననో దానివిషయమై మహాత్మాగాంధిగారు ఇచ్చిన సలహా నాగరిక ప్రపంచమువా రందరును అంగీకరించియున్నారు. 1929-30 సం॥మునకు, కంట్రోలరు ఆఫ్ కరెన్సీ గారు ప్రచురించిన నివేదికనుబట్టి యిండియా గవర్నమెంటువారు వడ్డి చెల్లించవలసిన ఋణము మొత్తము 1188 కోట్ల రూపాయిలు. ఇందులో కొంచెమించుమించుగా సగము వంతు అనగా 550 కోట్ల రూపాయిలు ఆదాయమును తెచ్చు రైల్వేలు మొదలగువానికై ఖర్చుపెట్టబడి ఋణప్రదాతల కీయనగు వడ్డికిసరిపడు లాభము ఆర్జింపబడుచున్నది. మిగత సగములో నెంతభాగము కేవల ఆంగ్ల సామ్రాజ్య ప్రాగల్భమునకై వెచ్చింపబడినదియు, ఎంత యిండియా లాభముకొరకు వెచ్చింపబడినదియు తేల్చవలసియున్నది. ఆఫ్గను యుద్ధములమీదను, బర్మాను వశపరచుకొనుటకై జరిగిన యుద్ధములమీదను, చైనాతో సలిపిన యుద్ధములమీదను, ఐరోపా సంమరమీదను ఖర్చుపెట్టిన సొమ్మును యిండియా భరింపవలయునా, భరింపవలయుచో నెంత భాగము భరింపవలయు నను విషయములు ఒక నిష్పాక్షిక న్యాయ సంస్థద్వారా తేల్చికొనుటకు ఆంగ్లేయులును హైందవులును రౌండుటేబిలు సమావేశములో అంగీకరించుట సమంజసము.

కట్టుదిట్టములను కోరుటకు గల మరియొక కారణము ఇప్పుడు ప్రబలముగా నిర్వచింపబడుచున్నది. ఆంగ్లేయులు యీ దేశములో వ్యాపారముమీద చాలా ద్రవ్యము పెట్టుబడిపెట్టి పారిశ్రామిక వాణిజ్యసంస్థలను నెలకొల్పుకొని యున్నారు. అట్లు పెట్టుబడిపెట్టిన సొమ్మునకు సరియైన అంచనా నాకు లభించలేదు. ఇండియాలో ఆంగ్లేయులు పెట్టిన పెట్టుబడి మొత్తమును ఇంగ్లాండులో ప్రచురింపబడు రెండు ఆర్థిక పత్రికలు యిటీవల లెక్కించియున్నవి. ఫైనాన్షలు టైమ్సు అను పత్రిక అట్టిపెట్టుబడి మొత్తము 58 కోట్ల పౌనులనియు, ఎకానమిస్టు అను పత్రిక 70 కోట్ల పౌనులనియు అంచనా వేసియున్నవి. ప్రొఫెసర్ కీన్సుగారు 1908 సంవత్సరములో అంచనా వేయుచు ఆమొత్తము 35 కోట్ల పౌనులుగా నిర్ధారణ జేసియుండిరి. అప్పటినుండి యిప్పటివరకు పెరిగిన మొత్తమును గుణించి యొకానొక అర్థశాస్త్రవేత్త యీ మొత్తమును నేడు 60 కోట్ల పౌనులుగా నిరూపించుచున్నాడు. బ్రిటిషు ప్రజల తాలూకు యీ పెట్టుబడి రెండు తెగలు. గవర్నమెంటువారియొక్కయు, స్థానికసంస్థలయొక్కయు హామీమీద పెట్టుబడి పెట్టిన సొమ్మొకొంత; ప్రజలసొత్తు హామీమీద పెట్టుబడిపెట్టిన సొమ్మొకొంత. రైల్వే బాండ్లు, మ్యునిసిపల్ బాండ్లు, పోర్టుట్రస్టు బాండ్లు మొదలైనవి మొదటి తరగతివి. వీనివిషయములో యిండియాకు అంత నష్టములేదు. ఈ పెట్టుబడిమీద సరాసరి గవర్నమెంటువారు యివ్వవలసిన వడ్డి నూటికి 3 3/4 అనియు ఆ పెట్టుబడిమీద సంపాదన నూటికి 4 మొదలు 5 వరకు గలదనియు యీపై లాభము దేశమునకే చెందుచున్నదనియు తెలియుచున్నది. ఇక జూటుమిల్లు షేర్లమీదను, టీతోటల మీదను, కోస్తానౌకలమీదను ఆంగ్ల బ్యాంకులద్వారా ఎగుమతి దిగుమతి వర్తకసరుకులమీదను పెట్టిన పెట్టుబడిమీద లాభమంతయు పెట్టుబడిదార్లదే. లాభముతోనేపోక యీ పెట్టుబడిదార్లకు ఆయా వ్యాపారములమీద పరిపాలనాధికారము, స్వామ్యముకూడ యుండవలయునను షరతులు పెట్టుబడిని పురస్కరించుకొనియుండును. దీనివలన యిండియాకు యింతవరకు గలిగిన మహానర్థముతొలగవలయు ననిన యీ విదేశపు పెట్టుబడిదార్లయొక్క పరిపాలన తొలగవలయును. ఇట్టివారి స్థానబలిమిని హైందవప్రభుత్వమువారు తొలగించుట కెట్టి అధికారమును ఉండకూడదనియు, అట్టి కట్టుబాట్లును రౌండుటేబిలు సమావేశమువారు శాసనములో నెక్కించవలయుననియు, ఆంగ్లేయ రాజ్యతంత్రజ్ఞులు కోరుచున్నారు. ప్రస్తుతము నౌకావ్యాపారము, జూటు, టీ మొదలగు వ్యాపారములు, సగమువరకు ఇన్‌ష్యూరెన్సు వ్యాపారము, ఎగుమతి దిగుమతి వ్యాపారము, బ్యాంకింగు మొదలైన ఆర్థిక ఆయువుపట్లు విదేశీయులవశమున నున్నవి. వీనిని మనము వశపరచుకొననిది, స్వరాజ్యము రసముపీల్చి వుమిసిన చెఱకుపిప్పివలె నుండును. మనము యీ రంగములలో కాలుచొప్పించుకొనదలచి గవర్నమెంటువారివల్ల ఎట్టి సదుపాయము కోరినను అది కూడనిపనియనియు, రౌండుటేబిలు సమావేశములో మా హక్కులను చెక్కుచెదరక కాపాడుటకు హైందవులు అంగీకరించినారనియు, ఆంగ్లేయులు వాదించకమానరు. ఈ వాదన యిదివరకే హాజ్జిగారి కోస్తావ్యాపారచట్ట సందర్భమునను, బ్యాంకింగు విచారణలోను తీవ్రముగా జరపబడినది. ఈ కట్టుబాట్లకు హైందవులు అంగీకరించుచో యిండియాయొక్క స్వరాజ్యము నిర్గంధకుసుమమగును. ఆర్థిక స్వాతంత్ర్యములేని స్వరాజ్యము ప్రజల కుపయోగించదు. కేవలము విద్యాధికులకు, ధనవంతులకు అధికారపదవులు సంపాదించుట కేర్పడినదియే యగును. గాంధిమహాత్ముడు ఎవరికై పాటుబడుచున్నారో వారికి లాభకారి కాజాలదు. అందుచే ఆర్థికస్వాతంత్ర్యమందు ఎంతమాత్రమును మనము ప్రమత్తులమై యుండరాదు. మరియొకవిషయముకలదు. ఈ కట్టుబాట్లు యిండియాయొక్క పరపతిని నిలుపుటకుకూడ ఆవశ్యకములట! ఆహా! ఇండియామీద యేమి యీ అవ్యాజ కరుణాకటాక్షము? ఇండియాయొక్క ఆర్థికస్థిరత పరపతి ఎట్లు యింతవరకు ఆంగ్ల ఆర్థికమంత్రులు నిలిపిరో, కరెన్సీ, ఎక్స్చేంజి, తమ దేశము లాభమునకై నిర్వహించిరో యిండియా లాభమునకై నిర్వహించిరో తెలుపవలెనన్న పెద్ద గాథగలదు. దానిని మరి ఒకనాడు చెప్పెదను. కావున యీ కట్టుదిట్టములు యిండియాకు లాభకరములు కానంతవరకు నిర్మొగమాటముగ నిరాకరించవలయును. అట్టి సమాధానమే హైందవుల భావిభాగ్యోన్నతికి తోడ్పడగలదు.

# రాజ్యాంగ సంస్కరణములు

ఆంధ్రవిశారద తాపీ ధర్మారావు గారు, బి. ఏ.

ప్రపంచపటమున నెందుజూచిన, సంక్షోభము కాకున్నను, మార్పు, సంస్కరణము, పరివర్తనము కనులఁ గట్టినట్లు గానవచ్చును. ప్రజలయందు గల స్వాతంత్ర్యాభిలాష క్షణక్షణ వివర్ధమానమగుచున్నది. రాజాధికారములు తొలఁగి ప్రజాస్వామ్యమునకు దారిఁ జూపుచున్నవి. న్యూనాధికవైచక్షణ్యము రూపుమాయ, సమత జగద్వ్యాప్తి నందుచున్నది. రాజ్యములయందు బరిపాలనములయందు నెట్టులో యట్టులనే స్త్రీపురుషవ్యక్తులయందు నీ యభిలాష పొడచూపుచున్నది. దీని నంతటిని జూచినఁ, బ్రపంచము నంతటిని ఘూర్ణమానముగ నొనరించుచున్న దేదియో యొక్క నూతనమహాశక్తి సర్వత్ర సముద్భూత మగుచున్నదని తెలిసికొనఁదగును. ప్రపంచపరిస్థితుల నిట్లు తాఱుమాఱుగఁ జేయ సమర్థమయిన యీ శక్తి, జగదంతర్భాగముల నెల్లఁ బూర్వపరిచితిని, బోల్చికొనుటకుగూడ నవకాశములేక మార్చివైచిన యీ శక్తి, మతవిద్యాసాంఘిక రాజకీయాశయముల నెల్లఁ జేత నిడికొని, కీలుబొమ్మలుగ నాడింపఁజాలిన యీ యమోఘశక్తి భారతవర్షమున మాత్రము తన ప్రాగల్భ్యమును జూపక మిన్నకుండునా? అసంభవము. అంతకు బూర్వము విద్యాధికులయందు నటనటఁ గానవచ్చుచుండిన వినూతనాశయములెల్ల నొక్కసారి, మంత్రప్రభావముననో యనునట్లు, భారతీయప్రజల నాబాలగోపాలము నుఱ్ఱూతలూఁగించెను. తుల్యయోగ్యతయెడ దేశీయాభిలాష సహస్రగుణీకృత మయ్యెను. అధికతర స్వాతంత్ర్యావేశము జనసామాన్యమునందు బర్వెను. ఉన్నతసౌధాగ్రసీమల సుఖోపవిష్టులయి రాజ్యాంగగంభీరవిషయమంతనముల నెఱపు విద్యాధికులయం దెట్టులనో యట్టులనే యెండయు వాన యనక కటికి నేలలఁ గష్టపడు కర్షకులందు నీ న్యూనాధికతానిర్మూలన వాంఛ బలీయము కాఁజొచ్చెను. జాతీయాతివాదుల యందువలె మితవాదసంఘమునందునుగూడ స్వపరిపాలనాభివాంఛ ప్రకటిత మయ్యెను. వేయేల, పొత్తములను చంకనిడికొని పుక్కిటిపురాణములఁ జెప్పికొనుచు బడుల కేగు విద్యార్థులయందును, ముసుఁగులను వీడుట దొసఁగను నూహతో గృహములయం దూడిగముల నొనరించుచు బాహ్యప్రపంచ మన నేమియో యెఱుఁగక యుండు నబలాజనములయందును సంస్కరణాభిలాష పొడచూపెను. నవనాగరకతా ప్రదర్శనరంగములగు నగరములందుబోలె నజ్ఞానాంధకారపరివృతములగు జనపదంబులయందును దేశీయవికాసప్రతీక్ష తీవరించెను. భారతీయుల కనులయెదుట ప్రపంచమున జరుగుచుండిన విషయబాహుళ్య మీ నూతనాశయోన్మేషమునకు దోహదముగఁ బరిణమించెను.

యోగ్యతాయోగ్యతలను నిర్ధారణ చేయుటకో యన దేశ మాసేతుశీతనగము నసిధారావ్రతమున కైన యగు ప్రచండపరీక్ష కుద్యమించినది. ఉత్తీర్ణతా మహాభాగ్యమున భారతవర్షము ప్రపంచధన్యవాదముల నందెననుట కావంతయు సందియము లేదు. పాలకులగు బ్రిటిషువారుగూడ నీ దేశీయాశయౌన్నత్యమును గుర్తించిరి. ధర్మపథావలంబకముగను కాలానుగుణముగను బ్రిటిష్‌వాగ్దానానుసారముగను భారతవర్షమహాజనులు వాంఛించు నంశములఁ దృణీకరించుట యనర్హమని వారే యంగీకరించిరి. ఈ మహోద్యమ ప్రతిఫలముగ నీ ధర్మక్షేత్రమునఁ గొన్ని సంస్కరణలు కలుగనున్న వనుట యెంతయు నానందదాయకము. ఈ సంస్కరణలవలన రానున్న పరిపాలనకు నామధేయ మెట్టిదియయినను ప్రజావాంఛితముల నా విధాన మవశ్య మంగీకరించి యాదరింపవలసి యుండుననుట నిర్వివాదాంశము. నిరంకుశవిధానమునకు తావుండమిం జేసి ప్రజాప్రతినిధిపాలనమునకీ సంస్కరణల యం దవకాశ ముండవలయును. ఆత్మదేశసంరక్షణ మఖిలజనులకు నాత్మగౌరవప్రదమగు మహాస్వత్వమగుట నీ భారతవర్షము నరుల బారినుండి కాపాడు నుదారగౌరవము భారతీయులకే యుండఁదగును. భారతీయులు నట్టి ధీరకార్యమునకు దక్షులేయగుదురు గాని నిర్వీర్యులుగారని హైందవేతిహాసధోరణి నెఱింగినవా రంగీకరింతురు. రఘుమహారాజనాయకత్వమున బాశ్చాత్యదేశముల నవస్కందము వెడలి యచటి పారసీకుల 'నవనీతశిరస్త్రాణులు' గాఁ జేసిన నాఁటి శౌర్యమును, దరయవహష్ హృష్టాశ్వాని ప్రయోజనార్థము గ్రీకుమూఁకలతోఁ బోరుసల్పి విజయపరంపరల నందిన నాఁటి పటిమయు, యవనక్షేత్రపులం బిలుకుమార్చి, కానికలను గప్పములను గొనిననాఁటి బింకమును — పురాతనచరిత్ర లేల? — జగత్ సంక్షోభకారణమగు నైరోపా మహాసంగ్రామమున నాంగ్లప్రభువులకు చేదోడువాదోడుగనుండి మిత్రమండలికి విజయలక్ష్మిని ప్రపంచమునకు శాంతిభిక్షను పెట్టఁగలిగిన నాఁటి సాహసమును నేఁటికిని భారతీయుల శరీరములయందలి ప్రతియణువునను ప్రస్ఫుటముగఁ గానవచ్చునుగదా! అట్టివారలు నిజదేశసంరక్షణముకొఱకితరుల నాశ్రయింపవలయు ననుట విడ్డూరమగును.

దేశీయక్షేమాభివృద్ధియంతయు నార్థికపరిస్థితులపై నాధారపడియుండునదియే కాన, భారతీయులకు దమ యార్థికవిషయపరిపాలనయం దెక్కుడుగ నధికార ముండవలయు ననుట సమంజసము. ప్రజాహితకార్యనిర్వహణాధికారమంతయు ప్రజాప్రతినిధుల చేతులయం దిడి, స్వపరిపాలనము నీదేశ మనుభవించుచున్నదను నభిప్రాయమును ప్రపంచమున వ్యాపింపఁజేసి, యార్థికాధికార

మంతయు నింకొక్కరిచేతులయం దుంచుట నిక్కవముగ నర్థ రహితమగు విధాన మగును. దేశకల్యాణకారకములగు పరిశ్రమా ద్యుద్యమముల నీ ప్రజాప్రతినిధిపాలకు లుద్దేశించినను, కేవలానవ సరవ్యయములఁ దగ్గింపఁ దలంచినను, భారతదేశప్రయోజనయో గ్యముగ వాణిజ్యప్రవాహము ద్రిప్పనెంచినను ప్రజల కార్థిక విషయాధికార ముండక తీఱదు. "ఇంటి పెద్దతన మంతయు నీవే చూడు, మినుపపెట్టెతాళముమాత్రము నాదగ్గఱ నుంచికొందు" ననుట పరిహాసమునకు బాల్పడునుగాని పరిపాలన కుపకరింపఁ జాలదు. అధికారసంక్రమణసంధికాలమునం దీ యార్థికసైని కాదివిషయములనుగూర్చి కొంత బాధకర ముండకతప్పదు గావున, తాత్కాలికములగు కొన్ని కట్టుబాటు లుండవలయునని యందఱు నంగీకరించుచున్నారు. కాని యీ కట్టుబాటులు భారతీయాభివృద్ధి కభిముఖములుగ నుండవలయునేకాని యన్యదేశలాభమున కూఁతగ నుండరాదని యనుట, స్వీయలాభపరాయణుల కించుక కటువుగ నుండినను, సమంజసమే యని యనక తప్పదు. ఈ సర్వజనాంగీ కారమగు కాంక్షను బ్రతిఘటింప నుద్యమించు వితండవాదుల యార్భాటమంతయు వింతయే యగు ననుట నిశ్చయము. స్వీయ లాభచింతనముచేత సంకీభూతచేతస్కు లగువారల కిట్టివాదమం తయు నసమర్థతాద్యోతకముగఁ దోఁచును గాన వారు దృఢపరి పాలనరతి నహరహము ప్రదర్శించుచుందురు. క్షణక్షణమును నూతనాభిప్రాయవిరాజితమయి, వినూత్నప్రబోధభరితమై, నవీనో త్సాహపూరితమయి వాయువేగ మనోవేగములతో పరిణామము నందుచున్న ప్రపంచవిషయములయందు ప్రాతపాటలు పాడ నుద్య మించుట వారివారి సంకుచితచిత్తప్రవృత్తులనే ప్రకటించును గాని వేఱుగానేరదు. అందునను భారతవర్షమునఁ గననయిన మార్పు భావాతీతము నత్యంతాశ్చర్యకరము నని జగమంతయు నొక్క మెలుంగునఁ జాటుచున్నది. దిన మొక శతాబ్దమో యనునటుల భారతీయ స్త్రీపురుషులయం దుత్తేజోజ్జీవనములు ప్రకటితము లగు చుండుట సర్వలోకవిదితము. మహావేగమున సర్వతోముఖమై ప్రసరించుచున్న భారతీయాశయమహాప్రవాహమును చివికి శిథిల ప్రాయమయియున్న దృఢపరిపాలనవిధాన మనుదానితోడ నీఁద నెంచుట వట్టి చిత్తభ్రమణమే యగును. సామరస్యమే ప్రధాన సాధనమును, స్నేహభావమే నౌకయు నని యెఱుంగుట మేలు.

సంస్థానములకును బ్రిటిషుభారతవర్షమునకు సమాహార విధానము సమ్మతముగఁ గానవచ్చుచుండుటవలన నా సంస్థాన ములయందలి ప్రజాసమూహమునుగూర్చియు గొంత యోచింప వలయును. బ్రిటిషుభారతీయు లాత్మీయాభిప్రాయానుగుణముగ నెన్నికొనిన ప్రతినిధులతో సంస్థానాధీశ్వరులు నిజేచ్ఛానుకూల ముగ నియమించిపంపిన సభ్యులుఁ గలిసి కార్యనిర్వాహణమునకు గడంగుట కొంచెము లోపభూయిష్ఠముగ నుండక తప్పదు. సంస్థా నాధీశులయం దెందఱో యుదారచింతను లున్నను, నిరంకుశపరి పాలనరతులుగూడ నధికసంఖ్యాకులుగ నున్నారనుట నిక్కవము. పరిపాలనయందు ప్రజలకు కొంత పలుకుబడినొసంగుట సాంప్ర దాయవిరుద్ధమనియు నట్టిప్రక్రియవలన సంపూర్ణ స్వాతంత్ర్య యుతులగు సంస్థానాధీశుల మహత్త్వము కుంకీభూతమగుననియు తలంచువా రింకను గలరు. కావున నియామకసూత్రప్రేషితులగు సభ్యులవలన సంస్థానప్రజా సుఖదుఃఖములకు దగిన సానుభూతి కొఱవడును. అధికసంఖ్యాకులగు నీ నరేంద్రపాలితుల నిట్టుల నోరు లేనివారినిగ నొనర్చి, సంస్థానప్రజలకు స్వవిషయయాజమాన్య భాగ్య మావంతయయిన నొసఁగక, భారతవర్షము ప్రజాపరిపాలిత సమాహారమనియు, స్వపరిపాలన భూషితమనియు కేరుట పరి హాసాస్పదముగ నుండును. భారతీయులకు స్వపరిపాలనభాగ్యము కలిగిన దనిన భారతవర్షమునందలి రెండు తెగలుగనున్న బ్రిటిషు భారతీయులకును సంస్థానభారతీయులకును నా యదృష్ట మొక్కటిగ చేఁజిక్కవలయును. అప్పుడే భారతస్వపరిపాలన మన్వర్థాభిధాన మగును. ఇంతకును బెద్దయనఁదగు సంస్కరణ మింకొండు గలదు. అయ్యదియే తుల్యగౌరవయోగ్యత. సమతయే ప్రకృతకాల ప్రధాన లక్షణ మనిన నతిశయోక్తి కానేరదు. స్త్రీకన్నఁ బురుషుఁ డధికుఁ డనినను, కార్మికునకన్న పెట్టుబడిదారుఁ డెక్కుడన్నను, 'అంత్య జుల' కన్న నగ్రజాతి మేలన్నను, నల్లవారికన్న దెల్లవా రధికు లని నను నీదినములలో నసంభవముగ నపార్థద్యోతకములుగఁ గాన వచ్చును, కావున నీ కలహబీజము నూడబెఱుకుట నూతనసంస్క రణములలోనెల్ల నగ్రగణ్యమయి యుండఁదగును. నారీజనప్రక టితమగు నూతనోత్సాహమున కనుగుణమగు తెఱంగున వారల కధికతరస్వత్వముల నొసంగుట ధర్మము. మొన్నటి మహోద్యమ మున నారీమణు లొనరించిన యూహాతీతమగు దేశసేవ నారసిన నచ్చెరువున మునుఁగనివా రుండరు. స్త్రీజను లానాఁడు జూపిన యుత్సాహాతిరేకమును గాంచియే గదా యాంగ్లేయ రాజ్యతంత్ర జ్ఞులు సంశయరహితచిత్తులయి యీ యుద్యమ మనివార్యమని గ్రహింపఁగలిగి సక్రమపథమునకు వచ్చిరి? పురుషులతో సమాన ముగఁ గార్యరంగకష్టపరంపరలఁ గాంక్షించుటతో సంతృప్తినందక, యనేకస్థలముల నా పురుషులకే మార్గదర్శినులయి యత్యుదార ప్రవర్తనయందుండిన యబలాజనులను గాంచియేకదా బ్రిటిషు రాజ్యతంత్రపారీణు లందఱు "నద్దిరా ! భారతనారీమణు లందఱు నీ యుద్యమమునకు బాసటయున్నవారుగదా ! ఇంక దీనిని నివా రింపనుగాని యాసడింపనుగాని మానవమాత్రులకు శక్యమగునే" అని పార్లమెంటునందు నుపన్యాసవేదికలయందు నుచ్చరించిరి? నేఁడు బ్రిటిషుదేశమునందు భారతీయాశయాభిముఖు లింద ఱుండుటకు గారణము నారీమణుల యుత్సాహప్రదర్శనమే యనిన నత్యుక్తి గానేరదు. అట్లు దృఢప్రయత్నముతోడ స్వాతంత్ర్య సమరమున కుజికిన మహిళామణుల స్వత్వముల నంగీకరింప కుండుట కృతఘ్నతయు నరకహేతువు నగును.

భారతదేశమునందు గల భారతీయు లందఱును దుల్యగౌరవ భాగులే యను నుదారధైర్యమును సోదరభావమును దేశీయుల హృదయసీమలనలంకరింపవలయును. భారతీయులనిన,పరపాలితులై స్వాతంత్ర్య విరహితులయి యవజ్ఞాయోగ్యులగు నికృష్టజాతియను తలంపు తక్కుంగలజాతుల వారి హృదయకోశములనుండి పెకలింప వలయును. చతుస్సముద్రముద్రిత మగు నీ మహీవలయమునం దెల్లయెడల భారతీయులు గౌరవభాజనులయి నల్వురిలోఁ దల యెత్తి తిఱుగు భాగ్యము నందుదురు గాక.

# ఖద్దరు*

డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్య పంతులు గారు

" నేను భారతదేశమున కరుదెంచితిని. నాకిచట ముఖ్యముగ మూడువిషయములపట్ల మనసు కలదు. గాంధీజీ, తాజ్ మహల్, హిమాలయములను సందర్శింప మిక్కుటమగు నభిలాష కలదు. కాని వీనియం దేదో యొక్కదానినే ఎన్నుకొనవలసినయెడల, గాంధిమహాత్ముని సందర్శించుటకే ముఖ్యముగ నభిలషింతును. గాంధిమహాత్ముడు లోకమున కెంతయు ప్రబోధమొనరింపవలసియున్నది. "

(ప్రొఫెసర్ గెయిక్, బారో లెక్చరర్)

ఏ దేశమునైనను జయించునప్పు డుద్యమ ప్రారంభసంభవములను కాలక్రమమున మరచిపోవుదురు. కాని భారతదేశపు టార్థికవిషయము లటువంటివి కావు. పూర్వము భారత వాణిజ్యవస్తువులయందు వస్త్రము ప్రాముఖ్యమైనది. తమ ప్రాచీననాగరకాతిశయమును భారతీయులు ప్రశంసించుట తమ ప్రాచీనభారత కళలను పరిశ్రమలను గూర్చియే. ఈ యాధునిక పారిశ్రామికాభివృద్ధియంతయు నొక 150 ఏండ్లపాటిది కాదు అను విషయమును గమనించునెడల ఢిల్లీనగరమున పూర్వము నిర్మింపబడిన యుక్కుస్తంభముల మొదలు ఢక్కా మజిలినులవరకు భారత శిల్పకారుల చేతిపనియే యని తెలియును.

1298 సం. వరకు ఆంగ్లేయులకు ప్రత్తి యన నేమోకూడ తెలియదు. ఈ రోజులలో నీమాట బహుశః పుక్కిటిపురాణముగ తోచవచ్చును కాని నిశ్చయముగ నటు తరువాత కొంతకాలమువరకు నైతము వారికది క్రొవ్వువీపములకు వత్తులనుచేయుట కుపయోగించునట్టి యొక వస్తువనునంతకన్న మరేమియును తెలియదు. అటువంటి కంబళి సీమలో 1331 సం. నందు మూడవ ఎడ్వర్డు నరపాలుడు 70 నేతగాండ్ర కుటుంబములను ఇంగ్లండుకు గప్పించి రాజపోషణయం దుంచెను. పిమ్మట 1641 సం. న రాబర్టున్ అనువా రొకరు " ట్రెజర్ ఆఫ్ ట్రాఫిక్ " అను నొక గ్రంథము ప్రకటించిరి. మాంచెస్టరు ప్రత్తి పరిశ్రమనుగూర్చి ఆరోజులలో ప్రకటింపబడిన ప్రప్రథమగ్రంథ మదియే. ఆంగ్లేయు లంతట భారతదేశపు ప్రత్తి, పట్టు వస్త్రముల దిగుమతి నరికట్టి తమ వస్త్రవ్యాపారమునకు సంరక్షణమొసంగ దగు చర్య పుచ్చుకొనవలసివచ్చెను. అందువలన 1666 లో, దేశీయ లెట్టితరగతివారైనను మృతకళేబరములను కంబళి సల్లా కప్పి భూస్థాపన మొనరింపవలయునని పార్లమెంటులో నొకశాసనము గావింపబడెను. బ్రిటిషుకంబళివస్త్రపరిశ్రమ నభివృద్ధిపరచుటకే యిట్లుద్దేశింపబడె నని వేరుగ చెప్పవలయునా? మజిలినులును 1660 సం. మున సీమలో దిగుమతిగావించుకొనబడుచుండెను కాని 1700 సం. మునందు అసలు ప్రత్తివస్త్రములను ధరించుటయె అచ్చట చట్టబద్ధముగ నిషేధింపబడెను. ప్రత్తిబట్టలను ధరించువారికి 5 సవరనులు, విక్రయించువారికి 20 సవరనులు, జరిమానా విధించబడునట్లు 1721. సం. నం దొకశాసన మమలుపరుపబడెను. 1730 సం. మునం దట్టి సరకుపై " లినెన్ వార్ఫ్, కాటన్ వెఫ్ట్ " అను ముద్ర పొందినచో విక్రయించుననియు, సదరుముద్రను పొందుటకు చదరపుగజమునకు 6 పెన్సుల సుంకము చెల్లించవలయుననియు మరియొకచట్టము గావింపబడెను.

ఇట్లుండ ఈస్టిండియాకంపెనీ 1600 వ సంవత్సరమున సీమలో నేర్పడెను. 1612 సం. మునం దది భారతదేశమున మచిలీపట్టణమునందు కాలుబెట్టెను. 1613 సం. మున సూరతు, 1629 సం. మున మదరాసు, 1630. సం. మున హుగ్లీనగరము లాకేగెను. వా రేర్పరచిన కర్మాలయములు పారిశ్రామికాలయములుగనే గాక ఇంగ్లండున కెగుమతిచేయుటకు మన దేశీయ ఖద్దరుసరకును సమకూర్చి నిలువయుంచుటకు గిడ్డంగులుగ నుపయోగింపబడుచుండెను. అందు వారు పరిమళద్రవ్యములను, వ్యాపారార్థము వారు తమదేశమునుండి తెప్పించెడి కత్తులు కత్తెరలు బనాతుగుడ్డలు వగైరాలనుగూడ అచ్చటనే నిలువచేసి యుంచుకొనుచుండిరి. 1669 సం. మునందు ఈస్టిండియాకంపెనీ వర్తక లోకపక్షముగను, మచిలీపట్టణపు వ్యాపారులు మరియొకపక్షముగను నిలిచి ఖద్దరుసరఫరావిషయమున కంట్రాక్టు నేర్పాటుచేసికొన్నట్లు రికార్డులు కలవు. కృష్ణాజిల్లా మాన్యుయల్ V అనుబంధమునం దిది కానవగును. అందు కలంకారీలు, సుధీరంజీలు, పాలంపోరులు, సాసరగంట్లు, ద్వాపర్లు, దయమట్లు, రుమాళ్లు, అల్లిజాలులు, కలవపువ్వులు, పరకాళాలు, లుంగీలు, సల్లాలు, ఇజారులు వగైరాలనుగూర్చియుగూడ సూచింపబడియున్నది. ఈ ఖద్దరువ్యాపారమునందు ఈస్టిండియాకంపెనీవారు సీమలో గొప్పగొప్పలాభములును, అనగా నొక్కొక్కపుడు వందకు ఆరువందల లాభములనుగూడ గడించుకొనుచుండిరి. భారతదేశపు సిలుకులను వస్త్రములను ధరించవలసిన దురదృష్టము దాపురించెనా యని ఇంగ్లండులో ప్రజలు నిర్ఘాంతబోవుచుండిరి. ఇంగ్లండులో అప్పటి పెట్టుబడిదారులు వ్యాపారులు జెందిన సంతాపమును మెకాలేగా రీరూపముగ వర్ణించుచున్నారు.

" ఆరోజులలో గ్రామప్రాంతములవారును, పట్టణవాసములయందలి ప్రజలును తమగొర్రెలయున్నితో తమ మగ్గములయందు నేయబడిన వస్త్రములను ధరించుచుండిరి కావున అవి మంచిరోజులట. ఎలిజబెత్తురాణికాలమున రాచనగరులయందు గోడల కందముగ వ్రేలగట్టిన గంభీరములగు ఆరాసు పరదా లేమైపోయినవి? స్వదేశమున దేశీయపు టున్నితో దేశీయులచే నేయబడినవస్త్రములను తప్ప యితరములను మనపూర్వులు ధరించి యెరుగకుండగా, ఎక్కడనో మూర్షిదాబాదు నుండి దిగుమతిచేయబడిన అద్దకపుబట్టల నూటును పట్టుమేజోళ్లను ధరించి కులుకుట మన కగౌరవకరము కదా. " ఇట్టి యాందోళనయె 1696 సం. నందు " యథార్థవార్త " యను నొక నమోదులేని కరపత్రమున ప్రకటింపబడెను. అందా కంపెనీ లాభమంతయు మజిలినులు వగైరా వస్త్రములవలననే యని నిరూపింపబడెను. ఆ రోజులలో మజిలిను ధర గజమునకు 30 షిల్లింగులు. " పూర్వము దుప్పట్లకు, పరుపుగుడ్డలకు సామాన్యులు వాడుకొనుచుండిన బట్టలు నిపుడు సంపన్నురాండ్రు నైతె ముసుగులకై వినియోగించుకొనునంతవరకు ప్రజలకు ఇండియా అద్దకపుసరకుపై అభిమాన మతిశయించెను. నేలపై పరుపబడుచుండెడివి మూపుపైనను, జంబుఖానాలు జాకెట్లుగను సమున్నతస్థానముల నలంకరించెను. ఇంతటితో పోలేదు. అది మనయిండ్లయందు, పడకగదులయందు, పడదాలయందు, తలదిండ్లయందు, కుర్చీలయందు, అన్నిటియందు ప్రవేశించెను. మన పరుపులుగూడ భారతపు అద్దకపుబట్టలే. నేయేల, మన స్త్రీలయుదుపులు, ఇండ్లయం దుపయోగించునట్టి వస్తువులు అన్నియును భారతవ్యాపారమువలననేకదా మనకు చేకూరుచున్నవి. అప్పటివరకు నేలపై పరచుట కొప్పినదనుకొనబడుచుండిన అద్దకపుగుడ్డలను మేరీరాణీ ధరించి, ధారణయోగ్యములని క్రొత్తమోస్తరును త్రోవచూపెను. " అని యార్క్ షైరు విల్టుషైరు నార్విక్ స్పిటిఫీల్డు ప్రాంతముల పుల్లుపనివారు వర్తకులు భారత ప్రత్తివస్త్రముల దిగుమతిని నిరసించుచు తీవ్రాందోళన గావింపసాగిరి. 1667 సం. మ నాటికి ఇంగ్లండులో 160000 పౌనుల భారతవస్త్రములు దిగుమతి గావింపబడినపుడు వారి యాందోళన యతిశయదాయకము కాదుకదా. ఈస్టిండియా

* పంతులవారి ఆంగ్లవ్యాసమునకు ' సమదర్శిని ' పత్రికా కార్యాలయమునందలి వి. యస్. జయగోపాలునాయుడుగా రొనర్చిన ఆంధ్రానువాదము.

కంపెనీవారి కప్పటికే అపరిమితలాభము చేకూరియుండుటవలన వారాధారుల కందరకు వారివారి మొత్తమంతధనము బోనసుగా నొసంగబడెను. ఇట్టిపరిస్థితులవలన కంబళిపరిశ్రమ క్షీణించి, యాపనివాండ్రకు దురదృష్టము దాపురించెను. కావున భారతదేశమునుండి వస్త్రముల దిగుమతి నరికట్టి ప్రజలు భారతవస్త్రములను ధరించకుండుటకు తగుచర్య పుచ్చుకొనవలెనని పార్లమెంటుకు యొత్తిడి కలుగజేయబడెను. భారతదేశమునుండి దిగుమతియగు సరకుపై నూటికి పది మొదలు మూడువేలవరకు శేవుకేవు విధింపబడెను. ఒక గజము వెడల్పు 20 గజముల పొడవుగల మజిలీను బట్ట నేయుటకు 10 రోజులు మొదలు 60 రోజులవరకు పట్టును. అట్టిమజిలీను ఒక్కొకటి రు. 100 మొదలు రు. 400 ల వరకు కిమ్మతు కలిగి యుండును. ఒక అవు, పూరిపచ్చిక యని భ్రమించికాబోలు, నొక మజిలీనుబట్టను తినెను. అట్టి యజాగ్రతకు నబాబు అలివర్దీఖానుగారు నొకనేతగానిని దేశభ్రంశము గావించిరి. ఒకానొకసందర్భమున ఔరంగజేబుచక్రవర్తి తనకుమార్తెలు మజిలీను వస్త్రములను ధరించి కచ్చేరీకిరాగా, వారిపై నున్న మజిలీనువస్త్రమును గమనింపజాలక దిగంబరులై వారట్లు వచ్చిరని తూలనాడెను. కాని వారు తమ యొడలిపైనున్న 7 పొరల మజిలీనువస్త్రముల నాతని కగుపరచి యుపశమింపజేసిరి. ఈ వస్త్రముల పనితనమును సున్నితమును టావర్నియరు, బెర్నియరు మున్నగు సుప్రసిద్ధ లోకసంచారకు లెంతయు శ్లాఘించియుండుట విదితము. ఆరోజులలో అరేబియా పెర్షియా ఈజిప్టు పెగూ మలాకా సుమత్రా మధ్యధరాసముద్రతీరప్రాంతములయందు భారతవస్త్రవ్యాపార మెంతయు నుచ్ఛదశయం దుండెను.

ఆంగ్లేయు లిట్టి విషమస్థితియందు తమ పరిశ్రమల నభివృద్ధి గావించుకొనుచుండిరి. ప్రత్తివస్త్రములను నేయునట్టి యుత్తమయంత్రమును కనిపెట్టువారి కొక గొప్ప బహుమాన మొసంగబడునని ఆంగ్లకళాసంఘమువారు 1761 సం. మున ప్రకటించిరి. అందుపై పలువురు పలువిధ యంత్రచయమును కనిపెట్టనొడగిరి. పిమ్మట ఆవిరియంత్రము మరమగ్గములు కనిపెట్టబడి ఆంగ్ల ప్రత్తిపరిశ్రమ యత్యంత యుచ్చదశ నొందెను. కాని పరిశ్రమలయందు ప్రారంభదశలో కొలదియవాంతరములు ప్రాపించుట సహజముకదా. అటువలెనే 1812 సం. నుండి పూర్తిగా 5 ఏండ్లు కార్మికులయందు ప్రచలన ముదయించెను. అనేకులు దేశభ్రంశులు గావింపబడిరి. పెక్కురు ఉరితీయబడిరి. కాని వారిపరిశ్రమ దినదినాభివృద్ధిపొందెను. భారతదేశ వ్యవహారములు తారుమారైనవి. విజాతీయ క్షైత్రయాత్రలవలన భారతీయుల చేతిపను లేమాత్రమేని 11 వ శతాబ్దానంతరము వినాశముజెంద నటుకొన్నను అక్బరుచక్రవర్తికాలమునం దవియన్నియు పునరభ్యుదయ మొందెను. అప్పటి మజిలీనులను, సాటినులను, సగిషీ, జాళువాపట్టు, బంగారుమచ్చులు, బంగారు జలతారుదువ్వాలువలు, రత్నాలకంబళాదులను బెర్నియరు, టావర్నియరువంటి ఘనులగు ప్రపంచయాత్రికు లెంతయు ప్రశంసించియున్నారు. ఆరోజులలో మూర్షిదాబాదు లండన్‌నగరమువంటి గొప్పనగర మనియు, అతి సమ్మర్ద జనావాసమును ఐశ్వర్యవంతము నగు మూర్షిదాబాదులో వ్యక్తులకడనున్న ఐశ్వర్యము లండన్ నగరమునం దుండదనియు హెచ్. జే. ఎస్. కాటన్‌గారు వర్ణించియున్నారు. మానవనిర్మితములయందు భారతవస్త్రములు మిక్కిలి యమోఘములైనవనియు వర్తకు లత్యంత వ్యయప్రయాసలనోర్చి వానిని సేకరింతు రనియు చరిత్రకారుడగు ముర్రే వ్రాసియున్నాడు. 1600 సం. డిసెంబరు 31 తేదినాడు ఎలిజబెత్తు రాణివద్ద ఈస్టిండియాకంపెనీవారు అనుమతిని పొందినప్పుడు, ఇంగ్లండునం దారోజులలో పరిశ్రమ లంతగా లేనందున సాధ్యమైనంతవరకు ఈస్టిండియాలో వర్తకము చేయవలెను కాని ఆంగ్లదేశమున తయారైన వస్తువులకుబదులుగ భారతవస్తువులను స్వీకరింపరాదను నియమముండెను. (రిపోర్టు పారా 2)కాని, భారతదేశమున వ్యాపార మొనరింపవచ్చిన ఆంగ్లవర్తకులకు భారతపరిశ్రమల నంతరింపజేయగల సదుపాయము తమ ప్రభుత్వ మొసంగిన యవకాశమువలన వీలుపడదని యసంతృప్తికలిగెను కావున వారి కీదేశమునందు రాజకీయాధికార మొక్కింత సంప్రాపించినంతనే, అదియును ముఖ్యముగ ప్లాసీ యుద్ధానంతరము వారు స్వయముగ భారతవ్యాపారుల నణగద్రొక్క దొడగిరి. భారత ఆంతరంగిక రాజకీయములయందు వారు నిరాటంకముగ జోక్యముకలుగజేసికొని దేశీయులకు వారిపాలకులపై విద్వేష ముదయింపజేయగల కుట్రలను పన్నదొడగిరి. ప్లాసీ యుద్ధానంతరము బ్రిటిషువర్తకులు తమవ్యాపారార్థము భారతవస్తువులను సేకరించుటకై మిక్కిలి దారుణవిధానముల నవలంబించిరి. నబాబు మీర్‌కాసీముగారి కీ విధానము కిట్టక ఖండించినందున, బ్రిటిషువర్తకు లాతనిని పదచ్యుతునిగావించి తామే బంగాళపు సుబేదారు బాధ్యతలనువహించి పాలింప దొడగిరి. వారినిర్బంధము వర్ణనాతీతము. 1848 సం. మునందు ఫ్రాన్సిస్ కార్నక్ బ్రాను అనునతడు సెలెక్టుకమిటీమెంబరుల సాక్ష్యమొసంగుచు, సభ్యులమెంబరు నొక భారత చరకానుంచి ప్రతియింట నట్టిరాటమునకును తత్సంబంధములగు పరికరములు కన్నిటికిని నిర్బంధతీవ్రసుంకము విధింపబడినట్లు సూచించుటయె వారి నిర్బంధవిధానమునకు ప్రబలనిదర్శనముకదా. ఈస్టిండియాకంపెనీవారు నిర్భయముగ సంస్థానాధిపతులతోడ కంట్రాక్టునేర్పరచుకొని వారిసంస్థానములందు తయారగునట్టి బట్టయంతయు వారికే యొసంగునట్లు ఒప్పందము గావించుకొనుచు, పారిశ్రామికు లాచొప్పున సరఫరాచేయనోడినయెడల వారిని నానాహింసలబెట్టుచు నుండిరి. నూరేండ్లక్రితమే కలకత్తారేవునందే 2 కోట్లు అనగా ప్రస్తుతము 10కోట్ల విలువగల ప్రత్తివస్త్రములు ఎగుమతిచేయబడుచుండెను. దుర కదియంతయు మాయమయ్యెను. ఢక్కా నేతగాండ్రు తమచేతిబొటనవ్రేళ్లను తామే తెగగొట్టుకొనిరని కొందరు చెప్పుదురు కాని కంపెనీవారు బలవంతముగ తెగగోయుటకన్నను నేతగాండ్రు తామే స్వయముగ తెగనఱకుకొన్నారన్నచో నిర్బంధ మింకెంతటిదయియుండవలెనో యూహించుకొనవచ్చునుకదా. 19 వ శతాబ్దారంభమున మార్టిన్, డా. హ్యామిల్టన్‌గారలు "భారతవ్యాపారమును" గురించి ప్రకటించిన గ్రంథపుస్తకమును పఠించువారికి ఈస్టిండియాకంపెనీవారీ ప్రాచీననాగరకదేశముయొక్క వ్యాపారాతిశయము నెట్లు నాశమొనరించిరో విదితమగును. జాగల్ బాకీ పరిసరప్రాంతవాసులగు 700 నేతకుటుంబస్థులు కంపెనీ నిర్బంధమును భరింపజాలక తమనివాసములను వృత్తిని పరిత్యజించి పరారులైన చరిత్రము జాలికరము. 18 వ శతాబ్దముయొక్క అపరార్థభాగమున ఈస్టిండియాకంపెనీ యుద్యోగులును, వారివద్ద ధనమును స్వీకరించెడు దేశీయసంస్థానాధీశులును పారిశ్రామికులపట్ల వహించిన నిర్దాక్షిణ్య దారుణభావమును తలచినంత గుండెలు ఝల్లుమనక మానదు. కంపెనీ గుమాస్తాలు నేతగాండ్రను కటారులతో భయపెట్టి మిక్కిలి విపరీతమైన తక్కువ ధరలకు సరకును వారివద్దనుండి బలవంతముగ నూదలాగుకొనగలుగునంత యధికారమును పొందియుండిరి. బలవంతముగ వారిచే నొప్పందముచేయించుకొనబడిన సరకును వారు తయారుచేసి యివ్వజాలనియెడల పాపము వారిని స్తంభములకు నిలువగట్టి కమ్చీలలో కొట్టుచుండిరి. భారతవ్యాపారులు నేతగాండ్రవద్ద వస్త్రములనుకొనరాదు. కొనదలచువారికి లైసెన్సుండవలయును. తమవృత్తి యాదాయప్రదము కాదని పరిత్యజించి పొరుగూరి కేగదలంచు నేతగాండ్రటువలెచేయుటకు వీలులేదు. ప్రయాణపుచీటిని పొందవలయు నను నిర్బంధ ముండెడిది. సరకు ఈస్టిండియా కంపెనీవారికిగాక యితరులకు విక్రయింపబడునపు డాసరకుపై దుర్భరమగు విపరీత రవాణాసుంకము విధించబడుచుండెను. ఆరోజులలో గవర్నరుగారు పర్యటన మొనరించునపు డాయా ప్రాంతములయందు లభింపగల వస్త్రచయమునంతయును గవర్నరుగారికిని వారిగుమాస్తాలకును సమర్పించవలయునని సంస్థానాధీశు లుత్తరువులను జారీచేయించు చుండెడివారు. ఒకానొకసందర్భమున నేతగాండ్రను ఆంగ్లేయులను దచ్చివారును పంచుకొనుట కొక దారుణసూచన సైతము గావింపబడెను కాని డైరెక్టరు లాసూచనను నిరాకరించిరి. నేతగాండ్ర నాకాలమున కంపెనీయుద్యోగులు బానిసలవలె నిరాదరించుచుండినట్లు మన్రో మున్నగు నప్పటిపాలకుల వ్రాతలయందు కానవగును. అటువలె 1813 సం. నాటికి భారతవస్త్ర పరిశ్రమ చాలవరకు నిర్మూలమయ్యెను. అటుపిమ్మట సంగతినిచెప్పవలయునా? 1820 సం. నందు 70 లక్షల విలువగల సీమగుడ్డలు భారతదేశమునకు దిగుమతియగుటచే దేశీయులు చింతాక్రాంతులై తమకన్నులార చూడవలసినవారైరి. తుదకు 1851 సం. మునందు సి. ఎస్. దేవర్ (భారతీయుడు) గారు భారతదేశమునం దొక యంత్రాలయమును నిర్మించుటను డెల్‌హౌసీప్రభువు గమనించి, వస్త్రవ్యాపారమునుమాత్రముగాక ప్రత్తిపండు ప్రాంతమును సైతము తమపర మొనరించుకొను టగత్యమని తలంచి, 1853 లో బీరారు ప్రాంతమును నిజాముప్రభునికడ నుండి వశపరచుకొన దగుచర్య బూనెను. బీరారుతరువాత 1854 లో నాగపురసంస్థానమును పాలించుచుండిన భాన్స్లే వంశీయుడగు నరపాలు డనపత్యుడై మృతినొందినంతనే వారసుని దత్తస్వీకార మొనరించుకొననంతమాత్రమున వశపరచుకొనిరి.

భారతదేశమునం దీ ప్రాచీనపరిశ్రమ నాశనమైన విషయమునుగురించి ఆంగ్లపాలకులు సైతము దాపరిక మొనరించుటలేదు. సర్ బేసిల్ బ్లాకెట్టుగారు ఢిల్లీవల నొకానొక యుపన్యాసమునందు మనస్ఫూర్తిగా నీ యథార్థము నంగీకరించుచు, "భారతదేశమున ప్రతీచీచర్య, అందు ముఖ్యముగ గ్రేట్ బ్రిటనుయొక్క పారిశ్రామికాభివృద్ధి, మూలమున భారతదేశమునకు అపరిమితముగ దిగుమతి గావింపబడుచున్న యంత్రనిర్మిత సామగ్రివలన భారత ప్రజాసామాన్యమునకు మేలు రకములగు వస్తువులు సరసముగ లభించగలిగినను, 19 శతాబ్దమున భారతగ్రామ

ప్రాంతవ్యాపారమును చాలవఱకది చెఱచె. భారత ప్రభుత్వ మాగోజులలో
మాంఛెస్టరు ప్రాంతవాసుల యభిప్రాయమునకు లోనయి ఆర్థికవిషయములయం
దంతగ జోక్యము కలుగజేసికొనక లా ఆర్డరులను నెలకొల్పుట కవసరమగు
నంతమాత్రము పన్నులను విధించుచుండెను" అని నిరూపించిరి. ఆ యంత్ర
నిర్మితవస్తువు లేవి, భారతదేశమున ప్రసరింపబడుచు తక్కువధరలకు లభించు
మేలుతరపు వస్తువు లేవి యనుటను మనము గమనింపదగును. ఆధునిక ఆంగ్ల
విజ్ఞానవంతులగు భారతయువతీయువకులు తెల్లవారుజామునుండి సాయంత్రమువరకు
(గ్రామప్రాంతములయందు సైతము) చాలమట్టుకు విదేశీయసరకునే యుపయోగించు
చుండుదురు కదా. యూనిమాల్ దంతలేపనము, జపాను బ్రష్షులు, వల్కనైటు
నాలుకగీతబద్దలు వగైరాలు ప్రాతఃకాల నిత్యకృత్యములకును, క్రాపు రేజరులు,
పదునుచేయుతోళ్ల లేపనములు, వాలెట్, గిల్లెట్, జంప్ జూనియర్ బ్రాండు మున్నగు
సెల్ఫు షేవింగుసామగ్రి, కత్తిబ్లేడులు, యంత్రపుసానలు, లోమట్టపు అద్దములు,
క్యూటికురా, వినోలియా సబ్బులు స్నానమునకు, ఒడలు తుడుచుకొను రబ్బరు
బిళ్లలు, ఆల్కిన్ మన్సు శాఖాకేశతైలము, తలదువ్వుకొను బ్రష్షులు, వాసనద్రవ్య
ములు, హిమాలయన్ బొకే, ఎరా స్మిక్ లండన్, స్నోఫేస్ క్రీం లండన్ నుండి
దిగుమతియగు ఫ్రెంచి పాంసియా, లేదా వినోలియా క్రీం ఎరా స్మిక్ ఓల్డ్
లవండర్ సోపు, రోల్డుగోల్డు సూదులు చొక్కాలకు, గోల్డు కవర్డు పాయింట్లు,
డెర్బీ సైజు, ఎత్తుకాలరులు, ఉడుపులకు క్రిలియనేట్ లేదా మేరినో, లేదా
గ్లాస్గో, కత్తులు, ముండ్లు, చెంచాలు, టీసెట్లు, మార్బిల్ తట్టలు, కేవిస్
టేబుల్ వాటర్ బిస్కట్లు, నార్వేజియన్ సార్డిన్ చేపలు, తక్కాలికాయలతో
వండిన మార్టన్ గారి హెర్రింగుచేపల డబ్బాలు, ఊరవేయబడిన అనాసబద్దల
డబ్బాలు, సీమపండ్లతాండ్రలు, ఆస్ట్రేలియావెన్న వగైరాలు భోజనమునకు, జర్మను
గంధి లవండర్ వాటర్ 64 దినుసుల [illegible]సెంట్లు, స్విస్ గడియారములు, చేతి
కర్రలు, పట్టుగొడుగులు, మోటారుకారులు, ఓవర్ కోట్లు, డామన్సుబూట్లు,
క్రిస్టీస్ హ్యాట్లు, టెన్నిసుబ్యాట్లు, హాకీకర్రలు సాయంత్ర మాడుకొనుటకు, డీట్సు
లాంపులు, గోల్డుమెడల్ మంచములు, దోమతెరలు, ట్రంకుపెట్టెలు, తోలు
సంచులు, కాన్వాసు సంచులు ప్రయాణమునకు, మేజాపంకా, వెన్నమరలు, నిమ్మ
రసము నొక్కులు, స్వీడిష్ ప్రాయిలు, సిల్కుల నుతుకుటకు లక్సుసబ్బు, ఇస్త్రీ
పెట్టెలు, బత్తాయికత్తులు, రేపిడ్ రోవ్ కోర్టు నోటుకాగితములు గూప్ టూన్ కల
ములు, జోకల్ బుక్ ఫారం పేటెంటు, వేర్టిలాక్ ఫోల్డర్లు, టాప్ నాచ్ కవరులు,
మణిల్లా చుట్టలు, వర్జీనియా సిగరెట్లు వగైరాలు మన కన్నులను భ్రమింపజేయును,
హృదయము నాకర్షించును, మన ధనమును నాశన మొనరించును. ఇంతటితో
పోలేదు. ఇంకను బ్రాసో మెటల్ పాలిషు, కోబ్రాబ్లాంకో జోళ్లకప్పులు, కాఫీ
దుమ్ముచేయు యంత్రములు, మెరయునట్టి బ్రసెల్సు తివాసీలు, జుగోస్లేవోకియా
కుర్చీలు, చిలుక చెక్కబడిన మేజబల్లలు, ఎలెక్ట్రిక్ దీపములు పంకాలు, హీట
రులు, టీపాత్రలు, చేతి దీపములు, కాగితపు క్లిప్పులు, గుండుసూదులు, దారపు
ముక్కలు వగైరా లెన్నియేని కలవు కాని ఒక్కటీ కెడుమాదియైన నుండదు.
భారతదేశమున ప్రతిగ్రామమునందు ఇంగ్లీషు అమెరికను యూరోపియను జపాను
సరకు లన్నియు దుకాణములలో లభించుచుండగా, కుదురు లేశమాత్రమేని ప్రత్తి
గాని వడకిన నూలుగాని లభింపకుండుట విపరీతము కదుంగడు దారుణముకదా.

భారతదేశమునందుండి యింత ద్రవ్యము పోవుచుండుట నరికట్టుటకే
గాంధీజీ చేతితో నూలువడకుటకును, బట్టలను నేయుటకును మరల మెల్లగా నొక
ప్రారంభమును గావించెను. 1920 సం. మునందు కలకత్తాలోజరుపబడిన ప్రత్యేక
కాంగ్రెసు సమావేశమునం దీ యభిప్రాయము సూచింపబడినప్పు డంతగ గమనించ
రైరి కాని నాగపూరునం దావత్సరమే జరగిన కాంగ్రెసు సభలో, మిల్లునూలు
చేతినేత బట్టలు, మిల్లునూలు మిల్లు నేతబట్టలు, విదేశనూలుతో స్వదేశమిల్లులలో
నేయబడిన బట్టలు వగైరాలు సైతము స్వదేశబట్టలజాబితాలో చేర్పబడినను
ఖద్దరు వస్త్రము లవశ్యధారణయోగ్యములని సభలో నిర్బంధముగ తీర్మానింప
బడెను. అనంతరము ప్రజలయందు సైతికాశయ మభివృద్ధిపొందినందున నిప్పుడు
ఖద్దరనగా చేతినూలుతో చేతితో నేయబడిన వస్త్రమే. దేశభక్తుల కదియే
ప్రధానచిహ్నమయ్యెను. కాంగ్రెసుసభ్యు లెవరేని ఖద్దరువస్త్రములనుతప్ప యితర
ములను ధరించినయెడల కాంగ్రెసుపక్షీయులేగాక యితర రాజకీయవర్గములకు
చెందినవారుసైతము వారిని నిరసించి కాంగ్రెసు ఉద్యమ విద్రోహులని సంభా
వించు చున్నారు. ప్రజాసామాన్యమునం దీ యభిప్రాయాభివృద్ధి యొక్కదిన
మున కలుగలేదు. క్రమక్రమముగ మెల్లమెల్లగ నీ ఖద్దరుదీక్షవలన కాంగ్రెసు వాతా
వరణమంతయు బంధురమై, తుద కొకనాలుగేండ్లలో, అనగా 1925 సం. జనవరి
మొదటితారీఖున కాంగ్రెసుసభ్యులు ఖద్దరునే తప్పక ధరించవలయుననియు కాంగ్రెసు
కార్యనిర్వాహక సంఘసభ్యత్వమునకు వ్యక్తులు తమంత స్వయముగ నూలు
వడకి తీరవలయుననియు, తదనంతరము కాంగ్రెసు సభ్యత్వమునకు చందాయొక
నిర్ణీతమాత్రపు చేతినూలు పంపబడవలయునని యేర్పాటు చేయబడెను. ఖడ్గమునకు
మారుగ రాట్నమే పరమసాధనమనియు, దౌర్జన్యమునకును వినాశమునకును మూల
మగు ఖడ్గమును కాంగ్రెసువారును దేశీయులును త్యజించివేసిరనియు ప్రజల మన
సున నాటజేయబడెను. ఖద్దరుదీక్షవలన ప్రస్తుతము పాశ్చాత్యదేశములయందును,
పూర్వ మనాదినుండి ప్రాచ్యప్రాంతములయందుసైత ముండినయంత సమున్నత
గౌరవ మభివృద్ధి పొందెను. ప్రతీచీప్రాంతములయందు కార్మికులలో సామాన్యపు
కూలీ మొదలు పార్లమెంటుసభ్యులవర కున్నారు. మనలో నట్లుకాదు. మన మంత
కన్నను పరొకడుగు ముందునకే పోయితిమి. ప్రజాసామాన్యమున కాహారవస్త్రా
దుల నదుపాయమున కొనరింపబడు మానవప్రయాసయందు మన మొక్కింత మేర
సన్నాహ మొనరించుచున్నా మనుభావముతో మనము చేయుచున్నాము. మనదేశ
మునకు విదేశవస్త్రములు దిగుమతి యగుటవలన భారతీయుల ఆహారమునకు, ఐశ్వర్య
మునకు, ఆత్మగౌరవమునకు నంతకును భంగము వాటిల్లెను. అందువలన నిరుద్యోగ
సమస్య తీవ్రతర మయ్యెను. బెల్గాము కాంగ్రెసుసమావేశము ఖద్దరు అభివృద్ధిసూచక
శక మనదగును. ఆసభ నలంకరించిన భారతపురుషులును నారీమణులును అందరును
ఖద్దర్ ఉద్యమ విజయమునకు ప్రయత్నింప సత్యప్రమాణములను గావించిరి. అప్పటి
నుండియు ఖద్దరు నభివృద్ధిపరచుటకు ప్రచారకులును సంస్థలును వెలువడ దొడగెను.
అందలి తత్వమంతయు తుద కత్యంత సులభసాధ్యమే. డబ్బిచ్చి దూదిని ఏకులను
పుచ్చుకొని యాదూదిని ఏకుల నిచ్చి నూలును, నూలునిచ్చి బట్టను, బట్టనిచ్చి క్రయ
మును పొందుట. అంతవర కేల పెరటిచుట్టును ప్రత్తిచెట్లను మొలిపించి, ఇంటిలో
నూలువడకి, మందువాలో నేయించి ధరించుకొన్నయెడల చాలదా. పూర్వము
మనదేశమునందు గ్రామవాసములలో పెండ్లి పేరంటములు జరుగునప్పుడు వా
రందులకు వలయు వస్త్రచయమును పట్టణప్రాంతములందలి బజారులకేగి ఎన్నడు
కొనియెరుగరు. ఆగ్రామమునందే నేయబడిన బట్టలను కండెల నిచ్చి మార్చు
కొందురు. ఇతరవస్తువులగూడ నటువలెనే గ్రామమునందే సేకరించికొందురు.
ఇప్పటివలె బోలెడుధనము ఖర్చుచేసి కొనరు. గ్రామములలో తగినంత నూలు
కండెలు లభించనియెడల వా రాయేడు సదరు కార్యమును జరుప మానుకొని,
గ్రామములో చాలినన్ని కండెలు లభించునప్పుడే జరుపుకొనుచుండెడివారు. నేతి
విషయమునగూడ నంతే. నెలలకొలది నేతిని చెడిపోకుండ పదిలపరుపగల విధము
వారికి తెలియును కావున, ఇప్పటి ప్రభుత్వమువారు నిషేధింప జాలకయున్న
వనస్పతి నేతివంటి కల్తీ నేతికొరకు వా రెన్నడు పట్టణవాసములకు రారు.
కాని యీ యాచారమును పూర్వమువలె మరల నెలకొల్పగలుగుట యసా
ధ్యమే కావచ్చును. ఆరోజులలో బాలికలు వడకుటను నేయుటను నేర్వనియెడల
పెండ్లి కీడుకానివారుగ పరిగణింపబడుచుండిరి. అస్సాము ప్రాగ్జ్యోతిష పుర
ప్రాంతమునం దీ యాచార మిప్పటికిని యనుసరణీయ మైయున్నది. కావున మన
మిప్పుడు భారతవస్త్రపరిశ్రమను మరల నుద్ధరింపదలచుటలో మన మొక నిరూపిత
యథార్థాంశమును నెలకొల్ప యత్నించుచున్నాము కాని, అవసరపడి యన్యథా
ప్రయాస పడుచుండుట లేదు. గ్రామవాసములయందు ప్రజలకు మితిలేని తీరిక కలదు.
దురదృష్టవశమున వా రిప్పు డాసమయమును చీట్లాటయందు వృథా ప్రసంగముల
యందు చిల్లరాటలయందు జూదములయందు కోర్టువ్యాజ్యములయందు వ్యర్థపుచ్చు
చున్నారు. దీనినంతయు మాన్పించ వలయును. వ్యవసాయదారులు సాగుపని లేనపుడు
స్వగ్రామములనుండి జీవనోపాధికై లేచిపోవక గడపుకొనజాలుటకు వారి కనుకూల
మును సాధ్యమును ఆదాయకరము నగు నేదేని యొకవృత్తి నేర్పరుపదలచి సర్. విశ్వే
శ్వరయ్యవంటి పండితులు అనేకులు బ్రహ్మప్రయత్నములను గావించిరి కాని, గాంధీజీ
యొక్క నిరుపమాన సత్ఫలప్రదమాత్మజ్ఞానము శుభకరమగు ఖద్దరు పరిశ్రమను మరల
నెలకొల్పదగునని సూచించునంతవరకు మానవవిజ్ఞానమున కెట్టివృత్తియు స్ఫురించలేదు.
నూలువడుకుట మిక్కిలి సులభమైనపని. మనదేశమునందు అధమపక్షము 5 కోట్ల
రాటములైన నుండును. ఇక కావలసినదంతయు నొక పావలాదూది. నాలుగణాల
పెట్టుబడి చాలును. వృద్ధ, కుంటి కురూపులైనను చక్కగ వడకగలుగుదురు. నూలు
వడకుట లాభకరముకాదని, కొందరందురు కాని యదిపొరపాటు. అది ఎన్నడు లాభ
కరము కాకపోలేదు. అయిన నగటున రోజు కొకఅణా ఎనిమిది కానులకన్న
నెక్కువ సంపాదన చేకూర్ప నేరదు కాని మనలోనున్న కుబేరులను కోటీశ్వరులను

లక్షాధికారులనందరను జమకట్టుకొన్ననుగూడ సగటున భారతీయుని యాదాయము మాత్ర మెంత? అణా ముక్కాలైనకూడ యుండదేమో. కోట్లకొలది ప్రజలు పని పాట్లు లేకున్నారు. అట్టియెడ వీరి కిల్లువాకిలి చుట్టుపక్కములను విడచి పోరుగూళ్లకేగి ప్రయాసపడవలసిన యవసరములేక సగటున నొక భారతీయుని యాదాయమంత ద్రవ్యము ననాయాసముగ లభింపగల సదుపాయకర మగువృత్తియందు నియోగించుట దోషమా! భారతీయులు తమ యఖండమానవ ప్రాబల్యమును గమనించునెడల, కోటానకోట్లగు భారతీయులందరును వడకిననేగాని విదేశీయుల యొక్కయు యంత్రములయొక్కయు పాశ్చాత్య నవీనపారిశ్రామికాభ్యుదయము యొక్కయు తీవ్రమగు పోటీని మన మెదుర్కొని మనకు వలయువస్త్రచయమును సమకూర్చుకొనజాలమని గ్రహింపగలుగుదురు. పూర్వము గ్రామవాసములయందు ప్రజలకు ప్రత్తి వడకుటమాత్రమె వృత్తికాదు. బంగాళమునందు జనమును వడకుటయు నేయుటయు నుండెను. పట్టునేతసైత మన్నిప్రాంతములవారికిని తెలియును. ఈవిషయమునం దానోజులలో జాతిభేదము నెవ్వరు పాటించినవారుకారు. నూలు వడకినవారు నేసిరిలు హిందువులు. నేతగాండ్రు మహమ్మదీయులై యుండిరి. వారందరు పరస్పరము కలిసిమెలిసి జీవించుచుండిరి. ఒక గ్రామమునందు 4000 ప్రజలుండి, వారి కందరకు వలయు వస్త్రము లాగ్రామమునందే సరుదుపాటు చేసికొనవలయుననుకొనుడు. ప్రతి వ్యక్తికి 13 1/2 గజములబట్ట కావలసియుండునను అంచనాచొప్పున ఆ గ్రామమున కొక యేడాదికి 54000 గజముల బట్ట అవసరము. దాని క్రయము రమారమి రు. 27000 లుండును, ప్రత్తి మనదేశమునందే పండును. కావున ఇందు మూడవ వంతు ప్రత్తి క్రయమునకు మినహాయించినయెడల రు. 18000 లు లాభము. ఇందు వ్యాపారలాభము, సరకు రవాణా ఖర్చులు వడుకుకూలి నేతకూలి వగైరా ఖర్చులన్నియు గ్రామమునకు మిగిలినవేగదా. ఇంతలాభము, గ్రామవాసులందరుగాక యే యున్నారనుకొన్న తమ తీరికవేళలయందు నూలువడుకుటవలన ఆగ్రామమున కా రు. 27000 లాభము మిగులుచున్నది. ఇది యొక నేరమా, ఇది దురాలోచనమా, అనుచిత దేశభక్తియా, ప్రతివత్సర మాగ్రామమునకు రు. 27000 ల లాభము మిగులుచున్నపుడు దానిసంపద యెట్లుండునో మీరే యూహించుకొనుడు. మీ రీ సాధారణాంశమును చక్కగ గమనించినయెడల ప్రాచీన భారత సౌభాగ్యాతిశయమును ప్రస్తుత దుర్భర దారిద్ర్య పరిస్థితియు మీకే విదితమగును. జీవితమున కాహారము వస్త్రము నావశ్యకములు. కావున యేదేశమునం దివి దేశీయముగ లభింపజాలవో అది యొక నాగరికదేశము కానేరదు. నూలువడుకుటవలె గాక నేత పరిశ్రమను తమకు వలయు వస్త్రచయమును స్వదేశమున తయారుచేసికొనజాలనివారి దురవస్థ భారతీయులకెండ యుద్ధసమయమున విదితమయ్యెను. ఆరోజులలో బట్టలధరలు మితిమీరి పెరిగిపోయినందున పాప మనేకులు బట్టలు లేక మానమునకు వెనుదీసి యాత్మహత్య లనుసైతము గావించుకొనియుండుటను విని యున్నాము. చేతినేతపరిశ్రమ భారతదేశమున చిరకాలమునాటిది. దీనికిని సహాయనిరాకరణోద్యమమునకును సంబంధ మేమియును లేదు. 1905 వ సం. మున బంగాళావిభజనాందోళన మొదలయించుటకుముందు ఫ్లయిషటిల్ విధానమును ప్రవేశపెట్టినపుడు మనదేశమునందు 60లక్షల మంది నేతగాండ్రున్నారనియు అందు రమారమి నాలవవంతు దక్షిణాదియందున్నారని ఇ. బి. హ్యావల్ మహాశయునియంతటివారే అంచనావేసి నిర్ధారించిరి. కావున దేశమునందిప్పుడొక 50 లక్షల రాట్నములైన నుండుననుకొనుట అతిశయోద్దేశము కానేరదు. అనుభవజ్ఞుడగు తంతుకారకుడు సగటున గంట కొక 336 గజముల చక్కని మెలిగల 10, 15 ఇంకను 20 నెంబరుగూడ నూలువడకగలడు. అటువలె రోజు కొకడు 5 గంటలసేపు పనిచేసినయెడల రమారమి 1680 గజముల నూలు చులకనగ తీయగలడు. అనగా నెలకు 4 పౌనులు, సాలుకు 48 పౌనుల నూలు తీయగలడు. ఒకపౌను నూలుతో 4 గజములబట్ట నేయగలుగునపుడు 48 పౌనుల నూలు 192 గజముల బట్టకు సరిపోవును. ఆ లెక్కచొప్పున పనిచేయునెడల విదేశవస్త్రముల దిగుమతి నంతయును మన మరికట్టవచ్చును కదా. దానికి వలయు మూలధనము సైతము ననాయాసముగ సమకూరును, కాని యింతకు మనము వడకవలయుననియు, సాధించవలయుననియు స్థిరచిత్తము మాత్ర ముండవలయును.

రాటమును ఖద్దరును మరల అభివృద్ధిపరుపవలయునని మనమనునపుడు, మిల్లు బట్టల నేల యుపయోగింపరాదని విజ్ఞానవంతులు కొందరు వాదింతురు. మనవారి కిట్టి విపరీతవాదములు నూతనములుకావు. వ్యక్తిత్వాభిమానమువలన ప్రజల కిట్టి వితండవాదములు స్ఫురించుట సహజమె కాని వారి కందువలన ధర్మాధర్మసాధకబాధక విచక్షణయుండదు. కాంగ్రెసు తీవ్రతర తీర్మానములయందు సైతము మిల్లుగుడ్డ యుపేక్షింపబడలేదు. స్వదేశీసరకునందున వివిధములగు దినుసులన్నియు సవివరముగ సూచింపబడియేయున్నవి. తక్షణము ఖద్దరును కొనజాలని బీదవారు భారత మిల్లులలో వడకబడిన నూలుతో భారత మిల్లులలో నేసినబట్టల నేల ధరించరాదని కొందరు ప్రశ్నింపవచ్చును. నిశ్చయముగ నిరుపేదలగువారి కట్టి సదుపాయ ముండవలసినదే కాని ధనవంతుల కేల. భారతదేశభక్తుల కార్యక్రమమునందు యంత్రముల యుపయోగము నిషేధింపబడియుండలేదు. అట్లే యనుచో బంగాళా రసాయనశాలా నిర్మాతలును, పలు యంత్రాలయముల పోషకులు నగు ప్రాఫెసరు రేగా రబద్ధమాడుచున్నట్లే భావించవలయును. గాంధీశ సైత మిప్పుడు మోటారుకారులో ప్రయాణము చేయరా? యంత్రసహాయ మవసరమగు పరిశ్రమలకును, చేతిపనులకును చాల తారతమ్యము కలదు. కళాయుక్తములగు పరిశ్రమలే యొకజాతి కత్యంత స్తవనీయములు, ఒకజాతివారికి వారి సంప్రదాయములకు వ్యక్తిత్వమున కనుగుణ్య మగునట్టి కళలును చేతిపనులు నుండునపుడే అది నాగరికజాతి యనంబడును. ప్రపంచమునం దంతట నీ కళలును పరిశ్రమలే యెంచుకొనవలెను. శీఘ్రగమనమునకు మోటారుకారు లున్నవి. సాగుచేయ నీరు తోడుటకు పంపులు కలవు. రాళ్లను పిండిచేయుటకు మరలు యంత్రములు కలవు. కూలీలను తగ్గించుటకు ఆవిరియంత్రము కలదు. కాని బట్టలను దుప్పట్లను నేయుటగాని అర్ధకముగాని అటువంటి పనికాదు. కావున దానికి యంత్రసహాయ మనవసరము. అది యొకజాతియొక్క చేతిపనులకు సంబంధించినది. కావున మేమీదేశమునం దీ విషయము గమనింపబడవలయుననియే ప్రయాసపడుచున్నాము. ఇంకను మిల్లుబట్టల నందరకును సరుదుపాటు చేయించుటకు వీలుపడకపోవచ్చును కాని, చరకా అట్లు కాదు. దాని కొక 4 అణాల ఏసలుగాని దూదిగాని మొదటనుండిన చాలును. ఒక చేతిమగ్గమునకు రు, 3 ల విలువగల నూలు పెట్టుబడియుండిన చాలును. ఇక నను భవమునకు సలహాకు వలసినంత సహాయము కలదు.

ఇప్పటికిని చేతిమగ్గములయందు నేయబడిన వస్త్రములను దేశీయు లుపయోగించుచునే యున్నారు. కావుననే భారతదేశమునం దెన్నటికైన నేత పరిశ్రమ స్వదేశమునందును ఆంగ్లదేశమునందునున్న మిల్లుపరిశ్రమను మించిపోవునని ఇ. బి. హ్యావెల్ గారు సూచించియుండిరి. యంత్రాలయములయందు సైతము రోజు కొక 480 పౌనులు, అనగా రమారమి 1500 గజముల బట్ట తయారుచేయబడును. ప్రతి వ్యక్తికి సాలుకు 13 1/2, 15 గజములబట్ట కావలసియున్నపుడు అందొకరోజులో నేయుబట్ట 100 మందికి సరిపోవును. అందుచే ఒకసంవత్సరమున కొక మిల్లు 30000 ప్రజలకు వలయుబట్టను సరుదుపాటు చేయును. కావున 1 లక్ష ప్రజలకు సరుదుపాటు చేయుటకు 3 మిల్లు లుండవలయును. 3 కోట్ల 20 లక్షల మందికి సరుదుపాటు చేయుటకు 960 మిల్లు లుండవలయును. సంస్థానములు బ్రిటిషురాష్ట్రమునందు సగపాలుండు ననుకొనునెడల మొత్తముమీద రమారమి 350 జిల్లాలను లెక్క తేలును, అట్టి ప్రతి జిల్లాకు, అనగా రెండు మూడు తాలూకాల కొకమిల్లుండవలయునుకదా. ప్రతి మూడు తాలూకాలయం దిట్టిమిల్లు నిమిత్తము 40, 50 లక్షల మూలధన మెటనుండి లభించగలదు. సమకూర్పయత్నించినను పదేండ్లుపట్టును, పిదప యంత్రముల కార్డరు చేయునెడల మన కవి 2 1/2 ఏండ్ల తరువాతగాని లభింపవు, మనము యంత్రములను పొందించి పని నారంభించుటకు మరొక రెండేండ్లు పట్టును కావున ధనమున్నను యంత్రాలయము నెలకొల్పుట కొక 5 ఏండ్లైను పట్టును. అటుతరువాత పని నడుపుటకు మూలధనము, వ్యాపారమును సముపార్జించుట, పేరు పొందిన ప్రతిపక్షుల పోటీనెదుర్కొనుట మున్నగు సమస్యలను పరిష్కరించుకొనవలసియుండును. వీనికన్నిటికి కనీస మొక పదియేండ్లైనను పట్టును. అదియును ఆ రెండు మూడు తాలూకాలలో సరియైన వ్యాపారము జరుగుచుండిననే. కాని, యది యసంభవము కదా. తుదకంత ప్రయాసపడినను, మన మప్పటికిని వెనుకనే పడియుందుము. యంత్రములు అరిగిపోయి ప్రాతపడును. లాభ మేమాత్రమేని అంత యింత లభింపగలిగినయెడల నదియును మాయమగును. అంతలో లాంకషైరువారు నూతన యంత్రములను సాధకములను సదుపాయములను కనిపెట్టి ప్రపంచమంతటికన్నను, తుదకు తమకన్నను గూడ మరొకయడుగు ముందున కంజవేయ ప్రయత్నింతురు. అప్పు డీ దూరభార సీమయం దే మారుమూలయందో యున్న యీ చిన్నమిల్లుగతి యేమగును, సర్వనాశనమే. అటుగాక మీ ప్రయత్నములు సఫలములైనవే యనుకొనుడు. అప్పటికిని బట్టలనిమిత్తము లాంకషైరువారి కొసంగ నిరాకరించిన ద్రవ్యమును యంత్రములకొరకు బకింగుహామువారి కర్పించుకొనవలసినదే గదా. అదియునుకాక మరొక విషయము కలదు. మూలధనము లభించి, యంత్రములు నమ్మకముగ పంపబడి, చక్కగ పనిచేయున ట్లమర్పబడినను అనివార్యములగు కార్మికులసమ్మెలు కలవు. గత 1928-29 సం. మునం దిట్టి సమ్మెవలననే గదా పనివేళ సగభాగము తగ్గింప

బడెను. ఆర్థికముగ వాని యంతరాయమంతే. ఇక నైతికముగ వారు కార్మికుల వ్యుత్పత్యుత్సాహముల నంతరింపజేసి యవినీతవర్తనులను గావింపవిడచి, భర్తలను భార్యలను పెద్దలకడనుండి బిడ్డలను వేరుపరచి పనులలోచేర్చుకొనుట గర్హ్యము.

లలితకళయందు, సహజముగ తమచేతులార చేసి అందలి జీవకళను తనివితీర జూచి యానందించగలట్టి యాసంతృప్తి మరెందున నుండనేరదు. ఒకదేశముయొక్క నాగరికాతిశయమును నిర్ణయించుట కందలి కళలును, చేతిపనులును ప్రాముఖ్యములు. భారత నేతగాండ్రును వర్ణకారకులును చేతినేతపనియందు పాశ్చాత్యులేనియు నూహించియుండనంత నైపుణ్యాతిశయమును పొందగల్గిరి. మనదేశమున కంతసను వలయు వస్త్రముల నూలుకూలి నేతకూలి నంతయును మిగులుట గలిగినయెడల 40 కోట్ల రూపాయల నష్టమును మన మేటేట వారించుకొనవచ్చును. విదేశములనుండి మనకు రు. 66 కోట్ల విలువగల బట్టయు, రు. 6 కోట్ల నూలును ప్రతిఏడు దిగుమతి యగుచున్నది. ఈ 72 కోట్ల దిగుమతిసరకుయొక్క నికరపుకూలి విలువ 40 కోట్లన దగును. మన మిందులకు మారుగ విదేశములకు రు. 40 కోట్ల విలువగల ధాన్యము నెగుమతిచేయుచున్నాము. సామ్రాజ్యవ్యాపారసంఘమువారు బంగాళా బర్మా ధాన్యములను శ్లాఘించుచు, భారతదేశమునందు దేశీయులకు వలయునంతకన్న నపరిమితముగ ధాన్యము పండింపబడుచున్న దని సూచించుచున్నారు. కాని అది శుద్ధ అబద్ధము. భారతజనసామాన్యమునం దొక అయిదవవంతు ప్రజలు అనగా 6 కోట్ల ప్రజలు ఒంటిపూటతిండితో ప్రయాసపడుచున్నారని సర్ ఛార్లెస్ ఎలియట్, సర్ విలియం విల్సన్ హంటరు మున్నగు మహనీయు లంచనావేసి నిర్ణయించి యున్నారు. ప్రజలకు బియ్యమును కొనగలుగుటకు తగినంత ధనమును ప్రసాదింప జేయగల ప్రభుత్వము లేదు. ఈదేశమునందు ధాన్యమునకు కఱవులేదనుట నిజమే కాని తిండిలేక మాడిపోవుచున్న వారికిమాత్రము లోపమా? వారి కన్నులముందున్న ధాన్యమును కొనుటకు వారికి ధనములేదు. గుడ్డలదిగుమతివలన నిప్పుడు విదేశముల పాలగుచున్న యా రు. 40 కోట్లను, మనము చేతినూలు చేతినేతవలన మనదేశమునందే మిగుల్చుకొనగలుగునెడల భారతీయు లపుడు పస్తుపడియుండ నవసరముండదు. మనధాన్యముసైతము విదేశముల కెగుమతి కాదు. అది యటులుండ రు. 100 ల కిమ్మతుగల మిల్లుబట్టలో రు. 71 లు పెట్టుబడిదారునికిపోవును. మిగిలిన రు. 29 లు కార్మికులకు చెందును. చేతినూలు చేతినేతబట్టలవిషయ మట్లుకాదు. అందు రు. 79 లు పనివారికి చెందును. ఇతర ఖర్చులకు రు. 21 లు పోవును. పనివారి కాహారమును నోటికందిచ్చు ప్రస్తుత మీవృత్తులన్నిటి కొక సహకారసంఘ మార్థికసహాయ మొనరించుచున్నది. కాని సహకారసంఘముల ప్రచారమును విచారణగావించిన టౌన్సెండు సంఘమువారు నేతగాండ్రకు పరపతివిషయమున ఇప్పటివరకు గావింపబడిన యేర్పాట్లు చాలవని స్పష్టముగ నిరూపించియున్నారు.

ఈమధ్య (అనగా 1929 సం. నందు) మదరాసులోన సమావేశమైన సహకారాశయుల రాష్ట్రీయ సమావేశమునం దీచేతిపనికి దోహద మొనరించుటకు ఖద్దరునేత సంఘములను, అందు ముఖ్యముగ గ్రామప్రాంత ఋణప్రదాన సంఘములను నివేదించిరి. ప్రజలు సైతము క్రమక్రమముగ గృహపరిశ్రమలకు సహాయ మొనరింపదగునని సంభావించుచున్నారు. యంత్రముల కొక నిర్ణయము కలదనియు యంత్రశక్తి గాల్లుకప్పలను పిండిచేయుటకును, బరువు నెత్తుటకును శస్త్రప్రచారమును నుపయోగించవచ్చుననియు ప్రాచ్యప్రాంతవాసులు తెలిసికొనగలిగిరి. పాశ్చాత్యులుగూడ నిట్లని గ్రహించకపోలేదు, కాని యది లలితకళలయందు మాత్రము జోక్యము కలుగజేసికొనరాదు. ఆవస్తువుల కట్లపరిమితముగ తయారుచేసి విదేశములకు రవాణా చేయవలయునని యెవరును కోరుటలేదు. ఎగుమతి నిమిత్తముకాని, నిరుద్యోగమును వారించుటకుగాని అపరిమితముగ వస్తువులను తయారుచేయుట, నక్కలు తమ తోకలను తామే వేటాడుకొనునట్లగును. నూతనముగ కనిపెట్టబడినవి పూర్వము కనిపెట్టినవానిని రూపుమాపవలయుననుట పాశ్చాత్య పారిశ్రామిక నాగరకముయొక్క తత్వము. అటువలెనే యుద్ధనావను క్రూయిజరు క్రూయిజరును డ్రెడ్ నాటు, వానినన్నిటిని సబ్ మెరైను, సబ్ మెరైను టార్పిడోలు అణగ ద్రొక్కినవి. వినాశము సంపూర్తియయ్యెను, మోటారుకారు నమోనాలు సైతమటువలె ఏటేట మారుచుండుటను మనము కన్నులార చూచుచునేయున్నాము. సింగర్ కంపెనీ స్వంతదారులు ప్రజలు నూతన విడిభాగములనుకొని తీరవలసినట్లు చేయుటకై ప్రాతయంత్రభాగములను సేకరించి ఏదో యొకనదిలో పారవేయుచున్నారట. ఇంతకు పాశ్చాత్య నాగరకమంతయు భాగములతోడను, పనిముట్లతోడను, మేపుటతోడ నున్నది కాని సంపూర్తిగ, యంత్రయుక్తముగ యుత్పత్తి సాధకముగ లేదు. అందువలన వారు భూమిని వేటనిమిత్తము అడవులుచేసి దేశమును ఆహారార్థము విదేశములపై నాధారముజేయుట కవకాశ మేర్పడెను. ఇంగ్లండుకు బియ్యము ఇండియానుండియు, గోధుమలు రషియానుండియు, మాంసము ఆస్ట్రేలియా న్యూజీలెండు దేశములనుండియు, పాలు వెన్న వగైరాలు హాలెండు బెల్జియం డెన్మార్కు దేశములనుండియు, ఇప్పుడు గ్రుడ్లు లక్నో ప్రాంతము నుండియు ఎగుమతి యగుచున్నవి. ఇప్పు డింగ్లండు తన పొరబాటును గమనించ దొడగునపుడు భారతీయులు మరల పొరబడరాదు.

ఖద్దరు తగినంతసరసముగ లేదనియు, అట్లున్నయెడల తాము సంతోషముతో కొందుమని ప్రజలు తెలుపుచుందురు. కాని యీ విమర్శకులయభిప్రాయము కేవలము నెర్రిబాగులదగును. ఖద్దరు లాంకషైరుబట్టలవలెగాని అంతకన్నను గాని సరసముగ లభించునెడల గాంధిగారు కాంగ్రెసువారు తదర్థము పనిబూని యొక జాతీయ విధానము నేర్పరచుకొని అంత ప్రయాసపడి ఖద్దరు ప్రచారమొనరింపవలసిన యవసరమేమున్నది. ఏవస్తువైనను అధికముగ తయారుచేసిననేగాని చౌకబడదనుట సర్వసామాన్యముగదా. మన మీ 8 సం. ములలో ఖద్దరును ప్రశంసింపదగినంత చౌకగ లభింపచేయగలుగలేదా. మొట్టమొదట ఖద్దరు నుపపాదించినపుడు 25 నెంబరు నూలుబట్టను గజము రు. 1-2-0 కు విక్రయించితిమి. ఇప్పు డదియే గజము 11 అణాలకు లభించుచున్నది. అనగా ధర నూటికి 33 వంతులు తగ్గెనన్నమాట. మనము ఖద్దరు నెంత హెచ్చుగ నుపయోగింతుమో దాని వెలయు నంతకంత తక్కువయగుచుండుననుట నిర్వివాదము. అటుగాక మీరును సదరుసరకు నుపయోగించరు. ఇతరులనైన వాడుకొననీయరు. మరియొక డెవడో నానాప్రయాసపడి తానే పెట్టుబడి పెట్టుకొని కష్టనష్టములనెల్ల నతడే యనుభవించి, తుదకేదో మహత్మ్యమువలన బట్ట విలువ చౌకయై కొనుట కిష్టము పుట్టునంతవరకు వేచియుండవలయునని మన యభిలాష. అప్పుడు మన మానసిక ప్రబోధప్రయత్న మేమి? త్యాగ మేమి? దేశభక్తి యేమి? అదియటులుండ నింతకు 10, 20 రూపాయల విలువగల జేపాగను, రు. 20, 25 ల విలువగల మెరీనాకోటును, రు. 6 ల కూలినిచ్చి కుట్టించి, రు. 6, 10 ల విలువగల పట్టువస్త్రను, అందు రెండునవరసుల విలువగల బంగారుగుండీలను తగిలించి ధరించుకొను మహనీయులు చౌకనుగురించి నీతులు పలుకుట కేవలము విపరీతము. వారి సౌభాగ్యమునకై మనకు చూపోపమి యేమియును లేదు కాని ఖద్దరునుగురించి యట్టివా దనర్థకరవివాద మొనరించునపుడే మనకు నిరసనభావ ముదయించును. అటువలెనే ఖద్దరువిషయమున మనము చౌకసంగతిని తలపెట్టరాదు. కాలక్రమమున ఖద్దరు నిజముగ చౌక కాకపోదు. మొదట పెట్టుబడి కొంతహెచ్చుగను పరిత్యజనీయముగను కనుపించవచ్చును కాని, బట్టయొక్క దృఢత్వమును త్వరలో పనిచేయనేర్చుకొనగల సామాన్యసాధకములను గమనించినయెడల మీకుదయించు ఖద్దరు అభిమానము, మీవ్యయాధిక్యమును తగ్గించి, మీదుస్తులకీవిని, ఆరోగ్యమును సౌకర్యమునకు తగినంత నిదానమును కొనివచ్చును. చౌకవిషయమున నొక ప్రశ్న నడుగగోరెదము. ఔను ఖద్దరు ప్రియమే, లాంకషైరుబట్టలను కొనవలసినదే. ఉప్పు సంగతి సైతె మంతేకదామరి మనయుప్పు గాయక మొనరింపబడెను. లివర్పూలు యుప్పును దిగుమతిచేసి మనదేశమున క్రుమ్మరించుచున్నారు. దాని నాకర్షణీయమగునట్లంత తెల్లగ, శుభ్రముగ చౌకగ లభింపజేయుచున్నారు. గనుక మన మా యుప్పును తెచ్చి మనదేశమున ద్రిమ్మరించుకొనవలసినదేనా! నిరుడు 5 కోట్ల రూపాయిాల విలువగల గోధుమలు మనదేశమునకు దిగుమతియయ్యెను. అటువలె నిరుద్యోగసమస్యాబాధితు లగు నాంగ్లేయు లనేకులు త్వరలో క్రొత్తక్రొత్త పొలములను భూముల నన్వేషించుచు ఏ ఆస్ట్రేలియాకో మరే దూరప్రాంతములకో బయలుదేరుదురు. అందుల కొక స్కీముకూడ తయారుచేయబడెను. వా రాప్రాంతములకు సహస్రాధిక సంఖ్యాకులై వెడలి, యాక్రొత్తపొలములలో తమ యంత్ర పరికరముల నుపయోగించి విశేషముగ ధాన్యమును పండించి ఉప్పుబస్తాలవలె నౌకలలో నామకపు చార్జిపై సమభారము నిమిత్తము నింపి, యీ దిక్కుమాలిన దేశమునకు సరసముగ నెంత ఎగుమతి చేయుదురో యూహించుకొనుడు. అప్పు డా ధాన్యము సరసముగ నున్నదని రైతులు తమవృత్తిని పొలములను పరిత్యజించి యాధాన్యమును కొనుచు నూరకుందురా, లేక వరిపైరుమాని తమ పొలములలో మరేమిపండింతురు? గంజాయా నల్లమందా, జనుమా, పొగాకా? గనుక చౌకవిషయ మీసందర్భమున తలపెట్టదగినది కాదు. ఇంతేసను అది నిజము కాదు.

కాంగ్రెసుసభలలోకాని స్వరాజ్యసమావేశములయందుగాని ఖద్దరు విషయమును తలపెట్టునపుడు, బ్రిటిషువారికి ప్రతిచర్యగ మనము బ్రిటిషుసరకును బహిష్కరించి జపాను జర్మనీ అమెరికాసరకును కొనరాదా యని కొందరు ప్రశ్నింతురు. అదే యిపు డున్న ప్రమాదము. విదేశవస్త్ర బహిష్కరణమువలన ఇంగ్లండుకు మాత్ర

మా ప్రతిఘటనము స్ఫురించక యుండునా! లాంకషైరు ప్రత్తి పరిశ్రమనుగూర్చి గత వత్సరాంతమునం దొక బ్రిటిషు విలేఖరి యిట్లు వ్రాసెను. "1929 సంవత్సరాంత కాల మత్యంత నిరాశాపూరితము. అంతటి దుస్తరవ్యాపారపరిస్థితులు మరెన్నడు లేవు. వ్యాపారస్తంభనమువలన గొప్పగొప్ప కంపెనీలు దివాలా తీసినవి. చిరకాల నిర్మితములను ప్రబలవ్యాపారాలయములు పనిమాని యూరకున్నవి. నూలు పరిశ్రమకు మరింత నాశనమయ్యెను. రమారమి 123 ప్రత్తిపరిశ్రమాలయములు దివాలా తీసినట్లు తెలియుచున్నది..."

ఆంగ్లవ్యాపారము కృశించినందుల కంతగ చింతింపకున్నను దానితోపాటు జపానునూలు, బట్టలవ్యాపారము ఇండియాలో మిక్కిలి అతిశయించుటనుమాత్రము మన ముపేక్షింపనేరము. ఈశతాబ్దారంభమున జపాను నూలుకాని బట్టలుగాని యిండియాకు అంతగ ఎగుమతి కాలేదు. 1914 లో జపాను నుండి 940 బేళ్ల నూలు మన కెగుమతి కావింపబడెను. దానివిలువ 2,16,890 ఎన్నులు. పండ్రెండేండ్ల తరువాత 1926 సం. జపానునూలు మనదేశమునకు 2, 16, 850 బేళ్లు అనగా 28086000 ఎన్నుల (రమారమి 4 కోట్ల 20 లక్షల రూపాయిలు) విలువగల నూలు ఎగుమతి కావింపబడెను.

ఇంతేని జపానునుండిగాని లాంకషైరునుండిగాని మనదేశమునకు దిగుమతి యగునూలు చాలవరకు 30, 60 నెంబరుల మధ్యదే. 1924 సం. డిసంబరు నెలతో నంతమగు వాణిజ్య సంవత్సరమునందు ఇండియాలో దిగుమతియైన బ్రిటిషు ప్రత్తి నూలు విలువ 4 కోట్ల రూపాయిలనియు, బ్రిటిషు వస్త్రములు రమారమి 54 కోట్ల రూపాయిలనియు అంచనా వేయబడెను.

జపాను కోరాగుడ్డల కిపుడు మంచి వ్యాపారము. అవి ఇంగ్లీషు బట్టలనుకూడ మించిపోయినవి. జపానుమిల్లుల పరిస్థితు లీసరకుయొక్క అభివృద్ధి కెంతయు దోహదమైయున్నవి. గనుకనే ప్రతినెల 8, 9 వందల బేళ్లు ఖర్చగుచున్నవట.

ఆ చిన్నదేశము ఇండియానుమాత్రమె గాక ఇంగ్లండునుకూడ మించిపోయిన ట్లీక్రింది పరిస్థితులవలన తెలియనగును. బ్రిటనులో యీపరిశ్రమయందు కొలదిభాగముమాత్ర మభివృద్ధిపరుపబడుచున్నది కాని జపానువారు ప్రత్తిని సేకరించుటమొదలు పరిశ్రమ కంతయు నిర్మాణమును వికసింపజేసియున్నారని మాంఛెస్టర్ ప్రత్తివ్యాపార చక్రవర్తియగు ఎల్లింగరుగారు ఒక మహాసభలో తెలిపిరి.

ఇది యిటులుండ లాంకషైరులో ప్రత్తినేత నేయబడు ప్రాంతములయందు లాంకషైరు బట్టలకన్నను సరసముగ జపానుబట్టతో కుట్టబడిన షర్టులను ఐర్లాండువారు ఎగుమతి చేయుచున్నారు. చౌకబారు జపానువెస్టుకోట్లు సైతము ఎక్కువగ నమ్ముడుపోవుచున్నవి. దీనింబట్టి లాంకషైరు ప్రాచ్యప్రాంతములకు తన ప్రత్తి వస్త్ర వ్యాపారమును సమర్పించుకొనునా. బహుశః ఆ షర్టులయం దంతగ లాభము లేకపోవచ్చును కాని, అందువలననే జపానుసరకు మనదేశమునందు నిండిపోవుచున్నదని మాంఛెస్టరు పోస్టుపత్రిక దిగులుపడుచున్నది. మన మందుచే ఇంగ్లండును విడచి జపానుమైత్రి నంగీకరింతుమా? మన మీబట్టలవలననే మనరాజ్యమును కోల్పోతిమని యింకను గమనింపకుండగలమా? తెలిసియుండియు ఆంగ్లేయుల హయాముకు తొలగించుకొనవలయునను నాతురతవలన వ్యాపారవేషమున జపానువారి నిచ్చట తమకొక భవిష్యదధినివేశము నేర్పరచుకొనుటకు మన మవకాశ మొసంగదగునా.

భారతదేశము నాత్మసంతృప్తికర మొనరించి, యీ ప్రాచీనదేశమును పూర్వపు టాత్మగౌరవమును మరల నాపాదింపజేయుటకు సంస్థానాధిపతులును ప్రజలును గొప్పప్రయత్నములను చేయుచుండుట సంతోషదాయకము. 1928 సం. నందు మైసూరు ప్రభుత్వమువారు ఖద్దరు పరిశ్రమవలన తమ సంస్థానపు ధనమొక్క కాసైన ఖర్చులేక 1000 పైగ కుటుంబములకు జీవనోపాధిని సమకూర్చగలిగిరి. భారత సంస్థానము లీసమస్యాప్రాముఖ్యసందర్భమున ప్రబోధమును గొను టెంతయు సదృష్టమనవగును. ఇందువలన లాంకషైరు వ్యాపారమున కవాంతరము తప్పదని ఇంగ్లండుకు తెలియును. కనుక బ్రిటిషుఇండియాలో అమ్ముడుపోనిసరకును సంస్థానములయందు ద్రిమ్మరింపజూచుచున్నది. పాటియాలా సంస్థాన విదేశాంగమంత్రియగు రష్బ్రూక్ విలియంసుగారు రీమధ్య లాంకషైరు వస్త్రవ్యాపారమునుగురించి యుపన్యసించుచు ప్రస్తుత రాజకీయాందోళనవలన భారతీయుల కవి కిట్టకున్నవి. వ్యాపారములో పోటీ తీవ్రముగనుండి, ధరలు చాలసరసములైననుగూడ వారి కీ రాజకీయ భాండసము చాలకలదు. సంస్థానములయందు 7 కోట్ల ప్రజలున్నారు. వారు రాజకీయములతోపాటు మితవ్యయమును సైతము పాటించి బ్రిటనుతోడ తమ మైత్రి నభివృద్ధిపరచుకొనదలచియున్నారు. కావున సంస్థానములయందే లాంకషైరు వ్యాపారమతిశయించునని సూచించియున్నారు. రక్షణనిర్ణయసంఘమునందు సంస్థానములకు ప్రాతినిధ్యము లేకపోవుటచే, సంస్థానములు తమ రేవులద్వారా దిగుమతి యగు సరకుపై స్వల్పసుంకము విధించుటవలన నీసరకు సరసముగ లభింపగలుగుచున్నది.

ఖద్దరును పునరభ్యుదయ మొనరించు నీ మహాయత్నమునందు పిన్నపెద్దలందరును తగినంత సహాయమొనరింపవచ్చును. ఖద్దరు ఉద్యమము దేశభక్తియుతమైనది. దేశీయులకెల్లరకు ఖద్దరువలన పరస్పర సంబంధము చేకూరును. జాతీయోద్యమమును గురించి మనము భాషించునపుడు దేశీయులు స్త్రీలు పురుషులు బిడ్డలు సైతము దేశముపట్ల తమవిధిని తాము నెఱవేర్పవలయునని యుద్బోధింతుము. ప్రజలకందరకును సహాయనిరాకరణోద్యమమునం దభిమానము లేకపోవచ్చును కాని, దేశములో తయారైనబట్టలను ధరించుట కెవరి కభిమానముండదు. అవి చూపున కొకింత ముతుకగనున్నను స్పర్శకు మృదువుగ నుండును. చూపరుల కొకింత చింతాస్పదముగ నగుపడినను నేతగాండ్ర కది యానందమును సంతృప్తిని సమకూర్చును. చాలకాలము మన్నును. చలికాలమున శరీరమును వెచ్చగను ఎండకాలమున చల్లగనుంచును. శుద్ధప్రచారము నవి మందగించునని కూడ డా॥ సర్. జే. సి. బోసుగారు రిటీవలనే కనిపెట్టియున్నారు. భారతీయుల నిరుద్యోగసమస్య నది పరిష్కరించును. దేశీయులయం దది యాత్మగౌరవాభిమానము నతిశయింపజేయును.

నూలువడకుట యొకానొక ఘనకార్యమే. మీకందువలన మనసు కుదురుపడును. మీకాలము సద్వినియోగమగును. మతి చంచలతను రాగానురక్తిని వారించును. హృదయ మాయాసముచెందినసమయమునం దొక్కమారు నూలువడికి చూడుడు. అటువంటి సమయములయందు నూలువడుకుట కుద్యమింపనుత్సహింపుడు. అరగంటసేపులో మీ మానసికభావమదృశ్యమై సాత్వికగుణ ముద్దీపించి హాయి నిచ్చును. ఖద్దరు సేవాపరాయణులు తా మెంతప్రయాసపడినను తమపేరు ముందుకు రానున్నదని యంగలార్వ నవసరములేదు. దేశమును పూర్వపు స్వతంత్ర ప్రతిపత్తికి గొనివచ్చి దిక్కుమాలిన దీనుల క్షుద్బాధను తొలగింప ప్రయాసపడుటకన్నను వారికి వేరుపని లేదు. దేశీయు లిపుడు నిశ్చయముగ సందిగ్ధావస్థయందున్నారు. వారు రాటములైనను లేదా యంత్రములనైన నామోదించవలసియున్నది. అనగా ఖాదీయా కాకీయా మనము ధరించదగు ననునదే ప్రశ్న. కాని యీరోజులలో భారతీయులకు రాట్నమే బంధవిమోచన సాధనమని తెలియవగును.

---

## బకధ్యానము

త్రిపురాణ సూర్యప్రసాదరావు దొరగారు

కలగొను సీతునన్ బదరికావనపావనపంకజాకరం
బులఁ దప మాచరించు మునిపుంగవుభంగి వసించి రిందు మీ
యలఘుతపఃపరత్వము బకాధిప! యారయ నేరిఁగూర్చియో
యల హరిఁగూర్చియో, యనిమిషాధిపుఁగూర్చియొ చెప్పు మియ్యెడన్.



# అపూర్వ పట్టాభిషేకము

మాంద్యము కోదండరామయలు గారు

ఆంధ్రులు రండు, మా యన్నలు రండు,
తెలుఁగు తల్లిగ నెంచు ధీరులు రండు,
వాడవాడల తెల్గువారెల్ల రండు,
బుజము లుప్పొంగఁగా ముదము సెలంగ
సంతోష మలలయి జాలుకొనంగ
హృదయముల్ త్రుళ్లంగ నింపు గుల్కంగ
నుత్సవంబును జేయ నున్నది నేఁడు.
చిన్నకార్యము గాదు, చిటికిది గాదు,
సామాన్య మగునట్టి సందడి గాదు :
జగము నెందునులేని సొగసు గలట్టి
పట్టాభిషేక మీ పండుగు మనకు.
నిన్న రాజ్యం బేలి నేఁ డేగునంత
ప్రజలు మఱచునట్టి రాజుది గాదు,
పన్నులఁ దినుటయె భాగ్య మం చెంచి
పాలించు నొక మహాప్రభునిది గాదు,
వస్త్రరాజుది గాదు, బలునిది గాదు,
ధనరాజులది గాదు—ఘనకవీశునిది.

కవీశ ప్రశంస

అందఱురాజులు నటుగాదు కవియు :
శుద్ధాంతములనుండి చూడఁ గా దనఁడు,
కనఁగోరినంతఁ జయ్యన నేగుఁదెంచి
చక్కఁగా మాట్లాడు సంతృప్తినొసఁగ,
బీద లం చెంచక ప్రేమతో వచ్చి
కష్టకాలంబులోఁ గడఁద్రోయు వెతల,
ఏకాకులై తోడు నెఱుఁగనివారి
తోడునీడగనుండు దూర మం చనక,
ఆనంద మందెడునట్టి వేళలను
గూడి సంతోషంబు కొఱలేక చేయు,
ఏ యుపాయము మది నెఱుఁగనివేళ
చెవిలోన మార్గంబు సెప్పఁగా వచ్చు,
తెలిసి దోసముసేయ దెప్పుడు మనల
నీతుల మఱిమఱి నేర్పుచునుండు.
ప్రాయంబు సెడకుండ బలము పోకుండ
కలకాలముండు నిక్కవిరాజు ధరను.
మృతి నెన్నఁ డెఱుఁగని బ్రతుకు గలట్టి,
దివిజసమానులై భువిఁబుట్టునట్టి
ప్రజలు సంతసమున వరియించునట్టి,
సత్కవిరాజుల సార్వభౌముండు
ఘనబుద్ధిశాలులకును చక్రవర్తి
ధీరవిచారుల రారాజు గలఁడు

తిక్కనార్యుం డతి తేజేమయుండు,
అతనిదే నేఁటి పట్టాభిషేకంబు.
మనకృతజ్ఞతఁ జూపఁ జనదటే మనకు ?
రాజభక్తిని జూపరాదటే మనము ?
కావున రా రండు కవిరాజరాజు
పట్టంబు గట్టఁగాఁ గట్టుఁడీ నడుము.

భవననిర్మాణము *

అమృతంబు బాఱుచు నతిరమ్యమగుచు
మిగుల విస్తీర్ణమై సొగసైనయట్టి
ఆంధ్రవాక్కను బయ లల్లదే! కనుఁడు
కనుమేర కున్నది కాంతిగొల్పుచును.
అట నొక్క సుందరహర్మ్యంబు నిపుడు
నిర్మింపఁగా రండు నేర్పుమీఱంగ ;
గుణగౌరవముల బాగుగ విమర్శించి
నీరసభావంబు నిల్వనీయకుఁడు ;
అప్రయోజకపు పదార్థంబు లెల్ల
తొలఁగింపుఁ డిపుడె నిర్మలముగాఁ నుండ ;
భావకవనపు సంభారంబు లన్ని
కొనివచ్చి యొకచోటఁ గూర్చుఁడీ మొదట ;
వృత్తములై వింతవింతగనుండు
కంబముల్ నిల్పుఁడీ కమ్ర పాదముల ;
ఘనపదార్థంబుల గౌరవం బెఱేఁగి,
యుంచుఁడీ గోడ లత్యున్నతంబులుగ ;
చక్కనివస్తువుల్ చిక్కఁగాఁ గూర్చి
పైకప్పు గట్టుఁడీ భద్రంబుగాను ;
శిల్పచాతురిఁ జూపు చిత్రమౌ వింత
కల్పన లుంచుఁడీ కట్టడంబునను ;
నాతిగూఢములగు నవ్యభావములఁ
దెఱచు కవాటముల్ తీర్చుఁ డద్దాన ;
మిలమిలరుచులుఁజిప్పిలు రసంబులను
మేలుపూఁతపూయుఁడీ మిఱుమిట్లు గొలుప ;
పలుపాకములఁ గూర్చి వర్ణింపుఁ డన్ని
విషయముల్ శోభను వెదచల్లునట్లు ;
రీతిరీతుల పుష్పజాతులతోడఁ
గట్టుఁడు తోరణాల్ కమనీయముగను ;
అమృతోపమానంబు లగు రసంబులను
కుంభముల్ నిల్పుఁడు కుదురున్నచోట్ల ;

ఆయాస్థలంబుల కర్హమైనట్టి
లసదలంకారంబులను గూర్ప రయ్య ;
నడక నానందంబు నొడఁగూర్చునట్టి
శయ్యలఁబఱచుఁడీ చక్కఁగా లోన ;
చాలినమట్టుకు సంస్కృతం బగుచు
ముద్దులొల్కఁగ నిండుమురిపెముల్ సూపి.
ఈభంగి సర్వాంగశోభఁ గుల్కుచును,
వినినంతమాత్రాన గనఁగోరునట్లు,
చేరి కన్గొనఁ బ్రీతిఁజెందినయట్లు,
లక్షణంబుల మెప్పులం గాంచునట్లు,
గుంఫనల్ హర్షమున్ గూర్చెడునట్లు,
పొందికఁగాంచి యబ్బురమందునట్లు,
భవనరాజముఁగట్టి భవ్యులు గండు·

విమాననిర్మాణము

* * *

సింహాసనము

ఆ విమానంబున కర్హమైనట్లు
నూతనాలంకారభూతితో మెఱయ
చిత్రవర్ణంబులఁ జికిలిసేఁతలను
ఘంటికాపత్రలేఖనములఁ గలిగి
భావప్రకాశంబు బాగని మెచ్చ
పాదపాదంబున భ్రమలువుట్టింప
ప్రకృతబింబంబునై రమ్యంబునైన
సింగంబు నిర్మించి సేయుఁడీ గద్దె.

ఆహ్వానము

ఇటులఁ గై సేఁతల నింపులు నింపి,
వెలుపల లోపల వింతలుగూర్చి,
చూడఁ జూడఁగఁ గ్రొత్తసొబఁగుఁబుట్టించు
చిత్రమౌ కల్పనల్ చిన్నెలు నుంచి
దిక్కుదిక్కుల కెల్లఁ దెలియంగఁజేయ
భవనోపరిని మన ధ్వజ మెత్తరయ్య.
ఆలస్యమున కింక వ్యవధిలేకుంట
"కవిసార్వభౌమ తిక్కనసోమయాజి
పట్టభంద్రుండగు పర్వదినంబు
గావున భవనంబుకడ కర్హరీతి
వచ్చి గౌరవ మందవలయు నుం డ"నుచు
జాంఘికులంబంపి చాటింపనిండు,
పంపుఁడీ కవుల కాహ్వానపత్రికలు ;
హృదయంగమంబులై శిరసుల నూఁపు
మంగళధ్వనులఁ జెలంగనిం డెచట.

* వాచకమహాశయు లిందలి కావ్యపరిభాషాపదములయందుఁ గల విశేషార్థముల నారయఁ బ్రార్థితులు. ఉ. పదార్థ ( పద-అర్థ )

### కవీశ ప్రస్థానము

అల్లదే సత్కవీశాధిరాజైన
మన తిక్కనార్యుఁ డీమందిరంబునను
పట్టభద్రుండుగా వచ్చుచున్నాఁడు.

### రథ ప్రశంస

పనిచమత్కృతుల నప్రతిమ మం చనఁగఁ
గనఁజాలినంత నెమ్మనములోఁ గొనుచు
నద్భుతంబగుఁ జూడుఁ డా యరదంబు,
భారతం బనుపేరఁ బ్రస్తుతిఁ గాంచు :
ధీరు లా కవుల మనోరథం బిదియె.
బంగారు తళుకుగు వాడంగ వాడంగ,
వెండి వెలవెలబోవకుండ దెప్పుడును,
ఈ రథం బొకనాటిదే కాదటంచు,
లోహంబులం గల్గు లోపంబు లెంచి,
కాంతి పోలివోకుండ, ఘనత పోకుండ,
వన్నె తగ్గకయుండ, వమ్ము గాకుండ,
వేలు లక్షలయేండ్లు వెలయఁగాఁ దగిన
ఘనపదార్థములతోఁ గట్టి రిద్దాని.
ఏభాగముం గన్న నెచ్చటలేని
సింగార మచటనే పొంగినట్లుండు.
శిల్పసౌష్ఠవమును, కల్పనల్ సొగసు
తల లూఁచునట్లుంట దానికే తగును.
మనతోడ మెలఁగుచు మాట్లాడునట్లు
గన్పట్టుచుండు చక్కని చిత్రములను
పలుభావముల వ్రాసి వర్ణించినారు.
ఆచిత్రములు నిట్టివని మెంచఁజాల
మఖిలప్రపంచంబు నందునె కలదు.
పరమేశు సృష్టికి బ్రతిసృష్టి యనఁగ
నన్నియు సద్దాన నమరించినారు.
ధర్మానుచారులు, ధైర్యభూషణులు
దుష్టులు, కాముకుల్, తులువలు గలరు ;
పలుభంగు లగునట్టి పొలఁతులు, యతులు,
నీతి ధర్మము దెల్పు నిపుణులు, గుణులు,
యుద్ధముల్,పురములు,నుదయా స్తమయము,
లతిఘోరవనములు, నద్రులు, నదులు,
కార్చిచ్చు, ధూళులు గలవు నిక్క మన.
ఒకచోట శృంగార మొలుకుచునుండు
యతులును సంసారయుతులు గాఁగోర ;
ఒకయెడ భయముండు నుచితవర్ణముల
వీరాగ్రణులుగూడ వెఱఁ గందునట్టు ;
కరుణవిశేషంబు గల దచ్చటచ్చట
ఱాఁతిగుండెలను గరఁగింపఁజాలి ;
వీరరసం బిట విరియుచునుండు
పిఱికికండకుగూడ బీరంబుగలుగ ;
హాస్యరసం బట నలరు వర్ణముల
నినుఁపబొమ్మలను నవ్వించెడురీతి ;
ఇట్టివట్టివియఁచు నెంచఁగా రాక
యన్నిరసంబుల నతికౌశలమున
బాపురే నేర్పున వర్ణించినారు.
మున్ముందుగాఁగఁ ద్రిమూర్తులు నడువ
శతఘంటశోభ వేచను దెంచె నదిగో !
కవిరాజులకురాజు గౌరవింపంగ
నర్హమే కాదె యీ యరదంపు సొబఁగు !

### కవిసార్వభౌమ వర్ణనము.

ఆ రథరాజమం దర్ధాసనమున
సుస్థిరంబుగనున్న సుకవినిం జూడ
నీయున్నతస్థలి కిటురండు మీరు ;
మహనీయ దివ్యవిగ్రహులను జూడ
నున్నతి మన మంద కున్న దే దారి ?
అదెచూడుఁ డా కన్ను లత్యద్భుతములు
కనివినిమెఱుఁగ మాకాంతిసంపదలు ;
మనుజుల మఱువులు మర్మంబు లన్ని
చొచ్చిచూడఁగలట్టి చొ ప్పందుగలదు.
ఆకన్ను లెదుట మాయలు నిల్వఁజాల
వడ్డగింపఁగఁ జాల దా దృష్టి నెద్ది.
ఏవస్తువున నిజంబెట్టుల నుండు
నద్దాని గ్రహియించు నాలోచనములు.
ఎల్లలోకము లొకదృష్టి లోఁగొనుచు
దైవదృష్టిని బోలు ధన్యనేత్రములు.
చిఱునగ వమృతంబు గుఱిసెడి పెదవు
లొప్పిద మదియెంత యున్నదో కనుఁడు.
తనవాక్కులెల్ల శాసనము లట్లుండు
ఘనభావమందునఁ గాంచ నౌఁగాదె !
పల్కు తేనెల తేట లొల్కుచునుండు
తీయందనం బందునే యుండు జూడ.
ప్రభువులు మన్నించు పటుతరవాక్య
గౌరవం బధరానఁ గన్పట్టు నదిగో !
ఱాలను గరఁగింపఁజాలిన నేర్పు
ననురాగ మందులఁ గనుఁగొనం దగును.
ధర్మముల్ లోన భద్రంబుగా నుంచు
భరణి బో ల్పెదవుల వైఖరిం గనుఁడు ;
భాసురాలంకార మై సరస్వతియె
పలుకవ్వనన్ నృత్యములు సల్పుచుండు.
నవ్వు నాలోకించినారలా మీరు ?
పండువెన్నెల లబ్ధిపైఁ బర్వినట్లు
సొబఁగున సరిలేని సుఖమును గూర్చు.
ఉన్నతి వైశాల్య మొకరీతిఁ గల్గి
నిగనిగ మెఱయు నా నిటలంబు గన్న
వాగ్దేవిగద్దియవలెఁ దోఁచుఁగాదె ?
బుద్ధి చమత్కారముల కెత్తినట్టి
ఫలకంబువలెఁ గానఁబడు చున్న దహహా !
సర్వప్రపంచంబు సానుభూతిఁ గనఁ
జాలు నాహృదయ వైశాల్యంబుఁ గనుఁడు.
లోకముల్ కౌఁగిటిలోఁ గొనందగిన
భావంబు గన్పట్టు బాహువులందు.
వ్రేళ్లు సూచినయంత వివిధచిత్రములఁ
జిత్రింపఁగా బ్రహ్మ చేసినరీతి
నందములై సోఁగలై తోఁచుఁ గనుఁడు.
ఆకారసౌష్ఠవం బది యిట్టులుండ,
గుణవిశేషం బెంచుకొలఁదికి మీఱు.

### గుణవర్ణనము

అన్నివిద్యల నేర్చినట్టి పుణ్యుండు
లోకరహస్యంబు లోఁగొన్న ఘనుఁడు
సృష్టివైచిత్రిఁ జూచిన మహామహుఁడు
అన్నిఁట దైవంబు నరయు ధన్యుండు
సమబుద్ధిఁ దొలఁగని సన్మార్గవర్తి
పక్షపాతములేని పరమధార్మికుఁడు
గర్వంబులేని సత్కార్యరతుండు
విసుఁ గెఱుంగని సద్వివేకి ; బుధుండు ;
నతని వర్ణింప భారత మగుం గాదె !
భువనవిస్తీర్ణుఁ డై పొలుపొందు నతని
పూర్తిగా నొకఁడును గుర్తింపలేఁడు.
చిన్నవారలలోన చిన్నవాఁ డితఁడు
పెద్దవారల మించు పెద్దవాఁ డితఁడె ;
చిత్రకారుఁ డనుచు, శిల్పియౌ ననుచు,
కొంటె యంచును, తార్కికుండె యోయనుచు,
మంత్రి యటంచును, మహిపాలుఁ డనుచు,
దేశికుం డని, యువతీప్రియుం డనుచు,
సిద్ధుఁ డంచును, సాంఖ్యశిక్షకుం డనుచు,
ఖడ్గవీరుఁ డనుచు, గవిరా జటంచు,
నైఘంటికుం డంచు, న్యాయవాదియని,
రాయబారి యటంచు వేయిభంగులను
తమయూహలంబట్టి తలఁతు రా ధీరు.
తలఁచి, యాశాఖల తలమానికముగ
నెంచి యాపుణ్యుఁ బూజించుచుండెదరు.
దేవాంశఁ బుట్టిన ధీరుండు గాన
విశ్వరూపంబున వెలయు టబ్బురమె !
ఆగుణంబుల నెన్నఁగాఁ గాదు మనకు,
భవనరాజము సేరె కవిరాజు: రండు—

### పట్టమహము

భవనరాజము జనభరిత మైపోయె
నిసుకసల్లిన రాలనీయదు సమితి.
జనుల దండడికోర్వ శక్యంబుగాక
వెలుపల నిల్చిరి వేలు లక్షలును.
మంగళధ్వనులు సెలంగె నెల్లెడల ;
జయజయధ్వనులను జనులెల్లఁ బలుక
కరతాళశబ్ద మాకాశంబు నంటె.
సోపానముల భక్తిజూపు కవీశు
లంతరంబు లెఱింగి యందందు నిల్వ,
నవ్యభావోజ్జ్వలదివ్యాంగులైన
కీర్తిధనుల్ భక్తిఁ గేలూఁత లొసఁగ,
నరదంబు డిగ్గి సింహాసనంబునకు
మందయానమున నమ్మహనీయకీర్తి
కవిసార్వభౌముండు గదిలి , కూర్చుండె ,
తనదు తేజము దిక్కులను బర్వుచుండ
నుదయాద్రి నరుణార్కుఁ డుండినయట్లు.
భేరి, దుందుభి, జయవీరణ, తూర్య,
పటహ, కాహళాదిపటురవం బెసఁగ,
వేదపాఠంబులు వీనులవిందు
లై సుస్వరంబుల హర్షముం గూర్ప,

నుత్సాహభరితులై యున్న యాజనుల
సన్నుతుల్ జయజయశబ్దముం బెంప,
కవులు గుణంబుల గణుతించుచుండ,
భూనభోంతరములు బోరున మ్రోసె.

భారతీదేవియేతెంచుట

సందడి చెలగు నాసమయంబునందు
దిక్కులఁ గాంతులఁ దేజ మందించు
దివ్యయానమున నేతెంచె నయ్యెడకు
భాసురదరహాస, భారతీదేవి,
దివ్యవిగ్రహ, మహాభవ్యచారిత్ర,
వేదసేవిత, సద్వివేకనిధాన
అమృతమయాంగి లోకానందమూర్తి,
సంగీతసాహిత్యసంజ్ఞావిలాస,
ఆశ్చర్యమున జనులందఱుఁ జూడ.
కుతుకంబు మదిలోనఁ గుల్కుచునుండ,
నానందపారవశ్యము గాంచి, దేవి
కరముల రెంట సుందరకిరీటంబు—
కవిరాజసన్మస్తకప్రశస్తంబు,
దివిజనిర్మితము సందీప్యమానంబు—
నొకదాని దిక్కన యుత్తమాంగమున
నుంచె, జూచినవార లుబ్బితుళ్లంగ.
మఱి రెండుకరములఁ గుఱియుచునుండె
కల్పకసుమము లక్షయములై మీఁద.
జయజయధ్వానముల్ జగముల నిండె,
నమరులు పుష్పవర్షము సల్పినారు,
కవిరాజు లప్పుడు కడు భక్తితోడ
శ్రమఁ గని యార్జించి సమకూర్చినట్టి
వెలలేని మేలికానుకల మెచ్చనిచ్చి,
యవకాశమబ్బె నం చానంద మంది
తమరాజభక్తి నందఱు దెల్పుకొనుచు
చరితార్థులై యున్న తెఱఁ గెన్నఁదరమె.
కవిచక్రవర్తి తిక్కనసోమయాజి
పట్టంబు కన్నులపండువై మించె.

దృఢప్రతిజ్ఞ

మునుపెట్టి మంచినోములు నోఁచినామొ,
నేఁ డీ మహంబును జూడఁ గల్గితిమి;
చూచి కృతార్థతఁ జూఱగాఁ గొంటి.
ఇఁక మన మేకాన్క లీయఁగాఁ గలము?
బుద్ధి సంపదలు గోల్పోతిమి గాదె,
గుణవైభవములకు గొదవఁగాంచితిమి
భక్తివిశ్వాసముల్ పాసెను, పేద
వడి యెట్టులిత్తు ముపాయనంబులను?
కావున నొకమాట గట్టిగాఁబల్కుఁ
డాంధ్రసోదరులార అందఱుమీరు:
కవిసార్వభౌమతిక్కనమంత్రిచంద్రు
నొకనాఁడు మఱవమం చూహించి యనుఁడు.
తిక్కనవాక్కులు తృషదీఱ నెపుడు
పారాయణము సేయ బాసచేయుండు
తనకార్యమందునుం దనయందుఁగూడ
భక్తి నేమరమంచుఁ బ్రతినఁ బూనుండు.
ఆభావముల నెంచి యానందమంది
స్మరణచేసెద మంచు శపథంబుగొనుఁడు.
నాల్గుమాటల నాడఁ గల్గినయంత
వానిఁ బ్రస్తుతిసేయ వాగ్దానమిండు.
తనయందు భక్తియే మనగౌరవముగఁ
బరికింప సుస్థిరభావంబు గనుఁడు.
ఇదియె సాధనమందు రిహపరంబులకు.

ఫలశ్రుతి

ఈయుత్సవశ్రేష్ఠ మెట్టులనైనఁ
జూచిన పుణ్యుల లోచనంబులును
వినఁజాలువారల వీనులజంట
మది నెంచఁజాలిన మానసంబులును
ధన్యముల్ ధన్యముల్ ధన్యంబులెపుడు!

---

## నా మీ సా లు

‘యరలవ’ గారు

కోటినోముల ఫలమా అన్నట్టు దేవుడు నాకు కోతేరులాంటి ముక్కును మాత్ర మిచ్చాడు మరేమీ లేకపోయినా. ఆ ముక్కుకింద మిరిపెం కక్కుతూ ఉండే మీస ముంటే ఎలా గుంటుందో అని అనుకునేవాణ్ణి చిన్నప్పుడు. వీరపురుషలక్షణం అనిన్నీ మీసంవుంటే మొఖాన్ని మొగసిరి తాండవిస్తుందనిన్నీ అనుకొనేవాణ్ణి. పౌరుషానికి దూరముండే బాపనాళ్లంతా పనికిమాలిన మీసాలు అనాచారమూలకా అని బరబరా గొరిగేయడం చూసి ‘వీళ్ల కింతే కావాలి’ అని అనుకునేవాణ్ణి, ఎప్పుడు మీసం వొస్తుందా అని ఎదురెదురు చూస్తూ తెల్లవారలేచి మెల్లిగా పైపెదవి తడుముకుంటూ ఉండేవాణ్ణి. సరి! మించిపోతున్నాయి 15 ఏళ్లు: మీసకట్టయినా కనబడదేమి అని చింతించేవాణ్ణి. ఒక్కసారి గొరుగుతే మీసా లుబుక్కొని వొస్తాయని ఎవరో (ఎందుకో!) చెప్పారు. సరే నని ఒకశుక్రవారం సాయంత్రం తోటలో చెట్టుక్రింద నిలబడి మంగలివాడినిపిలిచి వుత్తి వుత్తి పైపెదవిని వూరికే గొరిగించాను. సోమవారం బడికిపోయేటప్పటికి సొంపుగా మీసం కనబడుతుందనే ఆశ. ఆశ లెలాగున్నా అలాటి సోమవారాలు చాలానడిచాయి.

ఆఖరి కెలాగయితేనేం చిన్న చిన్న మీసాంకురాలు (మిశ్రసమాసమని మా గురువుగారు మిటకరిస్తేనేం? అవి మీసాల కంకురాలు కావా యేమిటి?) చిన్నచిన్న మీసాంకురాలు పొటకరించాయి. ఇదే సమయం అని ఆమొలకల్ని సందుదొరికనప్పుడల్లా పీకుతూ దోహదం చేసేవాణ్ణి. చేతికందకముందే చిన్నగా మెలివేయడానికి ప్రయత్నించేవాణ్ణి. పొదుముండా అద్దాన్ని పదిసార్లైనా చూసేవాణ్ణి; ప్రయోజనమాత్రం పరకంతైనా లేకపోయింది... వరప్రసాదంలాగ కలిగిన యీ మీసాల్ని వదిలేదికాదు చెయ్యి, ఒకనాడు మా నాన్న నన్ను దగ్గిరికిపిల్చి ‘అబ్బాయీ, పెద్దవాళ్లతో మాటలాడేటప్పుడుగూడా మీసాలు దువ్వుతుంటా వేమిట్రా దురభ్యాసం’ అన్నారు. * * *

ఉద్యోగం దొరికేసరికి ఉబ్బెత్తుగావచ్చింది మీసం. జర్మనీ యుద్ధాల్తోనూ, కెయిజరు బొమ్మలతోనూ నిండిపోయాయి వార్తాపత్రికలన్నీ. నా ముక్కూ కెయిజరు ముక్కూ ఒక్కలాగుంటుం దన్నారు కొందరు. అయితే మీసమో అనిపించింది నాకు. అద్దంపట్టుకొని ఆరంభించాను. తిప్పాను మీసాలు రెప్పలికి తగిలేటట్టు. కెయిజరి కెలాగుండేదో గాని నాకుమాత్రం యుద్ధం గెల్చినట్లే అనిపించేది ఆ మీసాలూ నామొగమూ అంతానూ అద్దంలో చూచుకొనేటప్పటికి. ‘అదేమిటూ మీసా లసహ్యంవేసుకుంటూనూ?’ అన్నాది మా ఆవిడ ఒకసారి. * *

‘మీతాలు గుత్తుకుంతున్నాయి నాన్నా... మీకు ముద్దియ్య’ నన్నాది మా చిట్టితల్లొకనాడు. అన్నా!! ప్రమాద మొచ్చిందని చూశాను. సరే అని ఫ్రెంచి మీసాలు పెట్టాను. ముక్కులోనించి ఊడిపడుతూవున్న ‘మిరిపెంపు నీలాల ముద్దల్లా’ గుండేవి నామీసాల ముక్కలు. * * *

కటికిచీకటిలాగుండే కమ్మని మీసాల్లో కనబడ్డాయి అక్కడక్కడ తెల్ల వెండ్రుకలు మబ్బుల్లో మెరుగుల్లాగ. చిమ్టా పట్టుకొని చేస్తూఉండేవాణ్ణి పని. గాని స్నేహితులుమాత్రం కనిపెట్టేశారు. ముసలివాడివయిపోతూ మొండి మీసా లెందుకురా అన్నారు చిన్ననాటి స్నేహితులు. పెంచీయండీ మీసా లన్నారు పెద్దవాళ్లంతాను. సరే అని సమ్మతించాను. * * *

సంసారంబాధ అధికం అయ్యేకొద్దీ మీసాలముచ్చట్లు మూలనుపడ్డాయి. మంగలికత్తిమహిమగాబోలు మరింత పొడుగుగా పెరిగాయి మీసాలు. తెల్ల వెండ్రుకలు దళమైపోయాయి. ముద్దిస్తే ముక్కు పట్టుకున్నట్టు, నా కాఫీలోగూడా వంతుకు వచ్చేవి మీసాలు. ఒకనాడు శాస్త్రిగా రొచ్చి “ఏమండోయి, మీ మీసాలూ మీముక్కూ అంతా పక్కవాటుగా చూస్తే రవీంద్రనాథ టాగూరుగారి లక్షణాలున్నాయండీ” అన్నారు అమాంతంగాను. పోనిస్తురూ అని బయిటి కన్నానే గాని పొంగిపోయాను లోలోపల. పక్కవాటుగా పొటిగ్రాఫు తీయించి చూచాను. బలే! నిజమే అని అనుకున్నాను. శాస్త్రిగారికి కళాజ్ఞానం చాలసూక్ష్మమైందని అనుకున్నాను. కానీ అని పెంచాను గడ్డాన్ని—ఇక అదొక్కటేకదూ తరవాయి టాగూరుగారికీ నాకూ! ... పొటిగ్రాఫు తీసుకొనిచూస్తే—పొందూరు భైరాగీవాడిలాగ తయారయాను గాని మహర్షి రవీంద్రనాథుగారి మచ్చైనా కనబడలేదు. వృద్ధాప్యంతోనే వేదాంతం కుదిరింది. వెంట్రుకముక్కలకోసం ఇంత వెర్రియెందుకో అనిపించింది. మీసాలకోసంగూడా మోసపోతారే పాపము మానవులని చిన్నతత్వం ఒకటి రాశాను.

# అరయడు–విప్పర్లవారు

గూడవల్లి రామబ్రహ్మం గారు

పంన్రెండు పదమూడవశతాబ్దములలో నతనాటిసీమను పరిపాలించిన చాగివారి వంశవృక్ష మొకసందియమున కాకరమయినది. మదరాసు ఆర్ష శాఖాధికారులు (1 *) తమ 1924 వ సంవత్సరపు నివేదికలో ముక్త్యాలశాసనము (2 *) ననుసరించి యీ క్రిందివిధముగ చాగివారివంశావళిని ప్రచురించిరి.




ఈ శాసనపు నకలు ఆర్ష శాఖాధికారు లింతవఱకు ప్రచురింపలేదు. దానిసారాంశము నివేదికలోనున్నది గాని అందు మన కెక్కువ వివరములు తెలియవు. అయినను యీ శాసనపు నకలు ఎలియట్ దొర సంపాదించిన శాసనావళిలో (3 *) ప్రచురింపబడినది. అందీ క్రిందివిధముగా చెప్పబడినది.

" క్షోణీరక్షణదక్ష దక్షిణభు జోభూ ద్దుర్జయా
ఖ్యో నృపస్తస్మా న్ముప్పధరాధిపారయ ఇతి
ప్రఖ్యాతసోమాజనీ తస్మా న్ముప్పధరాధి
పాద్విభురభూ త్యాగాంకదోరాధిపః "

పై శ్లోకమువలన దుర్జయునకు ముప్పధరాధిపుడును, ముప్పధరాధిపునకు త్యాగాంకదోరాధిపుడును కుమారులని స్పష్టపడుచున్నది. కాని ఆశ్లోకమునందలి " ముప్పధరాధిపారయ " యను వాక్యమున గల ' అరయ ' శబ్దమునకు అర్థము వచ్చుటలేదు. అదియే ప్రస్తుత చర్చనీయాంశము.

## అరయడు

బెజవాడ శాసనము (4 *) యీక్రిందిశ్లోకముతో ప్రారంభమగుచున్నది.

" 1 శ్రీ (1 *) ఆసీద్దుర్జయవంశాబ్ధేర [రయో] హరివి
2 క్రమః (1 *) ప్రాగీశసద్రిశ (ః *) శ్రిమాం, పశ్చిమాధీ
3 శ్వరోపమః ॥ (౧ *) ... "

ఇందలి మొదటిచరణము యీక్రిందివిధముగ పదవిభాగము చేయవచ్చును. ఆసీత్ + దుర్జయవంశాబ్ధేః + అరయః + హరివిక్రమః : హరివిక్రము డగు అరయడు దుర్జయవంశమున గల డని తేలుచున్నది. ఇందలి నిజము నింకను విచారింతము. బెజవాడలోని మరియొక శాసనమున (5 *) చాగివారివంశావళి యీవిధముగ వర్ణింపబడినది.

1 స్వస్తి శ్రీమతి త్యాగివ
2 ంశే అరయధరణీపతి
3 స్నాకామ విజితతరణితనయ
4 వితరణవిలాసోబభూవ
5 తస్యతనయస్త్యాగిదోరవనుం
6 ధరావల్లభః ...

ఈశాసనము ననుసరించి త్యాగివంశమున అరయధరణీపతి గలడనియు, అతడు దానమున కర్ణుని జయించినవాడనియు, అతనికి దోరభూపుడు కుమారుడనియు స్పష్టముగ చెప్పబడియున్నది.

## ' అతులమరయతాపట్టకం '

చాగివంశమున అరయధరణీపతి గలడనియు, అతడు దోరనకు తండ్రియనియు, మన మిప్పటికి దృఢముగ తెలిసికొనగలిగితిమి. అటుపిమ్మట అమరావతిశాసనములలో (6 *) ని యీక్రిందనుదాహరింపబడిన భాగమందలి " అతులమరయతాపట్టకంప్రాప్య " అను శబ్దములయొక్క అర్థమును గ్రహించుటకు ప్రయత్నింతము.

" 19 ......అస్మాద్రాజేంద్రచోడాదతు
20 లమరయతాపట్టకం ప్రాప్య
21 భాళేభేరీశంఖానకాద్యాస్ప
22 ధితకకుభఃకాహలాందోర
23 భూపః ... "

ఇదమలకు " అట్టి రాజేంద్రచోడునివలన అతులమరయతాపట్టకముపొంది భాళే, భేరీ, శంఖ, ఆనక, కాహలాదులచే దిక్కులను బధిరీభూతముచేసినటువంటి దోరభూపుడు " అనునది తాత్పర్యము. అతులమరయతాపట్టక మన, అతులమ్ అరయతాపట్టకమ్ = తుల లేని అరయునిలక్షణములు గలపట్టకము లేక అధికారపత్రమని అర్థము చెప్పవచ్చును. ఈ రాజచిహ్నసంపాదనమును, రాజేంద్ర చోడునియొద్దనుండి రాజ్యము పొందుటయును, అరయలక్షణములు కావచ్చును. పరాక్రమసేనానియై, చోడరాజ్యస్థాపకు డగుటవలన రాజేంద్రచోడుడు సంతసించి యితనిని సామంతప్రభునిగ జేసియుండవచ్చును. అందుచేత వారిసంతతివారు అప్పటినుండియు సామంతపదవిని " అతులమరయతాపట్టకం " అని వాడవచ్చును. పండితు లింక నిందలియథార్థమును చర్చించెదరు గాక !

## అరయడే ముప్పభూపాలుడు

అరయడు దోరభూపాలునకు తండ్రియనియు, రాజేంద్ర చోడునివల్ల ప్రభుచిహ్నముల నందినవాడనియు, నింతవఱకు తెలిసి

(1 *) Epigraphical department.
(2 *) Ins. No. 300 of 1924.
(3 *) Elliot Collection of inscriptions (No. 15-6-26) Manuscripts Library Page 608.
(4 *) No. 294 & 296 of 1892.
(5 *) No. 335 of 1892.
(6 *) No. 253 & 271 of 1897

కొంటిమి. కాని ముక్త్యాల శాసనములో (1 *). దోరని తండ్రి ముప్పభూపాలుడని యీవిధముగ చెప్పబడియున్నది.

"తస్మాన్ముప్పధరాధిపాస్త్వభూద్భూ
త్యాగాంకదోరాధిపః— "

అందుచేత దోరయకు తండ్రులుగా చెప్పబడిన అరయడును, ముప్పధరాధిపుడును ఒకరు కావలయును.. అరయనికి ముప్పధరాధిపు డనునది బిరుదు కావచ్చును. ఈ యంశమును సాగిరాజుల ప్రధాననగరమగు గుడిమెట్టలోని శాసనము (2 *) ఇంకను ధ్రువపఱచుచున్నది. ఈ శాసనమును తమనివేదికలో (3 *) ఆర్కి శాఖవారీ క్రిందివిధముగ చర్చించిరి.

"In No. 313 it is said that Muppa Bhupa obtained the insignia of chief-dom consisting of the fore-head-plate, the bheri, the sankha, the anaka, the Kahala, etc. from King Rajendra Choda..."

ఈ మర్యాదలు అరయడు పొందినట్టు పైని తెలిసికొంటిమి కనుక అరయడు, ముప్పధరాధిపుడు ఒకరనియు, ముప్పధరాధిపారయడు పూర్తియగు నామమనియు తేల్చగలిగితిమి. అందుచేత చాగివారి వంశావళియందు ముప్పనకుబదులు 'ముప్పధరాధిపారయడు' అని దిద్దవలసియుండును.

౨

చాగివారు—విప్పర్లవారు

ఆర్కిశాఖవారు తమ 1924 వ వత్సరపు నివేదికలో చాగివారినిగూర్చి వ్రాయుచు, చాగివారు మొదట విప్పర్లవారని తెలిపిరి. అందులకు వారు అనుమెంచిపల్లె శాసనమును (4 *) చూపుచున్నారు. అయ్యది యింకను ప్రకటింపబడకపోవుటచేత, చదువుభాగ్య మందజాలకపోతిని. అయినను చాగివారు పూర్వము విప్పర్లవారని తెలియపఱచు నితరసాధనములు లేకపోలేదు. అముద్రితగ్రంథమగు వెలుగోటివారి వంశావళి యను గ్రంథమున (5 *) 236 వ పేజీలో నీ క్రిందిపద్యము కనబడుచున్నది.

"మును విప్పర్లకులాధిపుల్ బిరుదులే పోమోటలే కాని పెం
పున పెంప్పొలర మానసం బలర యేపారం జెరల్ బెట్టినా
వనఘా! గన్నయసాగిశైచ! పటుబాహాశక్తి వెల్లింకిమా
దని యా రామునిబట్టి కాచితి మహోద్ధామప్రతాపోన్నతిన్"

సాగివారికి పూర్వము విప్పర్లకులాధిపు లని బిరుదున్నట్టు లీపద్యము తెలుపుచున్నది. మరియు నాగ్రంథముననే విప్పర్లగోత్రమువారు అను శీర్షికక్రింద "సాగివారు! జూపల్లివారు! వాడపల్లివారు..." మొదలగువారి నామములు గలవు. రెంటిని సమన్వయించి చూచినచో, సాగివారనుపేరు రాకపూర్వము వీరు విప్పర్లవారనియు, తరువాత వీరు విప్పర్లగోత్రజు లైరనియు తెలియుచున్నది. ముక్త్యాలశాసనమున (6 *) మన కొక విప్పర్తిపోతక్షితిపాలుడు కనబడుచున్నాడు. ఇతనికూతురగు మేడాంబికను దుర్జయకులజుడగు ఈవని కండ్రపాటి గొంకధరాధినాథుడు వివాహమాడెను.

"...గొంకధరాధినాథ సౌందర్యశౌర్యజ్వాలరత్నహారః
విప్పర్తి పోత క్షితిపాలపుత్రీ మేడాంబికాసీ ద్భువితస్యపత్నీ"
—ముక్త్యాలశాసనము నెం. 303/1924.

ఇందు తెలుపబడిన పోతక్షితిపాలుడు చాగిపోత డనియు, చాగివారు ఈవని కండ్రపాటి రాజులతో సంబంధములు సల్పిరనియు మన మిందువలన తెలిసికొనుచున్నాము.

---

# సిరిమఱపు

ఒక జనకుఁడు

పిల్లలందఱును గలిసి చిలిపిఱాలును చిల్లపెంకులును బెట్టి బొమ్మపెండ్లి చేయుచుండిరి. అలంకృతములయిన తాటియాకుల బొమ్మల నొకచో నుంచి, పెండ్లివారలందఱును, భోజనములకొఱకు చిక్కుడాకులయందు ఱాలను పెంకులను బెట్టి వడ్డనలు చేయుచుండిరి. వట్టివట్టి నీళ్లతో వారందఱు కాలుసేతులను గడిగికొని, పంక్తులుదీఱి భోజనములకుఁ గూరుచుండిరి. వియ్యపువారలతో వికటములాడుచు వికావిక నవ్వుచు వారుత్సాహములోనుండ నందులో నొక్క బాలిక 'ఈ గారె బాగుగ వేఁగలే'దని యొక చిల్లపెంకను నోటపైచికొని నమలఁజొచ్చెను.

* * *

ఇంతవఱకు నాబాలికలను గానరాకుండఁ గవాక్షమునుండి చూచుచుండిన భీమారావు తన కొమరిత చిల్లపెంకను నమలుచున్నదికదా యని పరుగుపరుగునవచ్చి యాబాలికనెత్తి, చిల్లపెంకు నుమియునట్లు చేసి, నోటిని బాగుగఁ గడిగి 'అమ్మాయీ, ఆటలో గారెలు నోటిలో వేసికొనదగునా?' యని మందలించెను. ఆట ముగిసిపోయెను.

* * *

అసత్యములగు నాహారపదార్థములతో వారందఱు విందు నారగించుచున్న యప్పుడు తాను వారి కంటఁబడిన వారి వినోదమునకు భంగము గలుగవచ్చునని భీమారావు చాటుచాటుననే యుండి చూచుచుండెను. చిన్నబాలిక చిల్లపెంకును నమలునప్పు డీ యసత్యజనితవినోద మపాయకరముగఁ గానవచ్చెను. తోడనే యాతండ్రి పరుగునవచ్చి బాలికను గాపాడనెంచెను.

* * *

ఓ జగజ్జనకా! మానవు లసత్యములగుసంపదలతో నీబాలికలవలెనే వినోదించుచుందురు గదా! వారివినోదమునకు భంగము నేల గలిగింపవలయు నను నుద్దేశము ననా నీ వా సంపన్నుల మనములకు గానరాకుందువు? నీయునికిని వా రా సమయములలో సంపూర్ణముగ మఱచిపోవుదు రనుట వారినేరమా? నీ విలాసమా?

* * *

ఐశ్వర్యవినోదమత్తులయి ప్రజలు ప్రవర్తించుచు నాపదలఁ బడనుండు సమయంబుల నో దయామయా! నీవును భీమారావు నట్లు పరుగుపరుగున వచ్చి కాపాడుదువుగదా! ఎంత సుకృతము!

లేకున్న

చిలిపిఱాలవంటి యీ సంపదలే సంతోషప్రదములని యనుకొనుచు సిరిమఱపున నిన్ను విస్మరించు నీయజ్ఞాన ప్రపంచమంతయు నాపత్కూపంబునఁ బడి యడుగంట వలసినదియే కదా!

ఆటయందలి సంపద లాత్మానుభవమునకు బనికిరావని మందలింతువా!

---

(1 *) No. 300 of 1924.
(2 *) No. 313 of 1924.
(3 *) Ep. Report 1924.
(4 *) No. 283 of 1924.
(5 *) Oriental Mss. Library (15-5-32)
(6 *) 303 of 1924.

# శ్రీకృష్ణస్తవమునందలి కొన్ని పద్యములు

వద్దాది సుబ్బారాయ కవి గారు

యదువంశాంబుధిపూర్ణచంద్రమ! యశోదానందకందంబ! నా
రదవీణాభరణాయమానచరితా! రాధామనోనాథ! పా
రదకర్పూరతుషారపాండురయశా! రాసప్రియా! గోపికా
సదనస్వైరవిహారదుర్లలిత! కృష్ణా! యాపదుద్ధారకా.

వైకుంఠంబు సమస్తవైభవములో వర్జించి, యాదృష్టికిన్
సైకం బా మధురాపురిన్ జెఱయరన్ జన్మించి, తత్కంసభీ
స్తోకం బా నొకగొల్లపల్లెను మనం దూకొంటి; నీకుం దయా
సాకల్యంబునఁ బట్టె నెట్టిగతి కృష్ణా! యాపదుద్ధారకా.

ఆ నందాంగన ప్రక్కనుండి వసుదేవానీత యా కూఁతు, న
మైత్ర నభోక్తిఁ దలంచి, చంపు కడకం బైఁజిమ్మ కంసుండు వా
లూనన్, వ్రాలక తెల్పె నిన్నది చనన్ ద్యోవీథి; నాఁడాదిగా
వానాద్విట్కులభాగ్ని వైతిగద; కృష్ణా! యాపదుద్ధారకా.

దాదిం బంపెను మేనమామ యనఁగాఁ, దాఁ బచ్చిబాలెంతయై
చేదుం గుప్పిన కప్పుఁజన్మొనలతోఁ, జిప్పిల్లు స్తన్యంబుతోఁ,
గాఁడీగం బిగిచుట్టుతోఁ గదిసి, చంకం బూని పాలీయఁగా
వాదిం బూతన చేతనం గొనవె? కృష్ణా! యాపదుద్ధారకా.

ఇల్లిల్ సొచ్చి విసంబుగ్రోల్చి శిశులన్ హింసించు పాపంబు, ని
న్నల్లన్ బూతనపోఁక, దుల్లె నిజ, మత్యాభీలరూపంబుతోఁ;
బల్లెన్ గొల్లలు గాంచి, రక్కసి యనుర్ పాయన్, బయల్పడ్డ దా
వల్లం ద్రావెడు మే నటం చడల; కృష్ణా! యాపదుద్ధారకా.

వనముంజొచ్చిన నిప్పుఁదున్కఁగతి, క్రేపల్లెం బ్రవేశించి చ
క్కనిరూపంబున, నెన్నొసత్వములఁ జుల్కన్ మాపి, నిన్ నొంపరా,
వనముంజొచ్చిన నిప్పుఁదున్కఁగతియే ప్రాపించె నాపూతనం;
దన మాయల్, నిను డాయ దాఁగెడునె? కృష్ణా! యాపదుద్ధారకా.

తపనీయప్రతిమాకృతిం దనుజ నిన్ దా మాయడాయన్, బరం
తప! నీ యద్భుతశక్తి దాని కొదవెన్ గాలాయసాకారమే;
కపటాద్యద్యుతి పాఱెనా, నపుడు తత్కాలాభ్రనీలాంగమం
దపురూపంపు వెలుం గొకం డెగయఁ; కృష్ణా! యాపదుద్ధారకా.

నిన్నుం దొల్కరిమబ్బుదున్కయనుచున్ విభ్రాంతి భావింపనో
పు న్నాఁ డాసుడిగాలి, లేనిసుగుఁ గొంపోయెన్ నభోవీథికిన్;
దన్నన్ రక్కసుఁ డంచు నీ వెఱిఁగి యంతన్ గొంతుక్రోల్ నొక్క, వాఁ
డన్నా! కూలెను గ్రుడ్లుపైకెగసి; కృష్ణా! యాపదుద్ధారకా.

స్థూలప్రోన్నతమైన కొండొక మహాస్థూణంబు నగ్రంబునన్
బ్రోలన్ వేదుకతోంచు గాలిపతిమన్ బోలన్, దృణావర్తకో
న్మాలిన్ మిన్నున నిల్చునందిరుగు నిన్ బాలున్ విలోకించి, డెం
దాలన్ నందయశోద లేమనిరొ? కృష్ణా! యాపదుద్ధారకా.

బరువై నీవు యశోద, కావె యొడినుంపన్ లేక నిన్ డింపగా
సొరువై తా మరగాలి కెత్తుకొనిపోఁ, జోద్యంబు తా నీక్రియల్;
మెరుగన్, మేలుఁ, ద్వదాగ్రహాగ్రహమహాదిప్నంబు లం చెంచుటల్
సరిగా; దెవ్వఁ డెఱుంగు నీమొళవు? కృష్ణా! యాపదుద్ధారకా.

అవనీదాన మొసంగినట్టి బలిఁ, గన్యాదాన మిడ్డట్టి య
గ్ణవు బంధించితి; దాఁకెనో యసుర; సంతానప్రదాత్రుండవై
యవులన్ ఱోలను గట్టఁగాఁ బడితి వీ వా తల్లిచే, శాపబం
ధవిముక్తిం గన జక్కల క్కతనఁ; గృష్ణా! యాపదుద్ధారకా.

మాయాతోయనిధిన్ సమస్తజగముల్ మగ్నంబు గావించు నిన్,
మాయం ద్రోయఁగ నెవ్వఁడోపు? నటవీమధ్యంబునన్ గ్రేపులన్,
నీ యన్నం జెలికాండ్ర, నొక్కసమవాణీభర్త డాఁపంగ, నీ
వాయారూపులఁ దోఁపవే మహిమఁ? గృష్ణా! యాపదుద్ధారకా.

తల్లింగాన, కెఱింగి యారుచి, యశోదం దేవకింగాక, వ్రే
పల్లెన్ వ్రేతల గోతతిన్ ముదమెలర్పన్ మాతలం జేసి, కో
న ల్లోకేశుని దొంగఁ జేసితివి, గా కాతం డెఱుంగండె నిన్?
ద్వల్లీలల్ వినుతింపఁడే మునుపు? కృష్ణా! యాపదుద్ధారకా.

ఏదే వస్తు వొకండు చేసి, సరి య ట్లింకొక్కటిం జేయఁగా
రా దా బ్రహ్మకునైన; రూ, పెలుఁగుఁ, బూర్వంబట్ల సర్వంబుగా
నేదారిన్ గమలాసనాపహృతవత్సవ్రాతార్భకాద్యాకృతుల్,
నా దేవా! ధరియించి తీ వరుదు! కృష్ణా! యాపదుద్ధారకా.

కడిమిం జూచిన, దానఁ దొల్కరిని మొగ్గల్ వోలె నొక్కుమ్మడిన్
బొడమున్ గగ్గురుపాటు మేన; మును పాభూజంబు పైనుండి గా
పడగల్ నుగ్గుగ దూఁకి, కాళియుని దర్పంబార్చి, కాళింది పెన్
మడుఁగున్ శుద్ధజలం బొనర్చితివి! కృష్ణా! యాపదుద్ధారకా,

స్ఫుటమాణిక్యరుచిస్ఫటాపటలి మెచ్చుం జేయఁగా రంగమై
తటవిస్మేరవిలోకనందముఖు లొందన్ సభ్యభావంబు, కై
కటిసంధించి, మెయిం గుదించి, గొని తోఁకన్, దందశూకంబుపై
నటనప్రౌఢిమఁ జూపవే యమునఁ? గృష్ణా! యాపదుద్ధారకా.

క్షీరాంభోనిధిఫేనధీప్రదమహాశేషాహితల్పంబునన్
దారంగూడియె పవ్వళించి, సుఖనిద్రం గూరుటల్ తొల్లి యా
చారం బై తగునీకుఁ, గాళియుని శీర్షంబందుఁ గాళింది స్వే
చ్ఛాకేళిన్ నటియించు టెంతపని? కృష్ణా! యాపదుద్ధారకా.

కాళిందీనది నల్పు; బింబితమహాకాశంబు న; ల్పందులోఁ
గూలం బందుఁ దమాలరాజి నలు; పా ఘోరాహియున్ నల్పు త;
న్మౌళిన్ నర్తిలు నీవు నల్పు! నలుపుల్ ధ్యానింపఁగా నిన్నియున్,
మాలో నల్పు దొలంగుఁ జిత్ర మిది కృష్ణా! యాపదుద్ధారకా.

తలిదండ్రుల్ పురిటింట, మోమున యశోదాదేవి, యక్రూరుఁ డా
జలమధ్యంబునఁ, గొల్వులోన ధృతరాష్ట్రద్రోణభీష్మాదు, లీ
కలియందుం గలఁ డిక్కయజ్వ, సుకృతుల్ గన్గొన్న నీ లీల, వ
త్సలతన్ నాకును జూపు మొక్కపరి కృష్ణా! యాపదుద్ధారకా.

'నమఁ గొల్వన్ వలతేనిఁ గావలయు డెందం బిట్టి' దన్నట్టు లె
త్తినచేలన్ నవనీత మొప్ప, 'విడు మీ దేహాభిమానంబు నీ'
వను చందాన దిగంబరుండవయి, 'సాష్టాంగానతిన్ సల్పు నా'
కను వీకన్ ధరఁ బ్రాఁకు నీవ నతి; కృష్ణా! యాపదుద్ధారకా.

# బ్రహ్మయుగవర్ణనము

మల్లాది సూర్యనారాయణ శాస్త్రి గారు

పరమమునీంద్ర! నీకపుడు పంకజనాభ మహత్త్వ తత్త్వ సం
భరితము నద్భుతంబు నగు పౌష్కరసర్గ మెఱింగితిన్ సవి
స్తరముగ సాంఖ్యయోగములతత్త్వము తేటపడంగ వ్యాసవా
క్పరిచితమైన బ్రహ్మయుగవర్ణన మింక ననుగ్రహింపుమీ.

చ. అనుటయు మౌని యిట్లనె ధరాధిప! సుస్థిరచిత్తవృత్తి వై
వినుము త్రికాలసత్యము నవేద్య మచింత్య మనామరూపవ
ర్తనము నఖండమైన పరతత్త్వ మొకండు సదాత్మకంబు దాఁ
దనకు నిమిత్తమై యవిదితస్వపదంబు ననాదియై తగున్. [బ్రాఁ

చ. అదియె పరాత్పరుండు పరమాత్ముఁడు పూరుషుఁ డాద్యుఁ డంచుఁ
జదువులు పల్కు నవ్విభుఁడు సర్వజగంబు సృజింతు నేను నా
ముదమున బ్రహ్మభావమునుబొంది యహంపదవాచ్యుఁడయ్యె న
ప్పదమునఁ బంచభూతములు భౌతికముల్ జనియించె నెల్లెడన్.

చ. అరయ నతం డహమ్మనుట యప్పదమందు సమస్త మీచరా
చరజగ మున్పతిల్లుటయు సన్నుతికెక్కు స్వభావమంచు న
ప్పురుషుఁడె నైజమాయ జగముల్ గలిగించియు నిండియుండదం
తరచరుఁ డయ్యు ద్రష్టయయి తాఁ గనరాక వెలుంగు జోతియై.

చ. మును వివరించినట్లు మునుమున్న త దీశ్వరమాయచే జనిం
చిన వియదాదిభూతములఁ జేవయు లావును గల్గుపృథ్వి నీ
టను బడి మున్గిపోవుచుఁ గటా! పయినుండఁగఁగోరి క్రింది కిం
కను దిగజాఱుచుంటి గతికల్గ దొకో! నను నుద్ధరింపఁగన్.

చ. అనుచును మొఱ్ఱవెట్టఁ బరమాత్మ తదార్తరవంబు విన్నచో
ప్పనసె వరాహరూపమును బూని తటాలున దూఁకి యర్ణవం
బున నడుగంటమున్గి తన పోటగు కోఱలఁబట్టి యెత్తి భూ
మిని బయినిల్పి తా నధిగమించెను వెండియు బ్రహ్మభావమున్

గీ. అట్టి బ్రహ్మమయంబు దివ్యంబు నైన
తేజ మాకాశసంజ్ఞ నుతింపఁబడియె;
ఆ పర బ్రహ్మ తైజసరూప మలర
సర్వ భూతపితామహ సంజ్ఞఁ బడసె.

గీ. నాఁటఁగోలెను బ్రహ్మమానసము బలిమి
నేఁటిదనుకను ధర యిట్లు నిలిచియుండెఁ
దాదృశజ్ఞానయోగమే ధర ధరించు
శేష కూర్మాఖ్యు లని ప్రశంసింపఁబడియె.

ఉ. ఇమ్ముగ నట్లు నిల్చిన, మహీపతి, మధ్యముఁ జీల్చివచ్చు నీ
రమ్మునఁ గల్గినట్టి వివరమ్మున మేరువు పొల్చె దాని య
గ్రమ్మున సూర్యమండలము గ్రాలెఁ బ్రభాకర మాచు దాని మ
ధ్యమ్మున నుండి వెల్వడె సుధామయకాంతుల సోమబింబమున్.

గీ. ఉమ యనఁగ బ్రహ్మవిద్య, యా యుమను గూడి
సోముఁ డనఁగ సనాతనధామభూతుఁ
డైన యా బ్రహ్మ తన్మండలాభిమాని
బ్రాహ్మణాధ్యక్షుఁ డగుచును బరఁగె నట్లు.

క. ఆ సోముని యాననమున
శ్వాసం బక్షరమయంబు సర్వార్థ సము
ద్భాసక మగు తేజంబున
భాసిల్లుచు వెడలె వేద వాఙ్మయ మగుచున్.

గీ. పరమపురుషస్వభావసంభవము లైన
యా చతుర్వేదముల యర్థ మాత్మఁ దలఁచి
యాధిదైవికనిర్మాత యా విధాత
కడఁగి యాధ్యాత్మికార్థసంఘటన కపుడు,

చ. సలిలము మాంసశోణితవసాప్రముఖంబులు భూమి చర్మ మె
మ్ములు గగనంబు కర్ణములు మున్నగు చిల్లులు పావకంబు క
న్నులు పవనంబు ప్రాణములునుం గలిగింపఁగ ముఖ్యకారణం
బులుగఁ దలంచె దివ్యుఁ డగుపూరుషుఁ డాత్మకు జీవరూపమున్.

గీ. ఆ సనాతనపురుషుఁడే యట్లు జీవ
పురుషుఁడై యింద్రియంబులఁ బొందుకతన
నాత్మతత్త్వంబు మఱచి మాయావశుఁ డయి
మసలుచుండు శరీరాభిమానియగుచు.

గీ. అతఁ డెంతకు నిజసత్య మరయలేఁడొ
యంతదనుకను సంసార మాశ్రయించి
పూర్వ పూర్వానుగతకర్మభోక్త యగుచు
జనన మరణ ప్రవాహ సంచలితుఁ డగును.

గీ. ఇంద్రియంబులు నిర్జించి యెపుడు యోగ
శక్తిచేఁ దన్నుఁ దాఁ గనఁజాలునతఁడు
సకలబంధంబు లప్పుడే సడలిపోవ
బ్రహ్మభావంబు గాంచి కైవల్య మొందు.

గీ. అది నవ్యక్తుఁడై యట్లు వ్యక్తరూప
మలర నావిర్భవించినయట్టి పంచ
భూతమయుఁ డైన యా దివ్యపూరుషుండె
బ్రహ్మ పరమాత్మ స్రష్ట నాఁ బరఁగుఁ జుమ్మి.

ఉ. ఆతఁడు దివ్యపూరుషసమాఖ్యుఁ డట న్నిజదివ్యకాంతి వి
ద్యోతిత మేరుపృష్ఠముననుండి సనాతన మాత్మ తేజమున్
జేతమునందు నిల్పి గురునిష్ఠఁ దపం బొనరించెఁ దాన సం
ఖ్యాతసమంబు లాత్మజనితాగమతత్త్వపరాయణాత్ముఁ డై.

గీ. అతని తపమున కనికప ట్టయినయట్టి
యతి విశాలంబు రమణీయ మైన మేరు
శిఖరమే బ్రహ్మలోక మై చెన్నమీఱె
నతఁడు నట్లుండి సృష్టి చేయం దలంచి

గీ. తాన యానందలీల ద్వంద్వంబుగాఁగ
నలరి క్రీడించి యవ్యక్త మక్షరంబు
నైన తన తేజమున నభివ్యక్తపఱచి
క్షరమయంబు త్రిలోకసర్గంబు మఱియు,

గీ. బ్రహ్మవిష్ణుమహేశ్వరాహ్వయము లలర
సకల భౌతికజగదధిష్ఠాన మఖిల
కారణంబును బహువిధకార్య మగుమ
విశ్వరూపంబు ధరియించి వెలసె నంత.

క. తొలి వెలసిన వేదంబుల
నలు మొగములఁ దాల్చినట్టి నలువముఖమునం
గలిగిరి బ్రహ్మోక్తవిధుల్
వెలయింపఁగఁ జాలునట్టి విప్రులు తొలుతన్.

గీ. బ్రహ్మ ముఖమున జనియించి బ్రహ్మ మెఱిఁగి
బ్రహ్మపారాయణ మొనర్చి బ్రాహ్మ్యవిధుల
నాచరించుట బ్రాహ్మణు లైరి వారు
నారె పురుషార్థముల కాలవాల మైరి.

గీ. బ్రహ్మములు లీనమైయుండు బ్రహ్మమందు
బ్రహ్మములయందు లీనమై బ్రహ్మ ముండు
ననెడి పరమార్థ మెఱుఁగు బ్రాహ్మణుఁడె బ్రహ్మ
వేత్తనా, వేదవేత్తనా, వినుతికెక్కు.

---

## దా యా ది

ఇంకొల్లు శ్రీరామశర్మ గారు

చవిటినేల జలంబు చవి నొసంగిననాఁడు
మానుగ దాయాదిమంచి గల్గు
గ్రామసింహపుఁ దోఁక కడుఁ జక్క నౌ నాఁడు
మానుగ దాయాదిమంచి గల్గు
వేప కుండెడు చేదు విఱిగిపోయిననాఁడు
మానుగ దాయాదిమంచి గల్గు
అహిదంష్ట్రలన్ విషం బమృతంబె యగునాఁడు
మానుగ దాయాదిమంచి గల్గు
భస్మమున దైలమును దీయవచ్చునాఁడు
నెంచి చూడంగ దాయాదిమంచి గల్గుఁ
గాని; మధ్య నొకింతైనఁ గలుగఁబోదు
వసుధలోపల దాయాదివానిమంచి.

సీ. తన కెంతయో మేలు నొనరించినను గాని
జ్ఞాతికి మంచియే కానరాదు
తనె దేవుఁ డని కొల్చుకొనుచు నుండినఁ గాని
జ్ఞాతికి మంచియే కానరాదు
తన సేవయే నిరంతరము సల్పినఁ గాని
జ్ఞాతికి మంచియే కానరాదు
తన క్షేమమే సదా తలఁచుచుండినఁ గాని
జ్ఞాతికి మంచియే కానరాదు
తన పురోవృద్ధిఁ గోరుచుండిననుగాని
జ్ఞాతి కెప్పుడు మంచియే కానరాదు
తన పదంబులమీఁద వ్రాలినను గాని
జ్ఞాతి కెన్నఁడు మంచియే కానరాదు.

సీ. ఇంచుక దయపుట్టు నేమొ హింసించెడి
యమకింకరుల చరణములఁ బట్ట;
కృపఁ గల్గునేమొ యొ క్కింత పైకొని మోము
తెక్కలికాండ్రకు మ్రొక్కు లిడఁగ;
కడుబాళి ననుకంప గల్గునేమో బాధ
పెట్టు వైరికి మొఱపెట్టుకొనగ;
నెన రింత జనియించు నేమొ నేరముఁబట్టి
కలఁచు పోలీసుల నెలమి వేఁడ;
కరుణ యుదయించునేమొ నిక్కముగ గొంతు
నఱకు హంతకులను బ్రార్థనము నొనర్పఁ;
గాని, దాయాది కిల మంచి గల్గఁబోదు
వేఁడినను గొల్చినను బొంది వీడువఱకు.

సీ. పరమేష్ఠి లిఖియించు వ్రాఁత తప్పినఁ గాని
తలఁప దాయాదిమత్సరము పోదు
పశుపతినేత్రాగ్ని పస తూలినను గాని
తలఁప దాయాదిమత్సరము పోదు
కాలుదండపుశక్తి కూలిపోయినఁ గాని
తలఁప దాయాదిమత్సరము పోదు
వర రామబాణంపు గుఱి తప్పినను గాని
తలఁప దాయాది మత్సరము పోదు
విష్ణుచక్రప్రభావంబు విడినఁ గాని
తలఁప దాయాది కుండు మత్సరము పోదు
కపట మెఱుఁగని విమలహృత్కమలులార
స్వానుభవమునఁ జెప్పుచున్నాను వినుఁడి.

సీ. కటికివిషముఁ గ్రక్కు కాకోదరం బైన
గణుతింపఁగా దాయకన్న మేలు
భగ్గుభగ్గున మండు వైశ్వానరం బైన
గణుతింపఁగా దాయకన్న మేలు
గాండ్రు గాండ్రని దూఁకు గబ్బిబెబ్బులిమైన
గణుతింపఁగా దాయకన్న మేలు
అత్యుగ్రముగఁ ద్రుంచు మృత్యుదేవతమైన
గణుతింపఁగా దాయకన్న మేలు
భళిర! పైశాచసమితిలోపలను గల వి
కార మలజాలనుండు కార్కశ్యము సెల
యేళ్లలోనుండు వక్రత లేర్చిచేసె
బమ్మ దాయాదుల నటంచు నెమ్మిఁ దలఁతు.

# నవద్వీపము

యలమంచిలి శ్రీరాములు గారు

నవద్వీప మనుపేరును పండితులెల్లరు వినియుందురు. ఏలకో గాని నవద్వీపచరిత్రమును ఎవ్వరు తెనుఁగుభాషలో వ్రాయలేదు. అందుచేత నవద్వీపచరిత్రమును 'నా చైతన్య సర్వస్వము' నుండి సంగ్రహముగ నెత్తి వ్రాయు చున్నాను.

బంగాళాదేశములో కలకత్తాకు ఉత్తరముగ పదునేఁడు మైళ్లదూరమున భాగీరథీ పశ్చిమతీరమున 'నవద్వీప' మను గ్రామ మున్నది. ఈ గ్రామమును పూర్వము 'కులియా' అనెడివారు. నవద్వీపము గంగానదికి తూర్పుతీరమున నుండెడిది. అది కాలక్రమమున నశించిపోయినది; 'కులియా' యే 'నవద్వీప' మని నేఁడు పిలువఁబడుచున్నది.

నవద్వీపనగరఖ్యాతి పదునైదవ శతాబ్దములో భారతదేశ మెల్లడలను మార్మోగిపోయెను. నేఁడు పూర్వవాసన తప్ప మఱేమియు కనఁబడదు. అయినను మహానుభావుఁ డగుచైతన్యదేవుఁడు జన్మించిన స్థలముగదా!

పందొమ్మిదవశతాబ్దములోఁ గూడ నవద్వీపము పేరు మనదేశములో వినఁబడు చుండెడిది. ఏ యూరిలోనైనను పెక్కుండ్రు పండితు లున్న నేఁటికిని ఆ ఊరిని నవద్వీపమునకు పోల్తురు!

పదునైదవశతాబ్దమున వంగదేశమంతయు ఇంచుమించుగా మహమ్మదీయులచేత పరిపాలింపఁబడుచుండెను. నవద్వీపము రాజధానీ నగరము కాదు; కూడలిస్థానము కాదు; వ్యాపారస్థలము కాదు; అయిననేమి? భారతదేశ మెల్లెడలను ప్రఖ్యాతినిపొందెను. చిన్నపల్లె పెద్దపట్టణముగ మారెను. దీని కంతటికిని కారణము విజ్ఞానసంపద తప్ప మఱేద్దియు కాదు. నవద్వీపముకడ భాగీరథిలో లక్షలకొలఁది జనులు ఉదయము సాయంకాలము స్నానముచేసి పూజలు సల్పుచుండెడివారు. వారి పూజలతో గంగానది పుష్పమయమై పోవుచుండెడి దనిన నతిశయోక్తి కాదు.

ఇప్పటివలె ఆరోజులలో జీవితవ్యయము హెచ్చుకాదు. తినుటకు తిండి కట్టుకొనుటకు బట్ట దొరికిన చాలును. నేఁడు సన్యాసులకు కూడ ధనము నిలువచేసికొనకపోయిన భవిష్యత్తు జరుగదేమో అను భయము. ఆ రోజులలో అట్టి భయ మవసరము లేకుండెను. ధనవంతులు అతిథి అభ్యాగతులను ఆదరించుటలోఁ గాని కుంటి గ్రుడ్డివారిని పోషించుటలోఁ గాని వెనుక ముందు ఆలోచించువారు కారు. ఎవరియింటికైనను అతిథులు వచ్చి సత్కారము నొందక తిరిగిపోయినచో ఆ యింటివారికి సంఘములో వన్నె తగ్గిపోయెడిది. అందువలన గృహస్థు లెంతయో జాగ్రత్తగలిగి యుండెడివారు. కాకున్నను అర్హులను గమనించి ఆదరించుట విధాయకధర్మముగా నెంచుకొని ప్రవర్తించు చుండెడివారు.

జ్ఞానసంపాదనతప్ప మానవునికి వేఱు కర్తవ్యములేదని నవద్వీపవాసు లగు స్త్రీపురుషులు అందే నిమగ్నులై యుండిరి. ఉద్యోగముచేయుట నీచమైనదిగా నెంచెడివారు. బాధ్యత గల పెద్దపెద్ద ఉద్యోగముల నైనను అంగీకరించెడివారు కారు. వారి దృష్టిలో ఉద్యోగముచేయువాఁడు అల్పుఁడు. భౌతికవిషయములు వారిని ఆకర్షించెడివి కావు. భగవద్భక్తి విజ్ఞానము లున్న చాలును. యుద్ధములు హత్యలు రాక్షసకృత్యము లని వానిని మిక్కిలి గర్హించెడివారు. సౌందర్యము అధికారము ధనము వీనిలో నేదియు విద్యకు సాటికావనియు వయస్సును గణింపక విద్యను సంపాదింపవలెననియు వా రనుచుండెడివారు. అట్టులే జీవితకాలమంతయు విద్య నభ్యసించుచుండెడివారు. అనఁగా వా రెల్లప్పుడును ఉత్సాహవంతులగు విద్యార్థులే. అల్లుఁడు లక్షాధికారియా కాఁడా అను విచారణచేయువారుకారు. పండితుఁడా కాఁడా యని బహు జాగ్రత్తగ విచారణచేయువారు. పండితున కున్నగౌరవము కోటీశ్వరునకు సున్న. పండితులకు దారిద్ర్యభీతి లేదు. పండుగులలో ధనవంతులు పండితులకు తగిన కానుకలను విధాయకకృత్యముగా నెంచుకొని పంపుచుండెడివారు. ఇంక పండితుని కేమికావలెను? బిడ్డలు పండితులు కావలెననియే భగవంతుని ప్రార్థించెడివారు గాని ధనవంతులు కావలె నని యెవ్వరు ప్రార్థించెడివారు కారు. స్నానము చేయునప్పుడుకూడ శాస్త్రచర్చలే జరుగుచుండెడివి. ఏ వీధిలోఁజూచినను విద్యార్థులే! విద్యాచర్చలే! ప్రతి విద్యార్థియు తనచేతిలో నొక పుస్తకమును గలిగియుండెడివాఁడు; అదియే అతని సర్వస్వము, ప్రాణతుల్యము, భూషణము, మిత్రము.

నవద్వీపవాసులు దొంగల భయమును మహమ్మదీయ పరిపాలనలోని యితర కష్టములను లెక్కగొనక తీర్థయాత్రలు ఎక్కువగా చేయుచుండెడివారు.

ప్రతి వీధిలోను కళాశాలలు పెక్కులుండెడివి. ప్రతి కళాశాలలోను వందలు, ఒక్కొక్కప్పుడు వేలు, విద్యార్థు లుండెడివారు. నిత్యము వేలకువేలు నవద్వీపమునకు పలుప్రదేశముల నుండి వచ్చుచుండెడివారు. కొందఱు బిడ్డలచదువుకోసము– మఱికొందఱు విద్యాచర్చలు వినుటకోసము–వేఱొక కొందఱు విఖ్యాతకోవిదుల దర్శనముకోసము వచ్చుచుండెడివారు. నవద్వీపము పోయి పరీక్షకు నిలువఁజాలిననేగాని పండితుఁ డని లోక మెన్నెడిది కాదు. కనుక నవద్వీపపండితులనుండి యోగ్యతాపత్రములను బొందుటకు పెక్కుపండితులు వివిధరాష్ట్రములనుండి అక్కడకు వచ్చెడివారు. డబ్బునకు చదువు చెప్పుటగాని న్యాయము చెప్పు

టకు డబ్బు తీసికొనుటగాని మహాదోషము. అట్టి నేర మెవ్వరు చేసెడివారుకారు. చదువుచెప్పటలో జాతి మత విచక్షణ లేదు. చదువుకొనవలయు నన్న అభిలాష గలిగిన చాలును. ఎట్టి యిబ్బంది యుండెడిది కాదు. వారములకు—విద్యార్థివేతనములకు—విసువెత్తు నట్లు వెదక నవసరములేదు.

ప్రతి కళాశాలకును ఒక్కొక్క ఆచార్యు డుండెడివాడు. క్రిందితరగతి విద్యార్థులకు పైతరగతుల విద్యార్థులు తీరికగలవేళలలో చదువుచెప్పుచుండెడివారు. సంఘమును నడపువారే అధ్యాపకులు. వారికి సంఘములో ఎంతో గౌరవముండెడిది. అందులో తర్కశాస్త్ర పండితుల కుండెడి గౌరవమునకు మితిలేకుండెడిది. వారి అపార శాస్త్రజ్ఞానముచేత ఎల్లరను దిగ్భ్రమ నొందించుచుండెడివారు.

తర్కశాస్త్రమునం దింతటి గొప్పపేరు నవద్వీపమునకు నొకట లేదు. ఇతర విషయములలో గొప్ప పండితు లున్నను తర్కశాస్త్రమునకు గౌతమబుద్ధుని జన్మస్థల మగు మిథిలానగరము వాసిగాంచియుండెను. తర్కశాస్త్రమును చదువుకొనవలెనన్న భారతదేశములోని యేమూలనుండియైనను మిథిలకు పోవలసి యుండెడిది. ఆ తర్కశాస్త్రాభ్యాసమునకు నవద్వీపవాసులుకూడ మిథిలకే పోయి వచ్చెడివారు. మిథిలానగరపండితులు మాత్రము ఎవ్వరిని ఆ తర్కశాస్త్రగ్రంథమును ఎత్తి వ్రాసికొననిచ్చెడివారు కారు. ఆ గ్రంథము నితరులు ఎత్తి వ్రాసికొనిన తమ గొప్పతనము గుర్తింప రనియు ఇతరులు మిథిలకు రారనియు వారి అభిప్రాయమై యుండెడిదట. నేటికిని భారతదేశ దురదృష్టమున అనేక అమోఘ వైద్యప్రక్రియలను, ఇతరులకు చెప్పిన తమగొప్ప పోవునని, ఎవరికిని చెప్పకుండ నెందరో చచ్చిపోవుట కలదు.

నవద్వీపములో 'రామభద్రభట్టాచార్యుడు' తర్కశాస్త్ర కళాశాల నొకదానిని స్థాపించెను గాని తర్కశాస్త్రగ్రంథము అతనివద్ద లేని కొఱత కనబడుచుండెను. అతని విద్యార్థియగు 'సార్వభౌముడు' దీనిని గ్రహించెను. అతనివంటి ప్రతిభావంతుడు ఆ కాలమున భారతదేశమున మరొకడు లేడన్న ఆశ్చర్యపడ నవసరములేదు. మిథిలకుపోయి ఆ తర్కశాస్త్రగ్రంథమునంతను కంఠస్థముచేసి నవద్వీపమునకు తిరిగివచ్చెను. దీనిచేత తర్కశాస్త్రము కూడ నవద్వీపమువచ్చి వేసె నన్నమాట. ఇంక నవద్వీపమున కీడేమి గలదు? మిథిలా ఖ్యాతి తగ్గిపోయెను. నవద్వీప నగరఖ్యాతి దశదిశల నిండిపోయెను. సంకుచితదృష్టితో తమవద్ద దాచుకొనిన తర్కశాస్త్రగ్రంథమును తెచ్చి లోకమున కొసంగిన సార్వభౌము డెల్లరకు స్మరణీయుడు. ఆ సార్వభౌముడు నవద్వీపములో ఒక తర్కశాస్త్రకళాశాలను పెట్టెను. వేలకొలది విద్యార్థులు భారతదేశములోని బహుప్రాంతములనుండి మూగ నారంభించిరి. అతడు తన అనుభవజ్ఞానమును మిళితముచేసి 'చింతామణి' అను జగద్విఖ్యాత తర్కశాస్త్రమును రచించెను.

నవద్వీప నగరవాసులును సార్వభౌముని శిష్యులు నగు ప్రథమ రఘునాథుడు చింతామణిని పెంచి 'దీధితి' అను తర్కశాస్త్రమును రచించెను. దానికి తుల్యమైన తర్కశాస్త్రము సంస్కృతమున మరొండు నేటికిని లేదు. రఘునందనుడు పదునెనిమిది భాగములుగ విభజించి స్మృతిని రచించెను. కృష్ణానందుడు తంత్రశాస్త్రమును రచించెను. ఆ విషయమున దానికీడైన గ్రంథము నేటికిని మఱొకటిలేదు. వీరిలో ఎవరు గొప్పవారో యెవరు తక్కువవారో నిర్ధారణచేయుట దుర్ఘటము, అనవసరముకూడ నేమో!

ఇట్లు కొంతకాలము గడచిపోయినది. క్రమముగా బంగాళమున భక్తిభావ మంతరించిపోయినది. గోస్వామి తెగకు జెందిన కొలదిమందిమాత్రమే వైష్ణవులుండిరి. ఎచ్చటచూచినను శాక్తేయులే. బలుల కంతులేదు. శ్రీ చైతన్యుడు జనించునప్పటికి నవద్వీప మనేకమగు మార్పుల నొందెను. నవద్వీప పండిత ప్రకాండులు వారి తర్కశాస్త్రపాండిత్యమును జూపుటయేగాని భగవంతుని మఱచిపోయినారు. వారి తార్కిక శక్తిచేత భగవంతుని ఉనికి నిర్ధారణచేయుటయును ఖండించుటయును జరుగుచుండెడిది. ఇది యంతయు నాస్తికవాదమునకు బలమొసంగుచుండెడిది. పండితులకు భక్తిభావముపోయి పాండిత్యగర్వము మితిమించెను. జమీందారులయొద్దనుండి ఒడసిన కానుకలను మూటగట్టనేర్చిరి; భక్తిని మూఢలక్షణముగా నెంచిరి. నీతికిని భక్తికిని దూరమైన చర్చలు చేయుచుండెడివారు. నిజమైన వేదాంతమును విడిచి వక్రగతులు పట్టినారు. జనసామాన్యమునకు త్రాగుడు బలులు నిత్యకృత్యము లైపోయెను. అట్టి నగరమున శ్రీ చైతన్యుడు జన్మించుట విద్యల యొక్క పరమార్థము భగవంతుని తెలిసికొనుటకే అని బోధించుటకై యుండునని అందఱి తలంపు. ఆయన క్రీ॥ శ॥ 1486 ఫాల్గుణమాసమున శుభలగ్నమున పున్నమినాడు చంద్రగ్రహణమున జనించెను.

ఆయన జన్మచేత అదివరకే పేరు ప్రఖ్యాతులు పొందిన నవద్వీపమునకు మరింత వన్నె వచ్చెను. బంగారమునకు తావి అబ్బినట్లే! ఆయన వంగదేశమందలి వైష్ణవు లందరిచేతను భగవంతుడని చెప్పబడుచున్నాడు. చైతన్యుని అనంతరము వ్యాసు డున్నయెడల భగవంతుని అవతారములలో నీ అవతారమునుగురించి కూడ పురాణములలో రచించియుండునని వారందురు. పూర్వవంగీయ సాహిత్యమంతయు చైతన్యసంబంధ మగుగ్రంథములతోనే ఆరంభ మయ్యెనని చెప్పవచ్చును. నేటికిని చైతన్యమతము బంగాళాదేశములోను ఓఢ్రదేశములోను సజీవముగా నున్నది. చైతన్యసంబంధ మగువాఙ్మయమే లేకున్న బంగాళీయులకు పూర్వవాఙ్మయము సున్న. కనుక వంగవాఙ్మయ విజృంభణమునకు కారణభూతుడును మతప్రవక్తయు నగు శ్రీ చైతన్యునకు జన్మస్థల మగు నవద్వీపము చిరస్మరణీయము.

# విశ్వరూపసందర్శనయోగము

సెట్టి లక్ష్మీనరసింహము గారు

(శ్రీమద్భగవద్గీత)

### అర్జునుని వాక్యము

నన్ననుగ్రహింపఁగ నీవు నాకు సుహ్య
మగుచు నధ్యాత్మసంజ్ఞితం బైన పరమ
వాక్య మెది పల్కితివో, దానివలన నిపుడు
నాకుఁ గల మోహ మయ్యది నాశ మయ్యె.

పుండరీకవిలోచనా, భూతములకుఁ
గలుగు నుత్పత్తి నాశనంబులను నే స
విస్తరంబుగా నీవల్ల వింటిని గద?
యవ్యయం బగు మాహాత్మ్య మదియు వింటి.

ఏ ప్రకారంబుగాఁ బరమేశ్వర, నినుఁ
గూర్చి నీవు నాతోడ వాక్రుచ్చినాఁడ,
వట్టి యైశ్వరంబయిన నీ యాకృతి పురు
షోత్తమా, చూడవలె నని యున్న దయ్య.

స్వామి, దానిఁ జూడఁగ నాకు శక్యమగునఁ
టంచు నీ మనంబందుఁ దలంచితేని,
అవ్యయం బైన యట్టి నీ యాకృతిని గ
నంబఱుపుము యోగేశ్వరా, నాకు నీవు.

### శ్రీ భగవంతుని వాక్యము

పాండుభూపాలనందనా, బహువిధములు,
బహుళవర్ణముల్, బహుళరూపములు నైన
వందలికొలంది, వేలకొలంది, మామ
కీనదివ్యాకృతులను వీక్షింపు మీవు.

కనుఁగొనుము పార్థ, యాదిత్యులను, వసువుల,
రుద్రులను, నశ్వినులను, మరుత్తుల, మఱి
మున్ను నీ వెన్నఁడును జూడకున్న యట్టి
యద్భుతంబులఁ బెక్కింటి నరయు మిపుడు.

అర్జునా, సచరాచర మైన యఖిల
జగమును, మ ఱేది నీవు కాంచఁదలఁతువో
యదియు, నిచ్చట నాదు దేహంబునందుఁ
గనుము యిప్పు డేకస్థంబుగాఁగ నీవు.

నీకుఁ గల యీ కనులతోనె నీవు నన్నుఁ
గనుఁగొనం గలుగుటకు శక్యంబు కాదు;
నీకు నే నొసంగెద దివ్యనేత్రములను;
ఐశ్వరంబగు నా యోగ మరయు మీవు.

### సంజయుని వాక్యము

ఈ ప్రకారంబుగా వచియించి పిదప
గాండివికి మహాయోగేశ్వరుం డగు హరి
యైశ్వరంబును బరమంబు నైన యట్టి
రూపమును జూపె ధృతరాష్ట్ర భూపతీంద్ర.

అట్టిరూపంబునం దనేకానన నయ
నము, లనేక దివ్యాభరణము, లనేక
మయి పయికి నెత్తఁబడిన దివ్యాయుధము, ల
నేకములగు నద్భుతములు, కన్పించు చుండె.

మఱియు నది దివ్య మగు వస్త్రమాల్యములను
దాల్చినది, దివ్య మైన గంధంపుఁ బూఁతఁ
గలది, సర్వాద్భుతమయంబు, కాంతియుత, మ
నంతమును, విశ్వతోముఖం బగుచు నుండె.

గగనతలమున నొక్కమాఱుగ సహస్ర
భాస్కరుల కాంతి వెలువడ్డ పక్షమందు,
అట్టి మిక్కుటం బగు కాంతి యా మహాత్ము
కాంతి తోడ సమానంబు కాఁ గలుగును.

బహువిధంబుల విభజింపఁబడిన యట్టి
యెల్ల జగమును గూడ నయ్యెడఁ గనియెఁ గి
రీటి దేవదేవుని యా శరీరమందుఁ
దా నొకేచోట నున్నట్టిదానిగాఁగ.

విజయుఁ డంతట విస్మయావిష్టుఁ డగుచు,
నొడలి వెండ్రుకల్ కడు గగుర్పొడుచుచుండ,
దాను దేవునికి శిరంబుతో నమస్క
రించి, చేతులు మోడ్చి, యీ రీతిఁ బల్కె.

### అర్జునుని వాక్యము

దేవ, కనుచుంటి నిదె సర్వదేవతలను,
బహుళ భూతసంఘంబును, బ్రహ్మను, గమ
లాసనస్థు, నీశు, ఋషుల నందఱి, మఱి
దివ్యులగు నురగులను నీ దేహమందు.

ని, న్ననేకబాహూదరనేత్రముఖు, న
నంతరూపుని గనుచుంటి నన్నియెడల:
ఆదియును, మధ్యమును, నీకు నంతముఁ, గని
పింపలేదు, విశ్వేశ్వరా, విశ్వరూప.

గద కిరీటంబు చక్రంబు గలిగి, మండు
ననలసూర్యులవలె నంతటను వెలుఁగుచు,
నరయరాని తేజోరాశి వైన నిన్ను,
నప్రమేయు, నే నెల్లెడ నరయుచుంటి.

ఎఱుఁగఁ దగుఁ బరమాక్షరం బీ వగుదువు;
పరనిధానంబ వీ వీ ప్రపంచమునకు;
సకల శాశ్వత ధర్మరక్షకుఁడవును, స
నాతనుండవు, నవ్యయుండ, వని యెంతు.

ఆదిమధ్యాంతరహితు, ననంతభుజు, న
నంతవీర్యుని, సూర్యశశాంకనేత్రు,
దీప్తపావకవదను, స్వతేజమున జ
గంబునెల్లఁ దపించు నిన్ గాంచుచుంటి.

దివికి భువికిని మధ్యప్రదేశము, మఱి
యఖిలదిశలు నీచేతనే వ్యాప్త మయ్యె;

అద్భుతము నుగ్రమైన నీ యాకృతి యిది
కాంచి, ముజ్జగంబులు వ్యథం గనె మహాత్మ.

సురతతులు వీరు నీయందుఁ జొచ్చిరి; భయ
మునను గొందఱు చేల్మోడ్చి మ్రొక్కి రిదిగో!
సిద్ధులును మహర్షులు స్వస్తి చెప్పుచు, నిను
స్తుతియొనర్తురు పుష్కల స్తోత్రములను.

రుద్రు, లాదిత్యులును, పితరులు, వసువులు,
నశ్వినులు, విశ్వులు, మరుత్తు, లసుర యక్ష
సాధ్య సిద్ధ గంధర్వ వ్రజంబులెల్ల
నరయుచున్నారు విస్మితు లగుచు నిన్ను.

ఓ మహాభుజా, పెక్కు బాహులుఁ, బదములు,
ముఖములున్, నేత్రము, లుదరంబులుఁ, గరాళ
దంష్ట్ర, లూరువుల్, గల మహా తావకాకృ
తిని గని భయంపడితిమి నేనును జగములు.

నింగి నొరసి, దీప్తమయి పల్ రంగులూని,
నోర్తెఱచి, మండు పెద్ద కన్నులును గలిగి
యున్న నిన్నుఁ గన్గొనుచు విష్ణూ, మదాత్మ
భయముపడె: ధృతియు, శమముం బడయనంటి.

భయదదంష్ట్రలుం, బ్రళయపావకసమభవ
దీయముఖములుం గని, దిశల్ తెలియనంటి;
శర్మమునుగాంచనంటిఁ: బ్రసన్నుఁడవుగాఁ
గమ్ము నీవు దేవేశ, జగన్నివాస.

సర్వమేదినీనాయకసమితితోడ
ధార్తరాష్ట్రులు వీరలందఱును, మఱియు
ద్రోణుఁడును, భీష్ముఁ, డల్ల కర్ణుండు, మఱియు
నస్మదీయు లౌ ముఖ్యయోధాళి కూడ,

వేగమ కరాళదంష్ట్రలన్ వెఱపు గొలుపు
చున్న నీ నోళ్లలోఁ జొచ్చుచున్నవారు;
కొందఱు రదాంతరములఁ జిక్కుపడి, తలలు
నున్నమగుచును గనఁబడుచున్నవారు.

ఉదధిలోనికె నదులయం దున్న బహుజ
లప్రవాహముల్ చొచ్చెడి లాగున, నర
లోక వీరులు వీరు పెల్లుగను మండు
చున్న నీ నోళ్లలోఁ జొచ్చుచున్నవారు.

మిగుల మండెడు నగ్నిలో మిడుతలు కడు
వడిగ మడియుటకై యెట్లు పడునో, యట్లె
కడు వడిగ లోకులుం గూడఁ బడుచు నున్న
వారు మడియుటకై నీదు వదనములను.

మండు నోళ్లతోడ సమస్తమనుజుల గ్రసి
యించి; యంతటన్ నాకెద వీవు; తావ
కోగ్రకాంతి తేజముల విష్ణూ, జగంబు
నెల్ల వ్యాపించి, కడుఁ దపియించుచుండె.

ఎఱుఁగఁ జెపు: ముగ్రరూపుఁడ, వెవఁడ వీవు?
దేవవర మ్రొక్కెదను: బ్రసాదింపుము నను;
నాద్యుఁడ వగు నిన్నెఱుఁగంగ నభిలషింతు:
నే నెఱుంగనే లేనంటి నీ ప్రవృత్తి.

## శ్రీభగవంతుని వాక్యము

లోకముల నాశనంబు నల్పుటను వృద్ధి
గనిన కాలమున్ నేను; లోకములఁ జంప
నిపుడు పూనితి: నీవు లేవేనియుఁ బ్రతి
సైన్యయోధులు వీ రెల్లఁ జచ్చువారె.

కాన లెమ్ము: శత్రుల గెల్చి, కనుము కీర్తి;
యనుభవింపు సమృద్ధ రాజ్యమును నీవు;
వీరు నా చేత నిహతు లైనారు మున్నె:
యర్జున, నిమిత్తమాత్రుండ వగుము నీవు.

మున్నె నా చేత నిహతు లై యున్న యట్టి
ద్రోణు, భీష్ము, సైంధవుని, గర్ణుని, మిగిలిన
యోధజనులఁ జంపుము; భీతి నొందకు; మని
సలుపు: రణమున జయ మొందఁ గలవు నీవు.

## సంజయుని వాక్యము

మాధవుం డాడినట్టి యా మాట విని, కి
రీటి వణఁకుచుఁ గేల్మోడ్చి కృష్ణునకు న
మస్కరించి, మాటికి భయంపడుచు, నమ్రుఁ
డగుచు, గద్గదస్వరముతో మగుడఁ బలికె.

## అర్జునుని వాక్యము

తగు: హృషీకేశ, నీ ప్రకీర్తనముచేత
జగతి హర్షించె, మిగుల రంజనము గాంచెఁ;
బఱచి రసురులు దెసలకు భయము కతన;
మ్రొక్కి రదె సర్వసిద్ధసమూహములును.

ఘనతముఁడవు, బ్రహ్మకు నాదికర్త, వో మ
హాత్మ, నీ కేల మ్రొక్కరు? కీవనఁగను సద
సత్తులకుఁ బరందనగు నక్షరుఁడ వగుదు
గద యనంత, దేవేశ, జగన్నివాస!

ఆదిదేవుండవు, పురాణుఁడైన పురుషుఁ
డవు, పరంధాముఁడవును, వేత్తవును, వేద్యుఁ
డవు, జగతికిం బరనిధానమవు నగుదు; వ
నంతరూప, నీచేఁ దతం బఖిల జగము.

వాయువు, యముండు, నగ్నియు, వరుణుఁడు, శశి
యును, బ్రజాపతి, ప్రపితామహుఁడును నీవ:
యే నొనర్చెద వే నమస్కృతులు నీకు,
మరల మరల నమస్సు, నమస్సు నీకు.

మ్రొక్కుదును నీకు నో సర్వ, ముందు వెనుక
లందు, సర్వత్ర మ్రొక్కుదు నయ్య; నీ వ
నంతవీర్యామితపరాక్రమాన్వితుండ;
వఖిలమును బొంది, యఖిలంబు నగుదు వీవు.

ఇట్టి నీ మహిమంబును నెఱుఁగక సఖుఁ
గాఁ దలఁచి నెయ్యముననో, ప్రమాదముననో,
యోయి కృష్ణ, యో యాదవా, యో సఖ యని
యవినయంబుగా నే నన్న యందులకును,

అచ్యుత, విహారశయ్యాశనాసనముల
నొక్క నీ కడనో, యొరుల యెద్దనో, యప
హాసముగ నవమానించినందునను, క్ష
మింపఁగా వేఁడెదను నప్రమేయ నిన్ను.

ఈ చరాచరజగములకెల్ల నీవె
తండ్రివిని, బూజ్యుఁడవుఁ గురూత్తముఁడవగుదు;
నీకు సముఁడును లేడు ముల్లోకములను:
మఱి యధికుఁ డెవ్వఁ డప్రతిమప్రభావ?

కాన నీశుఁడ, వీడ్యుఁడ, వైన నీకు
సాగి మ్రొక్కి, దేవ, నినుఁ బ్రసన్నుఁ జేసి
కొందుఁ: బ్రియుఁడవు, నా ప్రీతి కొఱకు నను స
హింపఁ దగు, సుతుం బిత, హితున్ హితుఁడును బలె.

ఎన్నఁడును జూడనిది చూచి, హృష్టుఁడ నయి
నాఁడ; భయముచే వ్యథ చెందె నా మనస్సు;
చూపు నాకు దేవేశ, నీ రూపము నె; ప్ర
సన్నుఁడవు కమ్ము దేవ, జగన్నివాస.

మునపటి విధంబునఁ గిరీటమును, గద, కర
మందు చక్రముం, గల నిన్ను నరయఁ దలఁతు;
వేయి భుజములు గలిగిన విశ్వరూప,
యా చతుర్భుజాకృతితోనె యలరు మిపుడు,

### శ్రీ భగవంతుని వాక్యము

కాంతిమయ, మాద్యము, పర, మనంతము నగు
నాదు విశ్వరూప మిది ధనంజయ, యొరు
లెన్నఁడును జూడ లేదు; నీ కిపుడు చూపి
నాఁడ నా యోగమునఁ బ్రసన్నత వహించి.

పాండుతనయ, యీ నాదు రూపమును నీవు
గాక యన్యులు మానవలోకమునఁ గ
నంగ లేరు వేదాధ్యయనముల, యజ్ఞ
ములఁ, గఠినతపముల, దానములఁ, గ్రియలను.

ఇట్టి నా ఘోరరూపంబు నీవు చూచి,
వ్యథయు వలదు: విమూఢభావమును వలదు:
భీతి విడనాడి, మనమునఁ బ్రీతిఁ బూని,
యరయుమా నాదు రూప మయ్యదియె మరల.

### సంజయుని వాక్యము

పార్థుతో నధోక్షజుఁ డిట్టి భంగి పలికి,
చూపె నాపగిదిం దన రూపు మరల:

ఆ మహాత్ముఁడు సౌమ్యదేహమును మగుడఁ
దాల్చి, భీతుఁ డౌ క్రీడి నోదార్చె నపుడు.

### అర్జునుని వాక్యము

మానుషంబును సౌమ్యంబు నైన నీదు
రూపమును దీనిఁ జూచి సరోజలోచ
నా, యిపుడు తేటపడియెను నా మనంబు;
ప్రకృతి నొందితి; మఱియు నిర్భయుఁడ నైతి.

### శ్రీ భగవంతుని వాక్యము

నీవు మామకరూపమున్ దేనిఁ జూచి
నాఁడవో యట్టి యా రూపు చూడ మిగులఁ
గష్టము సుమి: యా రూపముం గాంచుటకును
వాంఛపడుచును నుంద్రు దేవతలు గూడ.

ఏ విధంబు గాఁగను నను నీవు చూచి
నాఁడవో యా విధాన నన్ జూడఁ దరము
వేదములఁ గాదు, తపములఁ గాదు, యజ్ఞ
ములను గాదు; మఱియు దానములను గాదు.

పరులఁ దపియింపఁజేయు బీభత్స, యిట్టి
నను యథార్థంబుగాఁగ ననన్యభక్తి
కతముననె యెఱుంగ నగును, గనుఁగొనంగ
నగును, మఱియుఁ బ్రవేశింప నగును జుమ్ము.
నా కొఱకుఁ గర్మముల్ చేసి, నన్ను గతిగ
నెంచి, సంగంబులన్ విసర్జించి, సర్వ
భూతములయందు నిర్వైరుఁడై తనర్చు
నాదు భక్తుఁ డెవ్వఁడో వాఁడు నన్నుఁ బొందు.



## దాంపత్యము—మాతృపూజ

భాగవతుల పూర్ణయ్య గారు

మనసులోనీ మనసు
మాటలోనీ మాట
పాటలోనీ పాట
మా జంట
చూపులోనీ చూపు మా వలపు.

కాటుక చీకట్లగలిసి వెన్నెలనవ్వ
ఆపె కనుపొత్తులో పాపనైపోదు,
చేయెత్తి నావంక చేరి పిలువగ ఆమె
చేతిలో చేమంతి చెండునైపోదు!

మనసు వీడని యామె మాట మాధురిసీధు
సరసిలో మునుక లిడి, సల్పుదును మాతృవిధి
పూజలను—మా ప్రేమపూతజలజార్చనల
మావలపు మాటలో మాధురుల్ చేది
మా చూపు నవ్యత మార్గముల్ కాంచి
స్వచ్ఛవాయువు వీచి
స్వైరజీవన మిచ్చి
మముగన్నతల్లి మా మవ్వంబుపెంచు!
ప్రేమ వెన్నెల వీట
ప్రణయగాథల పాట
అర్థాంగి యను మాట కర్థమే లేదోయి,
నా పూర్ణదేహంబు నాయింతి
నా నిండుడెందంబు నా రాణి!

# నైషధకథాసామ్యము

బండారు తమ్మయ్య గారు

శ్రాన్తైర్వేత్యవతాఽమూర్తిః గవితాథ ప్రాసనాఖ్యాసి శ్రీ
బ్రహ్మేం ప్రాదిను తేక్వరాన్నినసుధాపాథోధివీచీఘటాః
జిహ్వానూనవిహారధీరకలహంసీభూలచేతస్కః స
ద్బుద్ధిస్త్రష్టుః భజియింతు నైషధమహాంధ్రగ్రంథసంధాయకన్.

"నైషధమ్ విద్వదౌషధమ్" అను ప్రతీతి సుప్రసిద్ధము. ఈ నానుడి సంస్కృతభాషలో నుండుటచే నీ ప్రశస్తి శ్రీహర్షకృతమయిన సంస్కృతనైషధమునకే మై యుండు నని పలువుర యభిప్రాయము. అయినను నీ శ్లోకపాదముతోఁ గలిసి "కాశీఖండమయఃపిండమ్" అని కూడ వాడుకలో నుండుటచే స్కాంద పురాణాంతర్గత మయిన కాశీఖండమునకును ప్రౌఢకావ్య మయిన నైషధమునకును బొత్తు గూర్చిన యీ ప్రతీతి సంస్కృత రచనములంగూర్చి యేర్పడిన దనుటకంటె నేకకవికృతము లయి పొత్తు గాంచిన శ్రీనాథుని తెలుఁగు గ్రంథములఁ గూర్చి యేర్పడిన దనుట యుచితముగా నుండు నని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారు తమ శృంగారశ్రీనాథములో వ్రాసి యున్నారు. శాస్త్రిగారి యభిప్రాయము సమంజసముగనే కాన్పించు చున్నది గాని యాంధ్ర గ్రంథములఁ గూర్చిన ప్రతీతి సంస్కృతభాషలో రచింపఁబడుటయు శ్రీనాథుని కాశీఖండ మయఃపిండముగాఁ గాక యమృతఖండముగా నుండుటయు నిందులకు బాధక మగునేమో యని నా తలంపు. ఏది యెట్లున్నను శ్రీహర్షుని సంస్కృతనైషధమున కున్నంత గౌరవము శ్రీనాథుని యాంధ్రనైషధమునకుఁ గూడఁ గల దనుట నిర్వివాదాంశము. కళాప్రపూర్ణులు శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రి గారు విద్వదౌషధ మనఁబడు శ్రీహర్షనైషధమును శ్రీనాథుఁడు విద్వదమృతముగాఁ జేసినాఁ డని యాఁతని శృంగారనైషధమును బ్రశంసించినారు. ఔషధములు కటుకములుగా నుండుట సర్వసామాన్యము. కావున నమృతోపమానములగు మధుశర్కరాద్యనుపానములతో వానిని సేవించు చుందురు. శ్రీనాథునినైషధ మిట్లు విద్వదమృతముగా నున్న దని పండిత ప్రకాండులు ప్రశంసించినను, విదుషీమణి శ్రీమతి బిక్కిన సుదర్శన రామలక్ష్మీకాంతమ్మ గారు నైషధకథావిషయమున శ్రీహర్షుఁడు గూర్చిన యమృతోపమానమును శ్రీనాథుఁడు తన గ్రంథమున నుపేక్షించి రసపోషణమున న్యూనతఁ గలిగించినాఁ డని యాక్షేపమొనర్చిరి. ఆంధ్రపత్రిక శుక్లసంవత్సరాది సంచిక—హర్షనైషధము—శ్రీనాథుని యాంధ్రీకరణము" అను వ్యాసమును జిత్తగించునది. ఆంధ్ర సోదరీమణు లాంధ్రగీర్వాణములందు సమ్యక్పరిశ్రమ మొనర్చి విద్వదౌషధములు విద్వదమృతములు నని వినుతికెక్కిన యిట్టి యుద్గ్రంథములపయి విమర్శనములు వెలువరించుట యాంధ్రాభ్యుదయసూచక మయి యాంధ్ర సోదరుల కత్యంత ముదావహ మగు చున్నది. అందునను మన సోదరీతిలకముయొక్క వ్యాస ముభయభాషలందును నామె యొనర్చిన ప్రబల పరిశ్రమమున కాదర్శక మయి యామె ప్రతిభావైదుష్యములను బాగుగాఁ బ్రకటించు చుండుట కే నెంతయు సంతసించు చున్నాను. కాని శ్రీనాథకవిసార్వభౌమునియెడ నామె చేసిన యాక్షేపము మాత్రము విజ్ఞానక్షమముగాఁ దోఁచుట లేదని విన్నవించుటకుఁ జింతిల్లు చున్నాను. "శ్రీనాథుని యాంధ్రీకరణ" మని పే రిడినను శ్రీలక్ష్మీకాంతమ్మ గారు తమ విమర్శన వ్యాసమందుఁ బ్రతిపాదించిన విషయ మొక్క నైషధకథాసామ్యమున శ్రీనాథుఁడు పేర్కొనిన యుపమానమును గూర్చియే కాని యాతని యాంధ్రీకరణ విధానమును గూర్చి కాని యందలి బాగోగులను గుఱించి కాని కాదు.

శ్రీహర్షుఁడు రసాత్మక మగు తన కావ్యమునకుఁ బవిత్రతారసాస్వాద్యత్వములు రెంటను గూడ నమృతముతో నుపమానము జెప్పియుండఁగా శ్రీనాథుఁ డట్టి యమృతోపమానమును వీడి "నిర్మల నిజకథాఽనిమిషకల్లోలినీ క్షాళితాఖిల జగత్కల్మషుండు" అని దేవనదీసామ్యమును జెప్పె ననియు నది మహాకావ్యరచనకు రసపోషణమునఁ గొఱంత యనియు శ్రీమతి గారి విమర్శనసారాంశమై యున్నది.

శ్రీహర్షుఁడు కావ్యాదిని బ్రథమశ్లోకమునందే "నిపీయ యస్యక్షితి రక్షిణః కథా। స్తథాద్రియంతే న బుధా స్సుధా మపి" అనియు నా వెంటనే ద్వితీయశ్లోకమున "రసైః కథాయస్య సుధావధీరిణీ" అనియు వ్రాసి, నలకథకు సుధతో సామ్యమునే గాక యాధిక్యమును గూడ సూచించినాఁడు. ఏ ధరణీశ్వరుని కథలను గ్రోలి దేవత లమృతముపయి రుచినిగూడ మఱచుచున్నారో, యెవని కథ యాస్వాద్యత్వమున సుధనుగూడ మీఱుచున్నదో యని చెప్పినప్పుడు నలకథకు సుధాధిక్యమే ప్రతిపాద్య మగు చున్నది. కాని యీ యాత్కృష్ట్యము మాధుర్యాస్వాద్యత్వముల విషయమున మాత్రమే యనుట విస్పష్టము. తరువాత "కర్కోటకస్య నాగస్య దమయంత్యా నలస్యచ। ఋతుపర్ణస్య రాజర్షేః కీర్తనం కలినాశనమ్" అను పంచమవేదోక్తిని బురస్కరించుకొని "పవిత్రమత్రాను తేజగద్యుగే। స్మృతా రసక్షాళన ఏవ తత్కథా। కథం న సా మద్గిరమావిలామపి। స్వసేవినీమేవ పవిత్రయిష్యతి।" (రసక్షాళనముచేతనుం బలె స్మరణమాత్రముననే యీ కలియుగమున లోకమును బవిత్ర మొనర్చు నీ చరిత్రము తన్ను సేవించెడు నా వాణి (నొకవేళ నపవిత్ర మయిన దయినను) నేల పవిత్రీకరింపకుండును?) అని మూఁడవశ్లోకములో నీకఁ బావనత్వమును గూర్చి తలపెట్టి శ్రీహర్షుఁ డా విషయమున నలకథకు దేవనదీసామ్యమునే యుద్దేశించినాఁ డని నా యభిప్రాయము.

ఇందులకు శ్లోకమందలి "స్మృతా, రసక్షాళన యేవ, ఆవిలా మపి" అను శబ్దములు సాధకములు. క్షాళనముచే మాలిన్యము వెడలించి మలిన పదార్థమును నిర్మల మొనర్చు ధర్మము సాధారణముగా జలమునకే కలదు. ఇక స్మరణమనను, సేవనమనను మానవుని భావన మొనర్చు ధర్మమునందుఁ గూడ గంగానదికిఁ గల ప్రసిద్ధి యప్రతిహతము. అమృతమున కట్టి ధర్మ మప్రసిద్ధము. ఎంత మధురిమ గలిగినను క్షాళన విషయమున నది నిరుపయుక్త మగుట చెప్ప నక్కఱయే లేదు.

"(శ్రీ నాథుఁడు) రసక్షాళనా పవిత్రత్వమును వెల్లడించుటకయి యమృత సామ్యమును జెప్పక దేవనదీ సామ్యమును నలకథకుఁ జెప్పె నన్నచో నిట్టి సామ్యమును శ్రీ హర్షుఁ డొక్కసారి యైనను నుడువక పోవుటయే కాక మొదటి రెండు శ్లోకములలోను గూడ నమృతము నేల పేర్కొనవలెను? రసాత్మక మగు మహా కావ్యమునకు నమృతసామ్యమును వీడి దేవనదీ సామ్యమును జెప్పుటలో రసవిశేషము పొసంగి యున్నదా?"

"హర్షకవి రసభరిత మగు తన కథలో రసపోషకముగఁ బవిత్రత్వాస్వాద్యత్వములు ప్రకాశించునటుల నుపమానమును జెప్పం దలంచి నలకథ సర్వరసోత్తమం బగు సుధనుగూడ మీఱు చున్న దని బుధజన సమ్మతంబుగాఁ జెప్పియుండెను."

"ఐనను అమృతమున కపవిత్రము లేకుండుటయేగాక పవిత్రత్వమును, విశేష రసాస్వాద్యత్వమును కల వని నిస్సందేహముగఁ జెప్పవచ్చును" అను శ్రీకాంతమ్మగారి వాక్యములు శ్రీహర్షుఁడు పవిత్రతావిషయమునఁగూడఁ మూఁడవశ్లోకములో సుధాసామ్యమునే గర్భితముగా నుద్దేశించె నని యామె యభిప్రాయ మయినట్లు వ్యక్త మొనర్చు చున్నవి. కాని యది సరికాదని నా యాశయము. ఈ శ్లోకములో శ్రీహర్షుఁడు నిర్దేశించినది దేవనదీసామ్యమే యని నేను పైని జెప్పిన కారణములనుబట్టి తెలియఁగలదు. అందుచే శ్రీనాథుఁడు చెప్పిన స్వర్ణదీసామ్యము శ్రీహర్ష మతానుగుణమే గాని మూలవిరుద్ధముగ రసపోషణ వ్యతిరిక్తముగఁ గైకొనినది గా దని మనవి చేయు చున్నాఁడను. శ్రీనాథుని యాంధ్రీకరణము శ్రీహర్షనైషధమునకు యథామూలముగ లే దనుట నిర్వివాదాంశము. ఇతని భీమఖండ కాశీఖండాదులుగూడ నట్టివే. అతని యాంధ్రీకరణము కవిత్రయమువారి భారతాంధ్రీకరణముకంటె మూలమునకుఁ గొంచె మెక్కువచేరువగ నుండునే కాని కేవల మూలానుసరణముగ నుండదు. అందునను నీతఁడే మొదటి మూఁడు శ్లోకములలోని భావములను మఱింత సంగ్రహముగ రెండు సీస పాదములలోఁ దేర్చి వేసినాఁడు. అట్లొనర్చుటలో 1, 2 శ్లోకముల లోని "నల సితచ్ఛత్రిత కీర్తిమండల| స్సరాశి రాసీ న్మహసాం మహోజ్జ్వలః॥" "సువర్ణదండైక సితాతపత్రిత జ్వలత్ప్రతాపావళి కీర్తి మండలః॥" అను 3, 4 పాదములను మాత్రము "తపనీయదండైక ధవళాతపత్రి తోద్దండ తేజఃకీర్తి మండలుండు" అని సీసపద్య ప్రథమపాదముగాఁ దెలిగించి 1, 2 పాదములలోని సుధాధవళీకృత్వవిషయమును విడిచినాఁడు. గంగానదీ జలములు పయిని జెప్పినట్లు పవిత్రీకరణవిషయమునఁ బ్రసిద్ధము లగుట యట్లుండ, మాధుర్యవిషయమున సుధాతిరిచ్యములో సుధాతుల్యములో యగుటఁగూడ విఖ్యాతవిషయము. అమృతత్వ, శీతలత్వ, పావనత్వాదిగుణములు వానికి స్వతస్సిద్ధములు. కావున నలకథకు దేవనదీసామ్యమును జెప్పినప్పుడు పవిత్రత్వ, రసాస్వాద్యత్వములు రెండునుగూడఁ బ్రతిపాదింపఁబడినట్లె గ్రహింపఁదగును. సుధాసామ్య మొక్కటిమాత్రమే చెప్పినచో నాస్వాద్యత్వ మొక్కటే గాని యిట్టి గుణవిశేషములన్నియు గ్రాహ్యములు కాఁజాలవు. మఱియు నమృత మొక్క దేవలోకవాసులకు మాత్రమే లభ్య మై వారినిమాత్రమే ధన్యులను గావించినది. గంగ యట్లుగాక ముల్లోకములకుఁ గూడ ధన్యత్వమును గూర్చినది. కావున నమృతముకంటె గంగయే గుణాధిక్యముగలిగి నలకథతో నెక్కుడు సామ్యమును బొందియున్నది. అందుచేతనే శ్రీనాథుఁడు శ్రీ హర్షునిభావములను గర్భీకృతమొనర్చుచు స్వర్ణదీసామ్యముతో సంగ్రహముగ నొక్క పాదమే రచించె నని తోఁచు చున్నది.

శ్రీహర్షుఁ డెంత పండితుఁ డయినను నౌచిత్యమును మీఱి నలదమయంతుల సంభోగ శృంగారమును బచ్చిగా వర్ణించె ననియు నట్టిపట్టుల నాతనివాణి యశ్లీలతాజుష్టమయి మలినీకృత మయినది యనియుఁ గొందఱు విద్యాశేఖరులు తలంచు చున్నారు. దీని సామంజస్యమునుగూర్చి చర్చించుచు నా మిత్రులు శ్రీ ఇవటూరి సుందయ్యగారు ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికలో "నైషధరచనా తత్త్వము" అను వ్యాసమును బ్రకటించి యున్నారు. ఈవిషయ మెట్లున్నను శ్రీ హర్షుఁడుగూడ స్వవినయద్యోతకముగ నయినను "మద్గిర మావిలా మపి" అని తనవాణికి మాలిన్యము నా శంకించి కొని తత్పరిహారసూచకముగ నలకథ కౌత్కృష్ట్యము నాపాదించి యున్నాఁడు. గంగా సలిల సేవనమున మాలిన్యరాహిత్యముండుట యను శ్రుత సంప్రదాయ మయి యున్నది. యవనతరుణీసాంగత్యమున నపవిత్రతను బొరసిన జగన్నాథపండితరాయలు కాశీక్షేత్రమున నొకనాటి మధ్యాహ్నసమయమున నా యవనకాంతా సహితుఁడై నిద్రించుచుండఁగా శ్రీమ దప్పయదీక్షితులుగా రాతనిఁ గాంచి చూచియుఁజూడనట్లుగ "కిం నిశ్శంకం శేషే, శేషే వయసః సమాగతో మృత్యుః" అను నర్ధశ్లోకమున నర్మోక్తిగ నిందింపఁగాఁ బండితరాయలు "అథవా సుఖంశయీథాః, నికటే జాగర్తి జాహ్నవీ జననీ" అని యుత్తరార్థమును బూరించె ననియు నైతిహ్యము కలదు. పై శ్లోకమునకు వసురాయల యాంధ్రీకరణము.

> ముగిసెఁ బ్రాయము మృత్యువు మొగిసె నకట!
> యోట లేకిప్పుడా నిద్ర యోరి జీవ!
> అయినఁ గొద వేమి నిదురింపు మోద మలరి
> కడనె యున్నది తల్లి గంగాభవాని.

తరువాతఁ బండితరాయలు గంగాలహరి యను స్తోత్రరాజమున స్తుతింపఁగా గంగాభవాని శ్లోకమున కొకమెట్టు చొప్పునఁ బొంగివచ్చి యాతనిని, లవంగి యనునాతని యవననాయికను స్పృశించి వారిని బవిత్రులఁ గావించె ననియుఁ జెప్పుదురు. ఇందలి యాథార్థ్య మెట్లున్నను గంగాలహరి యందలి యాక్రింది శ్లోకములు మాత్రము పవిత్రీకరణవిషయమున గంగానదికిఁ గల యౌత్కృష్ట్యమునకుఁ బ్రబలనిదర్శకములుగ నున్నవి.

స్మృతిం యాతా పుంసా మకృతసుకృతానామ పిచయా
హరత్యంతస్త్రంద్రాం తిమిరమివ చంద్రాంశు సరణిః
ఇయం సాతే మూర్తిః సకల సురసంసేవ్య సలిలా
మమాంతస్సంతాపం త్రివిధ మపి పాపంచ హరతామ్.

అపి ప్రాజ్యంరాజ్యం తృణమివ పరిత్యజ్య సహసా
విలోలద్వానీరం తవ జనని తీరం శ్రితవతామ్
సుధాతస్స్వాదీయ స్సలిలభర మాతృప్తి పిబతాం
జనానా మానందః పరిహసతి నిర్వాణ పదవీమ్.

కృతక్షుద్రాఘౌఘా నథ సపది సంతప్త మనసః
సముద్ధర్తుం సంతి త్రిభువనతలే తీర్థనివహాః
అపి ప్రాయశ్చిత్త ప్రసరణ పథాతీత చరితా
న్నీరాన్నూకీకర్తుం త్వ మివ జనని త్వం విజయసే.

"స్మృతింయాతా" "సుధాతస్స్వాదీయ స్సలిలభరమ్" అను వాక్యములు నేను పైని జెప్పినట్లు గంగానదికి స్మరణమాత్రముననే పావనత్వమును గూర్చు సామర్థ్యమును, ఆ నదీజలములు మాధుర్యవిషయమున సుధాతిరిచ్యము లవుటనుగూడఁ బ్రకటించుచున్నవి. కావునఁ బయిశ్లోకమున శ్రీహర్షుఁడు నల కథకు గంగానదీ సామ్యమునే సూచించియుండుట స్పష్టము. వ్యాఖ్యాతృ సార్వభౌముఁడు మల్లినాథుఁడు ద్వితీయశ్లోకములో "రసైస్సుధావధీరిణీ" అను చోట "రసైః స్వాదైః" "ని. రసో గంధే రసాస్వాద ఇతి విశ్వః" సుధామవధీరయతి తిరస్కరోతీతి సుధావధీరిణీ" అని వ్యాఖ్యసేయుచు రసశబ్దార్థమున కచ్చట అనవసరమైన స్వాద శబ్దమును దెలుపు విశ్వనిఘంటూక్తి నిచ్చి యున్నాఁడు. ఇఁకఁ దరువాతి శ్లోకములో "రసక్షాళన మేవ" అనుచో "దేహధాత్వంబుపారదా ఇతి రసశబ్దార్థోక్తౌ విశ్వః" అని యిచ్చటఁ బ్రసక్తించు జలార్థమున కనువగునట్టి నిఘంటు ప్రమాణమును దెలిపినాఁడు. కావున నీశ్లోకమునఁ గవిచే నుద్దేశింపఁబడినది దేవనదీ సామ్యమే యని మల్లినాథుని మతముకూడ నై యున్నది. అట్లగుట శ్రీనాథుఁడు చెప్పిన దేవనదీసామ్యము శ్రీ కాంతమ్మగారు వ్రాసినట్లు రసపోషణమున వైరస్యమును గాక సారస్యమునే గూర్చుచు శ్రీహర్షమతసమ్మతమయి తనర్చుచున్న దని మనవి చేయు చున్నాఁడను. యథార్థనిర్ణయమున విజ్ఞులే ప్రమాణము.

---

# మృత్యుదేవత

వేంకట కోటీశ్వరులు గారు

వసుధపై మిత్తినా సమవర్తి సుండు
ధనికులని బీదలని విభేదమ్ము లేదు
చావువేలుపు నిశితదంష్ట్రలకు నెదుట
చిన్న పెద్ద యంతరువులు సున్న యెన్న.

ధరణిచక్రము నేలు భూధవులు మఱియు
కావ్యకల్పనమును జేయు కవివతంసు
లధికతరమగు సౌఖ్యంబు లనుభవించు
మనుజు లందఱునుం గూడ మడియవలయు.

పట్టువస్త్రాలె నిరతంబు గట్టి రంచు
నలరుసెజ్జలనే బండి రనిశమంచు
జాలి వహియించి విడువ దెచ్చటను గాని
మిత్తి సమవర్తి యగుట బ్రేమించు మివుల.

గండ్రగొడ్డలి జేబూని కర్షకుండు
పవలు రేయియు గడు గష్టపడుట జేసి
కడు బలిష్టములై నట్టి కండరముల
గూడ తుద కామె కాహుతి గూర్పవలయు.

వసుధ జననమ్ము నందిన ప్రాణతతులు
సర్వ మేనాడొ తప్పనిసరిగ నొకట
తనువు దొఱఁగంగవలయు తథ్యమ్ము గాగ
ఇతర పథ మేది గానరా దెచటనేని.

శత్రువుల నాజి జెండాడు శౌర్యగరిమ
వైరి నిర్మూలనాధిక పౌరుషంబు
యెం దడగిపోవునో మఱి యేమొ, మిత్తి
విక్రమ విహార మొనరించు వేళయందు.

నోట మాటలు లేక నెన్నుదురు జూపి
కంట దడిపెట్టు చుండి క్రీగంటి చూపు
బఱపుచును మిత్తివాతను బడును గాని
ఇతర పథ మేది గానరా దెచటనేని.

ధరణి క్షీరాన్నముల బెంచు తనువులెల్ల
తిరిపెమున జీవనము సేయు దేహములును
గూడ తుద కొకచోటికే గొంచుబోవు;
ఇతరపథ మేదిగానరా దెచటనేని.

కాన సమవర్తియే యగుగాదె మిత్తి;
ప్రాణు లన్నియు నసువులు బాయుచుండు
తనువు లన్నియు నశియించు గాని తుదిని
సత్ప్రివర్తన మొకటి విస్తరిలుగాక.




లేడీ ఇర్విన్‌సతి    ఇర్విన్ ప్రభువు    లేడీ విల్లింగ్డన్‌సతి    రాజప్రతినిధి విల్లింగ్డన్ ప్రభువు



మదరాసు ప్రభుత్వ ప్రధానమంత్రి గా॥ ది॥ బ॥ బొల్లిని మునిస్వామి నాయుడు గారు



మదరాసు ప్రభుత్వ ద్వితీయ మంత్రి
గా॥ పి. టి. రాజన్, బా రెట్ లా (ఆగ్జన్) గారు



మదరాసు ప్రభుత్వ తృతీయమంత్రి
గా॥ ది॥ బ॥ ఎస్. కుమారస్వామి రెడ్డియారు గారు



మదరాసు షెరీఫు ది॥ బ॥ ఏ. ఎం. ఎం. మురుగప్ప శెట్టియారు గారు

# సప్తర్షిమండలము — పూర్వఫల్గుని

కల్యాణానందభారతీస్వాములవారు

ఫాల్గున్యాం మార్గశీర్షేఽహ్ని దృష్టా స్సప్తర్షయో యుతాః
ఫల్గున్యా పూర్వయా నేత్రాగ్నిగగనేషు (౧౯౩౦) సమేకళా.
సప్తర్షీణాంతు యౌ పూర్వౌ దృశ్యేతే హ్యుదితౌ దివి
తయోస్తు మధ్యే నక్షత్రం దృశ్యతే యత్సమం నిశి.
ఋషయ స్తేన తిష్ఠంతి శతఘ్నం మాస రుద్రకం. (౧౧౦౦ మాసాః)
తతశ్చ భగణ స్తేషాం శాసభారాబ్ద సమ్మితః. (౨౭౦౦ సం)
యదాపురా మఘాస్వాసం స్తదా కృష్ణో దివంగతః .
యస్మి న్కృష్ణో దివం యాత స్తస్మి న్నేవ తదాహని.
ప్రతిపన్నం కలేర్యుగ మితి పరాశరో ఽబ్రవీత్
చకారనుస్ఫుటం తత్తు కల్యాణానంద భారతీ.

ఆసేతుశీతనగవ్యాప్తం బగు భరతవర్షంబున సృష్ట్యాదినుండియు నేఁటి వఱకు నవిచ్ఛిన్నపారంపర్యక్రమంబున నభివృద్ధిచెందుచుండిన వైదిక ధర్మానుయాయు లందఱును దమసఁ బవిత్రతమసమయంబగు వివాహకాలం బున ధ్రువనక్షత్రమును సప్తర్షిమండలమును దర్శింపవలసిన విధి యున్నటుల వైవాహికవిధులవలనను నాచారమువలనను లెస్సగఁ దెలిసికొనియున్న విష యమే. ఇట్టి విధియందలి యపూర్వవిషయ మెట్టు లేరిచే నూహింపఁబడినను దృష్ట విషయ మొక్కటి యిందు లోకము గ్రహింపవలసియున్నది. అట్టి దృష్టవిషయ గ్రహణయోగ్యత కనువగునటుల నొకింత లోకసంగ్రహమునకై వ్యక్తీకరింపు చున్నారము.

## ధ్రువనక్షత్రము

ధ్రువనక్షత్ర ముత్తరదిక్కున నిశ్చలముగ నిలిచియుండి సర్వలోకములను సర్వకాలములను దిక్కుల నప్రతిహతంబుగ బోధించుటయే కాక సకల జ్యోతి ర్మండలమును నియతమగు స్థితియం దునిచి నియతకాలములందు నియతమగు గతు లతోఁ జరింపునటుల నాకర్షింపుచున్నయది. ఇట్టి యాకర్షణశక్తి ధ్రువునియం దున్న టులఁ దెలిసికొనుటకు నయస్కాంతములో నలరారు దిక్సూచికాయంత్రమఁ (Mariner's Compass) ప్రత్యక్షనిదర్శనము. ఈ యంత్రమునం దొకకొనను నెల్లపు డును మన యుత్తరధ్రువుఁ డాకర్షింపు చుండును. దానంజేసి యా కొనకు నుత్తర ధ్రువమని (North pole) పేరుగల్గె. ఇతరమగు రెండవకొనను దక్షిణధ్రువనక్షత్ర మాకర్షింపుచుండును. దానంజేసి యాకొనకు దక్షిణధ్రువ మని (South pole) పేరుగల్గె. ఇట్టి ధ్రువద్వయ ముత్తరదక్షిణ దిక్కులనుండి సకలలోకములఁ జక్కఁగ నాకర్షింపుచు నియతస్థితులయందు నునుచుచున్నటుల సూర్యసిద్ధాంత మిట్లు బోధింపు చున్నయది.

మేరో రుభయతో మధ్యే ధ్రువతారే నభఃస్థితే
నిరక్షదేశసంస్థానా ముభయే క్షితిజాశ్రయే. అధ్యా. ౧౨ శ్లో. ౪౩.

ఈ రెండు నక్షత్రములయొక్క స్థిరతను బోధించు ధ్రువపదముచే నీ నక్షత్ర ములు వ్యవహరింపఁ బడుచున్నవి. అందు మనకు ప్రకృత ముత్తరధ్రువనక్షత్రము గణనీయము. ఏల యన నదియే ప్రకృతపు సప్తర్షిమండలములో సంబంధించి దృగ్గో చర మగుచున్నది.

## సప్తర్షిమండలము

సప్తర్షిమండల మన్ననో ధ్రువనక్షత్రము చుట్టునుఁ దిరుగుచున్నటులఁ జూడఁ బడుచున్నది. ఈ మండలమున నాలుగు నక్షత్రములు మంచపుకోళ్లవలె నుండి మూఁడు నక్షత్రము లొక తోఁకవలె నుండుటచేఁ బాశ్చాత్యులు దీనిని 'పెద్దయెలుగు' (Great Bear) అని పిలువసాగిరి. భారతవర్షీయు లన్ననో కశ్యపాదిసప్తర్షుల నిల యము లనియు నద్దానిచే సప్తర్షిమండల మనియుఁ బిలుచుచున్నారలు. సప్తర్షులన భారతభూమియం దతి ద్విజులకు మూలపురుషు లగు మహర్షు లని సంప్రదాయ విదులు గుర్తెఱిఁగి యున్నారలు. ఈ ఋషులు బ్రహ్మవిద్యాసాంప్రదాయప్రవర్త కులు గావున నట్టి బ్రహ్మవిద్యకు దగు కర్మయోగప్రారంభకాల మగు వివాహకాల మున నా ఋషులఁ దర్శించుట వారియొక్క సన్మార్గము ననుసరించి వారలవలె శాశ్వత పదవులఁ బొంద నిచ్ఛ జనింప తద్దర్శనము పవిత్రముగాఁ దలంపఁబడుచున్నది. మంచము కోళ్లవలె నుండు నాలుగింటిలో మొదట నుదయించు రెండు నక్షత్రము లును ధ్రువనక్షత్రములో నొక త్రిజ్య (Radius) వలె నుండును. అట్లుండి తిరుగు చుండుటచే నీ మండలముఁగూడ ధ్రువనక్షత్రమట్లు చలనరహిత మని కొలఁది రోజుల క్రిందటివఱకునుఁ బాశ్చాత్యులచేఁ దలంచఁబడుచుండెడిది. భారతవర్షీయు లన్ననో యీ మండలమునకు గతి కలదని తెలిసికొనుటచేతనే దీనిని ఋషిమండల మనిరి. "ఋషిగతౌ" అను ధాతువువలనఁ గల్గిన ఋషి యను శబ్దము "గతి కలది" యను నర్థమును స్ఫురింపఁజేయుచున్నది. ఋషు లన గతి కలవారని యర్థము. ఈ మండలపు గతి యతిసూక్ష్మ మగుటచే శాస్త్ర్యమును సుకరముగఁ దెలియఁ బడని రహస్య మీ ఋషినామముచే వ్యక్తీకరింపఁబడుచున్నది. ఈ మండలపు గతిని తెలిసికొనుటకుఁ గల విధానము పరాశరమహర్షిచే విష్ణుపురాణమున నిట్లు వక్కాణింపఁబడియున్నది.

"సప్తర్షీణాంతు యౌ పూర్వౌ దృశ్యేతే హ్యుదితౌ దివి
తయోస్తు మధ్యే నక్షత్రం దృశ్యతే యత్సమం నిశి.
తేన సప్తర్షయో యుక్తా స్తిష్ఠం త్యబ్దశతం నృణాం."

సప్తర్షులలో నాకాశమునందు మొట్టమొదట రెండునక్షత్రము లుదయింపుచుఁ జూడఁబడుచున్నవి. ఆ రెండిటియొక్క మధ్యమునుండి యే నక్షత్రము నిశయందు సమముగాఁ జూడఁబడునో యా నక్షత్రమునందు ఋషు లొక మానుషశతాబ్దము నిలిచియుందురు. అనఁగ పై రెండు నక్షత్రములనుఁ గలుపు సరళరేఖయొక్క మధ్య బిందు వశ్విన్యాదినక్షత్రములలో నే నక్షత్రముతో గగనమధ్యమందు సమాన రేఖయం దుండునో యా నక్షత్రమం దొక మానుషశతాబ్ద ముందు రనియు సామాన్యముగ వక్కాణింపఁబడియున్నది.

## ప్రకృతపుస్థితి

ప్రకృతమున గ్రీస్తు వెనుక 1930 సం॥రము డిసంబరు ఐదవ తేదీ శుక్ర వారమునకు సరియైన ప్రమోదూత సంవత్సర మార్గశీర్ష శుక్ల పూర్ణిమ. ఈ దివస మందు సప్తర్షిమండలము పూర్వఫల్గునీ (పుబ్బ) నక్షత్రమందుఁ బుష్కలముగఁ బ్రవేశించి యున్నట్లుఁ జక్కఁగ గగనమధ్యమున నగపడుచున్నయది. ఇతఃపూర్వ మించుమించుగ నొక శతాబ్దమునుండియు మఘానక్షత్రమునం దుండినట్లు శిష్టాచార ప్రతీతి సుప్రసిద్ధముగఁ దెలియవచ్చుచునే యున్నది. అంతియకాదు, మఘానక్ష త్రమునకును బూర్వఫల్గునీనక్షత్రమునకును నుండు ప్రదేశములో మూఁడు భాగములలో రెండు భాగముల పై నుండియు పూర్వఫల్గునీ నక్షత్రము వఱకును సప్తర్షిమండలము నడుచుటను మేము బాగుగ శోధించియున్నారము. ఇట్టి శోధన యందు సప్తర్షిమండలము మఘానక్షత్రమునుండి పూర్వఫల్గునీ నక్షత్రమునకుఁ బుష్కలముగ జరుగుట దృగ్గోచరమైనది. దానంజేసి సప్తర్షిమండలము గమనము లేక నిశ్చలముగ నున్నదను పాశ్చాత్యవాదము, ఈ మండల మితరగ్రహములట్లుగాక రాహుకేతువు లట్లు వెనుక కనఁగ మఘనుండి యాశ్లేషకు, యాశ్లేషనుండి పుష్యమికి నీతీరున నడుచుచున్నదను సువాదమును నంధప్రలాపములట్లు వారింపఁబడుచున్నవి.

## భగణము

సప్తర్షిమండలము "తేన సప్తర్షయో యుక్తా స్తిష్ఠం త్యబ్దశతం నృణాం" అను వచనమువలనఁ బ్రతినక్షత్రమునందు నూఱువత్సరము లుండునని తెలియ వచ్చుటచే నొక భగణమున కనఁగా నిరువదియేడు నక్షత్రములనుఁ జుట్టివచ్చుటకు

2700 వత్సరములు పట్టునని తెలియవచ్చెడిని. కాని పరాశరమహర్షిచే గ్రంథస్థము సేయఁబడిన విషయమును పరిశీలించినచో నొకింత సందియమునకుఁ గారణమయ్యెడిని. అదెట్లియన,

" తేషు పాశ్చిత్తే కాలే మఘా స్వాసన్ ద్విజోత్తమ
తదా ప్రవృత్తశ్చ కలిః ద్వాదశాబ్ద శతాత్మకః. "

సప్తర్షి మండలము పరీక్షిన్మహారాజుకాలమున మఘానక్షత్రమున నుండెననియు నప్పుడీ కలియుగము ప్రారంభమైనదనియుఁ బై శ్లోకమువలనఁ దెలియవచ్చుచున్నయది. కాని సప్తర్షి మండల మెప్పుడు మఘానక్షత్రమునఁ బ్రవేశించెనో యయ్యది నిర్వచింపఁబడియుండకపోవుటచే నీ సప్తర్షిమండలము మఘయందుఁ బ్రవేశించిన కొలఁదివత్సరములకుఁ గలి ప్రవేశమాయె నని యూహింపవచ్చును. కలిప్రవేశమున కించెకాలముముందుఁ బ్రవేశించి యుండుననునది ప్రకృతపుస్థితినుండి సుకరముగఁ దెలిసికొనవచ్చును.

## శోధకుల యదృష్టవిశేషము

కల్యాదియందు మఘానక్షత్రమందుండిన సప్తర్షి మండలము శోధకుల బాల్యదశయందు మఘానక్షత్రమునందే యుండుటయు నిప్పటికటనుండి చక్కఁగఁ బూర్వఫల్గునీనక్షత్రమునఁ జేరుటయు సుమారు ముప్పది వత్సరముల క్రిందట పరాశర వాక్యమును శోధకులు దిలకించుటయు నప్పటికి పాశ్చాత్యసవాదములు ప్రబలి యుండుటయు శోధకుల యదృష్టవిశేషమై యున్నయది. ఏలయనఁ బై పరిస్థితులచేఁ బరాశరమహర్షిచే సామాన్యముగ నుచ్చరింపఁబడిన గతియొక్క విశేషమును భగణకాలనిర్ణయపురస్సరంబుగ నిర్ణయించి వ్యవస్థ సేయుట కవకాశము లభించుటయు పుణ్యవిశేష మని ప్రాజ్ఞులు గ్రహింపఁగలరు.

## కల్యాది

కల్యాదినిఁ గూర్చి పురాణము లిట్లు బ్రశంసింపుచున్నయవి :

" యస్మి న్కృష్ణో దివం యాతః తస్మిన్నేవ తదాహని
ప్రతిపన్నం కలియుగం తస్య సంఖ్యాం నిబోధమే. "
" యదైవ భగవా న్విష్ణో రంశో యాతో దివం ద్విజ
వసుదేవ కులోద్భూతః తదై వాత్రాగతః కలిః. "

శ్రీకృష్ణభగవానులు దేహత్యాగమునఁ జేసి బ్రహ్మసాయుజ్యమునఁ బొందిన దివసమే కలియుగప్రవేశదివస మని పై వాక్యములవలన సుస్పష్టముగఁ దెలియవచ్చుచున్నయది. అట్టి తరుణమున ధర్మరాజని ప్రసిద్ధి కెక్కుచుండిన యుధిష్ఠిరుండు రాజ్యత్యాగముసేసి పరీక్షిన్మహారాజునకుఁ బట్టాభిషేక మొనర్చి మహాప్రస్థానమునకుఁ జనినట్లు పురాణేతిహాససాంప్రదాయములు వేయినోళ్ల ఘోషింపుచున్నవి.

గతే సనాతనస్యాంశో విష్ణో స్తత్ర భువో దివమ్
తత్త్యాజ సానుజో రాజ్యం ధర్మపుత్రో యుధిష్ఠిరః.
విపరీతాని దృష్ట్వాచ నిమిత్తాని హి పాండవః
యాతే కృష్ణేచకా రాథ సోభిషేకం పరీక్షితః.

ఇట్టి సుప్రసిద్ధమగు పౌరాణికవిషయములతో నొప్పుచుండు కల్యాదిని తన ప్రియశిష్యుం డగు మైత్రేయునకు విష్ణుపురాణ కథనావసర విషయమున బోధించు వ్యాజమున లోకమునకు వెల్లడిచేయుచు నట్టికాల మప్రతిహతముగ లోకులచేఁ గమనింపఁబడుటకుఁగాను జగద్గురువులగు పరాశరమహర్షు లక్కాలమున దృష్టమగు మఘానక్షత్ర సప్తర్షి మండల సంబంధము నుపదేశించియున్నారట. ఇట్టి సంబంధముచే స్థూలముగ నెల్లవారలునుఁ బై కార్యములనుండి యెంతకాలమునకు నిప్పటి తాము చరింపుచున్నారలో యొకింత సామాన్యముగఁ దెలిసికొన నవకాశము గలుగుచున్నది. ఇట్టికాలము సూక్ష్మదృష్టిచే నప్రతిహతముగ నార్యావర్తము నలంకరించుచున్నగణకశిరోమణు లందఱిచే స్థిరముగను నిస్సందేహముగను గ్రహస్థితులతోఁగూడ గ్రంథస్థము చేయఁబడియున్నది. ఋజువుచేయఁబడుచున్నది. ఇట్టి కల్యాదిగ్రహసంపత్తి ననుసరించియే నేటివఱకు నప్రతిహతముగ భారతభూమియందు సర్వదిశలయందును బంచాంగములు (Almanacs) గుణియింపఁబడుచున్నవి. ఇట్టి కల్యాది ప్రమాధిసంవత్సర చైత్రశుక్ల ప్రతిపత్ శుక్రవార మనియు నాఁటంగోలె నేటికి 5031 వత్సరములు గడచె ననియు ప్రకృతపువత్సరము 5032 వ వత్సరమనియును భారతదేశమున నెల్లరకు నప్రతిహతముగఁ దెలిసియున్నవిషయమే. దానంజేసి సప్తర్షి మండలపు భగణకాలమును, గతివిశేషంబులనుఁ దేటతెల్లంబుగఁ దెలిసికొన సుకర మగుచున్నయది.

సప్తర్షి మండల మొక్కొకనక్షత్రమునం దొక్కొకశతాబ్ద ముండునని వక్కాణింపఁబడియుండుటచే నొకభగణమున కనఁగా నిరువదియేడు నక్షత్రములనుఁ జుట్టి యథాస్థానమునకు వచ్చుటకు 2700 వత్సరములు పట్టునని తెలియవచ్చెడిని. కల్యాదినుండి నేటికి సప్తర్షి మండలము మఘనుండి మఘకు రెండుపర్యాయములు చుట్టి పుబ్బను బ్రవేశించినట్లును, పూర్వఫల్గునినుండి పూర్వఫల్గునికి రెండుపర్యాయములు చుట్టివచ్చినట్లును నిశ్చయము సేసికొనవలయును. ఏలయనఁ గల్యాదిగడచి నేటికి 5032 సంవత్సరములు సుమారుగ నైనట్లు సర్వవిధములఁ దెలిసియేయున్నది. పైని చెప్పఁబడినవిధమున సప్తర్షి మండలము కల్యాదినుండి యేఁబదియైదు (55) నక్షత్రముల ప్రదేశము సంచరించినట్లు సుస్పష్టమగుచునేయున్నది. 55 నక్షత్రములనుఁ జరించుటకుఁ బై నుదహరింపఁబడిన ప్రకారము 5500 సంవత్సరములు పట్టితీరవలయును. గ్రహగతుల శోధచేఁ గల్యాది 5032 సంవత్సరములకుఁ బూర్వ మని తెలియవచ్చెడిని. ఇందు 5500 — 5032 = 468 సంవత్సరములు వ్యత్యాసముఁ గన్పట్టుచున్నయది. ఇట్టి వ్యత్యాసమునకుఁ గల కారణము నొకింత దెలియనిది భగణవ్యవస్థ సేయుట యుక్తియుక్తము గాదు.

## సంవత్సరభేదములు

జ్యోతిశ్శాస్త్రమువలన సంవత్సరమందుఁ బరిమాణమానమునుఁగూర్చి వ్యవస్థాభేదములు గానవచ్చుట గణకుల కొక వింత గాదు. అదెట్టులనఁ గాలపరిమాణమును లెక్కించుటలో దినప్రమాణము నాధారముగఁ జేసికొని మాసాదిప్రమాణముల నొక్కొక వ్యవస్థచే గ్రహింపు చున్నారలు. సూర్యోదయాది సూర్యోదయపర్యంత మొకదినముగను నట్టిదివసములు ముప్పది యొకమాసముగను గ్రహించుట సార్వత్రికము. దీనిని సావనమాస మందురు. అరువదిగడియలకాలము దివసమనియు, నట్టి దివసములు ముప్పది యైనచో నొకమాస మనియు, నయ్యది నాక్షత్రమాసమనియును జెప్పఁబడు చున్నయది. చంద్రగతులచే చాంద్రమాసమును, అన నమావాస్య మొదలు అమావాస్యవఱకును లేక పూర్ణిమ మొదలు పూర్ణిమవఱకునుఁ, జాంద్రమాసము లెక్కింపఁబడు చున్నయది. ఇట్టిమాసమునకు సామాన్యదృష్టిచే 29½ దివసములచిల్లర పరిమాణము తేలుచున్నది. ఇఁక సంక్రాంతి గణనచే సౌరమాసము లెక్కింపఁబడుచున్నయది. ఇట్టిమాసమునకు సామాన్యదృష్టిచే 30 దివసముల పదిన్నఱగంటలకాలము తేలుచున్నది. ఇట్టి మాససంకేతము లుండ చంద్రుఁ డొకనక్షత్రమునుండి బయలు వెడలి మరల యానక్షత్రమునకు వచ్చుకాలము లౌకికమాస మని చెప్పఁబడు చున్నది. ఇట్టిమాసమునకు సుమారు 27⅓ దివసములకాలము పట్టుచున్నది. ఇట్టిమాసము విశేషజ్ఞాన మక్కఱలేకుండ కేవలనక్షత్రసంకేతముచేతనే లెక్కింపఁబడుచున్నయది. ఏ మాసపు పరిమితి యెట్టుల బరఁగుచున్నను సంవత్సరమునకుఁ బండ్రెండుమాసము లను వ్యవహారము సుప్రసిద్ధముగఁ దెలియవచ్చెడిని. సంవత్సరమునకు మాసములు పండ్రెండైనను మాసమునకు దినములు భేదించుటచే సంవత్సరమునందుఁగూడ భేదము దెలియవచ్చెడిని. ఇట్లు సంవత్సరము 1 నాక్షత్రము 2 సావనము 3 చాంద్రము 4 సౌరము 5 లౌకిక మని యైదుతెఱంగులఁ దెలియవచ్చెడిని. ఇందు మొదటి నాలుగుసంవత్సరములకునుఁ గారణం బగు మాసము కించి న్న్యూనాతిరేకముల యపేక్షచే ముప్పది దివసముల పరిమితి గలదిగా యోజింపఁబడుటచే నట్టిసంవత్సరము మూఁడువందల యరువది దివసములతో నొప్పునట్లు సర్వసాధారణముగఁ దలంచఁబడి జ్యోతిశ్శాస్త్రవ్యవహారమంతయు సరిపెట్టఁ బడుచున్నయది. లౌకికాబ్దమన్ననో యట్లుగాక 27⅓x12 = 330 దివసములతో నొప్పుచున్నయది. ప్రకృతమునఁ గల్యాదినుండి లెక్కింపఁబడు 5032 సంవత్సరములు 360 దినముల పరిమితి గల్గిన వత్సరములుగఁ బరిగణింపఁబడుట యెల్లరకునుఁ దెలిసినవిషయమే. కావున పరాశరోక్తివలనఁ దెలియవచ్చెడి "అబ్దశతం నృణాం" (నృణా మబ్దశతం) అను స్థలమందలి "నృణాం" అను పదముచే సర్వజనులకు లౌకికదృష్టిచేఁ దెలియఁబడు లౌకికాబ్దము అని గ్రహింపవలసి యున్నది. అట్లు గ్రహించుటచేఁ బ్రకృతము సమంజసముగా నొప్పు చున్నయది. ఎట్టులన,

ప్రకృతపువత్సరము 360 దివసములు కావున లౌకికాబ్దము 330/360 = 11/12 వ సామాన్యవత్సరమునకు సరిపోవును. ఇఁక 5500 వత్సరము లన్ననో 5500 x 11/12 = 5041 2/3 వ్యావహారికవత్సరములకు సరిపోవు చున్నవి. ప్రకృతము కలియందు భుక్తినొందిన వత్సరము 5031 2/3 యని సుప్రసిద్ధమే కద. దీనింబట్టి సప్తర్షి మండలము కలి ప్రారంభమునకుఁ బదిసంవత్సరములు పూర్వము, అన ద్వాపరాంతమున శుక్లసంవత్సరచైత్రశుద్ధప్రతిపత్తునాఁడు మఘానక్షత్రమునఁ జేరి యుండవచ్చునని నిశ్చయము చేయనగును. అట్లు నిశ్చయించినచో " తేషు పాశ్చిత్తే కాలే మఘాస్వాసన్ ద్విజోత్తమ, తదా ప్రవృత్తశ్చ కలిః " అను పరాశరోక్తి

సర్వవిధంబుల సమంజసంబుగ నుండును. దానంజేసి పరాశరు లుద్దేశించిన నూఱు వత్సరములు లౌకికాబ్దము లనియు నవ్వాని జ్యోతిశ్శాస్త్రదృష్టిలోఁ జూచిన నయ్యవి 100 x 11/12 = 91 2/3 వత్సరములుమాత్రమే యగుచున్నవి. గాన దానంజేసి సప్తర్షి మండల మొక భగణమునకు 91 2/3 x 27 = 2475 సంవత్సరములకాలము నపేక్షించుచున్నదనియును దెలియవచ్చెడిని.

## విశేషస్థితిగతులు

ఇంతవఱకు సప్తర్షి మండలము ఒకభగణమునకు 2700 లౌకికాబ్దము లన 2475 వ్యావహారికపు వత్సరముల నపేక్షించుచున్నదనియు, దానంజేసి యొక్కొక్క నక్షత్రమునందు నూఱు లౌకికాబ్దము లన 91 2/3 వ్యావహారికపు వత్సరములు చరింపుచుండుననియు, సామాన్యముగ నిర్వచింపఁబడియున్నది. కాని యీప్రకారమే క్రమముగ నొక్కొక్కనక్షత్రమునందుఁ జరింపునని చెప్పుటకు వీలులేదు. అట్లు చరించునన్నచో నక్షత్రసంకేతములు దృగ్గోచరములుగాక శాస్త్రీయములైన భావగోచరసంకేతములగుచు భగణపరిపూర్తియందుమాత్రము దృగ్గోచరయోగ్యములగును. అట్లు సప్తర్షి మండలమును లెక్కించినను లెక్కింపవచ్చును. అట్టి యుద్దేశముతోడనే పరాశరులు నిర్వచించిరనియును జెప్పవచ్చును. కాని నక్షత్రసంకేతముల దృగ్గోచరములగువాని ననుసరించినప్పుడుమాత్రమే సర్వజనగ్రాహ్యయోగ్యమగును. అంతియకాదు :

"సప్తర్షీణాంతు యౌ పూర్వౌ దృశ్యేతే హ్యుదితౌ దివి
తయోస్తు మధ్యే నక్షత్రం దృశ్యతే యత్సమం నిశి."

"తేన సప్తర్షయో యుక్తాస్తిష్ఠంతి"— అని దృగ్గోచరవిధానము సర్వసామాన్యముగఁ బ్రదర్శింపఁబడుచున్నది. అశ్విన్యాదులను దృగ్గోచరనక్షత్రములను గౌణముగాఁదలంచుచు, భావగోచరంబులగు 360° ÷ 27 = 13 1/3 అంశలు (Degrees) చొప్పున లెక్కించినచో నశ్విన్యాదిరేవత్యంతము ప్రతి నక్షత్రమునందును 91 2/3 సంవత్సరములుగాని లేక 100 లౌకికాబ్దములుగాని సప్తర్షు లుందురని నిశ్చయముగఁ జెప్పవచ్చును. కాని గగనమధ్యమందు నక్షత్రములతో సరిజూడఁదలంచినచో నశ్విన్యాదిరేవత్యంతనక్షత్రములలో నొక్కొకదానియందు నొక్కొక విశేషకాలమునకు సప్తర్షులు ప్రవేశించుట తెలిసికొనఁబడును. ఏలయన నాకాశమునందు నక్షత్రము లన్నియు సమానదూరమున నుండక భేదవిశేషములతో నొప్పుచున్నయవి. దానంజేసి యేయేనక్షత్రమునం దెంతెంతకాలమునకు సంబంధించునో యయ్యది యంశవిభాగంబుచే నిరూపింపఁబడుచున్నది. ఇచట నక్షత్రములకు సప్తర్షి మండలముతోడి సంబంధమును వివరించుటలో సప్తర్షిమండలమునకు ధృవనక్షత్రముతో నత్యద్భుతసంబంధ ముండుటచే ధ్రువకత్స్య (Polar longitude) యందలి దూరవిశేషములను గ్రహించి వ్యవస్థ చేయఁబడుచున్నది. దృగ్గోచరమగు నక్షత్రమునకుసంబంధించి గమనించినచో నిందుదహరింపఁబడిన కాలమునే గ్రహించవలయును. జ్యోతిశ్శాస్త్రమున నక్షత్రప్రమాణము 800 కళలు గ్రహింపఁబడుచున్నది. సప్తర్షి మండలము 800 కళలను జరించుటకు 91 సంవత్సరముల 8 మాసములు పట్టును. ఒకకళను జరించుటకు 11/96 సంవత్సరము అనఁగా 1 నెల 11 1/4 దినములు పట్టును. ఈదిగువపట్టికయందు దృగ్గోచరనక్షత్రము లుండుస్థానములు వానికినడుమనుండు వ్యత్యాసము ఒక్కొకనక్షత్రమునుండి మఱియొకదానికి బోవుటకుఁగల కాలము ప్రాజ్ఞుల యోజనకొఱకు నిరూపింపఁబడుచున్నది. ఇట్లు గమనించుటలోఁ బ్రకృతము దృగ్గోచరమగు పూర్వఫల్గునీనక్షత్రమునుండి వ్యవస్థ చేయఁబడుచున్నది. సప్తర్షి మండలదర్శనము విధింపఁబడుటచే దృగ్గోచరప్రాధాన్యముగ నిందలికాలము నిరూపింపఁబడుచున్నది. భావగోచర విషయమును గణకులు దీనినుండి సుకరముగఁ దెలిసికొనఁగలరు.

| సంఖ్య | పేరు | ధ్రువకత్స్య (అంశ \| కళ) | వ్యత్యాసము (కళలు) | సంవత్సరములు | ప్రవేశకాలము: కలి శకము | ప్రవేశకాలము: క్రీస్తు శకము |
|---|---|---|---|---|---|---|
| | | | | | ప్రకృతమున మార్గశీర్ష పూర్ణిమా శుక్రవారము | డిశంబరు 5-వ తేదీ |
| 1 | పూర్వఫల్గునీ | 144-0 | | | 5032 | 1930 |
| 2 | ఉత్తరఫల్గునీ | 155-0 | 660 | 76 | | |
| 3 | హస్తా | 170-0 | 900 | 104 | | |
| 4 | చిత్తా | 180-0 | 600 | 69 | | |
| 5 | స్వాతీ | 199-0 | 1140 | 131 | | |
| 6 | విశాఖా | 213-0 | 840 | 97 | | |
| 7 | అనూరాధా | 224-0 | 660 | 76 | | |
| 8 | జ్యేష్ఠా | 229-0 | 300 | 38 | | |
| 9 | మూలా | 241-0 | 720 | 83 | | |
| 10 | పూర్వాషాఢ | 254-0 | 780 | 90 | | |
| 11 | ఉత్తరాషాఢ | 260-0 | 360 | 42 | | |
| 12 | శ్రవణం | 280-0 | 1200 | 138 | | |
| 13 | ధనిష్ఠా | 290-0 | 600 | 69 | | |
| 14 | శతభిషం | 320-0 | 1800 | 207 | | |
| 15 | పూర్వాభాద్రా | 326-0 | 360 | 42 | | |
| 16 | ఉత్తరాభాద్రా | 337-0 | 660 | 76 | | |
| 17 | రేవతీ | 359-50 | 1370 | 157 | | |
| 18 | అశ్వినీ | 8-0 | 490 | 57 | | |
| 19 | భరణీ | 20-0 | 720 | 83 | | |
| 20 | కృత్తికా | 37-30 | 1050 | 121 | | |
| 21 | రోహిణీ | 49-30 | 720 | 83 | | |
| 22 | మృగశిరా | 63-0 | 810 | 93 | | |
| 23 | ఆరుద్ర | 67-20 | 260 | 30 | | |
| 24 | పునర్వసు | 93-0 | 1540 | 177 | | |
| 25 | పుష్యమి | 106-0 | 780 | 90 | | |
| 26 | ఆశ్లేష | 109-0 | 180 | 21 | | |
| 27 | మఖా | 129-0 | 1200 | 138 | | |
| | | | 900 | 104 | | |

ఇటుపైని యేయే నక్షత్రమునం దెప్పుడెప్పుడు ప్రవేశించునది మధ్యకాల వత్సరంబులఁ గ్రమముగాఁగల్పికొనిన సుకరముగ గ్రహింపవచ్చును. ఇందుఁ గొంచెము న్యూనాతిరేకములు బడయవచ్చును. అవ్వానిని భావికాలదర్శులు గమనించి సంతసింపుదురుగాక !

## సారాంశము

కల్యాదియందు మఖానక్షత్రమునం దున్నదని పరాశరమహర్షిచే విష్ణుపురాణమునందు నిరూపింపఁబడియున్న సప్తర్షిమండలము ప్రకృతపు దివసమగు ప్రమోదూత సంవత్సర మార్గశీర్ష పూర్ణిమాశుక్రవారమునకు మఖనుండి మఖకు రెండు భగణములఁజేసి పూర్వఫల్గునీ నక్షత్రమునఁ బ్రత్యక్షముగఁ బ్రవేశించినట్లు ధ్రువపరుపఁబడియె.

ఇతి నారాయణస్మృతిః.

# వలపుకాన్క

నరహరిశెట్టి వెంకటరత్నం గారు

అతడు చామనచాయ మనిషి, వయస్సు ఇరవైఅయిదు. ముఖము నిర్మలము, కోమలము, గంభీరము. భావసంపద, భావస్థిరత్వము ఆ కళ్ల వెలుగులో మెరుస్తూఉంటవి. చిన్ని గుండ్రనిగడ్డము గాంభీర్యము కోమలత్వము కలిసి పులకరించే ఏదో భావాన్ని తెలుపుతూఉంటుంది. విశాలమైన నెన్నుదురు, అప్పటప్పట అచట వానంతట అవే వచ్చే ముడతలు సాధనగల ఆత్మను స్ఫురింపజేస్తుంటవి. అంత బలిష్ఠమైన శరీరంకాదు, ఒక మోస్తరు.

ఆమెకూడా చామనచాయ. వయస్సు ఇరవయి. చక్కని ముఖము. స్త్రీకి సహజంగాఉండే సుకుమారత బాగా ఉంది. ఏదో అర్థముకాని తేజస్సు ప్రకాశిస్తుంటుంది. కళ్లలోనుంచి బయల్వెడలే సిగ్గుదొంతరలు ఆతేజస్సును అప్పుడప్పుడు కప్పివేస్తూ ఉంటవి. అప్పుడప్పుడే కాదు తరుచు చిఱునవ్వునవ్వుతూనే ఆమె తెరలు తెరలుగావచ్చే సిగ్గుకెరటాలలో తేలి ఆడుతూఉంటుంది. పెదవులు గభీరత నెంతమాత్రము తలపుకు తేక సుకోమలత్వాన్నే స్ఫురణకు తెస్తవి. నుదు రంతవిశాలమైనది కాదు. ఆమె ప్రతి విషయము మామూలుగానే చూస్తుంది. భావములే కాదు హృదయంకూడ అంతలోతుగలది కాదు. ఇన్ని వివరించేకంటే ఆమె సాధారణంగా వర్తించే ఒకానొక విద్యార్థిని అంటే !—పలుచని శరీరం. అంతపొడగరి కాదు. భూషణములా—నవ్వుచూనే ఆమె క్రిందటిసారి వచ్చిన రాజకీయపుఉప్పెనలో వదిలిపెట్టివేసింది ఉన్న వన్నీను. అందరూఇస్తున్నారు నేనెందుకు ఇయ్యకూడదని కాదు, అప్పట్లో ఆమెమనస్సు కరిగింది. కాని తర్వాత ఎప్పటిచిఱు నగవుతో—

౨

అది శ్రావణమాసము. సాయంకాలము అతడు పొంగి పొంగి వస్తూవున్నగోదావరి చూస్తూ నడచుచున్నాడు గట్టుమీద. వ్రేలుఆనవాలుపెట్టుకొనివున్న గ్రంథము చేతిలో ఉంది. మనస్సు పుస్తకంమీద వున్నప్పటికీ కనులపండువుగా గట్టురాసుకొని ప్రవహిస్తూవున్న గోదావరి, అందులో కొట్టుకొనివచ్చే పుల్ల పుడక, పెద్దపెద్దచెట్లు ఇవన్నీ అతను ఎంతోకోరికతో చూస్తున్నాడు.

ప్రక్కనుంచి నలుగురుపిల్లలు వెళ్లారు. అందులో ఆమె ఉంది. అతన్ని ఆమె చూచిందో లేదో కాని అతడుమాత్రము ఆమెను చూచాడు. అంతే, తర్వాత మనస్సు కొంచెముసేపు గోదావరిమీదికి, చేతిలోని పుస్తకంమీదికి పరిగెత్తింది. వెంటనే అప్పటి నిండుగోదావరి, జీవితానికి జీవితపరమావధికి అనుబంధమైన ఏదో భావాన్ని స్ఫురింపజేయగా అతడు దాన్ని మననముచేయ మొదలుపెట్టాడు. అంతటితో ఆమెవూసే మరచిపోయాడు.

మిత్రులు రాగానే కొంతసేపు గట్టుపైనకూర్చుండి ఈకబురు ఆకబురు మాటాడుకొని బయలుదేరడానికి లేచాడు. గోదావరి మీదుగా పడమటిదిశ ఆకాశంలో నెలవంక కనిపించింది. వెంటనే ఈ మహానది ఎంతమంది ప్రేయసీప్రేయసులను చూచిఉంటుందో అనుకొన్నాడు. మరు నిముసాన్నే యిందాక ఆగుంపులో వెళ్లిన ఆమె స్మృతికితోచింది. ఏమో అనుకొన్నాడు నిర్లక్ష్యంగా.

అతడు చిన్ననాటినుంచి ఆలోచనగలమనిషి. ప్రతిచిన్న విషయాన్నిగురించికూడా లోతుగా ఆలోచించే స్వభావము. కోమలమైన, నిశితమైన అతనిబుద్ధికి హిందూసంఘములో ఉన్న కులభేదాలు, మూఢాచారాలు, వెఱ్ఱినమ్మకాలు, భావదాస్యం, సొంతంగా ఆలోచించేబుద్ధి లేకపోవడము, అజ్ఞానం ఎంతోబాధ, దుఃఖము కలిగిస్తూఉంటవి. ఇటువంటి పెద్దపెద్దసంగతులు అతని హృదయాన్ని కలచివేస్తూఉండేవి. వీటిగురించి గ్రంథములు తరచడమేకాదు, అతను సొంతంగా ఎంతోఆలోచించాడు. ఇట్లుండగా రెండోసారి రాచకీయపుతుపాను రెట్టింపు బలంతో వచ్చింది. ఇందులో తాను కొట్టుకుపోతానేమో అనుకొన్నాడు. అందుకు కొంచెము జడిశాడనికూడా చెప్పవచ్చు. ఈ నడుమ దాన్నిగురించి అత నెంతో దీర్ఘంగా లోతుగా తన్ను తానే తరుచుకుంటున్నాడు: "సంఘం యిటువంటిదుర్దశలో కుళ్లుతో జీవితం గడుపుతుంటే రాచకీయపు స్వతంత్రము ఎంతవరకు అవసరం? ఒకవేళ దేశానికి స్వరాజ్యంవస్తే వ్యక్తిగతంగా ప్రయోజనం ఏమిటి? ప్రత్యేకవ్యక్తికి మానసికంగా ఎంతవఱకు ముక్తి ఉంది?" ఈ ఆలోచనలు ఎన్నాళ్లనుంచో, ఈరోజునకూడా, అతని హృదయాన్ని మేధస్సును పరిపాలిస్తున్నవి.

వీటిగూర్చి చింతిస్తూనే అతడు ప్రక్కపై పరుండి ఉన్నాడు. ప్రక్కనే ముడిచివేసిన పుస్తకము ఉంది. మరల ఆమె అప్పుడప్పుడు స్ఫురణకువచ్చుచుండుట అతడు గమనించాడు: "ఏమి చెపుమ! —" అనుకొన్నాడు.

కొంతసేపటికి కిటికీలోనుంచి బాలచంద్రుడు కనిపించాడు. చుట్టూ ఎన్నో నక్షత్రాలు మెరిసిపోతూఉన్నవి. అతనికి చుక్కలంటే ఎంతో యిష్టము. నెలవంకకూడా యిష్టమే కాని చుక్కల్లో అతని కేదో తియ్యని సంగీతము, మెరుపులు కనిపిస్తూ ఉంటవట. కాని నేడు నెలవంక అతనిదృష్టిని ఎక్కువగా ఆకర్షించింది. రెప్ప వేయక, ఊర్పునాపి రవంతసేపు చూచాడు: "పురుషుని జీవనాకాశంలో ప్రేయసికూడ అల్లాగే కామాసు" అనుకొన్నాడు. వెంటనే ఒక మబ్బుతునక నెలవంకను కొంచెము కప్పివేసింది. అతని హృదయవీణను ఏదో కనిపించనిచేయి మీటిన ట్లయింది: "దేహంలో కలిగే మార్పువల్లనేమో" అనుకొన్నాడు.

"ముత్యాలను గీటురాయిమీద విలువ కడితే యేమి తెలుస్తుంది" అని సమాధానం చెప్పుకొన్నాడు తనలోతానే. ఈసారి ఆమె స్మృతికి రాలేదు.

## 3

స్త్రీలో లేని గుణాలు యువకులు కల్పించుకుంటారనీ, లేని పోని సౌందర్యం ఊహించుకుంటా రనీ, తెలివితక్కువతనంవల్ల ఆమె చీరముడుతలలో, శిరోజములలో, అడుగులలో, కదిలే వ్రేళ్లలో ఏమేమో వింతవింత కళలు తెచ్చిపెడతారనీ, ఆమె మాటలలో, కంఠంలో, గమనంలో వెఱ్ఱిమాధుర్యము ఊహ చేస్తారనీ, పురుషు డెంతో స్త్రీకూడా అంతేకాని అంతకంటె ఎక్కువ కాని తక్కువకాని స్త్రీలో లేదనీ, ఒక స్త్రీ యింకొక స్త్రీ యెడల ఎటువంటి నిష్కామమైన దృష్టితో ఉంటుందో అటులే యువకులు కూడా స్త్రీయెడ వర్తించవలెననీ, అదికూడా సంఘోద్ధరణకు యితరవిషయములతోపాటు సమానమైన అవసరం గల సంగతనీ తోడియువకులతో అనేకసార్లు అతడు చెప్పాడు. అతడు స్త్రీ యెడ అటువంటి నిష్కామమైన దృష్టితోనే ప్రవర్తించుతాడని అందఱు అనుకుంటారు. అంతేకాదు స్త్రీలనుచూచి యువకులు ముగ్ధులై తెలివితక్కువవారై పోవుచున్నారని అతడు అప్పు డప్పుడు స్త్రీ జాతిని నిందించడముకూడా కలదు.

కొన్ని నెలలు గడచిపోయినవి. ఆమె అతనికి ఒకటి రెండు సారులు మాత్రమే కనిపించింది. అప్పు డాతని హృదయం అతనికి తెలియకుండానే కొంచెము వణికింది. నరములుకూడా వణికినట్లయి నవి. ముఖము తెల్లబారింది. చూపులు ఆమెమీదికి ఇటు అటు పరి గెత్తినవి. ఎందుకో అతనికి తెలియలేదు. ఆపుచేసుకోవలెనని ప్రయత్నించాడు. ప్రయత్నముమీద లోబరచుకున్నాడు హృద యాన్ని కళ్లను.

ఆమెమాత్రము అతనివైపు చిరునగవుతోనే ఒకటి రెండు సార్లు చూచింది. చిరునగవుతోనే తలవంచుకొనేది. నవ్వుచూనే సిగ్గుతో కళ్లుమూసుకొనేది. ఇదంతా ఒక్క నిమిషములోనే.

ఒకరోజున టవునుహాలులో టీపార్టీ అయింది. స్త్రీలు పురుషులుకూడా వచ్చారు. అతడును వచ్చాడు. ఆమెకూడా చెలులతో వచ్చింది.

కొంచెముసేపటికి జనసమ్మర్దము ఎక్కువైపోయింది. వడ్డన సరిగా జరగడములేదు. అంతవఱకు పై అజమాయిషీ చేస్తూఉన్న అతడు వడ్డన కందుకొన్నాడు. స్త్రీలదగ్గరకు ఫలహారాలు ఒక్కటీ సరిగా వెళ్లకనులేదు. అతనికి అడ్డు ఏముంది! అంతేకాదు నియ మములు, స్థిరమైన భావములు, సాధన ఉన్న సంస్కారి. ఆమె అక్కడ ఉండడము అతడు చూచినాడో లేదో కాళ్లు రవంత తడ బడినవి. చొరవచేసుకొని వెళ్లాడు. వడ్డిస్తూఉన్నాడు. ఆమెకు దగ్గ రగా వచ్చాడు. ఆమెకుకూడా వడ్డించాడు ఫలహారాలు. ఆమె చిరునగవుతోనే అందుకొన్నది. మధ్యమధ్య ఆమెను సిగ్గుదొంత రలుమాత్రము కప్పివేస్తూఉండేవి. అయినా ధైర్యంగా ఆమె రెండవసారి టీ అడిగింది. అతడే తీసికొనివచ్చి మాటాడకుండా యిచ్చి వెళ్లిపోయాడు. ఈసారి అతడు ఆమెను జాగ్రత్తగా చూచాడు. ఇంతకు పూర్వము అత డామెను ఈరీతిగా దృష్టి సారించి చూడనైనా చూచిఉండలేదు.

అత డెరుగును ఆమె వ్రేలెత్తిచూపదగినసౌందర్యవతికా దని. ఆమె సర్వావయవములు మామూలుగానే ఉన్నవి కాని అందేమియు ప్రత్యేకతకూడాలేదని. అయినను అతని నామె ఏలనో ఆకర్షించింది. ఎందుకో ఎట్లో అతనికే తెలియదు. అతడు దృఢ చిత్తము కలవాడు. నియమములు, కొంతవరకు స్త్రీజాతిఅంటే అయిష్టము ఉన్నవాడు. అవన్నియు మెల్లమెల్లగా సమ్మోహనము నకు చోటిచ్చినవి. ఆమె రూపవతికాదు. అయితేనేమి ఆమెలో ఏదో అతడే యెరుగడు అతనిని ఆకర్షించింది! ఇంతవరకు ఒక్క సౌందర్యమే ఆకర్షిస్తుందని తలంచే అతనికి ఇదొక క్రొత్త అను భవము. ఈ అనుభవములోని మాధుర్యము అతడు అపేక్షతో చూరగొన్నాడు. కాని తన్ను తాను ప్రశ్నించుకొనేవాడు: "ఎందుకు!.........జీవిత పరమావధిమాట..........!" అని. "స్త్రీ కూడా ఒక జంతువే. స్త్రీకి తెలివితేటలుకూడా ఎక్కువ లేవు. సౌందర్యముకూడా ఎక్కువకాదు. పురుషుడే స్త్రీ కంటే ఎక్కువ అందమైనవాడేమో కూడాను......గ్రీకు శిల్పులు తమ కళలో.........మరి నన్ను ఆమె దేనితో ఆకర్షిస్తూఉంది...! అదే అర్థముకావడములేదు. అర్థమయ్యేదేముంది! పదిరోజులు తప్పించుకుతిరిగితే ఈ పిచ్చిభావాలు, అపేక్ష వానంత టవే మాయ మవుతవి" అనుకొన్నాడు.

పచ్చికబయళ్లు తాత్కాలికంగా ఎండిపోయినట్లు కనిపిం చినా తొలకరించగానే నవజీవంతో మెరుస్తవి అనే విషయము అతను మరచిపోయాడు. మరచిపోవడముకాదు తన హృదయం రాతినేలవంటి దనుకొన్నాడు. స్త్రీలయెడ తాను నిష్కామంగా స్త్రీవలె ప్రవర్తించవలెనని దృఢచిత్తం చేసుకొన్నాడు. అంతే కాదు స్త్రీ మనోహరత్వానికి లోబడిపోవడము పురుషుని హృదయ దౌర్బల్యము తెలియపరుస్తుందని అతని నమ్మిక. అంతటితో ఆగ లేదు, పాపముకూడానేమో అని అనుకుంటూ ఉంటాడు.

## 4

మూడు నెలలు గడచినవి. ఆమె కాతడు ఒక్కసారీ కని పించలేదు. బుద్ధిపూర్వకంగానే తప్పించుకు తిరిగేవాడు. ఆమెను మరిచిపోవలెనని ప్రయత్నించాడు. మరిచిపోవడము అంత కష్ట మైనపని కాదనుకొన్నాడు. మరిచిపోయాననుకొని తృప్తిపడ్డాడు. మరిచిపోయినందువల్ల బాధ లేదనుకొన్నాడు. పూర్తిగా మరిచి పోయానో లేదో అని పరీక్షచేసుకోవడములోనే ఆమెస్మృతి యింకా తనలో ఉందనుకొన్నాడు. ఏమైనా ఆమె నీడజాడలు అతని హృదయవీథిలో గోచరిస్తునే ఉండేవి.

అది సాయంసమయము. మబ్బులుపట్టి చల్లగాఉంది. అతడు టేబిలుముందరకూర్చుండి తీవ్రంగా చదువుకుంటున్నాడు. మనస్సు ఉత్సాహంగ, చురుకుగా పనిచేస్తూ ఉంది. పెద్దపెద్ద భావాలు కెరటాలులాగావచ్చి పరిగెత్తుకుపోతున్నవి. ఈ విశ్వవిశ్వమంతా అప్పు డతనికి లేనట్లే.

గచ్చకాయరంగు చీర కట్టుకొని, నరిగంచు జాకెట్టు ధరిం చి, తలలో పారిజాతపు పూలగుత్తులు పెట్టుకొని సిగ్గుతో తల

ఆడించుకుంటూ చిఱునవ్వుతోనే ఆమె వచ్చింది. ఆమెను సరిగా చూచినాడో లేదో ఒక మెరపు మెరసినట్లయింది. ఆ మెరపు దెబ్బకు హృదయము, మనస్సు, మేధస్సు ఒక్కసారిగా క్రుంగి మఱు క్షణాన్నే నవజీవంతో లేచినవి. మెల్లగా అడుగులు వేసుకొంటూ శిరస్సు వంచుకునే తడబడుచు ఆమె చెట్లనీడలలోకి వెళ్లుతూ వుంది. అతడు మరల తలయెత్తిచూచాడు. ఒత్తుగా మెరసిపోతూ వున్న పెద్దజడ కనిపిస్తూవుంది. తన హృదయం ఆమె అడుగుల ననుసరించి శబ్దించుట అతడు కనిపెట్టాడు. తన మనస్సు నామె బలంగా లాగుకొనిపోవడము గ్రహించాడు. తాను అంతలోనే మానసికంగా నీరసం అయిపోవడము తెలుసుకొన్నాడు.

కోపంతో ఇకెన్నడు ఇటువంటిపని జరుగకూడదు. ఒక పేరు వూరు లేని యువతి నన్ను లోబరచుకోవడమేమి టనుకొన్నాడు. ఆమెలో వున్న గొప్పతన మేమిటని ప్రశ్నించుకొన్నాడు. ఇంత తెలివితక్కువగా ఆమెముందు కూలబడిపోవడ మేమిటనుకొన్నాడు. ఆమెకు నాకు ఏవిధమైన అనుబంధం అనుకొన్నాడు. ఇక ఈసారి యిట్టి పతనమునకు అవకాశ మివ్వకూడదనుకొని నిశ్చయం చేసుకొన్నాడు. ఇదంతా ఒక్క అరనిమిషములో.

పుస్తక మక్కడుంచి లేచివచ్చి కిటికీప్రక్కనున్న కుర్చీలో కూలబడ్డాడు. ఆ తీవ్రత తగ్గిపోయింది. మనస్సుకు మృదుత్వం అంతలోనే అబ్బింది. శాంతంగా ఆలోచించ మొదలుపెట్టాడు. జీవితంలో స్త్రీకి పురుషునికి వున్న సంబంధ మేమిటి, ఎంతవర కుండాలి, ఎప్పు డేరీతిగా వుండాలి, స్త్రీ పురుషులకు అసలు పరస్పర సాహాయ్య మెంతవర కవసరముంది, ప్రేమ నాధారంగా చేసికొని స్త్రీ పురుషుడు ఏల నివసించరాదు. వివాహం అసలు అవసరమా లేదా. వివాహంలేని పరస్పరప్రేమకు, నిజమైన ప్రేమలేని వివాహానికి తారతమ్యమేమిటి.........(మనోతీవ్రత మెల్లగా బిగి సడలింది) నా హృదయంలో ఎందుచేతనో ఈమెమీద అపేక్ష కలిగింది, ఇది ఎంతవరకు ప్రకృతిసిద్ధమయింది.........ఒక స్త్రీని ప్రేమించుట ఆమెకు లోబడిపోవడ మెల్లా అవుతుంది......... ఒక రమణిలో వున్నదేదో కనిపించని మనోహరగుణము ఆకర్షించితే అందుకు అవకాశమివ్వడము, కనిపించని సౌందర్యాన్ని ఆరాధించడము పాప మెల్లా అవుతుంది.........ఆమెను నేను కోర్వడమో లేక ఆమెకు నన్ను అర్పించుకోవడమో, కాదు ఈ రెండూ కలిసి ఎదో చెప్పజాలని దవుతుంది అటువంటి ప్రణయజీవనం గడవడములో దోషముంటుందా.........ఇన్ని ఆలోచించడమేకాని ఆమెదృష్టి నాయెడల ఎట్లుందో ఊహించనైనా ఊహించకుండా, తెలుసుకోవడానికైనా ప్రయత్నించకుండా.........” అంతలో ఆమె తిరిగివచ్చింది. ఆమె చిఱునవ్వు నవ్వుతూనే ప్రకాశిస్తూ వున్న ముఖంతో అతనివంక కిటికీగుండా చూస్తూవుంది. ఇదివరకు వలె అప్పు డాతనిలో విద్యుత్తరంగము లెగయ లేదు. ఆ ఆలోచనా చింతనములో మునిగిపోయివున్న అతని వదనం అప్పుడు భావ సంపద స్ఫురింపజేస్తూవుంది. అందు చిఱునవ్వు తునుక అయినా లేదు. అత డామెను కొలదిపాటి గంభీరమైన ముఖముతోనే చూచాడు. వారి యిరువురి చూపులు సంపూర్ణముగా మిళితము కావడము ఇదే తొలిసారి. ఒకరిచూపు చిఱునవ్వు వెన్నెలలు ప్రసరింపజేస్తూవుంది. ఇంకొకరి చూపులో భావముల వెలుగుమాత్రమే మెరుస్తూవుంది. పాపము, ఆమె అతడు తనవంక తీవ్రంగా చూస్తున్నాడేమో అని సంశయించింది. వెరపుతో తలవంచుకుంది. నవుస్తూనే మరల చిఱునవ్వుతో అతనిని చూచింది. ఈసారి అతడు చిఱునవ్వు నవ్వ ప్రయత్నించాడు. లోతుగల అతని భావాలు అప్పుడు చిఱునవ్వుకు చోటివ్వలేదు. ఎన్నోరసాలు ప్రసవించే భావా లప్పు డతని వదనముమీద తాండవమాడినవి. ఆమె గ్రహించింది. ఆమె చిఱునవ్వు చూపులతోనే అతని కొక పూజాపుష్పము సమర్పించింది. అత డా పూజాపుష్పాన్ని ప్రేమతో, కోరికతో అందుకొన్నాడు.

ఆమె మెల్లగా అడుగులువేసింది. పూలచెట్లలోనుంచి వచ్చిన కమ్మనివాసన లామెకు తమ ఆనందము తెలిపినవి. ప్రక్క గుబురుగావున్న బొగడచెట్టుపైని గువ్వలుకూడా తమ సంతోషము వెలిబుచ్చినవి. ఒకటి రెండు చినుకులతో తన కుంకుమపురంగు కిరాలుపంపి సూర్యుడు ఆశీర్వదించాడు.

“ నా భవిష్యత్తు అనంతమైన శూన్యాకాశం. అందులో నెలవంక ఎప్పు డుదయిస్తుందో ” అనుకొన్నా డతడు.

---

## దీపావళి

నోరి నరసింహ శాస్త్రి గారు, బి.ఏ., బి.ఎల్.

కారుచీకటులు క్రమ్మి జగమ్మున
కన్నులు కానని వేళన్
దీపావళి దేదీప్యమానముగ
దీపించితి వీవేళన్.

ధారుణిలో గల ధర్మదీపముల
దాచినార లీయసురుల్
అన్యాయంబున నంధకర్తమం
బారోపించిరి యసురుల్.

నిరతము నీక్షితి నిండి వెలింగెడి
నీ దివ్యాకృతికాంతుల్
నేడు నిరంతరనీహారావృతి
ని స్తేజములయె నెంతో.

ధర్మచ్యుత మగు ధాత్రీస్థలి నీ
ధన్యరూప మెటు కాంతున్,
దీపించని బహుదీపజాలముల
దీపావళి యెటు కాంతున్.

ధళధళ లాడగ ధర్మఖడ్గమును
ధళిపించెద వది యెపుడో
ధర నన్యాయపుతమసచ్ఛటలను
దళనము చేసెద వెపుడో!
ధర్మహీనమా ధరలో నెన్నడు
ధర్మస్థాపన మరలన్!
దీపావళితో దిక్తటు లెపుడు
దీపించెదవో మరలన్!

# దీర్ఘాయువు

కొర్లపాటి వీరాస్వామి నాయుడు గారు (భిషగ్రాజ)

లోకమున నందఱును సుఖ మపేక్షించువారలే. కాని సుఖము పడయు మార్గ మెఱిగి తదనుసారముగ బ్రవర్తించువారు మాత్రము మిక్కిలి తక్కువగనున్నారు. సుఖ మన, జిహ్వా కింపగు పదార్థముల దినుట- కంటి కింపగువాని ననుభవించుట, దారసుతాదులు క్షేమముగ నుండుట, ద్రవ్యముండుట, దాసదాసీ జనము లుండుట, యీ మున్నగునవియే యని పలువురు భ్రమించుచున్నారు. కాని దీని యాథార్థ్య మట్టివారు రోగపడి, మంచమెక్కి, యౌషధసేవ చేయుచు, మూల్గుచు, బాధపడునప్పుడ తెలియనగును. ఏమన నట్టి సమయములం దదివఱకు రుచ్యపదార్థముల నామస్మరణముచేతనే ద్రవీభూత మగుజిహ్వ, యా వస్తువుల రుచి జూడనైన నభిలషింపదు. కన్నులు దర్శనీయములగు వస్తువుల జూడ హర్షింపవు. చెవులు శ్రవణానందకరవార్తలను విన నొల్లవు. నాసిక సుగంధద్రవ్యముల నాఘ్రాణింప జాలదు. రోగముచే మనుజుని యింద్రియములే తమ సహజవ్యాపారము నుండి విముఖ మగునప్పు డిక భార్యాపుత్రాదులందలి మోహము మఱుగుపడునని వేఱ చెప్పనేల! అయ్యో! అదేమిపాపము! సుఖదాయకము లని తా దలచిన జిహ్వా కింపగు పదార్థములును, నయనానందకరములగు వస్తువులును, అర్థశరీరిణియగు భార్యయు, వంశోద్ధారకులగు సుతులును, దుర్లభవస్తుసంపాదనము చేయజాలు ధనమును, తాను మంచమునుండి దిగకుండనే సమస్తోపచారములు సేయు పరిచారకులును దగ్గఱనుండగనే మానవుడు సుఖవిహీను డగుచున్నాడు. కావున దీనినిబట్టి చూడ, పైని జెప్పిన పదార్థములు వాస్తవసుఖదాయకములు కావని తోచుచున్నది. ఇక నిజముగా సుఖము నొసంగు పదార్థము లేవి? సుఖ మనునది యొక పదార్థము కాదనియు, బయటనుండి తెచ్చునదియు, ఒకరివల్ల వచ్చునదియు, ద్రవ్యమిచ్చిన దొరకునదియు గాదనియు, నది మనలోనే యున్నదనియు, నది యారోగ్యమూలము నాశ్రయించి యుండుననియు, దానికి సరిగ దోహదము సేయుచునుండునంతవఱకె సుఖము తలయెత్తియుండుననియు, నప్పుడె యింద్రియవ్యాపారము సహజస్థితిలో నుండుననియు, నప్పుడే (పైనిజెప్పిన) బాహ్యపదార్థములు సుఖకరములై తోచుననియు తెలియనగును. అనగా మానవున కారోగ్య ముండునంతవఱకె సుఖముండుననియు, అప్పుడే బాహ్యప్రపంచ మతనికి బ్రియముగా దోచుననియు, అప్పుడే లోకమున కాతడుగూడ దర్శనీయు డగుచున్నాడనియు దేలుచున్నది. కావున నీ ప్రపంచయాత్రను సుఖముగా గడపవలె ననిన బాహ్యపదార్థములవలన సౌఖ్యము గలుగు నను భ్రమను విడనాడి సౌఖ్యమునకు మూలమగు నారోగ్యమును సంపాదించుట మానవున కావశ్యక మగుచున్నది.

సుఖమునకు మూలమగు నీ యారోగ్యము గొన్నినియమముల ననుసరించి యున్నది. అందుచే నారోగ్యవిధుల నిచట సంగ్రహముగా వివరించుచున్నాను.

ఆయుర్వృద్ధికరములు నారోగ్యజనకములు నై హితమైన వస్తువుల మితముగ సకాలమున దినుట, మాంసాహారవర్జనము, అహింస, దుస్సాహసకార్యత్యాగము, బ్రహ్మచర్యము, వీనివలన నారోగ్యమును, నందువలన దీర్ఘాయువును గలుగును. ఇందుగూర్చి ప్రాచీనకాలమున మహర్షు లాయుర్వేదమున వివరించిన నియమములను ముందుగా నుదాహరించెదను. ఈ విధుల ననుసరించితిమేని మనము నిజముగ నారోగ్య మందజాలుదుము. ధనమునకు భోగమే ఫలమని పలుసారు లుపహారముల గొనుచు, పానీయముల ద్రావుచు, పిండివంటల దినుచు, భోగము లందుచు, నడుగైన నడువకుండ గుఱ్ఱపుబండ్లమీదనే ప్రయాణము సేయుచు, తమ యుడుపులగూడ బరిచారకులవలననే తొడిగించుకొనుచు, శరీరముల బెంచి, ప్రమత్తులయి, తామే యారోగ్యవంతుల మనుకొను ధనవంతు లనారోగ్యమునకు దాసులగుదురు. పూర్వ మీ యనారోగ్యదేవత మన దేశమున మన పెద్దలకాలమున నింతగా తలవిరియబోసుకొని తిరుగాడినదికాదు. ఏమనిన మనవారు దేశకాలవయోబలానుసారముగ నాయుర్వేదవిధుల ననుసరించి సకాలమున మితముగా దినుట, దేహపరిశ్రమము సేయుట, ఇరువదియైదువత్సరములు గడచినగాని వివాహ మాడకుండుట, భార్యతో విహరించుటకుగూడ పెద్దల యనుమతి వడయుట, వేకువనే మేల్కాంచుట, కులధర్మముల ననుసరించి సర్వవిధముల బ్రవర్తించుట, మధ్యమధ్య నుపహారముల గొనకుండుట మొదలగు నియమములను పాటించెడివారు. కావుననే వారు మంచి జఠరదీప్తికలిగి, బలిష్ఠులయి, ఇంద్రియనిగ్రహులై, దీర్ఘాయుష్మంతులై, జ్ఞానవంతులయి, తేజస్వంతులయి, సుసంతానవంతులయి యుండెడివారు. ఇప్పటివారన్నో యకాలములయందు దినుట, సోమరు లయియుండుట, పదియారు వత్సరములనాటికే బిడ్డల తండ్రు లయియుండుట, కాలనియమము లేకుండ స్త్రీలతో విహరించుట, ప్రొద్దెక్కి లేచుట, కులధర్మముల మీఱి ప్రవర్తించుట, గొప్పతనమునకయి పలుసారులు తినుట మొదలగు దురభ్యాసముల కలవడి, స్వేచ్ఛావిహారులై, మనదేశము అజీర్ణరోగులతోను, సోమరులతోను, బలహీనులతోను, నిర్వీర్యులతోను, అర్థాయుష్కులతోను నిండియుండుటకు కారణమగుచున్నారు. ఖండాంతరవాసుల పరిపాలన మీ దేశమున నెలకొనినకొలది, ఖండాంతరములకు మన రాకపోకలు వృద్ధియైనకొలది పూర్వాచారము లనాగరకములని త్రోసిపుచ్చి, ఖండాంతరవాసుల నాగరకతనే మెచ్చి, సర్వవిధముల వారివలె నుండుటయే నాగరకత యని యెంచి, శీతబాధ కోర్వజాలక వా రక్కడ ధరించు నుడుపులనే మన యుష్ణదేశమున ధరించుచు, వారు త్రావు నుత్తేజకపానీయములనే త్రావుచు, వారు తిను బలకరపదార్థములనే తినుచు, వేయేల, వీరే వారని లోకులు భ్రమించునట్లా వేషములనే వేయుచు, మనవారు పలువురు నవనాగరకతా బీజమును నీ దేశమున నాటి దోహదము చేయుచున్నారు. అదియును దోహదవిశేషమున నచిరకాలముననే మొలకెత్తి, మొక్కయై, వృక్షమై, శాఖోపశాఖలుగ బెరిగి కాఫీ హోటల్సు, మధుపానశాలలు (Liquor Shops) మొదలగు ఖండాంతరఫలముల ప్రసవించుచు నొక్క శీతోష్ణస్థితిలోదక్క తక్కిన యన్నివిషయముల గొంచె మించుమించుగా మన దేశము నా ఖండాంతర దేశములుగనే మార్చుచున్నది.

కొలదికాలము క్రిందట రుచిచూడవలెనన్న దుర్లభమయిన కాఫీ యిప్పుడు ప్రతి పట్టణమునను, పల్లెటూరను వ్యాపించియున్నది. ఇంతియకాదు, నాటకములాడు చోటుల, జాతరలయందు, ఉత్సవములయందు, తీర్థములయందు, మార్గములయందు "కాఫీ హోటల్సు" ఉండితీరుచున్నవి. పెండ్లిబేరములలో మొదట కాఫీ, యుప్పుమా పంపునట్టుల నిర్ణయము జరిగిననే యా బేరము స్థిరపడుచున్నది. వేయేల? ఇంటికి బంధువువచ్చిన కాఫీ, స్నేహితుడువచ్చిన కాఫీ, పెద్దమనుష్యుడువచ్చిన కాఫీ ఇచ్చితీఱవలెను. తుద కిది యుత్కృష్ట గౌరవచిహ్నముగా మాఱిపోవుచున్నది. పోనిండు. దీనివలన సుగుణ మేమైన నుండునా యనిన వాస్తవముగా నట్టి దేదియును లేదు. కాఫీ, కోకో, టీ, సోడా ఇవి ఉత్తేజకపదార్థము లగుటవలన వానిని సేవించినవెంటనే నరములకు బలముకలిగి యుత్సాహము కలిగినట్లుండును గాని వాని సేవనము చిరకాలము చేసినచో నరములును, హృదయమును, బలహీనములై యజీర్ణము, శుక్లనష్టము, అతిమూత్రము మొదలగువ్యాధులు కలుగునని యాంగ్లేయ వైద్యులే యభిప్రాయపడుచున్నారు. ఇవి రోగజనకపదార్థములని శాస్త్రమువలనను అనుభవమువలనను నిశ్చయింపబడినది.

ఇక కాఫీ హోటలులందలి హేయస్థితినిగూర్చి యించుక ముచ్చటించెదను. ఉదయముననే కాఫీహోటలునందు జనులు తీర్థప్రజలవలె మూగియుందురు. స్థలమంతయు నెంగిలియాకులుతీయని పెండ్లియింటివలె నుండును. కాఫీ త్రాగిన గిన్నెల నొక నీటిగోలెములో ముంచి సేవకుడు తెచ్చి యిచ్చుచుండును. ఎందఱు త్రాగిన యెంగిలి గిన్నెలయినను, అదివరకు ముంచుచుండిన గోలెములోనే మరల ముంచి

తెచ్చి యిచ్చుచుండును. ఇందువలన కాఫీవలన గలుగురోగము లట్లుండగా, ఎంగిలి వలన గలుగు సాంక్రామికరోగములుగూడ సంభవించుటకు గారణమగుచున్నది.

రోచినపుడెల్ల నుపహారములగొనుచుండుట ఉడుకుచున్న వంటకములో మరల క్రొత్త వంటకము చేర్చుటవంటి దని గ్రహింపవలయును. ఇందువల్లనే ధర్మరాజునకు భీష్ములవారు భోజనములకు మధ్యకాలమున నొక యణువైన దినకుండుటయే సహోపవాస మనియు, ఋతుదినములయందుమాత్రము భార్యలో విహరించుటయే సహా బ్రహ్మచర్యమనియు నుపదేశించియున్నారు. వీనిలో మొదటి దానివలన నజీర్ణము రలనూపకుండును. రెండవదానివలన సకలధాతుసారమై లోక సృష్టి సేయునట్టి మహావీర్యము శరీరమున నిలిచియుండును. కావున వీనివలన నారోగ్యము నాయుర్వృద్ధియు గలుగును. మన మెంతకాల మెన్ని శాస్త్రముల జదివినను, ఎంతగా గురుకులవాసము చేసినను, ఎంతగా నాలోచించినను, అజీర్ణమే సర్వరోగములకు మూలకారణమని తేలుచున్నది. ఇందుచేతనే "అతస్సర్వేషు రోగేషు అజీర్ణం కారణం స్మృతం" అని యాయుర్వేదమున జెప్పబడినది. మఱియు చరక మహర్షి దీర్ఘజీవితాధ్యాయమున "ఆయుష్యం భోజనం జీర్ణం, వేగానాము విధారణం, బ్రహ్మచర్య మహింసాచ, సాహసానాంచ వర్జితం." అని వ్రాసి చేసిన భోజనము చక్కగ జీర్ణమైనతర్వాతగాని మరల భోజనము సేయకుండుట, మల మూత్ర వేగముల నాపకుండుట, బ్రహ్మచర్య వ్రతదీక్ష, అహింస, సాహసకార్య త్యాగము, ఇవియే యాయుర్వృద్ధికి మూలములని యుగ్గడించినారు.

## అ జీ ర్ణ ము

అజీర్ణముగా నుండునపుడు తినిన యాహారము జీర్ణముగాక, ఆమమై, అగ్నిమాంద్యాదిరోగముల గలిగించును. కావున శాస్త్రమున "అజీర్ణే భోజనం విషం" అని వ్రాసిరి. మఱియు చరకమహర్షి

> "పథ్యాపథ్య మిహైకత్ర భుక్తం సమశనం మతమ్
> విషమం బహువాల్పంవా ప్యప్రాప్తాతీతకాలయోః
> భుక్తం పూర్వాన్నశేషేతు పున రధ్యశనం మతమ్
> త్రీణ్యప్యేతాని మృత్యుంవా ఘోరాన్వ్యాధీన్ సృజంతి వా"

అని లిఖించి పథ్యము నపథ్యమునయిన పదార్థముల కలిపి ఏకకాలమున భుజించుట సమశనమని, కాలము రాకుండ గాని, కాలము దాటబెట్టి గాని, ఎక్కువగ గాని, తక్కువగాని భుజించుట విషమమని, ఒకమాఱు తినినపదార్థము జీర్ణముకాకుండ మరల తినుట అధ్యశనమని చెప్పబడుననియు నీ మూడును మృత్యువునుగాని ఘోర వ్యాధులగాని గలిగించుననియు నుగ్గడించినారు. కావున నారోగ్యము నిచ్చగించువారందఱు దీనిని గమనించి యట్టి విరుద్ధభోజనములమాని, ఆకలి యగునపుడే హిత పదార్థముల మితముగా దినుచుండవలెను.

## మ ల మూ త్ర ని రో ధ ము

మూత్రనిరోధమువలన మూత్రము కాగి ఆవిరిరూపము దాల్చి శరీరమున వ్యాపించి యనేక మూత్రకృచ్ఛ్రాది మూత్రజరోగముల బుట్టించును. మలనిరోధమువలన మలము గడ్డకట్టి మార్గ నిరోధముచేసి, అధోమార్గమున వెలువడవలసిన వాయువుల నూర్ధ్వగతములుచేసి కోష్ఠబద్ధత, అరుచి, ఆధ్మానాది (కడుపుబ్బరము) వివిధ రోగములను గలుగజేయును. కాబట్టియే "నవేగాన్ధారయే ద్ధీమాన్ మలాదీనాం జిజీవిషుః" అనగా జీవేచ్ఛగల బుద్ధిమంతుడు మలమూత్రాదులో వాయువుల నిరోధింపరాదని యాయుర్వేదవేత్తలు హెచ్చరించిరి.

## బ్ర హ్మ చ ర్య ము

"బ్రహ్మచర్య మాయుష్యాణామ్" (చరకము) "బ్రహ్మచర్య ప్రతిష్ఠాయామ్ వీర్యలాభః" (పతంజలి) ఆయుర్వృద్ధికరములగు నియమము లన్నిటిలో బ్రహ్మచర్యము ప్రాముఖ్యము వహించుచున్నది. బ్రహ్మచర్య వ్రతమువలన శారీరక మానసిక శక్తులు వృద్ధియగును. ఏమనగా:—వీర్యము శరీరమందలి సకలధాతు సారములవలన గలిగిన సారమగుటచే దీని ధారణమువలన సకలధాతువులును బలిష్ఠములై మానవుడు బలపరాక్రమవంతుడై, తేజస్వంతుడై, దీర్ఘాయుష్మంతుడై యుండును. కావున నిట్టివీర్యము నష్టమైనవారికి పైనిజెప్పిన సుగుణములన్నియు నాశమగునని వేఱ చెప్పనక్కఱలేదు. "మరణం బిందు పాతేన జీవనమ్ బిందు ధారణాత్" శివసంహిత. వీర్యపాతమువలన మృతియును వీర్యధారణమువలన జీవనమును కలుగుచున్నవి. ఏమన శుక్లము మస్తిష్కపక్వాశయాదులతో నధిక సంబంధము గలిగియుండుటంజేసి యట్టిశుక్లము దుర్బలమైనచో బుద్ధిమాంద్యము, మందాగ్ని, అజీర్ణము మొదలగు ననేక రోగములు గలుగును. ఇందువలననే యువకులుకూడ నిస్తేజులై, రక్తహీనులయి, దుర్బలు లగుచున్నారు. సకలధాతుసారమగు వీర్యముయొక్క పతనమువలన ధాతువు లన్నియు నశించుటచే నందువలన గలుగు వివిధరోగములను గ్రంథవిస్తరభయంబున విపులముగా వివరింపజాలక యందులో ముఖ్యమయినవానిని మాత్రము పేర్కొనుచున్నాను. అజీర్ణము, కోష్ఠ కాఠిన్యము, అరుచి, ఉదరమునను తత్సమీపస్థానములను వేదన, దంతమూలములు దుర్బలములై బాధకలిగి యూడిపోవుట, వెండ్రుకలు తెల్లనగుట, నేత్రములు లోనికిపోవుట, దృష్టితగ్గుట, గ్రుడ్డితనము, శరీరము తెల్లనగుట, శరీరమునందలి రోమము లూడుట, అవయవసంధులందు నొప్పులు, బుద్ధిమాంద్యము ఈ మొదలగునవి. కావున దీర్ఘాయుష్మంతులు కాగోరువారు ప్రతిజ్ఞాపూర్వకముగ బ్రహ్మచర్యవ్రత పాలనము సేయవలయును. దీని నింతగా పొగడుటకు కారణ మేమనిన లోకమున నే యౌషధములవలనను, ఏ వ్రతములవలనను, మఱి యే యుపాయములవలనను పడయరాని యాయువు దీనివలనమాత్రమే కలుగుచున్నది. ఇందువలననే పూర్వము మహర్షు లెంతకాలమైన జీవించియుండెడివారు. దీని ధారణమువలన నిప్పుడుకూడ నక్కడక్కడ నూఱు వత్సరములకు పైగ జీవించి జీవన్ముక్తులైనవారు కలరు. దీని కింత యాధిక్య మెందువలన కలిగెనదన శరీరరక్షణమునకు గావలసిన సారములన్నియు దీనియం దిమిడియున్నవి. కావున శరీరరక్షణమునకై బ్రహ్మచర్య వ్రతధారణ మత్యావశ్యకము. దీని యభావమున నే విధమగు స్వాస్థ్యరక్షణమును గలుగనేరదు. శరీరస్థధాతువులలో ప్రధానతమమగు వీర్యమును రక్షించుకొనుటచే శరీరరక్షణమును, దానిచే మేధాశక్తియు, దానిచే నిచ్ఛాశక్తియు, దానిచే నేకాగ్రచిత్తతయు లభించును. మఱియు బ్రహ్మచర్యప్రభావముచే శరీరమున నపూర్వ తేజము, అపూర్వసమర్థత, అపూర్వారోగ్యము, దీర్ఘాయువు ప్రాప్తమగును.

## అ హిం స

దీని నవలంబించుటవలన మనస్స్వాస్థతయు, చిత్తశాంతియు కలుగుచున్నవి. ఎప్పుడీ యుత్తమగుణ మంకురించునో యప్పుడే యాయుర్వృద్ధి యగుచున్నది. ఎవని మనమున నహింసాతత్త్వము నెలకొనియుండునో వానికి బ్రపంచమున శత్రువే లేకుండును. ఇంతియకాదు, అట్టివాడు సకలభూతములకును హితుడగుచున్నాడు. ఇది యోగవిజ్ఞానమూలమున సిద్ధియగుచున్నది. ఇది సిద్ధియైనవానిని దారులుకొట్టువారును, చోరులును మఱిమెట్టి క్రూరులును హింసింపనొల్లరు. సరికదా! సింహవ్యాఘ్రాది ఘాతుకమృగములుకూడ వానిని జంపనొల్లకపోవుటయేకాక మీదు మిక్కిలి వానిని ప్రేమించును. మఱియు నాతని ప్రభావముచే నాత డుండుచోట నిసర్గవైరము గల జంతువులుకూడ ముంగిస—పాము, పులి—మేక, సింహము—ఏనుగు మొదలగునవి పరస్పరమైత్రికలిగి వర్తించును. మఱియు దీని యాచరణమువలన సాత్త్వికాహారమలవడి హింసాప్రధానమగు మాంసాహార మలవాటు గలవారికిగూడ నది వదలిపోవును. అందువలన దేహబలమును, చిత్తస్వాస్థ్యమును, ఆరోగ్యమును, దీర్ఘాయువును కలుగును. మానవుని మనశ్శరీరముల గుణాదికము లాతడు భుజించు పదార్థములపై నాధారపడియున్నవి. ఈ ప్రపంచమంతయు నెట్లు సత్త్వరజస్తమోగుణవిశిష్టమయియున్నదో యట్లే మనముభుజించుపదార్థములుగూడ నీగుణవిభాగముచే మూడు విధములుగా నున్నవి.

> "సత్త్వాత్సంజాయతే జ్ఞానమ్ రజసో లోభ ఏవచ
> ప్రమాదమోహౌ జాయేతే తమసోఽజ్ఞానమేవచ"

సాత్త్వికపదార్థభోజనమువలన సత్త్వగుణవృద్ధియు, రాజసపదార్థభోజనమువలన రజోగుణవృద్ధియు, తామసపదార్థభోజనమువలన తమోగుణవృద్ధియు గలుగును. సత్త్వగుణముచే జ్ఞానమును, రజోగుణముచే లోభమును, తమోగుణముచే ప్రమాదము, మోహము, అజ్ఞానము గలుగుచున్నవి. కావున జ్ఞానాభివృద్ధికి సాత్త్వికాహారభోజన మావశ్యక మగుచున్నది. ఇందుచే జ్ఞానసంపాదనమునకై నిర్దేశింపబడిన మానవునకు రజస్తమోగుణవృద్ధికరమగు మత్స్యమాంసాద్యపవిత్ర భోజనము వర్జనీయ మయియున్నది. సాత్త్వికాహారము (అనగా పండ్లు, పాలు, అన్నము, శాకాదులు) భుజించువారు మాంసాహారమును భుజించువారికంటె చిత్తస్వాస్థ్యమును, ఇంద్రియనిగ్రహమును, శరీరసౌఖ్యమును, దీర్ఘాయువును గలిగి రజస్తమోగుణముల నుండి ముక్తు లగుదురు. మన మహర్షు లిట్టి సాత్త్వికాహారమూలముననే కఠినతపో వ్రతాచరణసమర్థులయి, త్రికాలజ్ఞులయి, దీర్ఘాయుష్మంతులయి లోకసౌభాగ్యమునకు దోడ్పడు మహోత్తమకార్యములను జేయగలిగిరి. ఆమిషభోజనము శరీరమునకు మిక్కిలి హానికరమయియున్నది. కావున నది సర్వదా విడువదగినది. ఇటీవల

పాశ్చాత్యపండితులగు ప్రొఫెసర్ జాన్ రే, లూయి కూనే (ప్రకృతివైద్యశాస్త్రజ్ఞులు) అనువారు భగవంతుడు మనుష్యుని మాంసాహారజీవిగ సృజించియుండలేదనియు, డాక్టరు లూకస్ మాంసాహారమువలన పక్వాశయమున ననేకవిధవిషరసము లుత్పన్నములై వానిచే "ఎప్పెండిసిటిస్ (అంత్రవృద్ధి) అను నసాధ్యరోగ ముత్పన్నమగు ననియు, డాక్టరు హేగ్ శరీరమున కతిహానికరమగునట్టియు, అనేకరోగముల గలిగించునట్టియు "యూరిక్ ఆసిడ్" మాంసాహారమువలననే కలుగుననియు, అది యొకపౌనుమాంసమునను 14 గ్రైయిను లుత్పన్నమగుననియు, డాక్టరు రాబర్ట్సబెల్ మాంసభోజనమువలననే వర్తమానమున నీదేశమున నధికవ్యాప్తిలో నుండు కేన్సర్ (కర్కటవ్రణము) అను నపాయకరరోగము కలుగుచున్నదనియు వ్రాసిరి.

## సా హ స ము

సాహసకార్యములలోలురకు మనస్స్వాస్థ్యత చెడుటయకాక అకాలమరణముగూడ సంభవించుచున్నది. సాహసకార్యము లనగా ఘాతుకమృగముల నెదుర్కొనుట, పుట్టలలోని పాములబట్టుట, సుడిగుండముల నీదుట, గృహదహనము, సాధుహింస మొదలగునవి. దీర్ఘాయువును గోరువారు వీనియెడ విముఖులు గావలయును.

## అకాలమృత్యువు

అకాలమృత్యువునకు కాలనియమము లేదు. శరీరమున బలవీర్యాదుల సంపూర్ణ సామర్థ్య ముండునప్పుడుకూడ సర్పములవలనను, జలమువలనను, విషమువలనను, పిడుగువలనను, అగ్నివలనను, శస్త్రమువలనను మరణము కలుగుచున్నది. దీనినే యకాలమృత్యు వందురు.

"అథ సత్యపి తైలాదౌ దీపం నిర్వాపయేత్ మరుత్
ఏవ మాయుష్యయుక్తం చ హింస త్యాగంతుమృత్యుః"

ప్రమిదెయందు నూనెయు, వత్తియు బాగుగనున్నను దీపమును గాలి యార్పివేయునట్లే, ఆయుర్దాయము కలవారినిగూడ నకాలమృత్యువు హరింపగలదని శాస్త్రమున చెప్పబడినది. చాలమంది, మృత్యు వొక నియమమున కధీనమైయుండుననియు, నియమితదినమున నిమునమైన తప్పకుండ తప్పక మృతికలుగుననియు, నందువలన విరుద్ధాహారవిహారాదులవలన నాయు వెట్లు నాశముకాగలదనియు శంకింతురు. కాని యది సరికాదు. నియమితకాలమున తప్పక కలుగునని వారు చెప్పునది కాలమృత్యువు. కాలము ననుసరించివచ్చునది కావుననే దానికి కాలమృత్యు వనుపేరు వచ్చినది. దీనినే అనిచ్ఛాప్రారబ్ధ మందురు. దీని కౌషధములు గాని, శాంతులు గాని, నివారణోపాయములు గాని లేవు. మఱి కాలనియమము లేక వచ్చు మృత్యువునకే యకాలమృత్యు వనుపేరు కలిగినది. ఇది విరుద్ధాహారవిహారాదులవలనను సాహసకృత్యములవలనను కలుగుచున్నది. మన యాయుర్వేదమును నందలి చికిత్సలును, అకాలమృత్యువునకే గాని కాలమృత్యువునకు గాదు. నూఱేండ్లు నిండి సహజముగ గతించెడువాని కౌషధములును, పండి రాలెడు ఫలములు రాలకుండ జేయుటకు చెట్టునకు దోహదములును ఎంతమాత్రము ప్రయోజనములు గాజాలవు. విరుద్ధాహారవిహారములవలన గలుగజేసికొను నిడుమలనే "ఇచ్ఛాప్రారబ్ధ" మందురు. అకాలమున నతిమాత్రముగా దినుట, సరిగపక్వముకాని లేక యధికముగపక్వమైన యాహారముల దినుట, తక్కువ జీర్ణశక్తి కలవా డధికముగ దినుట, అధికజీర్ణశక్తి కలవాడు తక్కువగదినుట, అశక్తుడు శరీరపరిశ్రమము నేయుట, శక్తిమంతుడు సోమరియైయుండుట మొదలగునవి విరుద్ధాహారవిహారములు. పాములనుబట్టుట, ఉన్నతస్థలములనుండి క్రిందికి దుముకుట, నదిలో సుడిగుండమున నీదుట, మొదలగునవి సాహసకార్యములు. వీనివలన నకాలమృత్యువు కలుగును. ఇది సాహసమువలననే కాని ప్రారబ్ధమువలన కలుగునది కాదు. ఇందువలన నకాలమృత్యువునకు ప్రధానాంగములు విరుద్ధాహారవిహారములును, సాహసకృత్యములు నని స్పష్టమగుచున్నది. విరుద్ధాహారవిహార సాహసకృత్యములు వదలి సావధానముగా నుండువారికి నపమృత్యువు కలుగనేరదు. మృత్యుముఖమున బడనుండు కష్టసాధ్యయాప్యరోగులుగూడ ఉత్తమౌషధాదిచికిత్సాచతుష్టయ మొనగూడినచో మంచి యారోగ్యమును దీర్ఘాయువును బడయగలుగుదురు. "భిషగ్ద్రవ్య ముపస్థాతా రోగపాద చతుష్టయమ్" (భైషజ్యరత్నావళి). వైద్యుడు, ఔషధము, పరిచారకులు, రోగి వీనిని చికిత్సాపాదచతుష్టయ మందురు. వీనియభావమున సాధ్యరోగపీడితులుగూడ నకాలమృత్యుముఖమున బడుచున్నారు. ఆలోచింపగా మన దుష్టవర్తనమువలననే మనము ఆత్మఘాతుకుల మగుచున్నాము. సద్వర్తనమువలన నాయుష్మంతులగుచున్నాము. ఒకకట్టెను చక్కగా జాగ్రత్తచేసితిమేని చాలకాల ముండును. దానినే వర్షమునను బురదను బడవైచితిమేని శీఘ్రముగ జెడును. మనుష్యజీవితముగూడ నట్టిదే. చరకమహర్షి యిట్లు వ్రాసియున్నాడు. "తస్మాద్ధితాహారవిహారమూలమాయుః" దీర్ఘాయుః ప్రాప్తికి ప్రధానోపాయము యుక్తాహారవిహారములు. ఇవిలేనివాడు అకాలమృత్యువువాతబడును.

"భుక్తోపవిశత స్థూలం శయానస్య వపుర్భవేత్
ఆయుశ్చంక్రమమాణస్య మృత్యుర్ధావతి ధావతః"

భోజనమైనతరువాత కూరుచుండుటవలన కడుపు స్థూలమగును. శయనించుటచే శరీరము స్థూలమగును. కొంతతడవు మెల్లగా దిరుగుటచే నాయువు వృద్ధియగును. పరుగెత్తుటచే మృత్యువు వెంటపరుగిడును. ఉష్ణతా ప్రధానమగు నీదేశమున పూర్వకాలమున పగలు రెండుజాములప్పు డెప్పుడును కఠినపరిశ్రమము చేయు నలవాటు లేకుండెను. ఏమన నది మహారాజులుమొదలు సేవకులవఱకును విశ్రాంతకాలమగుటచే మూడవజామున గాని కార్యాచరణమున బ్రవర్తిల్లెడువారుకారు. ఇప్పుడు శీతలదేశనియమములకు మన యుష్ణదేశము శిరసావహింపవలసివచ్చెను. మన ముండునది యసలే యుష్ణదేశము. ఎండ లపరిమితముగ నుండును. శరీరము వేడిమిచే నుడుకుచుండును. మనస్సు వ్యాకులత నొందుచుండును. ఈ సమయముననే అధికారులుమొదలు సేవకులవఱకందఱును ప్రభుత్వ కార్యస్థానములందును కంపెనీలలోను శారీరకమానసికపరిశ్రముల నధికముగ జేయవలసివచ్చుచున్నది. ఇందుచే నుద్యోగులును సేవకులును పార్టీలును వడివడిగా భోజనముచేసి తత్క్షణమే ఎండలో కచేరీలకు పరుగెత్తి యచ్చట నయిదాఱుగంటలకాలము అధికపరిశ్రమము సేయుదురు. భోజనమైనవెంటనే పరుగిడువానివెంట మృత్యువుగూడ పరుగెత్తునని నెడి పైవాక్యమును నిట్టివారందఱును జ్ఞాపకములోనుంచుట యావశ్యకము. అస్వాభావికములగు నిట్టి యకార్యములవలన బలహీనతగలిగి యాయువు క్షీణించు చుండును.

ఇంతవఱకు చెప్పినదానివలన మన యాహారవిహారములవలననే యాయుర్వృద్ధిక్షయము లేర్పడుచున్నవని స్పష్టమగుచున్నది. ఆయుర్వృద్ధికి బ్రహ్మచర్యము మూలమని చెప్పియున్నాను. కాని యీకాలములో దాని నెవ్వరైన పాటించుచున్నారా యని సంశయింపవలసియున్నది. పూర్వము మనవారు శిక్షాసమయమునను, యౌవనప్రాదుర్భావమునందును ఉత్తమవిధులచే బ్రహ్మచర్యము కాపాడుకొనుచుండెడివారు. అవివాహితులుకూడ పరిశుద్ధాహారవిహారములుకలిగి పవిత్రభావములో నుండెడివారు. కావున కామవాసన (స్త్రీవాంఛ)కు వారి యంతఃకరణమున తావు లేకుండెడిది. ఇప్పుడో శిక్షాసమయమునను పతనకాలమునను మఱి యెల్లయెడలను వారు సదాచారమునకు మాఱు మ్లేచ్ఛాచారముల ననుసరించుచున్నారు. యుక్తాహారవిహారములందు వారికి మనస్సుపోవుటయే లేదు. క్రమముగా శృంగారము పెరిగిపోవుచున్నవి. సహజముగా నుండవలసిన వేషములు మారిపోవుచున్నవి. చాలమంది విద్యార్థులు విద్యాభ్యాసకాలములోనే నలువురైదుగురు బిడ్డల తండ్రులగుచున్నారు. అవివాహితులుకూడ చాలమంది పాడగుచున్నారు. వారిశరీరములు శుష్కించి, ముఖవర్చస్సు చెడి, జ్ఞాపకశక్తి యడుగంటి, చిత్తచాంచల్యముకలిగి, తేజోరహితు లగుచున్నారు. మఱియు నజీర్ణము, మలబద్ధము, స్వప్నస్ఖలనము, ప్రమేహము, ధాతుదౌర్బల్యము మొదలగు ననేక దుస్తరరోగములు పుట్టి యందువలన శీఘ్రముగ స్వాస్థ్యము చెడి యకాలమృత్యువువాతఁ బడుచున్నారు.

బాల్యవివాహములుగూడ ఆయువును హరించుచున్నవి. మహర్షియగు సుశ్రుతుడు పురుషులలో నిరువదియైదువత్సరముల క్రిందివయస్సునందును, స్త్రీలలో పదియాఱువత్సరముల దిగువప్రాయమునను గర్భాదాన మయినచో, ఆ యల్పవీర్యశోణితములు పిండవృద్ధిచేయ నసమర్థములై యకాలప్రసవాదికములకు కారణమగు ననియు, ఒకానొకచో కాలప్రసవమై శిశువుజనించినను నది శీఘ్రమరణము నందుననియు, ఒకవేళ జీవించినను దుర్బలుడై రోగియై బాధపడుచుండుననియు వ్రాసియున్నాడు. ఈకాలమున యుక్తవివాహనియమములకు లోబడియున్నవా రెవరైన నున్నారా యనునది విచారణీయము. ఇప్పటికాలమున నాయుర్వృద్ధికరములగు నాచారములకు మాఱుగా యాయుఃక్షీణకారకములగు నాచారముల నవలంబించెడివారలే లెక్కకుగా నుండుటవలన శతసంవత్సరపరిమితిగల జీవిత మల్పకాలములోనే ముగియుచున్నది. మన మెంతవఱకు మనదేశప్రకృతి కనుకూలములగు నాహారవిహారాదుల ననుసరింపకుందుమో, ఎంతవఱకు మనదేశమున బాల్యవివాహాది దురాచారములు ప్రబలుచుండునో, ఎంతవఱకు మనము మనస్స్వాస్థ్యరక్షాసంబంధమగు నాయుర్వేదశిక్షాపాలనము సేయకుందుమో, అంతవఱకు మనము మనపూర్వులవలె బుద్ధిబలపరాక్రమములను దీర్ఘాయువును బడయజాలము.

కావున మహాశయులారా! ఎల్లవారును మన ప్రస్తుతదుస్థితినితిలకించి, పైని జెప్పిన యారోగ్యవిధులను పాటించి ధర్మసాధనములకెల్ల నాధారభూత మగుశరీరమును గాపాడుకొని దీర్ఘాయుష్మంతులై పురుషార్థముల సాధించుట యావశ్యక మని హెచ్చరించుచు నీవ్యాసమును ముగించుచున్నాను.



# స్వప్నలీల

కొత్తపల్లి సూర్యారావు గారు

(కొంతకాలము క్రిందట నాచే రచియింపఁబడిన తుంబాచార్యుల గారి స్వప్నలీలలలో నిదియొకలీల. స్వప్నలీల యుపోద్ఘాతమమాత్ర మొక్కప్పుడు శ్రీభారతిలోఁ బ్రకటింపఁబడినది. మఱికొన్ని లీలలు ప్రొద్దుటూరు భారతీకథానిధిలోఁ బ్రకటింపఁబడినవి. అందలిదే యీలీలయొక్కటి.)

తుంబాచార్యులుగా రిట్లుచెప్పుచున్నారు:—

నన్నొక కొందఱు కలలోఁ బిల్చి యాశుకవిత్వము చెప్పుమని కోరిరి. సిద్ధపరమే మూలము గాని నాకు సహజమైన పాండిత్యములేదు. పూనుకొనిన మహేశ్వరుఁడు నన్నుఁ బదిమందిలో నవమానపఱుచునా; సిద్ధవరా యని మొక్కి— "అయ్యా! మీ కాశుకవిత్వము కావలయునా, మంచిది వినుం డంటిని. పోనిండు పురాణము చెప్పుఁ డని మనుచరిత్రముం దెచ్చిరి. పోనిం డేమిటి, నాయనలారా! మీరుగదా నిక్కమైన రసికులు, మీరుగదా నిక్కమైన భాషాభిమానులు. నన్నాశుకవిత్వము చెప్పుమనుటచే మీ పాండిత్యమును పురాణశ్రవణకుతూహలమును బోధపడినవి. మీ కొక్క నమస్కారము! అని లోన ననుకొని ఆశుకవిత్వములో నన్నేవిషయము చెప్పుమందురు—మాటవరుస కంటినిగాని నా కిబ్బందిలేదు మీ రేది కోరిన నదియే చెప్పెదను... బాగుబాగు! దోమనుగూర్చి యాశుకవిత్వములో నుపన్యాసమా! "ఉపన్యాసస్తు వాక్ముఖం" అన్నాఁడుగదా అమరుఁడు-దాని కర్థమేమి, ఆశుకవిత్వములో రసముండదు కాఁబట్టి నోటితో నుచ్చరించుటకేగాని వ్రాసి పుస్తకములో స్థిరముగా నుంచుకొనుటకుఁ బనికిరాదని- గాలికిఁ బోవలసినదే యని తాత్పర్యము. మీ రేపత్రికకును బంపవలదని కోరితిని. ప్రారంభించితి నఁట. దోమ మీఁద మేరుపర్వతమంత కల్పన. అది వారికే నచ్చినదిగాదు: మీకు రుచించునా! సిద్ధుఁడు నానోట యుక్తియుక్తములే పల్కించుఁగాని నన్నుఁ గలలో దయ్యము పట్టుకొన్నదఁట—పరవశుఁడనయి యది పల్కించినట్లెల్లఁ బల్కితినఁట. పోఁగాఁ బోఁగా మూఁడుపద్యములందులోనివి జ్ఞాపకమునకు వచ్చినవి, వాని నిటఁ బొందుపఱిచెదను.

అక్కటా! దోమ! నీదు నవ్యక్తమధుర
గానరసమును జెవి నింపి కడమ యంగ
ములకు వినిపింపకునికిఁ జేతులకుఁజెప్పి
తఱిమివేయించు నవి నిన్నుఁ దరియకుండ. 92 వ పద్యము

నిజముచెప్పుము నీవు కర్ణేజపుఁడవొ,
శక్తిలేకమె వినవొ నీస్వనము నితర
ములగు నవయవములు, దానిమూలమేమి?
మీఁదఁబడి కఱచెద వేమొ మిత్రదూర. 106 వ పద్యము

ఒక్కచో మంగళముపాడి యొక్కచోట
యూళవైచుట వంచకయుక్తి నీకుఁ
బుట్టఁబుట్టినగుణ మది పోనె, యీతి
బాధ లోనరింపఁ బొల్గొన్నవారు లేరె. 150 వ పద్యము

ఎంత సిద్ధవరమున్నను కొన్నిమతములవారి యభిప్రాయప్రకారము సైతాను పట్టుకొనినచో బుద్ధికి భంగముకలుగును. ఊహించితిని. నాల్గవపద్యము నాకుఁ దోఁపనే లేదు. ఇంతే లోకమున కర్పించుకొనుచున్నాఁడను. లోకములో మంచి మంచిగ్రంథము లెన్ని నామావశిష్టములు కాలేదు! నామావశిష్టములేగాదు, వాని పేరునను చేరుసగూడ లేవు. పోనిం డాశుకవిత్వపుఁ బొల్లు నాపద్యములు నట్టివే.

మనుచరిత్రము పురాణము చెప్పుమన్నారుగదా! చదివితిని. అర్థముచెప్పితిని. శ్రావ్యముగా నున్నదని కొత్తపల్లి గంగయ్యగారి పురాణధోరణి యిందుఁ జాల గలదని పొగడిరి. అర్థము బహుమనోహరముగ నుపపత్తులతోఁగూడఁ జెప్పినట్లు వారు చెప్పుకొనిరి. నేనుజదివిన పద్యములన్ని మనుచరిత్రములోని వని యొకకొన్ని యీ స్వప్నప్రజలే స్వప్నపత్రికలోనే యొకదానిలో నచ్చువేయించినారు. అందున నన్నేమియు నిందింపలేదు. స్తోత్రమే యున్నది. కాని కొన్ని, బాధించునవికావున్నను, నసత్యములు వ్రాసిరి. చిత్తగింపుడు.

"భర మైతోఁచు కుటుంబరక్షణముఁగా" - అనుపద్యమునకు మాఱు

జుడుగక యర్థగౌరవము సుంతయెఱుంగక పాడుశయ్యలం
బడి పొరలాడుచు న్వికటభాషల రీతులఁదప్పుచు న్సదా
కడు చెడువృత్తులంగొని జగంబునఁ గ్రుమ్మరు దుర్విటోపముల్
నుడువఁగరాని కాకవిజనుల్ నుతిపాత్రులుగారు నాకిటన్.

అని యున్నదని ప్రచురించిరి. కాని యదిసరికాదు. అనుపద్యమునకు మాఱుగాదు, 'అనుపద్యముగూడఁ గలదు.' అని ప్రచురింపవలసినది. నేను రెండుపద్యములను జదివితిని.

"శీలంబుం గులము" అనుపద్యము తర్వాత

అడజడి గుడువఁడు సత్యము
విడువఁడు స్వప్నమున నైనఁబితరులఁగడవ
న్నుడువఁడు పరార్థసమితిన్
ముడువఁడు నడువఁడు దురధ్వమున నెన్నండున్.

అనుపద్య మొక్కటియున్నది.

"చేసితి జన్నముల్ తపము చేసితి" నను పద్యము క్రింద

నినువంటివారిఁ గొందఱ
నొనరించి విరించి శాంతినొందక యకటా
పెనువంతఁబడెడు వెడఁగై
యనిశము స్త్రీపుంనపుంసకాచరణమునన్.

అనుపద్యమొక్కటి కలదు.

చంద్రోదయవర్ణనములో "రాజు తేజస్వియై గ్రహరాజు" అనుపద్యముపిమ్మట

కలశాబ్ధిన్ రజతాద్రి మందరము పెన్గవ్వంబుగా దేవదై
త్యులు ద్రచ్చంగ సభంగమైపొరలి యుత్తుంగస్థితిం బొఱఁ బ
ల్వలరాజద్ధవళాంతరీపముఖకూలస్థాశ్ఛవస్తువ్రజం
బులదీప్తిచ్ఛటలో యనందగి జగంబున్నిండె నచ్చంద్రికల్.

అనుపద్యమును "అడరు నవీనభానుకిరణావలి యంటిన" అనుదాని క్రింద

వెలవెలఁబాఱుచుండె నిను వేఁడిమికోర్వ దొకించుకేని బు
ష్పలవము దాల్పఁబోదు మధుపప్రతికూలతఁగాంచు సారవ
జ్జలములఁగోరు నీలత లతాలలితాంగి నిను న్మనంబునం
దలఁచుచు నీరువోసికొను తన్వి తెలుంగునఁ గానవచ్చెడున్.

అనియుం గలదు. ఇందు "నీరు వోసికొను" అనుదానికి "నీరు మోసికొను" అని యుండిన నుండవచ్చునంటిని. ఆమాటను వారు విడిచిపెట్టిరి. ఇది ప్రమాదమేమో. గ్రంథవిస్తరభీతిని వదలిరో.

కొందఱీ మనుచరిత్ర మెక్కడి దని యడిగిరి. ఏదో వారు తెచ్చిరి. నేను జదివితిని. "విపులాచపృథ్వీ" - ఏమూల నేమియున్నదో యెవ్వరు చూడఁగలరు. ప్రయత్నించిన దొరకకపోదు. ఎక్కడనో దొరకవచ్చును. పుస్తకభాండాగారము లీనడుమ నూరూరఁ బెదపుట్టలవలె లేచినవి, యడఁగినవి. పరిశోధకులు పైలుదేఱిరి. కనుఁగొనుఁ డంటిని. వెదకుచున్నారఁట. నా కింకొకస్వప్నములో నదియున్నచో నెవ్వారికైనఁ జెప్పవచ్చును. అతివిస్తరమేల.

# నహుషుని నడమంత్రపు సిరి

దీపాల పిచ్చయ్యశాస్త్రి గారు

ఈపద్యములు శ్రీ నీలకంఠదీక్షితులవారి శివలీలార్ణవమునుండి తెలిఁగింపఁబడినవి.

అమరవిభుఁడులేని యదనును గనిపట్టి
యతనిగద్దె నహుషుఁ డాక్రమించెఁ
బ్రభువులేక చిక్కువడియుంట దివిజులు
నెటులో యతనిప్రభుత కియ్యకొనిరి.

అశ్వమేధశతము నందదుకుగఁ జేసి
బెరసె నాతఁ డెట్లొ సురపదంబు
విబుధవిభుత నున్న విడఁడయ్యెఁ దొల్లింటి
తన తమోగుణప్రధానవృత్తి.

మునుపు దనశాసనంబును ముదలకించి
ధిక్కరించిన రాజుల దేశములను
"ఒక్క చినుకైన వర్షింప నొప్ప" దనుచు
జడుఁడు వారిదములకుఁ గట్టడ యొనర్చె.

"వర్ష మే నిత్తుఁ గావునఁ బ్రజల కెల్ల
నేన యజనీయుఁడను గాక మానవమఖ
ఫలము లందఁగ వీర లెవ్వార" లనుచు
నిఖిలసురకోటి నాతఁ డెన్నికలు వెట్టె.

"నాకె యొసఁగుము సవనోపనతహవిస్సు
సకలమును మద్గృహీతశేషంబు నవలఁ
బంచిపెట్టుము వారికివారి" కనుచు
హవ్యవాహున కా మూర్ఖుఁ డానవెట్టె.

"గంగ కలిసిన చోట సాగరమునందు
నద్భుతపదార్థములు పుట్టు వందుచుండు ;
పట్టి యద్దాని శోధింపవలయు" ననుచు
నట్టె చల్లించె గాంగతోయముల నెల్ల.

అవనిపయినుండి దివిఁ జేరినట్టి యాత్మ
సైనికులలోన విశ్వాస్యు లైనవారి
నేర్చి మూలబలంబును గూర్చికొనియె
మది నిసర్గసురాళి నమ్మక యతండు.

"సమదమాతంగములఁ దురంగములగముల
నిమ్మనఁడు దేవతరువుల, నీయకున్నఁ
గూలఁద్రోయుఁడు" అని వనపాలకులకు
విధి నలిపె శంకలేక యా 'వెధవకొడుకు.'

అవనిఁ దనచే నుపాసితు లయ్యుఁ దగిన
ఫలము లీనట్టి దైవతములను బట్టి
కట్టి తెప్పించి చెనటిరక్కసులచేతఁ
గాల మెదిపించెఁ గ్రూరుఁడు కరుణమాలి.

అమరులు ప్రతిమాసంబును
తమ కులకూటస్థు మెసవు థార్ష్ట్యముఁ గని ఖే
దమునంది యాజ్ఞయిడెఁ బూ
ర్ణిమ మొదలుగఁ జంద్రుఁ గావ భృత్యుల కెల్లన్.

దనుజులం దెవ్వ రెవ్వ రింద్రునకు రిపులొ
వారినందఱ సఖులట్ల గారవించు ;
ననిమిషేంద్రున కెవ్వరు ప్రాణసఖులొ
వారిపయి నూరకయె మండిపడు నతండు.

ఒడల వెల్లివిరిసి మూఁతవడని కనుల
వలనఁ గనుమూసి పవళింప వలనుపడక
'నాకనులఁ బంచి మీరలు చేకొనుం' డ
టంచు సందేశ మమరుల కంపు నతఁడు.

అతని స్వార్థపరత యాతని దౌర్జన్య
మతని మూఢవృత్తి యతని గర్వ
మతని పాక్షికత్వ మంతంత కెదిగి ని
ర్జరుల కెంతయును నసహ్య మయ్యె.

"తనర నీచేత నశ్వమేధమునఁ బొలిసి
నట్టి మృగపక్షిపశుమనుష్యవ్రజంబు
నేఁడు నినుఁ జంప నిదిగో! కారాదు నిచట"
ననుచు బెదరింపఁ దొడఁగిరి యమరు లతని.

ఇదిగొ శచి యంచు నొక వారసుదతిఁ జూపి
మోసపుచ్చిరి విబుధు లా మూఢచిత్తు
నరయఁ బ్రజల కసమ్మతుఁ డైన ప్రభుని
దర్ప మంతయు హాస్యాస్పదంబ కాదె?

# ఆదిత్యస్తోత్రము

నాగపూడి కుప్పుస్వామయ్య గారు, బి. ఏ.

హరిహర హిరణ్యగర్భ
స్వరూపుఁడవు నీవటంచు సకలాగమముల్
నిరతము సన్నుతిచేసెడు
పరదైవము నీవకావె భావింప రవీ.

కమలముల నెవ్వగలు నీ
విమలమయూఖములుసోఁక వెస నరుగుటచేఁ
బ్రమదమున నిన్ను మిత్త్రుఁడు
కమలాప్తుఁ డటంచు విబుధగణము నుతించున్.

జగములు నీచే నిక్కం
బుగ నిలుచుట లోకబాంధవుండని నిన్నుం
బొగడుచు సమస్తదేవ
ర్షిగణంబులు నీకరుణఁ దరింత్రు భవాబ్ధిన్.

జలజములఁ జూచుకైవడిఁ
గలువలఁ గనుఁగొనవదేల కరుణదలిర్పన్
లలిఁ జంద్రుఁ డరయునని యొకొ
కలువలదెసఁ గరుణలేవు కమలవనహితా.

తిమిరసముదయంబులు వెస
సమయును నీ సముదయంబు సమయంబున నీ
క్రమమున భక్తుల యజ్ఞా
నములును సమయుట నిజంబు నళినకులాప్తా.

మర్మంబుగఁ జేసెడు దు
ష్కర్మంబులు నిర్మలాత్మకతఁ జేసెడు స
త్కర్మంబులు నీవరయుట
నర్మిలి నినుఁ గర్మసాక్షి యందురు దేవా.

మూర్తిత్రయాత్మకుఁడు సక
లార్తిహరుఁడు పుణ్యమూర్తి హరిమరీచి
స్ఫూర్తి త్రిభువనాధారుఁడు
మార్తండుఁ డొసంగుఁగాక మాకు శుభంబుల్.

రాజత్కరవినివృత్తన
రోజమనఃఖేదు భాస్కరుని సకలప్రా
ణ్యోజస్సంధాయకు రవిఁ
దేజోనిధిఁ బ్రస్తుతింతు స్థిరతరభక్తిన్.

నిగమాంతవేద్యుఁ డాద్యుఁడు
జగదుదయస్థితివినాశసత్కారణుఁ డొ
ప్పగ మాకశ్రాంతంబును
ద్రిగుణాత్మకరూపుఁడొసఁగు ధీవిభవంబుల్.

సత్యస్వరూపు భువన
స్థిత్యాధారుని బ్రచండదీధితి ఖగు నా
దిత్యు సురార్చితుఁ గొలుతును
నిత్యంబును భక్తి యెసఁగ నెమ్మనమందున్.

కమలవనంబులు చేసిన
విమలతపోరాశిఫలము విపులపటుతమ
స్సమితిపరిపంధి నిగమచ
యమయుఁడు మాకొసఁగు నాయురైశ్వర్యంబుల్.

లోకములు వొడము నీచే
లోకంబులు నీవలన నిలుచు నరయంగా
లోకములు వొలియు నీచే
లోకాధారుఁడగు కేవలుండవు తరణీ.

---

# పాగలు హరనాథస్తుతి

మంగిపూడి వేంకటశర్మ గారు

శ్రీ కుసుమకుమారీశ్వర
లోకేశ్వర సకలజీవలోకాధారా
శ్రీ కరుణాసాగర
ప్రాకటలీలావిలాస పర హరనాథా.

హరహర నీనామము భవ
హరము మహామోహశోకహరము మునిమనో
హరమును నాంతరశాత్రవ
హరము శుభాకరము హరహరా హరనాథా.

హరనామ ముచ్చరించిన
హరివచ్చుట ముచ్చటించు టచ్చెరువు గదా
హరిహరులు వేరుగాదన
నరుదగు తార్కాణమిదిగదా హరనాథా.

హరి యవతారము నంటివి
హరనామముదాల్చినావు హరిహరు లొకటే
యిరువురు లేరని యంటివి
హరిహరభక్తులకు మేలురా హరనాథా.

హరిమూర్తి సుప్రసిద్ధము
హరమూర్తియు సుప్రసిద్ధమైనదె రెండున్
హరిహరమూర్తిగ వెలసెను
గురియై శివకేశవులకు గురుహరనాథా.

హరి యెవ్వడు హరు డెవ్వడు
హరిహరు డెవ్వండు నీవె యన్నియు గావా ?
పరమార్థ మెరుగనేరని
నరులెంతురు భేదవాదనలు హరనాథా.

హరిహరనాథాలయములు
హరిహరనాథార్చనములు నరుదైపోయెన్
హరిహరభక్తులకు పర
స్పరవైరము లుప్పతిల్లె ప్రభుహరనాథా.

ప్రేమావతార మందురు
ప్రేమామృతరాశివంద్రు విబుధులు నిన్నున్
ప్రేమస్వరూపి వందురు
ప్రేమను మామీదజూపవే హరనాథా.

ప్రేమంపుభిక్ష పెట్టుము
ప్రేమించుటనేర్పి మమ్ము ప్రేమింపుము ఓ
ప్రేమావతార సకలము
ప్రేమించెడు దారి జూపవే హరనాథా.

## కవితానివేదనము

నిడుదవోలు వేంకటరావు గారు, బి. ఏ.

శ్రీవసూత్రుండను భక్తిగోత్రుఁడ శివాశ్రీకంఠసూనుండ శాం
భవదీక్షానుగతక్రియాచరణసేవాసక్తచిత్తుండ మ
త్కవితారూపనివేదనంబు కడువేడ్కం గాన్క నర్పించితిన్
శివసంకల్పపురస్సరంబుగ నిదే చేకొమ్ము గౌరీపతీ!

శ్రీమత్తావకదివ్యపాదయుగళీసేవార్పితాత్మీయహృ
ద్ధామాక్రాంతసమస్తదుర్విషయసంఘానైకదుర్ఘాసవ
త్కామాదిప్రబలద్విషద్విదళనైకజ్ఞానసంపన్ననో
ధీమాహాత్మ్యమొసంగ వేడెదను తండ్రీ నిన్ను గౌరీపతీ!

భూరాపోఽనలవాయుఖాత్మకము నై పొల్పొందు విశ్వంభరా
భారంబెల్ల వహింపఁ గుక్షినిడి జీవవ్రాత మానందవి
స్ఫారంబై చెలువొందునట్లుగ శుభప్రారంభముల్గూర్చు నీ
కారుణ్యంబును సంస్మరించెదను భక్తత్రాణ గౌరీపతీ!

పారంబుం గనరాని విస్తృతమహాపాథోనిధిం జేతనా
ధారంబై తనరారు వాయువుననుద్యద్భానుశీతాంశుమ
త్తారామండలమండితాభ్రమునఁ జిత్తజ్ఞానవిశ్వాతిగ
స్ఫారాగ్రంబున వెల్గు నిన్ను మదిలో వర్ణింతు గౌరీపతీ!

బహుధాజల్పితమై తనర్చిన మహాబ్రహ్మాండగోళంబు బ్ర
త్యహముం జిత్రవిచిత్రరీతులను చెన్నై యుండుటం జేసి యే
విహృతిం జెందగనీక తావక కృపావీక్షం బ్రసాదించి త
న్మహనీయస్థితి సుంతయే నెఱుఁగుజ్ఞానం బిమ్ము గౌరీపతీ!

సరసీజాసనవాసవాదిసు మనస్సందోహసంశ్లాఘ్యమై
పరమానందరసాశ్రయంబయి యశోభాస్వంతమైయొప్పు త్వ
చ్చరణాబ్జద్వయి మామకీనహృదయస్థానోపపీఠంబుపైన్
స్థిరమై నిల్వఁగఁ జేయఁ గోరెదను తండ్రీ నిన్ను గౌరీపతీ!

తలఁపుంజిక్కక మాటకందక మనస్తత్త్వాతిగమ్యంబునై
చలమై, నిశ్చలమై, సమస్తజగతీసంవ్యాప్తమై గుప్తమై
తులనాతీతమునై గుణేతరమహత్పూర్ణంబునై కాంతిసం
కలితంబై తగు నీదుమూర్తికి నమస్కారంబు గౌరీపతీ!

త్రయి త్రైగుణ్యపరీవృతంబనుచు గీతల్ వల్కు నూత్రార్థ మ
ద్వయరీతింజను వీరశైవమతతత్త్వంబెన్న ద్వైతార్థ మ
ద్వయలీలం బ్రకటించు వానిని మదింభావించి నీభక్తి ని
శ్చయమార్గంబున నుండగోరుట మహాసౌఖ్యంబు గౌరీపతీ!

భవనాశాయ దిగీశవందితకనత్పాదారవిందాయ స్వ
ర్భువపాతాళనభస్తలావృతజగత్పూర్ణప్రభాంగాయ ది
వ్యవివేకాంచితయోగిమానససదబ్జాతాళిమిత్రాయ శ్రీ
శివదేవాయ నమోస్తుతే యనుచు నిం జింతింతు గౌరీపతీ!

గౌరీనాథ! నమస్సు, దర్పకహరా! కైమోడ్పు, లోకత్రయా
ధారా! సన్నుతి, భక్తలోకవరదా! దండంబు, సన్మంగళా
కారా! మ్రొక్కులు, శేఖరీకృతశశాంకా! చిన్నిపూలంచు ని
న్నారాధించుచునుందు సంతతము భవ్యాతీత గౌరీపతీ!

---

## సందేశము

సూరాబత్తుల సూర్యనారాయణ గారు

భారతదేశవృత్తుల విపద్దశ పాయువిధం బిఁకేదొ యే
తీఱున నార్థికవ్యథలుదీఱునొ సంపదకల్గు టెట్లొ సం
సారరథంబు సాగిచను సాధన మేదొ దరిద్రదేవతా
గారముదాఁటఁగా నుగతిగల్గుట యెట్టులొ చూడు భారతా!

కనుఁగొను మెల్లదేశములు కష్టము నష్టమును న్సహించి ప్రా
ప్తనవిభవంబుఁ గాంచి పరతంత్రత డించి యథేచ్ఛనుండ నీ
వనయము చిద్విలాసమున నాటలఁ బాటల దుర్వ్యయంబులం
దనిసెద వెంతమందుఁడవు దాస్య మి కేగతిఁ బాయు భారతా!

కోటికి మించి వర్తకులు కుంది కృశించి బికారులైరి నా
నాఁటికి దేశవృత్తులు ధనవ్యయతన్ బరసీమల న్బడెన్
గూఁటికిఁ బేదలై వెతలఁ గుందెద రెందఱొ తోడివార లీ
చేటుదొలంగ యత్నములఁ జేయవు మేల్గను టెట్లు భారతా!

అనుదినమున్ బరిస్థితు లనర్థవిధంబుగ మారుచుండె, వా
రనిధనలోప మేర్పడెను రాఁబడి శూన్యము హెచ్చువెచ్చ మే
పని గనరా దొనర్చుటకు పట్టపరీక్షలఁ దేఱిదొర్లినన్
దినములు దాఁటఁగాంచు టెటు దీనదశన్ విడనాడు భారతా!

ఊఱట లేదు దేశమున నూహలు మెండు తిరంబు గాన ము
ద్ధారణ సున్న కార్యపరతంత్రత చాలదు పూర్వవృత్తు లే
పారు విధంబు బోధపడ దాదరు వేది దరిద్రమీద నే
తీఱున జీవయాత్ర కడతేఱు గతు ల్గనుపట్టు భారతా!

తలఁపుము జాతులెల్ల నుచితస్థితి భాగ్యము లంది వర్ధిలం
గలిగెడి మార్గముల్ కళలకౌశలమున్ బ్రకటించునట్టి పూ
ర్వ్యులకథలన్ స్మరింపుము సురూపకళావిభవంబుఁ గూర్చు నే
ర్పలవడఁ జేసికొమ్ము మరియాదకు లోపము రాదు భారతా!

అరయుము మేటిసంపదల నార్జనఁ జేయువిధంబు బుద్ధికిన్
స్థిరతమె లేదు వృత్తులను చేకొనఁ బో మెదిమేని పూనినన్
బురపుర నిల్లె మ్రింగెదము మూలధనం బెటు లైకమత్యమే
ర్పఱచుకొనంగలేము మనబాములు వీడ్వడు టెట్లు భారతా!

తీఱని కష్టనష్టములఁ ద్రెవ్వఁగ లేక తపించుచున్న యీ
భారతభూమి నోమఁగల వారలు పాలకు లేలొకో యుపే
క్షావతి నున్నవార? లనుకంప జనింపదె? వారి కాత్మసం
స్కార మొసంగి నైనము సుఖం బొడఁగూరుచుఁ గాత భారతా!

## ప్రేమ

శ్రీరామశర్మ గారు

అరయన్ బ్రేమచరిత్ర చిత్రమగు, స్వప్నావస్థలో జాగృతి
స్ఫురణన్, జాగృతి స్వప్నరీతులను బొల్పొందించు నాప్రేమమ
ద్యరసోన్మత్తత నెత్తికెక్కి కనులన్ వ్యాపించెనే నంత ని
ద్దురయున్ జాగృతి రెండుఁగూడఁ జనునెంతో దూరదూరంబుగన్.

తతసాంసారికకష్టయాతనలచేతన్ ధైర్యముం బాసి స్వ
స్థతఁ గోల్పోయెడు మానసంబునకు సత్యప్రేమఘాతంబు శాం
తతఁ జేకూర్చి సౌఖ్యమిచ్చు నెపుడేఁ దత్ప్రేమపీడావగుం
ఠితచేతస్కుఁడు కానివాఁడు ధరలో నిర్భాగ్యుఁ డూహింపఁగన్.

జగదుజ్జీవకమైన యీశ్వరకటాక్షం బక్షయోదారభ
ద్రగుణాప్తిన్ బ్రసరించు వేనియెడఁ బూర్ణప్రేమపీడార్ద్రితుం
డగు నాతం, డెపుడేని వేనియెడ ప్రేమాఘాతవిజ్ఞానభ
వ్యగతిస్వానుభవం బెఱుంగఁ దదెపో పాషాణ మీభూస్థలిన్.

ఒనరన్ జాలవు క్రోధభేదములు ప్రేమోన్మత్తచిత్తమ్మునన్
బెనుపొందున్ సమతాభిలాష మధురప్రేమవ్యథాముగ్ధచే
తనులౌవారు నిరంతరంబు సుఖనిద్రామత్తులై యెల్లచోఁ
గనులారన్ గనుఁగొంద్రు తా రరసి లోకంబందు ప్రేమచ్ఛవుల్.

పువుగుత్తిన్ జివురాకునందుఁ బ్రణయంపుం బోకడల్ చూచి మెం
డవు నానందముచేత 'ప్రేమి' హృదయం బాకృష్టమై పొల్చుఁ బ
ల్లవమధ్యోద్గతనూత్నపుష్పకలికన్ లక్షించి యెన్నాళ్లు గూ
ఢవిధిన్ బత్త్రిములం దడంగి యిది యుండంగల్గు నం చెంచెడున్.

విడివడి ప్రేమనిద్ర నఱవిచ్చిన చూడ్కులఁ జంద్రుఁజూచి లో
నడరెడు కాంక్షమైఁ బ్రియతమామలహాసము సంస్మరించి ము
గ్ధుఁడగును 'ప్రేమి' తత్ప్రణయగుంభనముల్ జగమందు నెల్లెపెం
బడులను గాంచి యాతఁడు నివాసమొనర్చును ప్రేమవాటికన్.

ఆరెడు ప్రేమవేదన హృదంతరమున్ మథియింపఁ బుట్టు ని
ట్టూరుపు నూత్నజీవనపు టుత్సవమున్ జగమందు నింపుఁ బెం
పారిన ప్రేమబాష్పము లపారకృపారసవృష్టిఁ బొల్చి య
త్నారభటిన్ రచించు జగదాశ్రయదానకథావిధానముల్.

తావి విడివడ్డ యెదియేని పూవు వోలెఁ
జంద్రికారహితుండగు చంద్రుమాడ్కి
నిశ్చయింపఁగ నెందును నిష్ఫలంబు
కేవలము ప్రేమవిరహితజీవితంబు.

(మిల్టన్)

---

## బ్రతుకు

వడ్లమాని అప్పారావుగారు

విరహంపు బరువుచే
నరవీడు కనులలో
నడిలేని నీవలపు సం
దడులు కనిపింప
పదునాల్గులోకాల
పసిడివేకువ మ్రోత
లొకసారి కనిపించి
యూరకే విరమించె...
తుదిసంజ తెరలలో
హృదయరాగములతో
పసిడివసనాల యా
మిసిమి వెన్నెలవలపు
తరళాశ్రువులరాల్చి
తళుకుమని సోకునా
ఈబరువుహృదయంపు
నాబ్రతుకు పాడునా!
నీరవించిన మొయిలు క
న్నీటివలపు లో
భారమేగ్రహియించి

పాడిల్లు నాబ్రతుకు
జల్లు వెడలిన నాటి
చంద్రుడై మ్రోగదా!
నీచూపు తారలై
నిలిచిమాటాడదా!
మనకమబ్బులలోని
కొనరుబిడియమ్ము లీ
విసపుటూర్పులలోన
మనలి వృతినొందవా?
విరహవేదనలలో
కరుణ మైమరపుచే
చెదరిచెదరిన కురుల
నడుము నీ వ్రేళ్లపై
ఇంద్రచాపము నేడు
ఎల్గెత్తిపాడదా?
మొయిలు తెర వీడదా
మూల్గుచెర తూలదా
యీ బ్రతుకు, నీబ్రతుకు
ఏకమై పాడవా!

# రాజా రామమోహనరాయల ధర్మసందేశము

అత్తిలి సూర్యనారాయణ గారు, బి.ఏ.

భరతఖండమునందలి ప్రాచీనార్యమహర్షులు సామాన్యమైనందిన జీవితమునకును ధర్మమునకును సంబంధము చెడకుండుటకై యెన్నెన్ని కట్టుపాటులు, మార్పులు, కాలక్రమమునఁ జేయుచువచ్చినను, భిన్నమతస్థుల కెల్లరకును మనము భక్తిపూర్వకముగ నాతిథ్యసత్కారముల నొసంగు చుండునపుడు, మతవిషయమున సర్వసమ్మతము సర్వోత్కృష్టము నయినవిధానము క్రమముగా నేర్పడక తప్పదని యంత స్పష్టముగా గ్రహించినవారు కారు. అప్పుడట్టి యవసరమును లేకపోయెను. గంగాయమునానదులు కలయుచోటుల, నదీసాగరములు సంగమించు స్థానములఁ బుణ్యతీర్థస్థానములుగఁ బూజించు స్వభావము కలవారు, కబీరు నానకు మున్నగు భక్తవరుల గౌరవించు నభిమతముగలవారు, షణ్మతముల నుద్ధరించు సద్బుద్ధి గలవారు, భిన్నవిషయములను సరళగతిని సమన్వయము చేయఁగల ప్రజ్ఞాఢ్యులు, పెక్కండ్రు బయలుదేఱుచువచ్చిన యీ యార్యావర్తమున సువిశాలవిశ్వధర్మమునకుఁ గ్రమముగా బీజోపకరణములు సమకూర్పఁ బడుచునె వచ్చెను. ధీశక్తికిఁ దగినంత స్వేచ్ఛాచారము నొసఁగి, విశాలహృదయముతో వర్తిల్లి, లౌకిక పారమార్థికవిషయముల కంతగా నంతరము లేకయుండఁ గాపాడ శక్తిగల మహాత్ముఁడు, నూతనజాతీయజీవనమునకు సమర్థమయిన పునాదిని బ్రతిష్ఠ చేయఁ దగు సమర్థుఁడు దేశమునఁ దలయెత్తుట యవసరమైనపుడు సర్వేశ్వరకారుణ్యవిశేషమున బ్రాహ్మధర్మప్రవర్తకుఁడయిన రామమోహనరాయలు బయల్వెడలి, హిందూదేశజీవనాడి పటిష్ఠముగానే యున్నదనెడి యాస కలిగించి, నానావిధము లయిన బ్రదుకుఁ దెరువులఁ బ్రదర్శించి ప్రఖ్యాతిఁ బడసెను.

ఆకాలమునఁ గేవలజ్ఞానయోగము చేతనే మోక్షము సాధింప నగు ననువారు కొందఱును, కేవలభక్తియోగము వలననే పరమపదవి లభ్య మవుననువారు కొందఱును, మఱి, యొక్కొక కర్మయోగముచేతనే యది సుసాధ్య మనువారు పెక్కండ్రును దేశమున బయల్వెడలి, తమతమ భిన్నభిన్నసంప్రదాయములను దమవర్తనముచేఁ గాక, కేవల వాక్కలహాదులతోనే భద్రముగా సంరక్షించుకోఁగోరి, సామరస్యమునుగాక, సర్వవిధముల నశాంతిని జెంపొందించు చుండినందున, దానికిఁ బరిహారమార్గముగ నొకదిక్కునను, గాలక్రమమున దేశస్థు లందఱిచేతను స్వీకరింపఁదగినదిగ నొకప్రక్కను, సర్వజనీనమైన సద్ధర్మమును బ్రదర్శించి దేశము నుద్ధరింపఁగల ధీశాలి తలయెత్తు టవసర మయ్యెను. దేశకళ్యాణిరాగాలాపముచేయు విశ్వగాయకుఁడు, విశ్వకవి, యవసరమైనపుడు, సర్వమతసారము నారసినవాఁడు, జాతీయతత్త్వమును బాడఁగలవాఁడు, రామమోహనరాయలు రంగస్థలమునఁ బ్రవేశింపవలసి వచ్చెను. "ఏకం సద్విప్రాబహుధా వదన్తి ఇంద్రమ్ యమమ్ మాతరిశ్వాన మాహుః" అని సకల విస్పష్టగా వినిపింపఁగల మంత్రద్రష్ట ముందున కడుగిడవలసివచ్చెను. జాతిభేదములేక, దేశభేదములేక, సర్వసాధారణముగ నెల్లరును నిరాకారబ్రహ్మోపాసన చేయఁగలరని, చేయనౌనని, విశ్వసించి, యాధర్మమును—మఱి యామార్గమును తెల్లగ బోధించి, రామమోహనరాయలు బ్రహ్మసమాజ మనెడి యుపాసనా సభను స్థాపించెను.

"శ్రీమహితశ్రుతి స్మృతులచే, బహుశాస్త్రపురాణయుక్తిచే,
నేమిఫలంబు? లౌక్యజనవృత్తికి నీఁ దగు నిర్జరాలయ
గ్రామకుటీనివాసఫలకర్మముచే ఫలమేమి? జన్మదుః
ఖామయభేషజాక్షయమహాసుఖ మొక్కటిదక్క నన్నిటన్.

"కావున, ననంత మమర మక్షర మజంబు
బ్రహ్మము భజింపు మతివికల్పములు వలదు:
బ్రహ్మసంగికి భువనాధిపత్యభోగ
పదవియును నీకుఁ దుచ్ఛమై పరగుఁ జూవె."

యని భర్తృహరియోగీంద్రుఁ డుపదేశించిన రీతినే, యీమహాత్ముఁడును బోధించి చిరకాలమునుండి శుష్కించి, తహతహలాడు చుండిన జీవాత్మ కింతజీవము పోసినవాఁ డయ్యెను.

ఈ విషయమై నవ్యమతము స్థాపించుటయం దీమహాత్ముఁడు మతమునకు మూలము వివేక మని స్పష్టముగాఁ గనఁబఱిచి, తన్మూలమున బుద్ధికి సర్వస్వాతంత్ర్యము సమకూర్చి, యిది బ్రహ్మము కా దది బ్రహ్మము కా దనెడి సామాన్య 'నేఽతి' వాదములను విడిచినవాఁ డయ్యెను, ఈ హేతువుచేతనే విశ్వధర్మమును సువ్యక్తముచేసి, లోకసామాన్యమైన ధర్మముండుట యత్యావశ్యకమని యతఁడు ప్రకటింపఁ గలిగెను. యోగ్యవర్తనము, సర్వాంగశిక్ష, సర్వసోదరభావము, సర్వేశ్వరోపాసనము ననునవి దానికైన సాధనచతుష్టయమని తన జీవితవర్తనములవలన విస్పష్టపఱిచెను—మన కెల్లరకును పురాణసిద్ధమైన మత మొకటి పుట్టువుతో మెడకుఁ గట్టినది యున్నదని బయలుదేఱుచు, స్వానుభవసిద్ధమగునా కాదా యనువిచారముతో సంబంధములేక యుండునట్లుగఁ జేసికొను చున్నందుననే, భగవంతుఁడు పూర్వులకు నార్యులకు మాత్రమె గోచరుఁడై మన కగ్రాహ్యుఁడుగ నున్నవాఁడని భావించుటచేతనే మనకీ జీవరాహిత్యము, విన్నన్న చెప్పినదే వేద మనెడి వెఱ్ఱినమ్మిక, కలుగుచున్నవి. మన కనుభవములోనికి వచ్చినదే మనది; మఱి, మన జీవితములో సాక్షీభూతముగాఁ గనఁబడునదె మనది. వేదాదులచేఁ బ్రకటింపఁబడువాఁడె దేవుఁడుగాక, యాత్మానుభవమునకు వచ్చినవాఁడె దేవుఁడు. ఆత్మప్రకాశకుఁడె పరమాత్ముఁడు. ఆత్మానుభవములేని వేదవిశ్వాసము అఱిగించుకోలేని యన్నమువంటిది. వజ్రసూచ్యుపనిషత్తులో జాతిభేదము లేదని, యుండరాదని, చెప్పఁబడిన దన్నంతమాత్రాన, మనబాధ లేమైన తగ్గుచున్నవా? మన నిత్యజీవితానుభవములలో వ్యక్తమాసపుడె గదా మనకది యర్థవంతము ఫలవంతము నగుచున్నది? పరమాత్మ రూపరహితము, కాలస్థలాబాధ్య మని గ్రంథస్థధర్మము లెన్నియున్న నేమిఫలము? అది యానందము నమృతము నని యెన్ని శుష్కవాక్యములు విన్న నేమి ప్రయోజనము? సాకారవిషయములకంటె నన్యముల మనము గ్రహింప యత్నింపనపుడు, నాత్మవికాసమును మన మందనపుడు, మఱి యేమి లాభము?

మత మనఁగా నేవో కొన్ని నియతసమయములయందే వ్యక్త మగుచుండునది గాక, జీవితకార్యములందెల్ల, వ్యాపారములయందెల్ల, చింతనలయందెల్లఁ, బ్రదర్శితమగు బ్రహ్మసంబంధరూపమహాశక్తి యని రామమోహనుఁడు సదుపదేశము చేసెను. సుఖదుఃఖాదివివిధద్వంద్వావస్థలయందు, స్వదేశవిదేశభిన్నప్రయోజనములందు, సమబుద్ధిని గలుగఁజేసి, స్త్రీపురుషాదిభేదముల ద్విజద్వితేతరభిన్నదృష్టిని వర్తిల్లక, సర్వజనుల సమభావముతోఁ జూచుచు, నెవరినేనిఁ జుల్కఁజూడక గౌరవించుచు వర్తిల్లుటే ధర్మపద్ధతి యని యాత్మజీవితమార్గమున నకలంకస్థితిని బోధించెను. సుందరపదార్థములఁ జూచుకోర్కి కన్నులకుఁ గల్గునట్లే, మధురపదార్థములఁ జవిచూడవలయు ననువాంఛ రసనకుఁ గలుగునట్లే, సుగంధ మాఘ్రాణింపవలయు ననెడి యభీష్టము ఘ్రాణేంద్రియమునకుఁ గలుగునట్లే, మానవాత్మ పరమాత్మానుసంధానమునకై ప్రబలతరముగ వాంఛించు చున్నది. ఇది సర్వజనసామాన్యధర్మము. తల్లికి బిడ్డకుఁ బరస్పరప్రేమ వెలయునట్లే పరమాత్మకు భక్తునకు వెలయు చున్నది. ధర్మపద్ధతిని భక్తుఁడు సకలజీవితవ్యాపారములలో బరమాత్మసాన్నిధ్యము నన్వేషించి, వాంఛాసిద్ధి, యాత్మోన్నతి, యానందము, మోక్షముఁ బడయు చున్నాఁడు—నియతమార్గమును దప్పక నభోవీథిని నక్షత్రసంతతులు సంచారము నేయుచుఁ దేజోమయము లగుచున్నవి కదా! ఆవిధముననే సర్వమానవులును సోదరభావమున వినీతహృదయమున సన్మార్గము వీడక, శాశ్వతానందపదవి నందఁగలుగు చున్నారు.

జనసామాన్యము సర్వేశ్వరపితృభావముఁ గ్రహించునపుడు, సర్వమానవభ్రాతృభావముఁ గలిగియుండక, భేదదృష్టితోనే వెడమొగములు పెట్టుకొనుచుండుట పరస్పరవిరుద్ధ మనియు, మతమునకును, మతసిద్ధాంతములకును, క్రియలకును సంబంధమె బొత్తిగా లేకయుండుటయు, మఱి మతమె లేకయుండుటయు, రెండును తుల్యములే యనియు, నట్టినామమాత్రమతమును గల్గియుంటవలని ప్రయోజనము, మన వేమనయోగి వచించినట్లు, 'దొంగగొడ్డుమెడను దుంగఁ గట్టినయట్లె'



12

యందు ననియు నతని నిశ్చితాభిప్రాయము లయియుండెను. మున్ను మాధవాచార్యులు విజ్ఞానభిక్షు మున్నగువారు షడ్దర్శనములను సమన్వయము కలుగఁజేసినట్లె కబీరు నానకులు పదునేనవశతాబ్దమున హిందూముసల్మాను ధర్మములను సరళసంయోగమును సాధింపఁ బ్రయత్నించినట్లె యీ మన నవయుగారంభమునందును రామమోహన దీర్ఘదర్శి ప్రాచ్యపాశ్చాత్యధర్మవిజ్ఞానములను, నీతిన్యాయములను, సంబంధము కలుగఁజేసెను. కొన్నిమతములవారు దేశమున ప్రాభవమునంది, శుద్ధసన్న్యాసము గాకపోయినను, లోకవ్యాపారములతో నంతగా సంబంధము లేని శుద్ధాద్వైతమును గూర్చిన విపరీతాభిప్రాయములనెల్ల వెల్లడించి, లేనిపోని సంప్రదాయముల లేవఁదీసి యవియే మోక్ష మతిచేత నవలీలఁ బెట్టునని గట్టిగా నమ్మి సంఘాభివృద్ధిమాట పెడచెవినిఁ బెట్టి బెట్టిదముగ బాహ్యావేషాడంబరములతోనే ప్రొద్దులు పుచ్చుచుండినపుడు, ధర్మజీవనము కత్తిమీఁది పెనుసామువంటిది సుమా, కష్టపడి సాధించి సంఘమును ధర్మబద్ధముగఁ జేయవలయును సుమా, భక్తిని విడిచిపెట్టిన మన బ్రతుకు వాసనలేని పూవువలె, చుక్కమాలి పింఛెవలె నైపోవును సుమా, యని హితోపదేశముచేసి, తాను సన్మార్గమును బ్రకటించి, మనల నెల్లర నుద్ధరించినవాఁ డయ్యెను. ఈ గుణోత్తరుఁ డొకదిక్కున విగ్రహారాధనము గూడదని చెప్పుచు నది బయలు వెడలుటకు నిమిత్తము లయిన కూటసిద్ధాంతములను దూరముచేసి వాని నున్మూలింప నునువైన సత్సంప్రదాయమును సహితము మనయెదుటఁ బెట్టెను. అశాశ్వతములు, క్షణభంగురములు, సాకారములు నయిన యేపదార్థములను గాని, విగ్రహాదులనుఁ గాని, బ్రహ్మమందిరములలో నిలుపరాదని నిషేధించునపుడును, పరమతదైవతములఁ దెగడుచు నచ్చోట నెన్నఁడును సంభాషింపఁ దగ దని ఖండితముగా శాసించినపుడును, బలివధ లచ్చోఁ జనికిరావనియు, మఱి యాహారనిమిత్తమైనను మాంసాదులుగాని, మఱి యేయితరపదార్థములుగాని యటకుఁ గొనివచ్చి సేవింపరాదనియు, ఈశ్వర భక్త్యారాధనములకు సంబంధింపని పాటలు, పదములు, నచ్చటఁ బాడరా దనియు, నట్టి భిన్నోపదేశములనైన జనసామాన్యములోఁడి యైకమత్యమునకు, మైత్రికి భంగకరములయిన యుపదేశసంభాషణాదులనైనఁ జేయరా దనియు, నేకేశ్వరారాధనమునకు, వదాన్యతకు, మైత్రికి, సోదరభావమునకు దోడ్పడువానినే యాదరింపవలెననియు, వీనిని సరిగాఁ బాలించుచుండుటకై యోగ్యుఁ డగువానినే యధ్యక్షునిగా నేర్పఱుచుచుండవలయు ననియు, విధినిషేధము లేర్పాటుచేసినప్పుడును, తన యున్నతాశయములనెల్ల సంగ్రహముగాఁ దెలియఁబఱిచెను.

ఈ యన్నిఁటినిఁబట్టి రామమోహనరాయలు ఆధ్యాత్మికజీవనమున నేనేవి యవసరములో, మఱి యేవేవి ప్రతికూలములో ఖండితముగాఁ జెప్పి, దేశాభివృద్ధికిని లోకశ్రేయమునకును దోడ్పడు ధర్మసూత్రముల సూక్ష్మముగా నెటులెఱుంగఁ గలిగెనో మనము గ్రహించి యానందింపనేర్తుము. సర్వజనోపాస్యుఁ డయిన పరమపిత మనహృదయమందిరమందే యధిష్ఠించి యున్నాఁడు. ఆతఁడే సర్వభూతాంతరాత్ముఁడై, నిఖిలరసామృతమూర్తి యై మనచేయు మేలిపనులన్నిటియందు వ్యక్తమగు చున్నాఁడు. మనసంఘమే మన విశాలాత్మ యగుచున్నది. మన మందిరములు మంగళప్రదములుగా నున్నపుడె శుచిగా నున్నయపుడె లక్ష్మి యందు నెలకొనవచ్చు ననెడి సామాన్యశుక్రవారకథనుబట్టి, మనహృదయములును, మన విశాలహృదయము లయిన సంఘములును దోషరహితములుగా నున్ననె, సర్వేశ్వరపూజామందిరములు సర్వేశ్వరనిలయములు నగుచున్నవి. ఇందుచేతనే సంఘరాజ్యాంగసంస్కారాదులు రామమోహనదృష్టిని విశ్వనాథునికిఁ బూజాద్రవ్యము లగుచున్నవి. సేవ లగుచున్నవి. మన చేయు నెట్టి చిన్నపనియైనను, తలంచు నెట్టి చిన్న తలఁపైనను, పూనెడి దే యలౌకికార్యమైనను విశ్వేశ్వరున కుపహారమె యగు చున్నది.

రామమోహనుఁడు లోకశ్రేయార్థము శమదమాదులును, బ్రత్యేకవ్యక్తులందు భాసిల్లవలయు ననియు, నార్థికరాజ్యాంగస్థితిగతులును జిత్తసంస్కారమునకుఁ దగినట్టుగ నెలయవలయుననియుఁ, దా నొనర్చిన పనులనుబట్టి, పూనిన యుద్యమములనుబట్టి, తేటపఱిచెను. రామమోహనుఁడు.

"సత్యనూచనా వినా సకలి వృథాయ్"

"ద్విభావ భావ కి మన ఏక భిన్న దుయినాయ్"

అను పల్లవులతోఁ జేసిన భగవత్కీర్తనములును, ద్వైతభావమును విడిచి, సత్యమునే యవలంబింపుఁడని చేసిన యుద్బోధనములును, సాధనాంగములను స్పష్టముగాఁ దెలుపుచున్నవి. ఇవి యన్నియు నొక్కరీతినె యేకేశ్వరవిశ్వాసములు, తత్సాధన మార్గములును, జీవితమునం దెట్లు మతము ప్రకాశింపవలయునో, మఱి సంఘమునందును, దేశమునందును, సర్వమానవకోటియందును, ఏ చందమున ఆ ధర్మము క్రమవికాసము నందవలయునో, యే యుద్యమమైన ఫలప్రదముగా భవ్యముగాఁ బ్రకాశింప వలయు నన్న, దాస్యసఖ్యవాత్సల్యాదిభావములను గ్రియారూపమున ననుభవమునకుఁ దెచ్చికొని, విశాలవిశ్వమానవజీవితధర్మముల నెట్లు వికాసమందఁ జేయవలయునో, స్పష్టపఱుచుచు, నున్నతాదర్శమును బ్రదర్శించుచు, వానినెల్ల బోధించిన రామమోహనునియందును, మఱి పరమేశ్వరునియందును, గౌరవమును భక్తిని సత్యాధికముగా హృదయమున హత్తించుచున్నవి.

# ప్రేమమూర్తి

ఓలేటి సీతారామమూర్తి గారు.

నీ కనుచూపు తీవియల నీడలలోన విషాదరేఖికల్
బ్రాకిన యామహూర్తమున భస్మముసేయును స్వాంతకోటర
వ్యాకుల వహ్నికీల నను ;—నార్పగజాలును దాని బ్రేమమూ
ర్తీ! కళలొల్కుచుండెడు త్వదీయకటాక్షపు మోహనీరమే.

నీ వదనారవిందమున నిర్మలహాసము మాయమైనచో
తేవిరి నేలరాలి ముకుళించిన వైఖరినొంది వెల్లనై
పోవగ వేడియూర్పులను బుచ్చుచ భూమినిగ్రుంగి, లేచెదన్
నీ వరహాసకౌముదులు నిస్తులమాధురి నొల్కలిప్తలోన్.

నీ చవులూరజేయు కమనీయపువేణునినాదపున్ సుధా
రోచుల శోకభావకళ బ్రుంగి నటించిన నొక్కటేనియున్
బూచినతీవ వేసవినిబోలె కృశించెదసుమ్ము ప్రేమశీ
లీ! చిలికించుదాక లలి బ్రేమరసంబును నీదుగీతులన్.

జారగ నాస్యఘర్మకణజాలము మోహనగండభాగన
వ్యారుణిమంబు పొంగగ బ్రయాసముచే మధుమూర్తి! వేడిని
ట్టూర్పు నీవు పుచ్చగ తదుష్ణము మాడ్చును నాహృదబ్జమున్
జేరి త్వదీయచుంబనవినిర్మలహైమకణాళి జల్లుమీ!

నీవునటించు గానమును నించెదు భాసురహాసచంద్రికల్
బ్రోవులుగాగ జల్లెదవు ముజ్జగముల్ భవదీయలీలగా
నావనధిన్ నటించుతరి బ్రాజ్యసుఖోన్నతివెల్లి ప్రేమరా
శీ! విలిఖించుకొందు నినె జీవితకాలముసర్వమున్హృదిన్.

# దైవసంఘటనం

బి. టి. శ్రీనివాసాచారి గారు

వేణుకి పదునేనిమిదేండ్లకంటె ఎక్కువుండవు. బెజవాడ మ్యునిసిపల్ హైస్కూలులో స్కూలుఫైనలు చదువుతున్నాడు. సాధారణమైన పొడవు, చామనచాయకలిగి కండలు తీరిన శరీరం, కోలమొహం చూడ ముచ్చటగవుంటాడు కుఱ్ఱవాడు. తల్లీ తండ్రీ వున్నారు. వారి కితనొక్కడేకొడుకు. దేవుడిదయవలన వారికి భూవసతికి ఏమీ తక్కువలేదు. ఆవూళ్లోనే వారి కొక పెద్ద అందమైన భవనముంది, దాంట్లో కాలక్షేపం చేస్తున్నారు.

పెద్దపరీక్షలయినాయి ; వేసంగిశెలవులుకూడా యిచ్చారు. బెజవాడలో ఎండలు మహోపద్రవంగా వున్నాయి. సాయంకాలమయేటప్పటికి ఎక్కడలేనిజనం చల్లగాలికోసరం కృష్ణఒడ్డుకు చేరుతుంటారు.

ఒకనాటిసాయంకాలం 4 గంటలకి వేణుకూడ మెల్లగా బయలుదేరి కృష్ణాబ్రిడ్జిదగ్గిరకెళ్లి యిసికమీద కూర్చుని ఏవో కూనిరాగాలు తీస్తున్నాడు. ఇంతలోకే అతనిదృష్టి స్వచ్ఛమై నీలాల్లాగ మెరిసేటటువంటి ఆనీటి నాకర్షించింది. రాగంతీయడం ఆపేశాడు. ఆకాశంయొక్క ప్రతిబింబం అందులో వింతగా చూస్తున్నాడు. చూసినకొద్దీ వుత్సాహం ఎక్కువవుతోంది. కడుపులో భావాలు గగ్గోలుపడుతున్నాయి. అట్లా పరికించి చూడగాచూడగా ఆ వినీలకాంతిలో యితనికి విశ్వజననీకరుణాప్రపూర్ణదృష్టి దృగ్గోచరమైంది. కృష్ణవేణమ్మతల్లియొక్క దీవనపూర్వకమైన చల్లని పిల్లవాయువు లతనిపైకి వీచాయి. ఆ పెయొక్క సునందనశతతరంగము లొక్కసారిగ భ్రాతృవాత్సల్యమున నవ్వుతూ యితనిని కలుసుకొనుటకు పరుగెత్తుకొనివచ్చాయి. ఆ నవ్వివుడు బైటపడిన పల్వరుసచిందిన బిందుసందోహంలో కన్పించింది.

ఈ యపూర్వసందర్శనంవల్ల ఆతనిహృదయం బ్రహ్మానందభరితమై వెల్లువలుగా కండ్లవెంబడి ప్రవహించింది. శరీర మొక్కసారి జలదరించింది. కొంతసేపటికి కళ్లుతుడ్చుకుని నాలుప్రక్కలా చూశాడు. కొంచెందూరంలో ఒక తెప్పమీద చేపలవల అల్లుకుంటూ కూర్చున్న పల్లెపిల్లవాడు కనబడ్డాడు. వాణ్ణిచూసేటప్పటికి జలవిహారంమీద పోయింది మనసు. అక్కడనుంచి లేచి వానిదగ్గరకెళ్లి, "ఒరే అబ్బాయి నీకొకపావలా యిస్తానుగాని నన్ను కొంచెం నీపడవమీద అటూయిటూ తిప్పుతావు" అని అడిగాడు. పావలా పేరువినగానే పరమానందంతో పల్లెవాడితనిని పడవఎక్కించుకుని తెడ్లు వెయ్యడం మొదలుపెట్టాడు.

స్వచ్ఛమై అతిగంభీరంగావుంది కృష్ణానది. ఎక్కడా కదలికన్నమాటలేదు. అటువంటినీళ్లలో వేణు ఎక్కినతెప్ప ఆ పల్లెపిల్లాడు తెడ్లేస్తోంటే మెల్లిగా బ్రిడ్జీపక్కనుంచి సాగిపోతోంది. అతడాదృశ్యాన్ని చూచి ముగ్ధుడై పోయాడు. మానససరోవరంలో తటతట రెక్కలుకొట్టుకుంటూ మందయానంతో పోతూవున్న రాజహంసపై నెక్కి స్వర్గానికి ప్రయాణంచేస్తోన్న ట్లనిపించింది అతనికి. ఆవేశపూరితుడై గాఢంగా నదీగర్భానికేసి చూశాడు. కాని యీసారిమాత్రం ఆ పవిత్ర మాతృమూర్తి కనుపించలేదు. ఒక ప్రభాపుంజప్రణయసుందరి సాక్షాత్కరించింది. శరీర మొక్కసారి రోమాంచలమైంది. ఇంతదనుక అతని హృదయపీఠము నలంకరించిన మాతృమూర్తి లేచి యా ప్రణయమూర్తిని దానిపై సధిష్ఠింపచేసింది. జాగ్రదవస్థలో స్వప్నసుఖ మనుభవిస్తోన్నట్లైంది అతనికి.

ఇటువంటి మహదానందంలో మునిగియుండగా. ఇంతలో ఏదో రాయిపెట్టి నెత్తిమీద ఫెడేల్‌మని కొట్టినట్లైంది. పాపం సుఖస్వప్నం భంగమైంది. అదిరిపడ్డాడు. తీవ్రమైన కోపంకూడా వచ్చింది. దెబ్బతగిలినచోట చేతితో గట్టిగా అదిమిపట్టి తలపైకెత్తిచూశాడు — ఏమి కన్పడింది ?—అప్పుడే వస్తోంది గుంటూరు బండి బ్రిడ్జిలోంచి. ఆ బండిలోవుండే పిల్లలందరు నీటిలోకి కాన్లు విసిరేస్తున్నారు. కాని యితనిదృష్టిమాత్రం తనకెదురుగానున్న పెట్టెకిటికీలోంచి ఏదో విసిరివేసినదానివలె చెయ్యి పైకెత్తి క్రిందికి వంగిచూస్తూన్న గులాబీరంగుచీరకట్టిన ఒకపిల్లపై పడింది. ఆపెట్టె బ్రిడ్జీదాటిపోయేంతవరకు అటువైపే చూశాడు. తర్వాత దెబ్బతగిలినచోట తడుముకుంటూ క్రిందికిచూశాడు. ధగధగ మెరుస్తూవున్న ఒక వజ్రపుఉంగరం తెప్పలో పడివుంది. ఆదుర్దాతో దానిని తీసికొని పరాకాయించి చూసేటప్పటికి శారద యను అక్షరాలు దానిమీద వున్నాయి. ఆపేరు చదివేటప్పటికి అతనిమన సదొకవిధంగా మారిపోయింది. ఏవేవో కొత్తకొత్తవూహాలు పుడుతున్నాయి. రెండుచేతులతో పట్టుకొని ఆవుంగరాన్ని పదేపదే ముద్దుపెట్టుకున్నాడు.

కొంతసేపటికి మళ్లీ వెనక్కితిరిగిచూశాడు. సిగ్నలివ్వకపోవడంచేత బండి బ్రిడ్జీదాటి ఆగిపోయింది. చటుక్కున యితనికేదో వూహ తట్టింది. తెప్ప ఎంతదూరం వచ్చిందో అని చూశాడు. అప్పుడే మొదటిస్తంభం దాటింది. వెంటడితే—ఆపల్లెవాడితో తెప్పని తొందరగా వెనక్కిపోనియ్యమన్నాడు. సరేనని వాడు పడవతిప్పి తొందరగా తెడ్లు వేస్తున్నాడు. పదినిమిషాల్లో పడవ ఒడ్డుకుచేరింది. ఆవుంగరం తనవేలికిపెట్టుకొని జేబులోంచి ఒక పావలాతీసి పల్లెవాడికిచ్చి గబగబ ఒడ్డెక్కాడు.

ఇందాక యితను చూసినపిల్ల సెకండుక్లాసుపెట్టెలో కనబడింది. గభాలున అక్కడే ఆగిపోయి ఆమెకేసిచూశాడు. ఆమె కూడా యితనికేసే చూస్తోంది. ఏమిచెయ్యడానికి తోచలేదు యితనికి. మళ్లీ ముందుకునడిచి మెల్లిగా తలవంచుకొని ఆమెదగ్గిరకెళ్లి నించున్నాడు. ఈవిధంగా యితను తనదగ్గిరకొచ్చి నించోడం చూసి ఆమె సిగ్గుపడింది. బుగ్గలు ఎరుపుతేరాయి. కాని వింతగాచూస్తోంది

యితనివైపే. మెల్లిగా తలెత్తాడు. ఇద్దరిచూపులుకలిశాయి. ఒకరి హృదయం ఒకరికి కళ్లల్లో కన్పించింది. పక్కపెట్టెలో ఇదంతా చూస్తోన్న ఒకపెద్దమనిషి క్రిందికి దిగి, గభాలున వీళ్లని ఫోటో తీసాడు. పాపం వీ రది చూడనేలేదు. ఇంతలోకే రైలు కూత వేసింది. ఆ కూత వాళ్లహృదయాలలో మారుమ్రోగింది. అదిరి పడ్డారు యిద్దరు. అప్పుడు వేణు ఎట్లాగైతే నేం ధైర్యంచేసి "శారదా...యిదుగో...నీ వుంగరం...నా పడవలో పడింది." అని తన వేలికున్న వుంగరం తీశాడు. శారదాఅనేపిలుపు వినేటప్పటికి తన పేరితని కెట్లా తెలిసిందా అని ఆశ్చర్యపడిందిగాని వుంగరం అనేటప్పటికి చటాలున తనవ్రేలికేసి చూసుకుంది. పాపం ఆపిల్ల వుంగరం పడిపోయినసంగతి అంతవరకు ఎరగనే ఎరగదు. అంత పరాకేమిటంటారేమో? ఆ పిల్ల కాసీ తీసికొని నీటిలోకి విసిరేసింది. ఆ విసిరేటప్పుడు వుంగరం వొదులుగా వుండడంచేత అదికూడా అందులో పడిపోయింది. తర్వాత ఆవిడ క్రిందికి చూసింది. అప్పుడు వేణు విహారం చేస్తోన్నటువంటి తెప్ప ఆమె హృదయాన్ని ఆకర్షించింది—అసలింతవరకు ఆ వుంగరాన్ని చూసుకోటానికి ఆమెకు తీరికేదీ! ఆ తెప్పకేసి చూడడంతోనే సరిపోయింది అప్పటినుంచి—అప్పుడాపిల్ల సిగ్గుచేత ఆదుర్దాచేత తడబడ్తూ, "అవునండీ—నాదే—కాసి విసిరేసే టప్పుడు ఒదులుగావుండి జారి మీ పడవలో పడిందిగామోసు. నయమే—పాపం" అని మెల్లగాచెప్పి చెయ్యి చాపింది. వేణు వుంగరం ఆమె వేలికి తొడిగాడు. చెయ్యిచెయ్యి తాకడంలో శరీరాలు పులకరించాయి.

ఇంతలోకే సిగ్నలిచ్చారు. గార్డు పచ్చజెండా వూపాడు. రైలు కూతవేసి కదిలింది. అప్రయత్నంగా ఆమె చెయ్యివచ్చి యితని చెంపకితాకింది. దానినితడు గాఢంగాముద్దుపెట్టుకున్నాడు. బండి సాగిపోయింది. ఇతనుమాత్రం అక్కడే నిలబడిపోయాడు. చేతు లూపుకుంటూ చూపు లందేవరకు ఒకరినొకరు చూసుకున్నారు.

వేణు మెల్లిగా ఆలోచిస్తూ తనచేతులకేసి చూసుకున్నాడు. చూసుకునేటప్పటికి శారద వుంగరం తన వేలికేవుంది, తన వుంగరం లేదు. "అరె! పొరపాటున ఈవుంగరానికి బదులు నావుంగరం తొడిగేశానే శారదవేలికి!" అనుకున్నాడు. కాని ఏంజేస్తాడు? మెల్లిగా ఇంటికేసి బయల్దేరాడు. దారిలో అనేకవూహాలు తట్టాయి. తన ఓడపికాపు, వుంగరంనెత్తి మీదపడటం, ఆరైలాగటం, ఇతనా బండిలో వాళ్లు తన్నుచూస్తారని సిగ్గుగాని భయంగాని లేకుండా ఆమెతో మాట్లాడటం, ఆ వుంగరాల మార్పు ఇవన్నీ తల్చుకొని ఆశ్చర్యపడ్డాడు. ఇక ముందామెను కల్సుకొనటం ఎట్లాగా అనుకున్నాడు. ఇంతలోకే ఎవరో స్నేహితు డెదురుపడ్డాడు. అతనితో కలిసి యింటికి వెళ్లాడు.

రైలువచ్చి స్టేషన్‌లో ఆగింది. సామానులన్నీ దిగాయి, మనుషులుకూడా దిగారు. శారదమాత్రం పరధ్యాన్నంగా యింకా పెట్టెలోనే కూర్చుని కిటికీలోంచి అవతలకి చూస్తోంది. ఆమె చిన్న తమ్ముడు గోపి వచ్చి "అక్కయ్యా యింకా యిక్కడే కూర్చున్నావేమే! మేమంతా దిగిపోతేనూ" అని చెయ్యిపట్టుకు లాగాడు. అప్పుడామె తటాలున అదిరిపడి లేచింది. ఇంతట్లోకే ఆమెచేతి వుంగరం వాడికంటపడింది. "అక్కయ్యా యీ కొత్తవుంగరం ఎక్కడిదే నీకు?" అని అడిగాడు. "కొత్తవుంగరం ఏమిటిరా, పాతదే" అని చేతికేసి చూసుకుంది—ఏముంది?—నిజంగా వాడు చెప్పినట్టు కొత్తవుంగరమే. దానిమీద వేణు అనే అక్షరాలు ప్రజ్వలిస్తూ కనబడ్డాయి. మొఖ మింతయింది. వెంటడితే, తమ్ముడు అక్కడవున్నాడనికూడా చూడకుండా గాఢంగా ముద్దుపెట్టుకొని హృదయాని కేసి అదుముకుంది. ఇంతట్లోకే వాళ్ల నాన్నగారి కేక వినబడేటప్పటికి తమ్ముడితో కలిసి చటుక్కున క్రిందికి దిగిపోయింది. అందరూ కలిసి స్టేషన్‌లోంచి బైటికొచ్చారు, సొంతకారు అక్కడ వీళ్లకోసం సిద్ధంగావుంది. దానిమీదెక్కి ఇంటి కెళ్లారు.

భోజనాలై బైటికొచ్చేటప్పటికి 8 గంటలయింది. రామారావుగారు వరాండాలో యీజీచైరులో పడుక్కొని తాంబూలము వేసుకుంటున్నారు. వీరు తమ కూతురు శారద నీటిలోకి కాసీ విసిరి తొంగి క్రిందనున్న తెప్పకేసి చూడటం మొదలుకొని వేణు వచ్చి వుంగరంఇచ్చిపోయేవరకు కనిపెట్టి చూస్తోనే వున్నారు. కాని ఆయనకు కూతురుపైనుండు ప్రేమచేతనో లేక వేరేదైన కారణంచేతనో ఇంతమట్టుకు శారద చేసినదాంట్లో ఏమీ తప్పు తోచలేదు. మీదు మిక్కిలి వారిర్వురినీ చూస్తే ముచ్చటైంది. కుర్రవాడు కనక మంచి స్థితికలవాడైతే వాళ్లిద్దరి కెట్లాగైనా పెండ్లి చెయ్యాలనుకున్నాడు. ఇంతట్లోకే ఈయనభార్య వంటింటోంచి భోజనం చేస్తూ "ఇదుగో—అక్కడవున్నారా—ఈ గోపిగాణ్ణి కేకెయ్యండి. నిద్రపోకుండా వంటింటో గుర్రాలు తోల్తున్నాడు" అని అర్చింది. "ఒరే, గోపీ, యిట్లారా" అని పిల్చాడు. ఆకుర్రాడు పరుగెత్తుకుంటూ తండ్రిదెగ్గిర కొచ్చాడు.

"ఏమిట్రా వెధవా అల్లరిచేస్తున్నావు నిద్రపోకుండాను?"

"కాదునాన్నా, నాకు నిద్ర రావడంలేదు."

"ఏడ్సావులే, పోయి మాట్టాడకుండా పడుకో'

"ఇవ్వాళ నీదగ్గిర పడుక్కుంటా నాన్నా"

"నాదగ్గిర చోటుచాలదురా, అక్కయ్యదగ్గిర పడుకో"

"నాన్నోయ్, మరే, అక్కయ్యే, ఎక్కడ్దో కొత్తుంగరం పెట్టుకుంది."

"నువ్వెప్పుడు చూశావు?"

"రైలుబండీలో నాన్నా."

"ఇప్పు డేంచేస్తోంది అక్కయ్య"

"నిద్రపోతోంది."

"సరేగాని నువ్వింక పడుక్కుందుగాని రా" అని వాణ్ణి శారద పడుక్కున్నగదిలోకి తీసికెళ్లి ఒకపక్కన ఆమెమంచం మీదే పడుకోపెట్టి ఆమె చేతివుంగరాన్ని పరీక్ష చేశాడు. వేణు అనేపేరు కనబడింది. లోపల ఏదో అనుకొని తలవూపాడు. తర్వాతతన గదిలో కెళ్లి మంచంమీద పడుక్కుని ఏదో ఆలోచిస్తూ నిద్రపోయాడు.

తెల్లవారింది. కాల్యకృత్యాలన్నీ తీర్చుకొని కాఫీత్రాగి అట్లా కూరగాయలమార్కట్టుకేసి వెళ్లాడు రామారావుగారు. సరిగ్గా ఆసమయానికే అక్కడికి వేణు కూరగాయలు తీసికెళ్లడానికి సైకిల్ మీద వచ్చాడు. ఈయన అతనిదగ్గిర కెళ్లి "అబ్బాయి నీపేరు వేణుకాదు?" అన్నాడు. "అవునండీ."

"మీ నాయనగారి పేరు?"

"ఆచంట కనకసుందరంగారు."

"నువ్వేమి చదువుతున్నావు బాబూ?"

"స్కూలుఫైనలండీ."

"ఓహో అయితే మీ ఇల్లెక్కడ?"

"గాంధీనగరంలో పూర్ణానందం సత్రం వెనకనండీ"

"సరే" అని ఆయన ఇంటికి వెళ్లిపోయాడు.

మధ్యాహ్నభోజన మైనతర్వాత మెల్లిగా బయల్దేరి కనకసుందరంగారింటి కెళ్లి చాలాసేపు వాళ్లపిల్లవాడినిగురించి ఆస్తిపాస్తులగురించి మాట్లాడారు రామారావుగారు. తర్వాత కనకసుందరంగార్ని వారిభార్యను తమఇంటికి తీసికెళ్లి పిల్లనుచూపించాడు. సరే అంటే సరే అనుకున్నారు. కనకసుందరంగారిభార్య "మా అబ్బాయికూడ సాయంకాలంవచ్చి పిల్లను చూస్తాడు" అంది. అక్కర్లేదు, ఆయన చూసుకోవడం ఇదివరకే అయింది" అన్నాడు రామారావుగారు. అప్పుడే వకబ్రాహ్మణ్ణి పిలిపించారు. ఆయన పంచాంగంచూసి ఆ నెలలోనే ఒక సుముహూర్తం నిశ్చయించాడు. తాంబూలాలుకూడా పుచ్చుకోవడమైంది.

పెద్దలచే నిశ్చయింపబడిన సుముహూర్తాన వేణూ శారదలకు పెండ్లి మహావైభవంతో అయింది. అయిన రెండునెలలకే పిల్లని కాపురానికి పంపారు.

ఒకరోజు మధ్యాహ్నం భోజనా లయాయి; వేణు పడకకుర్చీలో పడుక్కున్నాడు. పక్కన శారద నిల్చుని తమలపాకులకు సున్నంరాసి చీల్చిస్తోంది. ఇంతట్లోకే పోస్టుజవానువచ్చి కేకవేశాడు. వేణు లేచి వెళ్లి అతను యిచ్చిన సమదర్శినీ ఉగాదిసంచిక తీసుకొచ్చి మంచంమీదకూర్చున్నాడు. బంగీవిప్పి పుటలుతిరగెయ్యడం మొదలుపెట్టాడు. శారదకూడ మంచందగ్గిరకెళ్లి అతని భుజముపై నానుకుని చూస్తోంది. అట్లా కొన్ని కాగితాలు తిరగేసేటప్పటికి ఒకపేజీలో "కాముకులు" అనే టైటిల్‌తో వీళ్లిద్దరు ఆరోజు, రైలులో ఆవిడ—క్రింద ఇతనూ, ఒకరి నొకరు మోహదృక్కులతో చూసుకుంటోన్నట్లుగా చిత్రింపబడివుంది. "అరరె! అప్పుడు మనమిద్దరం అట్లావుండగా ఎవడో స్నాప్‌షాట్‌ఫోటోతీసినట్టున్నాడే!"

"ఆ! అవును."

"ఆహా! శారదా, మనయొక్క సంగతి తల్చుకుంటే ఎంత విచిత్రంగా వుంటుంది! ఇట్లా మనం కలుస్తామని కలలోనన్నా అనుకున్నాము?"

"అవును. మనదంతా ఒక సినీమా లాగుంది."

"అబ్బే, సినీమాలా గయితే, కథానాయకురాలు అనేక కష్టాలపాలవడం, వాటన్నిటినుంచి కథానాయకు డామెను రక్షించడం, చివరకి వాళ్లు పెళ్లాడడం జరగాలి. అట్లాకాదుగా మనది? ఇక్కడ కథానాయకురాలికి కష్టాలూలేవు, కథానాయకుడు తప్పించనూ లేదు."

"ఇటువంటి కథానాయకు డున్నపుడు కథానాయకురాలికి కష్టాలు రావడమే!" అని నవ్వుతూ అతని భుజాలమీద వ్రాలింది శారద.

ఆమెను సందిట్లోకి తీసుకొని "అవును, ఇదంతా దైవసంఘటనమేకాని మన ప్రయత్న మేమీలేదు" అనిగాఢంగా హృదయానికేసి అదుముకుని ముద్దుపెట్టుకున్నాడు.

---

## అనార్కాలి

దామెర రాజగోపాలరావు గారు

మామకీనగృహారామసీమలోనఁ
జారునిర్మలకాసారతీరమందుఁ
జొక్కట మ్మగు దానిమ్మమొక్క యొకటి
పెంచుకొనుచు నున్నాఁడనేఁ బేర్మితోడ.

కొన్నినాళ్లామె ; అంతనా చిన్నిమొక
బాలపల్లవసంగతప్రాంశువిస్తృత
మంజులమహీరుహంబుగా మారిపోయి,
పొలుపుమీఱంగఁ దానొక్క పూవుఁబూచె.

సలలితోద్యానములయందు సౌఖ్యగతిని
సంచరించెడి షట్పదచక్రవర్తి,
సంతతామోదహేలాప్రశాంతమూర్తి
మించు నర్మిలి దానిఁ బ్రేమించియుండె.

అదిమనోజ్ఞప్రశాంతసంధ్యాసమయము ;
స్ఫారఝుంఝూసమీరప్రసారవేల్లి
తాగముననుండి అయ్యయో! ఆసుమమ్ము
సడలి వెడఁదఁవుఁ బుడమిపైఁ బడియె వడిగ.

ఇంక నచ్చోట నాబంభరేశ్వరుండు
దనదుప్రాణేశ్వరిన్ మదిఁ దలఁచి తలఁచి,
వాడి ; యుద్దవడిఁ దడవు వగచి వగచి,
భూరివిమనార్ణవమ్మున ప్రుంగెనకట!

అరుణసహకారవిటపిలతాగ్రమందుఁ
గూరుచుండిన యొకమదకోకిలమ్ము
అన్నితాంతకఠోరదృశ్యమ్ము గాంచి
శాంతముగఁ బాడె నొక్కవిషాదగీతి.



16

# వైకుంఠయాత్ర

శ్రీమతి బెంగుళూరు నాగరత్నము గారు

దేవఋషియగు నారదుఁ డొకప్పుడు భూలోకసంచారము చేసి విష్ణుభగవానుని దర్శనముకై శ్రీవైకుంఠమునకు పోయినాఁడు. అతఁడు లోపలికి వెళ్లి చూచునప్పటికి విష్ణుమూర్తి శేషశయ్యపయిని విరాజమానుఁ డయి దర్శన మిచ్చెను. దగ్గఱనే జగజ్జనని యగు శ్రీమహాలక్ష్మి శ్రీహరిచరణసేవయందు మగ్నచిత్తయై యగపడినది. నారదుఁడు విష్ణునకు నమస్కరించి తదాజ్ఞానుసార మొకయాసనముపై నాసీనుఁ డయినాఁడు. విష్ణు వతని నాశీర్వదించి...రావోయి నారదా! ఈసారి నీవు చిరకాలమున కగపడినావు. అంతయు క్షేమమే కదా...అని యడిగెను.

నార :—తమదయవలన క్షేమమే. దేవా! నేను లోకములలో తిరుగుచుఁ దిరుగుచు భూలోకమునకు పోతిని. అందువలన శ్రీహరిచరణసేవకు రాఁజాల నయితిని.

విష్ణు :—నారదా! భూలోకమున కేఁగితి నంటివి గదా! ఇపు డచ్చట నేమి సమాచారము? వింత లేమేని యున్నవా?

నార :—దేవరా! ఏమని మనవి చేయుదును? ఇపు డచ్చట కలియుగప్రభావము నానాఁటికి హెచ్చిపోవుచున్నది. కాని యింకను కలికి తన ప్రయత్నములవలన పూర్ణఫలితము చేకూర లేదు. ఇప్పటికిని అనేకులు దానాదులయిన ధర్మకార్యములమూలమున శ్రీచరణసేవాప్రాప్తికొఱకు ప్రయత్నించుచునే యున్నారు.

విష్ణు :—(నవ్వి) నారదా; అన్నియు నెఱిఁగిన నీకుఁగూడ నీభ్రాంతి వదలినది గా దని మే మాశ్చర్యపడుచున్నాము. భూలోకమిప్పుడు తనమోహమాయలో లిప్తమయి యున్నసంగతి నీవు కనిపట్టలేకపోయినను మేము కనిపట్టితిమి. వారి కిప్పుడు వైకుంఠమునకు వచ్చుట కవకాశ మెక్కడిది? చూచుచున్నావుగదా! పాపము! లక్ష్మి యొక్కతెయే సేవాకార్యములలో లగ్నచిత్తయై యున్నది.

నార :—(చేతులు జోడించుకొని) దయామయా! అదేమి తమ రాలాగు సెల విచ్చుచున్నారు? భూలోకమునం దొక రిద్దఱు గాదు వందలకొలఁదిగ, వేలకొలఁదిగ, లక్షలకొలఁదిగ...కాదు కాదు కోట్లకొలఁదిగ—భక్తులు తమ దివ్యసేవకు వచ్చుటకు మిగుల నుబలాటపడుచున్నారు. తమ రాజ్ఞ దయచేయుటేతడవుగా నే నెందఱనో సంసారులను శ్రీవారి దివ్యసేవకు తీసికొని రాఁగలను.

విష్ణు :—నారదా! ఎవ్వరును తమ మోహజాలమును విడుచుకొని మా సన్నిధికి వచ్చుటకు కోరనే కోర రని మే మాలోచించు చున్నాము. మంచిది. నీ కంత కోర్కెయు, సామర్థ్యమును ఉన్నపక్షమున నింకొక్కసారి భూలోకమునకు పోయి ప్రయత్నించి చూడుము. వచ్చునదియు రానిదియు నీకే బోధపడును.

నార :—దేవా! తమ రాలాగున సెల వియ్యకుఁడు. నేను భూలోకమునకు వెళ్లి చెప్పుటయే తడవుగా తండోపతండములుగా వచ్చి వైకుంఠము నిండుదురు. నా కనుజ్ఞ దయచేయుఁడు. మరల వేగముగానే శ్రీవారిదర్శనమునకు వచ్చెదను.

విష్ణు :—పోయి వేగముగ రమ్ము.

## ౨

నారదభగవానుఁడు విష్ణుమూర్తివలన సెలవు పొంది భూలోకమునకు వచ్చి మొట్టమొదట శ్రీవిష్ణున కత్యంతభక్తుఁ డని జగత్ప్రసిద్ధిగన్న ధర్మానందునియొద్దకు వెళ్లినాఁడు. అతఁడు శ్రీవైకుంఠప్రాప్తికై మూఁడువందల యఱువదిదినములును బ్రాహ్మణసమారాధనలు జరపుచుండును. అతని మందిర మెప్పుడు చూచినను సదనుష్ఠానపరాయణు లయిన పండితప్రకాండులకు నిత్యనివాసమయి యుండును. నేఁడు శతచండి జరగినట్టయిన రేపు సహస్రచండి. అది ముగిసినతోడనే గాయత్రీపురశ్చరణోత్సవము విష్ణుసహస్రనామపారాయణములును భగవద్గీతాపారాయణములును. అవి యివి యన నేల? విష్ణుప్రీతికరములయిన యావత్కైంకర్యములును సదా జరగుచునే యుండును. అవి చాల వేమో యని యతఁ డనేకపర్యాయములు శీఘ్రముగ విష్ణుసాన్నిధ్యము లభించు నుపాయము చెప్పుఁ డని నారదుని ప్రశ్నించుచుండును గూడ. అట్టి పరమభక్తుని చూచి నారదుఁ డి ట్లనియె :—

నార :—భక్తశిరోమణీ ధర్మానందా! ఏమినీయనుపమభక్తి! నీ పుణ్యప్రభావమువలన విష్ణుభగవానుఁడు నీయెడ ప్రసన్నుఁ డయినాఁడు. వేగముగ బయలుదేఱి రమ్ము. ఆయన నిన్ను వైకుంఠమున స్మరించుచున్నాఁడు. "ఆలస్యా దమృతం విష" మ్మన్న న్యాయ మెఱుఁగుదువు గనుక "శుభస్య శీఘ్ర" మ్మన్నమాటను గమనించి వీలయినంత వేగముగ బయలుదేఱుము.

ధర్మా :—నారదభగవానులవారూ! నావంటి పామరుని పయిని, పతితునిపయిని భగవంతుని కంతగా దయగలుగుట నా యదృష్టము గదా! కాదు కాదు. తమకు నాయందలి వాత్సల్యము! నేను భగవత్సాన్నిధ్యమునందు చేరుకొంద మని యెంతగా కోరుచుండువాఁడనో తమరే యెఱుఁగుదురు. కాని, మునిచంద్రమా! వెంటనే బయలుదేఱు మనుచున్నారే! అదిమాత్రము సాధ్యపడదనుకొనియెదను.

నార :—ఏమీ ఇంకను నీకు విషయవాసనవలన తృప్తి కలుగలేదటోయి! నీ విదివఱ కెన్నిసారులో "స్వామీ! నాకు వేగముగ వైకుంఠప్రాప్తి కలిగింపుఁ" డని నన్ను హెచ్చరించువాఁడవుగదా! రావోయి వేగముగా వైకుంఠమున నిన్ను విష్ణుదేవుఁడు స్మరించు చున్నాఁ డనఁగానే రాక "అదిమాత్రము సాధ్యపడ" దనుచున్నావుగా!

ధర్మా :—అది కాదు దేవమునివర్యా! నా ప్రవృత్తి విషయ వాసనవలననుండి యెప్పుడో నివృత్త మయిపోయినది. తమరు నమ్ముడు, నమ్మకపోండు, నేను పేరుమాత్రమునకు గృహస్థుడను కాని యథార్థసన్యాసినే సుమండీ!

నార :—ఏమోయి! అట్లయినచో నీ కిపుడు వైకుంఠము నకు వచ్చుట కేమి యాటంక మున్నది? ఆలస్యమున కేమి పని యున్నది? లేచి వేగము రమ్ము.

ధర్మా :—అయ్యా! నా కేవిధమయిన సాంసారికేచ్ఛయును లేనే లే దని మనవి చేసికొనియే యుంటినిగదా! అయినను, సాంసారికకర్తవ్యములు భగవంతుం డేర్పాటుచేసినవి పాలించు టావశ్యకము గాదా?

నార :—ఏమయ్యా! ఇంకను నీవు పాలించుటకు మిగిలి యున్న కర్తవ్యము లే మున్నవి?

ధర్మా :—అన్నియు ముగిసినవి కాని ముఖ్యకర్తవ్య మొక్కటి మాత్రమే బాకీ యున్నది. అది మఱొకటి కాదు, మఱొకటి కాదు. ముఖ్యమే అని తమరును అంగీకరించెదరు. అది తీరిపోఁగానే సరి. మఱి నా కేయాటంకమును ఉండదు. అదియును దినములలోనే ముగించుకొనుటకు సంకల్ప మున్నది. అది జరగినతోడనే యే యాలస్యమును లేకుండ తమయాజ్ఞను శిరసావహించుటకు సిద్ధుఁడను. అంతముఖ్యకర్తవ్య మదేమి టందురా? నాకుమారునకు పెండ్లిచేయుట.

నార :—(తనలో...వీని కన్నియీషణలును పోయిన వని యనుకొంటిని గాని పుత్త్రైషణ వీనిని వదలలేదు. అది సామాన్య ముగా వదలునదియును కాదు.) మంచిది నీ విపుడు పుత్త్రుని వివాహ ప్రయత్నమున నుండుము. నేఁడే నే నెవని నయినను భగవంతుని సేవకు తోడ్కొనిపోవ వలయును.

ధర్మా :—దేవరా! తమయాజ్ఞను నెఱవేర్పఁజాలనందులకు నన్ను మన్నించి యీసారికి నన్ను విడిచిపెట్టుఁడు. తమ రింకొకసారి దయచేయునప్పటికి సిద్ధముగ నుండెదను. తమరును శీఘ్రముగానే దరిసెన మిప్పించెదరు గదా! సెలవు దయచేయుఁడు. లోపల కొంచెము పని యున్నది.

నార :—పొమ్ము; పోయి నీపనిలో నీ వుండుము.

3

నార :—ఈధర్మానందున కన్నియుఁ దీరిపోయినవి, తప్పక వచ్చు నని నే నెంతో ఆశించితిని గాని వీని కింకను పుత్త్రైషణ వదల లేదు. ఇట్టివాఁడు వైకుంఠమునకు రా నర్హుఁ డె ట్లగును? కాఁబట్టి ధనాల పోలిసెట్టిని తోడుకొని పోయెదను. అతఁడు నిజమయిన భక్తుఁడు. అతనికుమారునికి పెండ్లికూడ నయిపోయినది. కనుక నేయా టంకమును చెప్పక వెంటనే బయలుదేఱి వైకుంఠమునకువచ్చును. (అని పోలిసెట్టియింటికిఁ బోయి) ఏమయ్యా పోలిసెట్టి! ఏమి చేయుచుంటివి?

పోలి :—స్వామీ! దయచేయవలెను. నా కొక్క హరి భజన తప్ప నేమిపని యుండును? ఇరువదినాలుగుగంటలును నా కా యొక్కటియే ముఖ్యకర్తవ్యము. ఇపుడిపుడే యొకగొప్ప యజ్ఞమును విష్ణుప్రీత్యర్థము చేసి ముగించితిని. దేవలోకముననుండి వచ్చుచున్నారు గనుకను తమరును వినియే యుందురు.

నార :—ఆలాగుననా? అటులేని పోలిసెట్టీ! నీ వెంతయు ధన్యుఁడవు. నీ యజ్ఞము సఫల మయినది. దయచేయుము. విష్ణుభగ వానుఁడు వైకుంఠమునందు తన సేవకు నిన్ను తోడుకొని రమ్మని నన్ను పంపించినాఁడు. ఆలస్యము చేయక వేగ బయలుదేఱుము.

పోలి :—స్వామీ! విష్ణుభగవానుఁడు నన్ను స్మరించుట నాయదృష్టము. నేఁటికి నామనోరథము పూర్తి యయినది. సంసా రమునందు సాధకునికి సిద్ధికంటెను అధికానందదాయకమును, లభ్య మును అగువస్తు వింకొకటి యేముండునండీ!

నార :—అటులేని త్వరగా రమ్ము. మాటలు దారిలో మాట లాడుకొందము. ఆతఁడు నీరాక కెదురు చూచుచుండును.

పోలి :—(చేతులు జోడించుకొని) స్వామీ! క్షమింప వలెను. తమ రీలాగున తొందరపెట్టినట్టయిన నే నేమి మనవి చేసికోఁగలను? ఏ మయినను సరియేకాని ప్రస్తుతముమాత్రము నేను వైకుంఠమునకు రాఁజాలను. ఇట్లన్నా నని యన్యథాగా నాలోచింపక నన్ను మన్నింప వేఁడెదను.

నార :—(కోపసూచకముగా) ఏమయ్యా! ఇపుడు వైకుంఠమునకు బయలుదేఱ వయ్యా అనఁగానే బయలుదేఱి రాక యేమేమో చెప్పుచున్నావే! వచ్చుటకు నీ కే మభ్యంతర మున్నది? నీ కింకను సాంసారికవాసనలనుండి మనస్సు మరల లేదటవోయి? ఓరి దురదృష్టవంతుఁడా!

పోలి :—స్వామీ! మన్నింపుఁడు. ఉన్నయథార్థము మనవి చేసికొందును. నిజముగా నాకు నా నిమిత్త మేవిధమయిన యిచ్ఛయు లేదన్న నమ్ముదురుగాక! కానిసర్వజ్ఞులు తమ రెఱుఁగని యంశ మే మున్నదండీ! కర్మమున కనంతరము ఫలప్రాప్తినిమిత్తము కోరిక ఉండుట సర్వజనసాధారణమే కదండీ! దీనదయాళూ! తమరును వినియే యుందు రనుకొనియెదను. ఇపుడే గతవర్షమున నే నా యేకపుత్త్రునకు వివాహము చేసివేసితిని. ఈ కన్నులతో ఒక్క సారి మనుమని ముద్దుమొగము చూచి యందువలనఁ గలుగునానం దము ననుభవింపవలయునన్న చిన్నకోరికమాత్రమే మిగిలియున్నది. అసలుకంటెను వడ్డీ ప్రియ మయినది గదండీ! అంతకు మించిన కోరిక నా కెంతమాత్రమును లేదు.

నార :—అటులేని పోలిసెట్టీ! నీ విపుడు వైకుంఠమునకు రాఁ జాల వన్నమాట!

పోలి :—స్వామీ! తమతో యథార్థ మంతయు మనవి చేసికొంటిని గా దండీ! ఆ రవ్వంతముచ్చట తీరిపోయినదన్న సరి. మఱి నా కీలోకముతో నేమియు సంబంధము లేదు. వైకుంఠమునకు కాదు—ఎక్కడికి రమ్మన్నను వచ్చుట కే యభ్యంతరమును లేదు. మన్నింపవలెను.

నార :—మంచిది సెట్టీ! నీవు పౌత్రముఖదర్శనానందమును పూర్తి చేసికొమ్ము. భూలోకములో ఎందఱో భక్తులు వైకుంఠ యాత్రకు సిద్ధపడి యుందురు. నే నిపు డెవరి నయినను వెంటఁబెట్టు కొని పోయెదను. నీకు నాయందున్న భక్తి స్నేహములనుబట్టియు నీభజనయందలి విశ్వాసముచేతను నిన్ను పిలుచుకొని పోఁదలంచితిని గాని భక్తులు లేక కాదు. అయినను మీ రందఱును గృహస్థులు. సాంసారికములయిన వాసనలయందు సాలెపురుగుపన్నినవలలోఁ బడి చిక్కినయీఁగలవలె లిప్తు లయి యున్నారు. కావున నే నిపుడె

ప్రణవానందస్వామియొద్దకు వెళ్లి యతనిని వెంటఁబెట్టుకొని పోయెదను. ఆయన యిపుడు సంసారవాసన లన్నియు విడుచుకొని యేకాంతస్థానమునఁ గూర్చుండి భగవంతుని ధ్యానము చేయుచున్నవాఁడు. అటువంటివారే వైకుంఠయాత్రకు తగుదురు గాని మీవంటి సంసారుల కది యెట్లు లభ్యమగును?

పోలి :—చిత్తము స్వామీ! తమదయ మాకుండవలెను గాని యెప్పటికయినను వైకుంఠమునకు చేర్పఁగలరు. అటులేని తమ రిపుడు దయచేయుఁడు. నాకును ఇంటిలోపల కొన్ని ముఖ్యమయినపనులు నెఱవేర్చుకోవలసినవి యున్నవి. రాకరాక తమ రిన్నాళ్లకు దయచేసితిరిగదా యని యింతవఱకయినను మాటలాడఁగలిగితిని. చిత్తము. నా కనుజ్ఞ దయచేయింపుఁడు. వందనాలండి స్వామీ! (పోవును)

నార :—(తనలో) ఈ పోలిసెట్టి నిజమయినహరిభక్తుఁ డనుకొని మోసపోతిని. వీని హరిభజన అంతయు లోకులను మోసపుచ్చుటకే అని యిపుడు తెలిసికొంటిని. మరేమియు మించిపోలేదు. సర్వసంగపరిత్యాగము చేసికొనియున్న యా ప్రణవానందస్వామి యొద్దకే పోయెదను అని వీణవాయించుచు "భజగోవిందం భజగోవిందం గోవిందం భజ మూఢమతే!" అని పాడుకొనుచు పోవుచున్నాఁడు.

౪

నార :—ఏమయ్యా! ప్రణవానందస్వామీ! ప్రస్తుతేమేమి జరగుచున్నది?

ప్రణ :—ఓహో! నారదభగవానులవారు! చిరకాలమునకు దర్శనభాగ్యము లభించినది. దయచేయవలెను. స్వామీ! ఏమి జరగుచున్నదని యడిగితిరే! దయాహో! సన్న్యాసి కాత్మచింతనము, పరోపకారము తప్ప నిం కేమిపను లుండును జరపుటకు?

నార :—ప్రణవానందా! నీ యాత్మచింతన మిన్నాళ్లకు ఫలించినది. పదుము...విష్ణుదేవుఁడు నిన్ను తనసేవకై వైకుంఠమునందు స్మరించుచున్నాఁడు. ఆయన పంపినందుననే నిన్నును తోడ్కొనిపోవుద మని వచ్చినాఁడను. లె మ్మాలసింపక.

ప్రణ :—ఓహో! ఏమి నా పుణ్యము! భగవంతుఁడు నావంటిమూర్ఖుని తన కైంకర్యమునకు యోగ్యునిగా నెంచుట కంటెను నాకు సౌభాగ్యవిషయ మింకొకటి యుండునా? అంతయు తమదయ! కాని దేవమునిచంద్రా! మన్నింతురుగాక. నే నీసమయమున వైకుంఠమునకు రాఁజాలనని చెప్పవలసి వచ్చినందుల కెంతయు జింతించుచున్నాను. వారు నన్ను స్మరించుట, తమరు నన్ను తోడ్కొనిపోవ వచ్చుట నేను రాఁజాల ననుటయునా? అయినను ఏమిచేయవచ్చును? పరిస్థితు లట్లు లేర్పడినవిగదా!

నార :—(ఆశ్చర్యముతో) ఏమయ్యా! ప్రణవానందస్వామీ! ఒకనిని రమ్మని యన్న "నా కొడుకు పెండ్లి బాకీ యున్నది. అది ముగిసినతోడనే వచ్చెద" నన్నాఁడు. ఇంకొకనిని రమనఁగా "స్వామీ? మనుమని మొగము చూచి యానందించి వెంటనే వచ్చెదను" అన్నాఁడు. మఱొకనిని రావయ్యా! అనిన "మనుమని పెండ్లిమాత్రమే మిగిలియున్నది, అది ముగియఁగానే హాజ" రన్నాఁడు. ఏమోసంసారుల కనేకములు కోరిక లుండుట సహజము కాని సర్వసంగపరిత్యాగి వయిన నీ కేమిటి యింకను బాకీ యున్నదయ్యా?

ప్రణ :—భగవానులవారూ! పుత్రపౌత్త్రాది సంసారమంతయు అనిత్యము. సంసారమునందు లిప్తులయి యుండుట సంసారుల కర్మదోషము. కనుకనే మావంటి జ్ఞాను లట్టి తుచ్ఛవస్తువులయందు కోరిక యుంచుకోరు.

నార :—అటులేని నీకటువంటి కోర్కు లేవియు లేనియవ్వుడు వైకుంఠమునకు వచ్చుటకు నీ కే మభ్యంతర మున్నదయ్యా?

ప్రణ :—స్వామీ! యథార్థము మనవిచేసెదను. వీఁడు ప్రస్తుతము "ప్రణవానందమఠము" స్థాపించువిషయమున మగ్నచిత్తుఁడయి యున్నవాఁడు. అందునిమిత్తే మించుమించుగా ఒకలక్ష రూపాయలు వ్యయమగును. వీనిశ్రమ సాధనాదులమూలమున నిప్పటి కెట్టులో ఏఁబదివేలు సంపాదించి యుంచఁబడినవి. తమ దయవలన మిగత 'ఏఁబదివేలును వసూలు చేయవలసియున్నవి. వీఁడు వెళ్లి యడుగుటయే తడవుగా చందాలు వేసినవారియ సిద్ధులయి యున్నారు. ఆ రవ్వంత కార్యమును పూర్తి కాఁగానే యింక వీని కీ భూలోకమున నుండవలసినపని యేమున్నదండీ! పదంపడి తమ యాజ్ఞను శిరసావహింపఁగలఁడు. నారాయణా!

నారదుఁడు నవ్వుచు వీణ బుజాన వైచుకొని వైకుంఠమునకు పోయినాఁడు.

౫

విష్ణుభగవానుఁ డట్లే శేషశయ్యపయిని పవళించియుండెను. జగన్మాత ఆదిలక్ష్మి యెప్పటిచొప్పుననే శ్రీహరిపాదకైంకర్యము చేయుచున్నది. అదేసమయమున నారదుఁడు భజగోవిందం పాడుచు ప్రవేశించినాఁడు. ఏకాంగిగా వచ్చిన నారదుని చూచి విష్ణువు—

"ఏమోయి నారదా! భూలోకయాత్ర చేసి వచ్చితివా?

నార —చిత్తము స్వామీ!

విష్ణు :—వైకుంఠభిక్షుకులు భక్తు లెక్కడ నుంచఁబడిరి? వారినికూడ నీతోనే యేల తేలేదు?

నార :—జగద్రక్షకా! క్షమింపవలెను. తమ రన్నమాట అక్షరముల సిద్ధించినది. తమ రన్నట్టు నేను వాస్తవముగా భ్రమపడిపోయినాను. నిజముగానే సంసారము తన మోహమాయలో లిప్తమయియున్నది. భూలోకవాసులలో నొక్కనికిని వైకుంఠమురాఁ దీరికలేదు. కోరికయు లేదు.

విష్ణు :— నీ వేమేమో అంటివిగదా! ఇపుడుకూడ అనేకులు యజ్ఞాదులమూలమున వైకుంఠప్రాప్తిని కోరుచున్నారని. తీరినదిగదా నీ సందేహము?

నార :—భగవానులవారూ! నా భ్రాంతివిలాసమును మన్నింతురుగాక. తమరు సెలవిచ్చిన యంశమున సందేహము మందునకయినను లేదు. ప్రకృతకాలమున, ఒక రిద్దఱు గాదు. ఎందఱో మహానుభావులు బ్రాహ్మణ సమారాధనములని, యజ్ఞానుష్ఠానములని, వ్రతోపవాసములని, దానములని, ధర్మము లని యనేకవిధములయిన సత్కార్యములు చేయుచున్నమాట వాస్తవమే. కాని దయాస్వరూపా! అదియంతయు డాంబికమే యని నా యనుభవము చెప్పక చెప్పినది. తమతమ లౌకికనామప్రసిద్ధినిమిత్తమే యెల్లవారును తహతహ లాడుచున్నారు. భగవత్ప్రాప్తి...అథవా వైకుంఠప్రాప్తినిమిత్తము వాస్తవికమయినకోర్కి యెవ్వరి హృదయములయందును లేదు లేదు లేదు.

విష్ణు :—వత్సా! దిగిననే కాని లోఁతు తెలియదు. వారి వారి కర్మదోషమునకు నీ వేమి చేయుదువు. లెమ్ము కలికాలము!

నార :—అవును దేవా? తమరు సెలవిచ్చినదే యథార్థము నన్ను మన్నించి యనుజ్ఞ దయచేయుఁడు పోయివచ్చెదను!

విష్ణు :—మంచిది వీలయినపుడు వచ్చి యగపడుచుండుము.

నార :—చిత్తము... సెలవు గొనియెదను.

# రౌండు టేబిల్ సభా ప్రధాన ప్రతినిధులు



బ్రిటిషు ప్రధాని
రామ్సే మాక్‌డొనాల్డు గారు



ఇండియా మంత్రి
వెడ్జివుడ్ బెన్ గారు



సాంకే ప్రభువు గారు



సర్. తేజ్ బహద్దర్ సప్రూ గారు



శ్రీ భోపాలు నవాబు గారు



శ్రీ బికనీరు మహారాజా గారు

# రౌండుటేబిల్ సభకు వెడలిన మదరాసు రాష్ట్ర ప్రతినిధులు



సర్ ఏ. పి. పాత్రో గారు



శ్రీమతి సుబ్బరాయన్ సతి గారు



రా॥ బ॥ ఏ. టి. పన్నీర్ సెల్వం గారు



దీ॥ బ॥ ఏ. రామస్వామి మొదలియారు గారు



పర్లాఖిమిడి రాజా గారు



సర్ సి. పి. రామస్వామి అయ్యరు గారు



కే. టి. పాల్ గారు



కే. శ్రీనివాసన్ గారు



దీ॥ బ॥ ఎం. రామచంద్రరావు గారు

# గ్రామ పంచాయతులు

జాస్తి సాంబశివరావు చౌదరి గారు, బి.ఏ., బి.ఎల్.

హైందవ సామ్రాజ్య భావిరాజ్యాంగసౌభాగ్యమునకు గ్రామపునర్నిర్మాణమును, గ్రామమునందలి ప్రజలయొక్కయు, నందు ముఖ్యముగ నధిక సంఖ్యాకులగు రైతులయొక్కయు క్షేమమును ముఖ్యావసరములు. ప్రస్తుతరాజ్యాంగ విధానమునందును ముందు రాబోవు రాజ్యాంగవిధానమునందును సంపూర్ణబాధ్యతాయుత ప్రభుత్వమును స్థాపించుట రాజ్యాంగకర్తల యాశయమై యున్నది. అందు ముఖ్యముగా సంపూర్ణరాష్ట్రస్వాతంత్ర్యము మనకు త్వరలో లభింపనున్నదని యాశింపవచ్చును. కనుక పూర్వముకన్నను భవిష్యత్కాలమునందు 'గ్రామము' రాజ్యాంగవిధానములో ప్రాముఖ్యమును బడయవలసి యున్నదని నిస్సందేహముగా జెప్పవచ్చును. పూర్వము హిందూరాజ్యాంగవిధానమునం దేమి, తదుపరి మహమ్మదీయ ప్రభుత్వమునం దేమి, హిందూదేశమునందు 'గ్రామము' ప్రాముఖ్యమునుబడసి రాజ్యసౌష్ఠవమునకు మూలాధారమై మిగుల నాగరికతతో వర్ధిల్లుచుండెనని మనము చరిత్రవలన గ్రహించగలిగియున్నారము. ఈ విషయమై డాక్టరు అనిబిసెంటుగారు పురాతన హిందూదేశచరిత్రను పరిశోధించి యప్పటి హైందవ గ్రామ సౌభాగ్యమును, నాగరకతయును, ప్రపంచమునకంతయు మిన్నయై యాదర్శప్రాయముగా నుండెనని వ్రాసియున్నారు.

అదియునుగాక 'గ్రామపంచాయతి' యను మాసపత్రికలో పంచాయతిని గురించి యిట్లు వ్రాయబడియున్నది. "పంచాయతి మన దేశమునకు క్రొత్తగాదు. మన దేశము పుట్టినప్పుడు అదియుం బుట్టినది. కాని పూర్వము దానికున్న పరిపూర్ణమైన యంతస్థు ఈ దినమున లేదు. ఎరుకలు ఏనాదులలో పంచాయతి కింకను పూర్ణబల మున్నది. పెండ్లి, చావు, పోట్లాటలు, కొట్లాటలు అన్నిటిని వారిలో పంచాయతి తీర్చును. అదియే వారికి హైకోర్టు, ప్రీవీకౌన్సిలు. పై కులములలోను అనుదినము ఫలానావారు ఫలానాచోట పంచాయతిపడినందున పోయియున్నారనుమాటలు వినవచ్చును. నిజమే. ఈ పంచాయతిలోసభ్యుడు ఒక్కొక్కప్పుడు ఏ బలవంతుడైన రెడ్డియో కావచ్చును. కాని మనదేశహృదయములో పంచాయతికి గల తావు నిది ప్రబలముగా ధ్రువపరచుచున్నది. పంచాయతి మన రక్తములోని గుణముగా పుట్టినదనుటను ఇది వ్యక్తపరచుచున్నది. పంచాయతి నిశ్చయముగా మన మూలపురుషులతో బుట్టినది. మనతోబుట్టువుగనుండ పెనగులాడుచున్నది. మనము నశించుటయు నది లేకపోవుటయు నేకకాలముననే జరుగవలయును. మనము లోకమున మన సంతతులతోడంగూడ సజీవులైయుండ నోచుకొనినచో పంచాయతియే మన కా నోమును నిలుపగలది." (గ్రామపంచాయతి నవంబరు 1930 పేజి 50).

ఇక ప్రస్తుత కాలములో మన 'గ్రామములు' రాజ్యాంగ విధానమునం దెంతవరకు పాల్గొనుచున్నవో విచారించుదము. రాజ్యాంగమున కెక్కువభాగము శిస్తు (రివిన్యూ) చెల్లించునది గ్రామము. అట్లుండ నొక గ్రామము చెల్లించిన సిస్తునకు దగినట్లుగా తిరిగి యా గ్రామము లాభమును పొందుచున్నదా? లేదు. ఆ గ్రామవిషయములలో నా గ్రామము జోక్యము కలుగజేసికొన గ్రామాభివృద్ధిని గ్రామస్థులు గావించుకొనుచున్నారా? లేదు. గ్రామమునకు సంబంధించిన రోడ్లను, వంతెనలను గ్రామస్థులు వేయించుకొని ఆరోగ్యమునకు సంబంధించిన కార్యములను గ్రామస్థులు చేసికొనుటకు మారుగ తాలూకాబోర్డువారో లేక జిల్లాబోర్డువారో లేనియెడల రివిన్యూ డిపార్టుమెంటునకు సంబంధించిన కలెక్టరులో చేయవలసియున్నారు. కాని యే గ్రామమునకు సంబంధించిన యభివృద్ధులు ఆ గ్రామముయొక్క ధనముతో నా గ్రామస్థులు చేసికొనుటకు వారికి శక్తియు నవకాశమును లేదు. 6000 మైళ్లు దూరమున నున్న బ్రిటిషు పార్లమెంటు మన దేశమును పాలించుటకన్నను మన దేశస్థులైన ప్రజాప్రతినిధులు మన దేశముయొక్క పరిస్థితులు, కష్టసుఖములు బాగుగా నెరిగినవారు పరిపాలించిన నెటుల నెక్కువ లాభదాయకమో, అట్లే గ్రామమును చాల దూరములోనున్న స్థానికసంఘములుగాని రివిన్యూ ఆఫీసర్లుగాని మన గ్రామములోని యభివృద్ధికి సంబంధించిన విషయములలో జోక్యము కలుగజేసికొని పరిపాలించుటకన్న గ్రామములోని పరిస్థితులను లోపములను కష్టసుఖములను తెలిసిన గ్రామస్థులే, అనగా గ్రామములోని కొంతమంది పెద్దమనుష్యులే పరిపాలించుట గ్రామాభ్యుదయమునకు మిగుల లాభదాయకమని నిస్సందేహముగా జెప్పవచ్చును.

ఇట్టి లాభమును గుర్తించియే మద్రాసు గవర్నమెంటువారు 1930 సం. లో లోకల్ బోర్డుల ఆక్టునుసవరించి గ్రామములకు 'పంచాయతు' లను స్థాపించవలసినదిగా నేర్పాటు చేసియున్నారు. ఈ సవరణకు పూర్వము గ్రామవ్యవహారములు గూడ తాలూకాబోర్డుకు లోబడియుండి తాలూకాబోర్డువారిచేతనే పరిపాలించబడుచుండెడివి. 1920 సం. పు పంచాయతీ ఆక్టు అమలులోనున్నను మొత్తముమీద గ్రామపంచాయతులు ప్రతి గ్రామమునను స్థాపింపబడియుండలేదు. ప్రస్తుతము సవరణయైన చట్టము ప్రకారము సాధ్యమైనంతవరకు ప్రతి గ్రామమునను గ్రామ పంచాయతీ యేర్పరచబడి గ్రామ వ్యవహారము లన్నియును గ్రామపంచాయతీకి లోబడియుండును. అప్పుడు ప్రతి గ్రామమును దానియొక్క యభివృద్ధి వ్యవహారములను తానే చక్కబెట్టుకొని మిగుల యాదర్శప్రాయమై రాష్ట్రప్రభుత్వమునకును అఖిలభారతరాజ్యాంగవిధానమునకును సహాయభూతముగా నుండును. కనుక భావికాలమున "గ్రామ పంచాయతి" రాజ్యాంగ విధానమునందు పాల్గొని గ్రామాభ్యుదయమునకును ప్రభుత్వసౌష్ఠవమునకును తోడ్పడుటకు చాల యవకాశ మున్నదని చెప్పవచ్చును.

1929-30 సంవత్సరపు ప్రభుత్వమువారి "పంచాయతుల పరిపాలన రిపోర్టు" ప్రకారము మద్రాసురాజధానిలో మొత్తముమీద సంవత్సరాంతమునకు 3756 పంచాయతులు గలవు. ఇందులో 231 పంచాయతులు కొన్ని కారణముల వలన రద్దుచేయబడినవి. మద్రాసు రాజధాని మొత్తముమీద అన్ని జిల్లాలలోను గలిసి సుమారు 75000 గ్రామములు గలవని జెప్పవచ్చును. ఇందులో 3 వేలకు పైగా మాత్రమే పంచాయతులపరిపాలన యేర్పరచుకొని యున్నవనుటలో నేమియు గొప్పతనము లేదు. క్రమక్రమముగా ప్రతి గ్రామమునందును పంచాయతు లేర్పడిన గాని గ్రామజీవనము ఆదర్శప్రాయముగ నుండజాలదు. గ్రామములకు పంచాయతు లెంత యుపయోగకరములో గ్రహించుటకు తూర్పుగోదావరిజిల్లాలోని యొక గ్రామపంచాయతిని నిదర్శనముగా దీసికొనవచ్చును. కోటిపల్లి యను నొక గ్రామము కలదు. ఆ గ్రామ పంచాయతీ సిబ్బంది ఖర్చు రూ. 300 లే. వారి ఆదాయ వ్యయములు రూ. 13700. అంత కొద్ది ఖర్చుతో ఇంత పెద్దకార్య నిర్వహణము చేయుచున్నది. ఈ పంచాయతి నీటివసతులు చేయుట, బాటలు సరి చేయుటే గాకుండ గొప్ప యుత్సవమును నిర్వహించుచున్నది, ఆసుపత్రిని నిర్వహించుచున్నది, దీపములను వెలిగించుచున్నది, గ్రామపు ఆరోగ్యావసరములను కనిపెట్టుచున్నది.

గ్రామ పంచాయతులు అనగా నేమి? గ్రామ పంచాయతి యనగా "గ్రామ ప్రభుత్వ" మని సులభశైలితో నిర్వచించవచ్చును. అఖిలభారతదేశము నకు ఇండియా గవర్నమెంటు ఎట్టిదో, మద్రాసు రాష్ట్రమునకు మద్రాసు గవర్నమెంటు ఎట్టిదో, జిల్లాకు జిల్లాబోర్డు పరిపాలన ఎట్టిదో, తాలూకాకు తాలూకా బోర్డు పరిపాలన ఎట్టిదో, గ్రామమునకు గ్రామ "పంచాయతీ" పరిపాలన యట్టిది. ఇండియా వ్యవహారములను ఇండియాగవర్నమెంటుకు అధిపతియైన గవర్నరు జనరలు లెజిస్లేటివ్ అసెంబ్లీ సహాయముతో పరిపాలించును. మద్రాసు రాష్ట్ర వ్యవహారములను మద్రాసుగవర్నరువారు కౌన్సిలర్లయొక్కయు, మంత్రులయొక్కయు, లెజస్లేటివ్ కౌన్సిలుయొక్కయు సహాయముతో పరిపాలింతురు. జిల్లా వ్యవహారములను ప్రజాయత్తమైన శాఖలను జిల్లాబోర్డు ప్రెసిడెంటు తన బోర్డు సహాయముతో పరిపాలించును. తాలూకాలోని వ్యవహారములను ప్రజా

యుక్తమైనచో తాలూకాబోర్డు ప్రెసిడెంటు తన బోర్డుయొక్క సహాయముతో పరిపాలించును. అట్లే గ్రామమునకు గ్రామ పంచాయతీ యున్నయెడల ఆ పంచాయతీ ప్రెసిడెంటు పంచాయతీ మెంబర్ల సహాయముతో నా గ్రామ వ్యవహారములను పరిపాలించును. ఒక గ్రామముయొక్క పరిస్థితులు, కష్టసుఖములు, వ్యవహారములు చాలదూరములోనున్న యితరులకన్న గ్రామములో నివసించువారికే బాగుగా తెలిసియుండును గాన నే గ్రామముయొక్క వ్యవహారములనైనను ఆ గ్రామస్థులే పరిపాలించుకొన్నయెడల గ్రామ పరిపాలన, గ్రామ ప్రభుత్వము, గ్రామస్థులకు ప్రీతికరముగాను, సౌఖ్యకరముగాను, లాభకరముగాను నుండునని పైని చెప్పియుంటిమి. అట్టి గ్రామపరిపాలనను మిగుల సౌష్ఠవమైనదానినిగను, గ్రామస్థులకు సౌఖ్యకరముగాను నుండునట్లు చేయుటకు నిప్పుడు గ్రామపంచాయతులు గ్రామములందు స్థాపించవలసినదిగా చట్టసమ్మత మైనది.

మన దేశముయొక్క సౌభాగ్యమంతయు గ్రామస్థులయొక్క సౌభాగ్యముమీదనే యాధారపడియున్నది. దీనినిబట్టి పట్టణవాసుల సౌఖ్యమునకై మనము శ్రద్ధవహించ నవసరము లేదని నా యభిప్రాయము గాదు. పట్టణవాసులతో బోల్చిచూడ మన గ్రామస్థులు అనేక విషయములందు హీనస్థితియం దున్నారు. పట్టణవాసుల కిదివరకు చాల సౌకర్యములు గల్పించబడియున్నవి. కాని గ్రామస్థులు వారితో పోల్చిచూడ మిగుల దుస్థితిలో నున్నారు. అదియునుగాక మనదేశములో పట్టణవాసులకన్న గ్రామములందు వసించువారు అనేకమడుంగులు ఎక్కువ.

మన దేశపు ప్రజలలో 100 కి 90 మంది గ్రామవాసులు పోగా మిగిలినచో 10 మంది మాత్రమో పట్టణవాసులై యున్నారు. ఐనప్పటికిని విద్యావంతులయొక్కయు, మేధావంతులయొక్కయు, జ్ఞానము, శక్తిసామర్థ్యములు పట్టణవాసులయొక్క క్షేమాభివృద్ధికొరకై వినియోగింపబడి గ్రామస్థుల క్షేమాభివృద్ధి నిరసింపబడుచుండుట కడు శోచనీయము. అమెరికాదేశములో విద్యావంతులు పట్టణములయం దెంత శ్రద్ధవహించెదరో గ్రామాభివృద్ధియందుగూడ నంత శ్రద్ధవహించి పనిచేసెదరు. అందుచే నమెరికాయందు గ్రామములు మిగుల సౌకర్యములుగలవయి వెలయుచున్నవి. అక్కడి ప్రతి గ్రామమునందును మంచి కంకరరోడ్లును, రైలు మార్గముల యనుకూలమును, పోస్టాఫీసులును, టెలిగ్రాఫు ఆఫీసులును హాస్పిటలులును, పీపములును, అతి సౌఖ్యాకరములగు బంగాళాలును, యిండ్లును మొదలుగా గల సౌకర్యములన్నియు నున్నవి. ఇక మనదేశమునందన్ననో గ్రామస్థులలో 100 కి 5 గురికిగూడ సరియగు చికిత్సజరుపుటకు ఆస్పత్రులయిన లేవు. విద్యావంతులెల్లరును దేశక్షేమము నారసి ప్రప్రథమమున ముఖ్యముగా గ్రామజీవనమును సౌఖ్యకరముగ జేయుట ముఖ్యావసరము.

అట్టిచో గ్రామస్థుల యభివృద్ధికిని యశస్సౌభాగ్యములకొఱకును పంచాయతులు చేయవలసినపని యేమి? ఇప్పటి లోకల్‌బోర్డుల ఆక్టుప్రకారము పంచాయతీ గ్రామము కొన్ని వార్డులుగా విభజింపబడి ప్రతివార్డునుండియు ఒక మెంబరు ఎన్నుకొనబడును. గ్రామమునందు ప్రతి మనుజునికిని 21 వ సంవత్సరములు వయస్సు గలవారికి వోటింగు అధికారమున్నది. మరియొక ముఖ్యమైన సంగతి యేమన, స్త్రీలకుగూడ వోటు నిచ్చుటకును, తాలూకా జిల్లాబోర్డులకు మెంబర్లుగా నిలబడుటకును హక్కు ఇవ్వబడియున్నది. నిమ్నజాతులకు సంబంధించినవారికి కొంతమందికి స్థానములు ప్రత్యేకించబడియున్నవి. ఎన్నుకొనబడ్డ మెంబర్లనుండి యొకరు ప్రెసిడెంటుగా నెన్నుకొనబడెదరు. అట్టి ప్రెసిడెంటు యితర మెంబర్ల సలహాతో గ్రామ వ్యవహారములను పరిపాలించుచుండును. ఇట్టి పంచాయతీయున్న గ్రామము నొక చిన్న రాజకీయసంస్థగా భావింపవచ్చును. అదియే యొక చిన్న రాజ్యము. అట్టి పంచాయతీ దానియొక్క 'ఏరియా' లో అనగా సరిహద్దులలో పరిపాలన జేసికొనుచు నుండవచ్చును.

ప్రతి గ్రామపంచాయతియు చేయవలసిన పనులు చాల గలవు. రోడ్లను వేయించుకొనుట, బాగుచేయించుకొనుట, బజారుల నూడ్పించి పరిశుభ్రముగా నుంచుట, ఆస్పత్రులంబెట్టి గ్రామారోగ్యమును గాపాడుట, పాఠశాలలను బెట్టి విద్యను వృద్ధిచేయుట, పారిశ్రామికవృత్తులను నేర్పుట, వంతెనలను కట్టించుకొనుట, చెరువులను బావులను బాగుచేయించుట మొదలుగాగల పను లెన్నియో గలవు. అదియునుగాక ప్రతి గ్రామమునందును అత్యావశ్యకములగు గ్రంథాలయములు, కో-ఆపరేటివు సొసైటీలు బ్యాంకులు నేర్పాటుచేసి గ్రామస్థులకు సౌఖ్యము నభివృద్ధి చేయవచ్చును. ఇదివరకు పంచాయతీ ఆక్టులో లేని అధికారములు పంచాయతులకు ప్రస్తుత లోకల్‌బోర్డుల ఆక్టుక్రింద యివ్వబడియున్నవి. 65-ఏ, 65-బి శెక్షనుల ప్రకారము పంచాయతీ, గ్రామమునకు సంబంధించిన తోటలు, అడవులపైని, ఇరిగేషన్ పనులయందును అధికారము గల్గియున్నది. మఱియు 65, 65-సి శెక్షనుల ప్రకారము పంచాయతులు భూమిసిస్తును, పేషసిస్తును మొదలగు సిస్తులను వసూలుచేసుకొనుటకు అధికారము గల్గియున్నవి. ఇవిగాక నింకను యితర అధికారములు చాల గలవు.

ఇంకొక ముఖ్యవిషయ మేమనగా, గ్రామగ్రామమునకు పంచాయతుల నేర్పాటుచేయుటకును, పంచాయతులస్థితిని వృద్ధిచేయుటకును, పంచాయతులమీద జిల్లాయంతయు దిరిగి తనిఖీచేయుటకును "జిల్లాపంచాయితీ ఆఫీసరు" ను ఒకరిని 68 వ శెక్షను ప్రకారము నియమించుట కేర్పాటుచేయబడియున్నది. ఇదివరకు పంచాయతులు జిల్లాకలెక్టర్లయొక్కయు, వారికిపైని పంచాయతుల రిజిస్ట్రారు జనరల్‌గారియొక్కయు అజ్మాయిషీకి లోబడి యుండెడివి. ఇప్పుడు ముఖ్యముగా జిల్లాపంచాయితీ ఆఫీసరునకును, జిల్లాబోర్డు తాలూకాబోర్డు ప్రెసిడెంట్లకును వీరికిపైని లోకలు సెల్ఫుగవర్న మెంటువారికిని లోబడియున్నవి. కాబట్టి యిక పంచాయతుల భావిభాగ్యోన్నతి ముఖ్యముగా జిల్లాపంచాయితీఆఫీసరుమీద నాధారపడియున్నదని చెప్పవచ్చును. గ్రామములన్నియు స్వయముగా పరిశీలించి ప్రతిగ్రామమునకును పంచాయితీ స్థాపించుట ఈ ఆఫీసరుయొక్క శక్తిసామర్థ్యములపై నాధారపడియున్నది. ఈ జిల్లా పంచాయితీఅధికారియొక్క బాధ్యత "గ్రామపంచాయతి" యను మాసపత్రికలో నిట్లు వర్ణించబడినది. "నిజముగా నీ జిల్లాపంచాయతీఅధికారి లెక్కలు తనిఖీచేసి ఆడిట్ చేసి కట్టుపెత్తనము మాత్రము వహించుటకు నేర్పడవలయునని అభిప్రాయ మెన్నడునుగాదు. సహకారోద్యమము ఆరంభమైనప్పుడు రిజిస్ట్రారులు వారిసహోద్యోగులు సంఘములను ప్రోత్సహించి స్థాపించి శ్రమపడినయట్టులే వీరును ఇప్పుడును పంచాయతుల సందర్భమున పనిచేయవలసినవారు. పంచాయతీ యుద్యమముయొక్క పరమరహస్యము ప్రజాసామాన్యమున కందజేయుట యీ యధికారుల కార్యమగుట యెల్లరును గుర్తించగలరు. ఈ యధికారులును దేశములోని అనధికారప్రముఖులును ఈవిషయమునందు చేతులుకలిపి యుత్సాహముతో నారంభింతురేని శాసనములో 1000 మంది జనసంఖ్యగల గ్రామముల కన్నిటికిని పంచాయతు లేర్పడవలసినదని నాయకార్థము నిర్బంధము పెట్టినప్పటికంటె నిప్పుడే శీఘ్రతరముగ పంచాయతు లేర్పడుటకు నెక్కువ అవకాశము కలిగినను కలుగవచ్చును" (గ్రామపంచాయితి, అక్టోబరు 1930 పేజి 4) 1000 మందికి మించి యున్న ప్రజలు గల ప్రతిగ్రామమునకును పంచాయితీ స్థాపించవలయునని బిల్లులో మొదట నుదహరించబడి యుండెను. కాని కొన్నికారణములవల్ల, అనగా ప్రస్తుతము ప్రతి చిన్నగ్రామమునకుకూడ పంచాయితి స్థాపించుట కార్యరూపమున బెట్టుట మిగుల దుర్లభమని యెంచి యా నిబంధన ఆక్టులోనుంచి తొలగించబడెను. ఆరంభములో కార్యరూపమున బెట్టుట కొంచెము కష్టమైనను, ప్రతి చిన్నగ్రామమునకును పంచాయితీ స్థాపించుట అసాధ్యము కాజాలదు. ఇంగ్లండులో మనగ్రామమునకు పోల్చదగినది 'పారిష్' అనుపల్లెగ్రామము. ఈ గ్రామము బహుచిన్నదియైనప్పటికిని 300 మందికి మించివ జనాభా ఉన్నయెడల అక్కడ ఒక 'పారిష్ కౌన్సిలు' అనగా మన గ్రామపంచాయతీకి సరియగు రాజకీయసంస్థ యేర్పాటు చేయబడియున్నది. మన దేశములో స్వదేశసంస్థానమగు మైసూరునందు ప్రతి చిన్నగ్రామమునకుగూడ పంచాయతి స్థాపించబడు నిబంధన కలదు. ప్రతిగ్రామమునందును పంచాయతి స్థాపించబడియున్నది. కనుక మనకుకూడ 1000 కి మించిన జనాభా గల ప్రతి గ్రామములోను పంచాయితీ స్థాపించుట కష్టముగాదు. అట్లు ప్రతిగ్రామమునకును పంచాయితీ స్థాపించుట జిల్లాపంచాయితీఆఫీసరుయొక్క శక్తిసామర్థ్యములమీదను, గ్రామముయొక్క ఆర్థికపరిస్థితులమీదను గ్రామపంచాయతులకు లోకలుసెల్ఫు గవర్నమెంటువార లిచ్చుగ్రాంటుమీదను నాధారపడియుండును. ఈ పైసౌకర్యములను త్వరలో సమకూర్చి త్వరలో ప్రతిగ్రామమునకును పంచాయతీ యేర్పరచునట్లు ఆక్టులో నిర్బంధనిబంధనను లోకలుగవర్న మెంటువారు గావించెదగని యాశించెదము.

ఇదియునుగాక గ్రామపంచాయతులు జిల్లాబోర్డు ప్రెసిడెంటుగారికిని పంచాయతీ ఆఫీసరుగారికిని లోబడి పనిచేయుచుండవలయునా, లేక తాలూకాబోర్డువారికికూడ లోబడి పనిచేయుచుండవలయునా? యనువిషయముపై లెజిస్లేటివ్ కౌన్సిలులో చాల చర్చ జరిగెను. ప్రస్తుత ప్రధాన మంత్రివర్యు లగు ది. బ. బి. మునిస్వామినాయుడుగారు సందర్భములో వచించినట్లుగా నధికసంఖ్యాకములగు తాలూకాబోర్డులు పంచాయతుల యభివృద్ధికై చాల శ్రద్ధతో పనిచేయుచున్న వనియు, కావలసినప్పుడు ధనసహాయముగూడ చేయుచున్నవనియు, అందుచే, నే కొన్ని తాలూకాబోర్డులో పంచాయతుల యభివృద్ధికి తోడ్పడలే దను నెపమున పంచాయతులకు తాలూకాబోర్డులతో గలసంబంధమును తీసివేయుట యుక్తముగాదనియు చెప్ప

వచ్చును. ఈవిషయములో వోటింగుకూడ జరిగెను. పంచాయతులు, తాలూకా బోర్డుల లోబడియే పనిచేయవలయునని యధికసంఖ్యాకులచే నామోదించబడెను. కనుక నిప్పుడు జిల్లా పంచాయతీఆఫీసరు తాలూకాబోర్డు ప్రెసిడెంటు సలహాతోను జిల్లాబోర్డు ప్రెసిడెంటుసలహాతోను మంత్రిగారికి లోబడి పంచాయతుల యభివృద్ధి కొఱకు పనిచేయవలసి యుండును.

ఇక పంచాయతీ ధనమును (ఫైనాన్సును) గురించి ముఖ్యముగా నాలోచించవలసియున్నది. పంచాయతులు చేయవలసినపనులు చాల గలవని పైని పేర్కొనియున్నాము. కాని ఈ పనులన్నియు నెరవేర్చున దెట్లు? పంచాయతీ యెంతయో బాగుగా పనిచేయ నుద్దేశించి యుండవచ్చును. ఎన్నియోప్లానులు, స్కీములు వేయవచ్చును. అవన్నియు నెరవేర్చుటకు ధనము కావలసియుండును. పంచాయతీ ధనాగారమునకు మూలాధారములు రెండు గలవు. (1) ప్రభుత్వపు గ్రాంటు (2) పంచాయతీ ఏరియాలో వసూలుచేయబడు వివిధమైన పన్నులు సిస్తులు మొదలగునవి. ప్రస్తుతము ప్రభుత్వమువార లిచ్చు గ్రాంటు రెవిన్యూలో యే కొద్దిభాగమో యైయున్నది. క్రమక్రమముగా సంవత్సరములు గడచినకొలది గ్రామమునుంచి వసూలుజేయబడు సిస్తులో యెక్కువభాగము గ్రామపంచాయతీకి వినియోగించు నేర్పాటు జరుగునట్లు గవర్నమెంటువారు శాసించవలసియుండును. అట్లు జరిగినగాని రాజ్యాంగమునకంతకును పునాది యగు గ్రామమును గ్రామపంచాయతియును నభివృద్ధిగానేరవు.

ప్రస్తుతము గ్రామపంచాయతులు బాగుగా పనిచేయవలయు ననిన వాని రాబడి సాధ్యమైనంతవరకు హెచ్చుజేసికొనవలయును. పంచాయతికి రాబడి నివ్వగల విషయములు చాల గ్రామములలో గలవు. ఆ రాబడిని సరియైనపద్ధతిలో బెట్టి సక్రమమగు మానేజిమెంటు జరుగునట్లు పంచాయతీ ఉపవిధులు (బైలాస్, రూల్సు) ఏర్పాటు చేయబడవలయును. గ్రామములో ముఖ్యముగా రాబడి నిచ్చునవి చెరువులు, పోరంబోకులోని చెట్లు మొదలగునవియు, కాల్వలు, లంకలలోని పచ్చిగడ్డి, గ్రామ అడవులు, తోటలు మొదలుగాగలవియు నైయున్నవి. ఇవన్నియు ప్రతిసంవత్సరము వేలము పాటబెట్టి వానిలో నాసంవత్సరమునకు అనుభవించు హక్కులను విక్రయించివేయవలయును. అదియునుగాక ఇంటిపన్ను, వృత్తిపన్ను, కొలగారపు హక్కుమీదిపన్ను, మోటారుబండ్లు గుర్రపుబండ్లు అన్నివిధము లగు బాడుగబండ్లు వీనిమీది పన్ను పంచాయతీకి రాబడి నివ్వగలవు. ప్రస్తుతస్థితినిబట్టి రైతులయొక్కయు, కూలీలయొక్కయు వ్యవసాయపుబండ్లమీదను యితరవస్తువులమీదను పన్ను వేయుట పాడిగాదు. ఇంకను గ్రామస్థులందఱు నైక్యముగ సుహృద్భావముతో మెలగుచున్నయెడల "దానధర్మములఫండు" నొకదాని నేర్పాటుచేసి, పెండ్లిధర్మములు, శుభకార్యములయందు ధర్మములు, తదితరధర్మముల వలన కొంత ధనము చేకూర్చవచ్చును. ఇట్లు పంచాయతీవలన గ్రామాభివృద్ధిగావించుట కెన్నియో అవకాశములు గలవు. ఆ యవకాశముల నుపయోగించి గ్రామమును బాగుపరచి అందలి ప్రజల జీవనముల నెంతయో సౌఖ్యావహములుగా చేయవచ్చును. ప్రతిగ్రామమునందును వైద్యశాలల బెట్టవచ్చును. గ్రంథాలయములను స్థాపించవచ్చును. నీటిసప్లైకిగాను పంపులు కూడ నేర్పాటు చేయవచ్చును. అన్నిటికన్నను ప్రాముఖ్యమైన విషయ మేమన, గ్రామపంచాయతీ ప్రాథమిక నిర్బంధ విద్యావిధానమునకు పునాదిగా నుండగలదు. అప్పుడు గ్రామజీవనము పట్టణజీవనముకంటె మిగుల ననుకూలమై ఆరోగ్యమున కాటపట్టై సౌఖ్యజీవనమునకు మూలాధారముగా నుండగలదు.

ఈ సందర్భములో విదేశములగు అమెరికా మొదలగువానియందు గ్రామములు గ్రామజీవనము, గ్రామపరిపాలన యెట్లున్నదో పరిశీలించుట మనకు కొంచె ముపయోగకారిగానుండగలదు. అమెరికా గ్రామజీవనము పైనికొంచెమువర్ణించియున్నాము. 'బ్రైస్' గారు వ్రాసిన "అమెరికా కామన్ వెల్తు" అను గ్రంథములో నమెరికాయొక్క గ్రామపరిపాలన రాజ్యాంగమున కెట్లు ప్రధానమైనమెట్టుగా నున్నదో విపులముగ వ్రాయబడియున్నది. అక్కడగూడ ఇంగ్లండులో మాదిరి 300 మంది ప్రజలు నివసించు ప్రతిగ్రామమునకున్న గ్రామ "కార్పొరేషన్" గలదు. ఒక్కొక్క గ్రామమునకు 6 గురుగాని, ఇంక నెక్కువమందిగాని గ్రామ "ట్రస్టీలు" అనగా మెంబర్లు యెన్నుకొనబడుదురు. అందులో నొకరిని "మేయర్" గా అనగా ప్రెసిడెంటుగా ఎన్నుకొనెదరు. గ్రామపరిపాలనమంతయు నితర మెంబర్ల సలహాతో నతడు నిర్వహించుచుండును. అట్టి గ్రామ కార్పొరేషనుకు కొంతమంది నౌకర్లుండెదరు. 1 గుమస్తా, 1 కోశాధిపతి, 1 గ్రామభటుడు (కాన్‌స్టేబిలు) 1 బజారుకమిషనరు ముఖ్యముగా నుండెదరు. అవసరమైనయెడల మఱికొందఱు నౌకర్లుగూడ నియమింపబడుదురు. గ్రామస్థులు వేరుగా విలేజిమేజిస్ట్రేటును (న్యాయాధికారిని) గూడ నొకని నెన్నుకొనెదరు. అతడు తగవులు విచారించి తీర్పులు జెప్పుచుండును. అతడే గ్రామములో న్యాయస్థాపకుడుగను, శాంతిని నెలకొల్పువాడుగను నుండును. గ్రామములోని ప్రజలందఱును విద్య నేర్చియుందురు. అది గ్రంథపఠనపు విద్యయే గాదు. రాజకీయ వ్యవహారములందుగూడ వారితేరి స్థానికస్వపరిపాలనమందు మిక్కిలి నేర్పరులుగా నుందురు.

ఇటులే ఫ్రాంసు, జర్మనీ, ఇటలీ, స్విట్జర్‌లాండు దేశములందు "కమ్యూని" యను గ్రామము మనదేశపు గ్రామమునకు సరిపోల్చ దగియుండును. ఆయాదేశములలో నది స్థానికస్వపరిపాలనమునకు మొదటిమెట్టుగానుండి రాజ్యాంగమునకు సహకారిగా నుండును. ఇంగ్లండులో 'పారిష్' అనునది గ్రామమునకు సరియైనదని యిదివరలో చెప్పియున్నాము. ఈ పై సంస్థ లన్నిటిలోను గ్రామస్థులమీదగాని యితరవిధములగాని వేసిన పన్నునందు ఎక్కువభాగము బీదజనులయొక్క జీవనోపాధికొరకును గ్రామస్థుల సౌఖ్యముకొరకును వినియోగింపబడుచున్నది. ప్రతిగ్రామమునందును కుంటి, గూని, గుడ్డి మొదలుగాగల బీదజనులకొరకు శరణాలయము లున్నవి. కనుక వార లింటింటికి దిరిగి భిక్షమెత్తుకొన నవసరములేదు. ఇవ్విధముగా గ్రామసంస్థలు ప్రజలకు సంరక్షణ నిచ్చుచున్నవి. మనదేశమునందుగూడ పంచాయతు లీ పనులన్నియు చేయగలవు.

గ్రామ పంచాయతులు పంచాయతీకోర్టులనుగూడ నిర్వహించి పరిపాలించుట కవకాశము గలదు. గ్రామమునందలి సివిలు కేసులును, క్రిమినలు కేసులును విచారించి న్యాయమును గలుగజేయుట పంచాయతుల ముఖ్యమగు బాధ్యతయును, హక్కును నై యున్నది. గ్రామములోని యొక కేసుయొక్క నిజానిజములు గ్రామస్థులకు తెలిసినటుల దూరముగానుండు పట్టణములలోని కోర్టు అధికారులకు తెలియవచ్చుట కష్టముగా నుండును. కోర్టు దూరమైనకొలది నిజము బయల్పడుటకు మారుగ దాగుటకు అవకాశము గలదు. అదియునుగాక చిన్నచిన్న కేసులందుగూడ పట్టణముల కెక్కి న్యాయమును వాంఛించుట వృథా ఖర్చులకు బాల్పడుట యగును. కనుక గ్రామములోని కేసులను పంచాయతికోర్టులు విచారించి న్యాయమును గలుగజేయుట గ్రామవాసులగు రైతులకు మిగుల లాభముగా నుండును. గ్రామ మునసబునకు క్రిమినలు కేసులు విచారించుటకు గల యధికారమును పంచాయతీకోర్టులు తీసికొనగలవు. గ్రామ పోలీసు అనగా గ్రామ తలారి, వెట్టి, మోతాదు మొదలుగాగల సిబ్బందియంతయు పంచాయతిచేత నియమించబడి పంచాయతికి లోబడి యుండగలదు. ఈ నౌకర్లద్వారా పంచాయతీకోర్టు తీర్పులను అమలు జరిపించవచ్చును. రాత్రులందును, పగటిపూటయందును గ్రామ నౌకరులు గ్రామ కాపలా గాయుచు గ్రామములోని 'లా అండ్ ఆర్డరును' కాపాడగలరు. అప్పుడు గ్రామము పట్టణమువలె విరాజిల్లుచుండును.

ఇక ఫారెస్టు పంచాయతులను (అటవీ పంచాయతులను) గురించి కొంచెము విచారించుదము. ఈ పంచాయతులు 1882 సంవత్సరపు ఆక్టు ననుసరించి పరిపాలితమగుచున్నవి. అనేకరాష్ట్రములలో ఫారెస్టు పరిపాలన క్లిష్టమైన సమస్యలతో కూడుకొనియున్నది. 1912 సం. నుండియు ఫారెస్టు పంచాయతు లారంభమయి పనిచేయుచున్నవి. ప్రస్తుతము మన రాష్ట్రమునందు 22 జిల్లాలలో నిట్టి పంచాయతులు 1100 కలవు. 3500 చదరపుమైళ్ల యడవిని పరిపాలించుచున్నవి. కాని పంచాయతీదారులు చేయు నభివృద్ధిఫలితమంతయు గ్రామప్రజ లనుభవించుటలేదు. ప్రభుత్వమువారిపన్ను తగ్గించబడి నామమాత్రముగానుండి రాబడియంతయు ప్రజలసౌకర్యములకొరకు వినియోగించవలసియుండును. ఈపనులన్నియు పంచాయతులు చేయగలవు. ఇరిగేషన్ పంచాయతులుకూడా రాష్ట్రమునం దక్కడక్కడ నెలకొనియున్నవి గాని యవికూడ పంచాయతిచే గైకొనబడి, వృద్ధిచేయబడి, సక్రమముగా పరిపాలించబడిననేగాని ప్రజల కెక్కువలాభము గలుగజాలదు.

# అకాలవర్షము

కవిరాజ మల్లాది వేంకట విశ్వనాథ శర్మ గారు

పురివిచ్చి కేరలి పెంపుడునెమి ళ్లాడ
వగచి రాయంచలు వలసవోఁ జూడ
దుర్దిన మ్మిది హఠాత్తుగ నావరించె
నంతరిక్షము—విరహార్తుల మనము.

కడిగిన కార్దున్న కడుపు చందాన
నళినీలరుచిఁ బొల్చు నంబుదస్వామి
మెఱ పను పసపుమే ల్మిసిమిసాలువయు
బెగ్గురుగమిచేరి వెల్ల చిందమ్ముఁ
బ్రభలీన రెండవ వామనుం డనఁగ
నాక్రమించె బలారి! యాకాశపదము.

కవగట్టు చక్రవాకంబుల కరణి
నెక్క లల్లార్చి పాఱెడు హంస లట్లు
మిట్టిత్రుళ్లెడు నక్రమీనంబుల గతి
ధగధగద్ధగిత సౌధముల కై వడిని
గాలిచే మబ్బుతునకలు బిట్టు చెదరి
వివిధాకృతులఁ బూని నవురు నింపంగ
నంతరిక్షమ్ము నేత్రానంద మొసఁగుఁ
జిత్రితంబగు తెలిచీర చందమున.

కారుమొయిళ్ల చీఁకటులఁ గార్కొనుట
ధృతరాష్ట్ర నృపతికి నెనయయ్యె నభము;
కవ్వనం గేరి మిక్కిలి డెక్కఁ జూపి
దుర్యోధనున బద్ధిఁదూఁగెను నెమిలి;
పరిభవమ్మున వ్రగ్గి వనముఁ బట్టుటను
ధర్మసంభవు నవస్థను బొందెఁ బికము;
అజ్ఞాతవాసమహాయాస మెనసి
పాండవులన చీటువచ్చె హంసములు.

విరహార్తహృత్స్వేద విధి నంబుదములు
శైలశృంగములందు వ్రేలి గర్జించు;
ఆ సడిం బురివిచ్చి యాడి నెమిళ్లు
మణిచామరంబుల మన్నించు దివిని.

ఎగురుచున్ దుముకుచు దిగుచు వంగుచును
ఆర్చుచున్ బేర్చుచు నతిశయించుచును
దర్పనంబిచ్చు చంత నదృశ్యమౌచు
బహురూపములతోడఁ బరిఢవిల్లుచును
నదుమంత్రపుంగల్మి నడరు పూరుషుని
వైఖరిం జరియించు బళిర! మేఘుండు.

తవిలి బంధురపయోధరలైన తరుణు
లంటుకాంద్రను బాళి నభిసరించునెడ
గర్జించి వారిమార్గము నిరోధించెఁ
దా నిరంతరపయోధర యాట నీక్ష శి
సవతి యౌచును నిశాసతి గట్టివాయి.
బెగ్గురువరుస యన్ వెల్లపాగయును
మెఱుపులన్ పచ్చని మేటిచామరలుఁ
బరఁగఁ బయోధుఁ డన్ పాదుషా యదిగో
నింగి పేరింటి యేనుంగుపైఁ దిరుగు.

చెనఁటికిం జేయు మేల్సేఁతయుఁ బోలె
నంతరించిన వహో! యఖిలతారకలు.
విరహావిక్లిన్నలౌ వెలఁదుల రీతి
దిక్కు లన్నియును గాంతిని గోలుపోయె.
మెఱుపుమంటల మిన్ను కరఁగి నీరౌచుఁ
బడుచున్నదో భూమి వర్షరూపమున!

శంపాలతలతోడి జలదజాలములు
పలుకులు గట్టు నేస్తలుగాఁగఁ బూన్చి
జలధార లను వెండిగొలుసులు కట్టి
యుర్విఁ బైకెత్తించు చున్నాఁడొ హరియు.

పవనచంచలవేగపటిమమ్ముతోడ
స్థూలధారాశరస్తోమమ్ముతోడ
స్తనితభేరీమహాధ్వానమ్ముతోడఁ
గలితవిద్యుత్పతాకశ్రేణితోడఁ
గొనెఁ గరప్రతతి మేఘుఁడు చంద్రు మాటి
నృపతి దుర్బలవైరినృపతినిం బోలె.

కేరలి గొంతుకనెత్తెఁ గవ్వనం గేకి;
తొడిగె మొగ్గను నడావుడితోడఁ గడిమి;
యతివరేణ్యుండు దుర్మతులచేఁ బోలె
శశి మేఘవితతిచే సంఘన్నుఁ డయ్యె;
జడివాన పెద్దెబ్బ సైచి నీర్గారెఁ
గప్పయు బురద మొగాన నంటికొన;
నాదారుకొలపుఁ గ్రొన్ననబోణి వోలె
నొక్కపట్టునను గాలూనద మెఱపు.

వనదుఁ డార్ద్రితమాలపర్ణవర్ణుండు
గగన మంతరితభాస్కరముగాఁ జేసె;
శరధారలం బోని జలధార లడర
వల్మీకమును మదావళమున ట్లడఁచె;
మిఱుమిట్లు గొల్పెడు మెఱుపుదీవియల
స్వర్ణదీపము లెత్తెఁ బ్రాసాదములను;
అసమర్థుఁ డగువాని యాలినిం బోలె
జ్యోత్స్నను లేవఁదీసుకొని పోయె నహా!

ఒకపరి వెలుఁగు విద్యుద్దీపికలను
క్షణము గాంచఁగరాక గననౌచు క్షణము
కరఁగఁబోసిన వెండి కరణి మేఘముల
జాల్వారు ధారలు జానొందు నివిగొ—
నింగి పేరిటి చీర నిలువుగాఁ జినుఁగ
వ్రేలు జరీయంచు పేలిక లట్లు.

తాలీవనమ్ములఁ దారమ్ముగాను
మహీజశాఖలయందు మంద్రమ్ముగాను
ప్రోన్నతశిలలపై రుక్షమ్ముగాను
సలిలభాగములందుఁ జండమ్ముగాను
తాలానుసృతి వర్షధారికల్ పడెడు
సంగీతవీణాప్రసంగమంగళత.

(మృచ్ఛకటికమునుండి)

# విజయవిలాసము

కాంభట్ల విశ్వనాద శాస్త్రి గారు

"కేవల కల్పనాకథలు కృత్రిమరత్నము లాద్యసత్కథల్
వావిరి బుట్టురత్నము లవారితసత్కవికల్పనావిభూ
షావహపూర్వవృత్తములు సానలఁదీఱిన జాతిరత్నముల్"

అనునట్లు కథాసంవిధానమునను రసపోషణమునను నితర ప్రబంధములకన్న మిన్నయై సానలఁదీఱిన జాతిరత్నముల భంగి వెలుంగుచుఁ దెనుఁగునఁ గల యత్యుత్తమప్రౌఢకావ్యములలో నొకటిగా నెన్నఁబడి, వ్యంగ్యప్రధానమై, ప్రతిపద్యరసాస్పదమై, వినువారి వీనుల నమృతంపుసోన లొలుకు సరసవచోరచనల నలరారుచున్న యీ విజయవిలాస మను శృంగారప్రబంధమును రచించిన కవిశేఖరుఁడు చేమకూర వేంకటకవి. ఈతఁడు క్రీ-శ. 17 శతాబ్దివాఁ డైనట్లు తత్కృతిభర్త యగు రఘునాథరాజు కాలమునుబట్టి తెలియుచున్నది. ఈ కవిశేఖరుఁడు బ్రాహ్మణుఁడని కొందఱును, భోగినీకులసంజాతుఁడని మఱికొందఱును భిన్నాభిప్రాయులై యున్నారు. ఎట్లైన నీ మహాకవి యసదృశమగు తన సరసకవితచేఁ దనకులమునకు వన్నె తెచ్చెనని చెప్పనగును. మఱియు నిక్కవి సారంగధరచరితమును రచించి తృప్తిఁ జెందక సుకవులో హా యన నీ విజయవిలాసమును రచించి యాంధ్రకవితకు జగ్గునిగ్గుల నెనపి "చేమకూర పాకమునఁ బడె" నను పండితుల మన్ననలకుఁ బాత్రుఁ డయ్యెను.

ఇందలి కథ భారతములోనిది. మూలగాథనుఁ బ్రబంధరచన కనువగురీతిని యథోచితముగ మార్పు నొందించి కవి హృదయంగమ మగునట్లు సరసముగ నీప్రబంధమును రచించెను. కథాసంవిధానమున నీతఁ డసదృశమగు కౌశలముఁగలవాఁడు.

నాటకాదులలో నాయికానాయకుల కానుకూల్య మొనర్చుటకు విదూషకునివలె నిం దర్జునునకును జిత్రాంగదకును బొందు నొందించుటకు విద్యావిశారదుఁ డగు విశారదుని నెచ్చెలిగాఁగూర్చి యుచిత మగురీతి నా యిరువురకును సంఘటించి యర్జునుని, నాయకత్వము దగురీతిని పోషించె ననుట నిస్సందేహము. మఱియు యతిరూపమున నున్న నయ్యర్జునునకుఁ బరిచర్యఁ జేయు సుభద్ర యాతనిఁజూచి యర్జునుని వృత్తాంత మెఱుంగుదురా యని యడుగ

"అనిన నేనె సూవె యర్జునుండనఁగ నీ
యొద్ద నివ్విధమున నున్నవాఁడఁ
దరుణి నీవు నాకు ధరణీధరుం డను
జలజభవుఁడు చేసె సంగమంబు"

అని భారతమున నున్నది. అట్లు తోడనే నేనే యర్జునుఁడ నని చెప్పినచో నాయకునికి గాంభీర్య మసాస్త మగుటయే కాక నాయకత్వమునకు భంగము వాటిల్లును. మఱియు ముగ్ధయుఁ గన్యయు నగు నాబాలగూడ భయచకితయై మాటాడక సిగ్గున వెడలిపోవుటయు సంభవించును. అట్లైనచో నాయికానాయకుల హృద్గతములగు కోర్కులు పల్లవింప నవకాశము గల్గదు. కావుననే యీకవిరాజు

"మీ కింద్రప్రస్థము గనినారా?
పాండవులఁ జూచినారా?
సుఖులై వారందఱు నొకచో నున్నారా?
వీరాగ్రగణ్యు నరు నెఱుఁగుదురా?"

అని మృదూక్తుల నా బాల యతినడిగి "తీర్థయాత్రలు సేయునెడం గనినారము సంక్రందననందనుని" అను నా యతి యతిగంభీర మగు సూక్తుల నాలించి ముద మెదం జెన్నొంద "ఎచ్చటఁ గంటిరో విజయు నిక్కువ నిక్కువమా నె! రాఁడుగా యిచ్చటికి" అని యర్జునునిఁ దలఁచినమాత్రాన గాఢానురాగంబునఁ గోరిక లీరికలెత్త మన్మథరసావేశంబునఁ బల్కు నా యతి యాకోమలి యనురాగముం గని తోడనే నేనె యనిచెప్పక యతిగంభీరముగ మందహాసమొనర్చి క్రమముగఁ దా నని చెప్పుటకు ముందుగ "కన్నమాత్రమే యేమని చెప్పవచ్చు నొకయించుక భేదములేక యాతఁడే మేమయి యున్నవారము సుమీ" అని బీజన్యాసము చేసెను. ఆ యింతియు మాటికి ననురాగము తేటపడ నా యర్జునుని బ్రసంగింప నా యతి తనయెడఁ గల యనురాగమును గుర్తించి నీ కా యర్జునునియం దనురాగము కలదా? నిక్కువ మెఱింగింపుము. అట్లైన నిచ్చటనే యా యర్జునుఁ డున్నవాఁ డని తన నిక్కువంపు గూ పేరుపడం జెప్పెదనని సంఘటించి యాయిరువుర మనస్సాయి యగు స్థాయిని పరాకాష్ఠ నొందించెను. ఇట్లర్జునుఁడు దనయెడఁ గల యనురాగమునుఁ గ్రమముగ నెఱింగి యక్కోమలి భావంబు గుర్తించి తన నిక్కువంపురూపును దటాలునఁ జెప్పక నమ్ముద్దియ కనురాగ మతిశయిల్లఁ గ్రమక్రమముగఁ దనవృత్తాంతముఁ జెప్పి యామెకుం దనమనంబెఱింగింప నిరువురకు నుల్లంబున గోర్కులు పెల్లురేగె ననిచెప్పుట యెంతయు సమంజస మనఁదగియున్నది. మఱియు నర్జునుఁడు నాపె కేలువట్టి మాటాడ న ముగుద చంచలభావాంచితయై లజ్జ యానహిల్ల నరునితో మాటాడకునికిం జేసి ముంజేతిచిలుకతో నిరువురుసంభాషించి రనుట యెంతయు శోభావహము.

అసదృశ మగు పాండిత్యమును, నిరర్గళకవితాధారయు నిందుఁ బ్రతిపద్యమునందును స్ఫురించుచునే యుండును. కవులకు సాధారణముగఁ దమప్రభావమును స్వప్నముఖమునగాని కృతిపతి ప్రశంసాములఁగాని తెల్పుట యాచారము. పింగలి సూరనార్యుఁడు "పొసఁగ ముత్తైపుసరుల్ పోహళించినలీలఁ దమలోన దొరయు శబ్దములఁగూర్చి ......" అని పాత్రముఖమునఁ దన కవితా పాండిత్యముల వెల్లడించిన ట్లీతఁడును

" ప్రతిపద్యమునందుఁ జమ
త్కృతిగలుగం జెప్పనేర్తు, వెల్లన పెరుకా
కృతి వింటి మపారముగా
క్షితిలో నీమార్గ మేకికన్ రాదుగదా "

అని కృతిపతి తన్నుఁ బ్రశంసించినట్లు చెప్పికొనెను. ఈతఁడు దా చెప్పినచొప్పున గ్రంథమునునిర్వహించె ననుటకు సందియముండదు. చూడుఁడు,

" పోక ప్రాపలమహిమ, కప్పురపుటనఁటి
యాకుదోఁటలసౌభాగ్య మందె గలదు
ప్రబలు మౌక్తికసౌధ సంపదలమహిమ
వీటిరహి మెచ్చవలదెయుఁ బో వేయునోళ్ల "

ఇట నిట్టి వస్తుసమృద్ధిగల వీటిసొగసు వేయియగునోళ్లచేఁ బొగడ నగునను దానిని పోకలు నాకులు మౌక్తికసుధయు నుంటచే వీడెము యొక్కరహి నా వీడెము వేసెడినోళ్లనే బొగడ నగునని చమత్కరించెను. ఇటులె

" వేడుక నప్పురీహరులవేగము గన్గొని లేళ్లు గాడ్పుతో
గూడి చనన్వలె న్దనముఁ గూడఁగనోపక యోడినట్టివా
రోడనివారి పెంచు టని యొద్దిక పందెమునైచి కూడ లే
కోడెను గాక మోవఁగఁ బ్రయోజన మే మనిఖం సురంగముల్ "

ఇచ్చటచూడుఁడు కురంగవాహన మనిలున కెట్లువచ్చెననిచెప్పెనో. మఱియు

" లచక్కని బాలుఁడు వా
క్ప్రాచుర్యముగాంచు నని కుశగ్రహస్థితుల్
చూచి యిలావంతుం డని
యాచారుఁడు నామకరణ మలరిచి యంతన్ "

వాక్ప్రాచుర్యముగలవాఁడగుటచే నిలావంతుఁ డని నామ మొన రించెను. "ఇర" యన సరస్వతి. వాక్ప్రాచుర్యము గలవాఁ డగుటచే వాక్కులుగలవాఁ డని ఇలావంతుండని నామమొసరించు టలోఁ జమత్కృతింపు.

" అతిపాచంబులున్ మెఱుఁగుటారును వేనలియున్ స్తనాధరా
స్మితము నభీ...... ఘ నాభ్యుదయంబు నిష్ఠుతా
తితి సుని మాటిమాటికిని నిక్కెడు నీల్గెడు విఱ్ఱవీగెడున్
............ స్నదుమం త్రపుకల్మిగల్గుటన్ "

ఇచ్చట కుచములు పీవరములనియు ...... ...... గల దనియు వేణి ఘనమైనదనియు నెంతచిత్రముగఁ జెప్పెనో చూడుఁడు. నడుమంత్రపుకల్మి గల్గుటచే కుచంబులును మెఱుఁగుటారును వేనలి యును గ్రమముగ ' నిక్కెడు నీల్గెడు విఱ్ఱవీగెడున్ ' అని చమత్కరించెను. తలఁచుగఁ బ్రతిపద్యమునందును నర్థచమత్కారముగాని శబ్దచమత్కారముగాని యిటులఁ గన్పట్టుచునేయుండును.

మఱియుఁ గృతిపతిని బ్రశంసచేయునపుడు కవి

" తా రసపుష్టిమై ప్రతిపదంబున జాతియు వార్తయుం జమ
త్కారము నర్థగౌరవము గల్గ నశేషకృతుల్ ప్రసన్నసం
భీరగతిన్ రచించి మహి మించినచో.............. "

అని చెప్పుటచేతను నీతనికవితయందలి యాగుణములు తలఁచుగఁ గన్పించుచుండుటచేతను నాగుణము లీతని కభిమతము లని చెప్ప వచ్చును.

ఇందలి జాతీయము లగు సామెత లీతనికవితయందు జాతీయతను జాటుచునే యున్నవి. మఱియు రసమున కనువగు మృదు మధురమగు రచనల నిందలిపద్యము లలరారుచుండును.

" అన విని పాపపు పజవరా లెదలోనలపాపలేక యా
తని తెలిముద్దునెమ్మొగము దప్పక తేటమిటాఁకల్కిచూ
పునఁ దనివారఁజూచి నృపపుంగవ, యన్నిటజాణ వూరకే
యనవలసంటిగా కెఱుఁగవా యొకమాటనె మన్మకర్మముల్ "

ఇందు "శృంగారే కైశికీవృత్తిః" అనునటుల జిలిబిలిగొను ముద్దు పలుకులతో రసోచితమగు వృత్తిని కల్పించెను. ఇట్లే

" గర్వితారాతిమస్తకఖండనోత్థ
రక్తధారానుషంగాతిరక్తధార
నిజకృపాణిక కావేరినీటఁ గడిగెఁ "

ఇందలి వీరరసోచిత మగురీతిని నోజోగుణమును సంఘటించెను. చమత్కారమున కీతఁడు పెట్టినపేరుగదా? ఇందలి పద్యము లర్థ గాంభీర్యముకలవై యలరుచుండును.

" తనుఁ గౌఁగిలి యీ వొకప్పుడును నాథా నీకరస్పర్శనం
బున గిల్గింతలె యంచు పద్మిని కరాంభోజంబునన్ మందమం
దనటద్వాయుచలద్దళాంగుళులు గన్పట్టంగ నవ్వెల్లురా
యని రా రా యని పిల్చెనాఁ దగె ద్విరేఫాద్యంత దీర్ఘధ్వనుల్ "

ద్విరేఫాద్యంతదీర్ఘధ్వనులచే చలద్దళాంగుళులతోడ పద్మిని కాంతుని బిల్చెననుటలో "రా రా" యను ద్విరేఫాద్యంత దీర్ఘ ధ్వనులుచేయుచు నోరులఁబిలుతురను నర్థమును గంభీరముగ స్ఫురింపఁజేసెను. మఱియు,

" చాతిగఁ బైకొనన్వలెను పైదలి కుత్తుకలోని పల్లటీ
కూఁత లనన్వలెన్ సొగసుకోర్కులు రావలె నాలకించినన్ "

అని పెద్దనార్యుఁడు వచించిన ట్లిందలికవిత వినినను చదివినను మనోవికాసమునుబుట్టించు రామణీయకముకలదై, పైదలికుత్తుకలోని పల్లటీకూఁతవలె హృదయము నానందమునొందించును. చూడుఁడు

" నెల యుదయించునప్పు డల నీరజముల్ కుముదంబు లౌను రేల్;
కలువలదాయరాకను పగల్ కుముదంబులు నీరజంబు లౌ;
తలఁపఁగ నింత వింత కలదా యని కందువమాట లాడుచున్
ఛళిర కికీటి మీఱె తన ప్రౌఢి విశారదుఁ డెన్నుచుండఁగన్ "

ఇం దర్థమును నిజమగు నభిప్రాయమును కందువపలుకులసందర్భమున నెంతయు మనోహరముగఁ దెల్పెను. నీమనోరథ మీడేరు నని విశారదుఁడు కమలములనీయ నదియు నొక శుభశకునముగా నధిపుఁ డంది చేలికందిచ్చినట్లనే గబ్బిగుబ్బెతచెలిమి చేకురంగ గల దనుచు నాత్మలో నెంచి యాభావ మపనయించి యన్యాపదేశంబునఁ దనభావమును సరసముగ వెల్లడించెను.

ఇట్టిరచనలచే శృంగారరస మిక్కావ్యమున విభావాదులచే సముల్లసితమై సహృదయహృదయానందకర మగురీతిని శోభావహముగఁ బోషింపఁబడెననుటకు సందియములేదు. మఱియు నీతఁడు,

" గుట్టుసియాడ గబ్బిచనుగుట్టలపై పులకాంకురావళుల్
కెట్టుపగట్ట ... ... ... ... ... "

మున్నగుపట్టుల స్వభావసిద్ధము లగుభావములను జెప్పినను నంతవిచ్చలవిడిగా పచ్చిశృంగారమును వర్ణింపఁగూడ దనియు నట్లు చెప్పుట యుచితము గాదనియు కొంద అందురు. కాని సామాన్యముగనాంధ్రకవు లిట్టిపట్టుల నిటులవర్ణించుట సహజముగ కాన్పించుచున్నది. శ్రీనాథుఁడు తన శృంగారనైషధమున

" పవిసంగమ్మున తాపమొందిన శచీప్రాణేశు కంగేలికిన్
జివురుంగైదువుజోదు వైద్య ముపదేశించెన్ ... ...
... ... ... ... ... ... ... ...
ఇవతాళించు విదర్భరాజతనయాహృద్యస్తనద్వంద్వమున్ "

అని 'ఖైమిరాకోమలకర గ్రహణ' మని మూలముననుండ నీత డంతతోఁ దృప్తిఁజెందక పైజెప్పినయట్టుల నొకమందుఁ జెప్పెను. మఱియు నేకాంతచారి యగు నా నలుని యొకతె యెదుర్కొని యొరసె నని మూలమున నుండ నీ శృంగారనైషధమున నంతతో రసావహము గాదని కావలయు

"ప్రిదిలిన నీవిఁ గేల సవరించు తలోదరి నోర్తు గాంచి లోఁ
గదిసిన పాపభీతి వడి గన్నులుమోడ్చ నొకళ్లొకళ్లకై
యెదురుగవచ్చివచ్చి యొకయిద్దరు ముద్దియ లొత్తి రవ్విభున్
మదగజరాజసంభ్రమముల మచ్చరికించు కుచద్వయంబులన్"

అని వర్ణించెను. మఱియు నిట్లే రసికజనమనోభిరామకర్తగూడ నిట్టి శృంగారవర్ణనలను చేసియున్నాఁడు. పెద్దనార్యుఁడుగూడ

"ప్రాంచద్భూషణబాహుమూలరుచితో పాలిండ్లు పొంగార పై
యంచుల్ మోవఁగఁ గౌఁగిలించి ... ... ... ..."

అని చెప్పియున్నాఁడు. ఇట్లు సామాన్యముగ నాంధ్రకవులు శృంగారప్రబంధముల నిట్టిసందర్భములం దింతస్వేచ్ఛగా వర్ణించుటయుఁ గలదు. కావున నీవిజయవిలాసమున నీతఁడే క్రొత్తగఁ జెప్పియుండలేదు. కవిజనసామాన్య మగురీతి నితఁ డనుసరించెననుట సమంజసము.

మఱియు నీకవి భాష నుపయోగించుటలో చాల స్వతంత్రుఁ డని చెప్పవచ్చును. తనకాలముననున్న వ్యవహారముల నించుక సంస్కరించి యయ్యవి పూర్వలక్షణవిరుద్ధములైనను నెక్కుడుగ వాడియున్నాఁడు. చూడుఁడు,

"ఊదుకపోవు శంఖము నహో గళరేఖ"

అని యూదుకొనిపోవు ననెడి యర్థమున ఊదుకపోవు అని ప్రయోగించెను. మఱియు,

"మగవానికి మగవాఁడును......ఏమనన్నగరపురాజసమారుల జిగిబిగి"

ఏమనను, అనునది ఏమందును అను నర్థమున వాడియున్నాడు. ఇది పూర్వలక్షణ విరుద్ధమైనను తనకాలమున నుండు వ్యవహారమగుట నీతఁడు నిశ్శంకముగ వాడియున్నాఁడు.

"గుసగుసల బోయి వలపుల కిసకిస లని"

అని, గుసగుస కిసకిస మున్నగువానిని తమ కాలమున గ్రామ్యములగువానిని సంస్కరించి వాడెను. ఇట్లు దేశీయపదముల వాడుటగాక సామెతలను కొన్నినీతులను సరసముగఁ బ్రయోగించియున్నాఁడు.

"మోక్షమునకుఁ బోవ మొస లెత్తుకొని పోయె"
"క్షితి నటుగాదె యొక్కొకరికిన్ నదుమంత్రపు కల్మిగల్గినన్"
"ఏ గతి రచియించిరేని సమకాలపువారలు మెచ్చరే కదా"
"ఒకరాజు సన్నగిల్లిన యొకరాజు జంరంతమున్ మహోన్నతిఁ గనఁడే"
"అందినన్ సిగయు నందకయున్నను గాళ్లుఁ బట్టుకొందువు"
"చేసినయది జపమున్ మరి వేసినయది గాలమనుట"
"ఆఁడుపుట్టువు పుట్టింటి కాసపడును"

అను సామెతలు మొదలగువానిని దగినపట్టుల నర్థమును సమర్థించురీతిని వాడియున్నాఁడు.

మఱియు నీతఁడు లక్షణవిరుద్ధము లగుప్రయోగముల వాడుటచే నీగ్రంథము సలక్షణము కాఁజాలదని కొందఱి యూహ. "అనవలసంటిగా కెరుగవా" అనుచో క్త్వార్థకారసంధియు

"కోప మొకింత లేదు......సత్యమా
రూపము తారతమ్యము లెఱుంగ......"

అనుచో రేఫ శకటరేఫలకు యతియు మున్నగు లక్షణవిరుద్ధములిందు గాన్పించుటచే నియ్యది సలక్షణము కాజాలదని తలఁచెదరు కాని ఇట్టి ప్రయోగము లీతఁడేకాక తత్పూర్వులుఁగూడ ప్రయోగించియున్నారు. రేఫలమైత్రి పోతనగూడ చేసియున్నాఁడు.

"నెఱిఁ బ్రియురాలైన సురుచిఁ గన్న......" (భాగ:)
"ఎఱిఁగెఱింగి నా వల పిది యేల"

అని క్త్వార్థకారసంధి భాగవతమునగూడ నున్నది. మఱియు

"నే డేతెంచు ప్రయత్నమున్న నకటా నీచేర చెప్పంపఁడే......"

అని ప్రభావతీప్రద్యుమ్నమునగూడ నిట్టిసంధులు గలవు. శ్రుతిహితము లగుపదములను తాము యథానుకూల్యముగ వాడుచుందురు. కాన నింతమాత్రమున దీని సలక్షణతకు భంగము వాటిల్లనేఱదు. కావుననే విష్ణుచిత్తీయమున "తలఁబక్షచ్ఛట గ్రుచ్చి బాతువులు కేదారంపు గుల్యాంతరస్థలి నిద్రించుటఁ జూచి" బాతు, అనుదానికి వు వర్ణకముచేర్చి శ్రుతిహితమగుట ప్రయోగించినను దోసము లేదయ్యె.

మఱియు నిందు దత్పూర్వపుచాయ లచ్చటచ్చట గాన్పింపక పోలేదు. చూడుడు మనుచరిత్రమున గల

"ఎక్కడివాఁడొ యక్షతనయేందుజయంతవసంతకంతులన్
జక్కదనంబున న్గెలువజాలెడువాఁడు.........
మఱిం ... ... ... ... ... ...
డక్కొనంగరాదె అకటా నను వీడు పరిగ్రహించినన్"

ఈ భావమును ఇంచుక మార్చి

"చెక్కులయందము న్మొగముచెల్వము జన్గవనీటు వేణిలీ
లక్కడ జూడ మన్నిటికి............
............ఇక్కటి యొక్కటి చాలదే మఱిం
డక్కొనన్ రతింగెలిచి డక్కొనన్ నవమోహనాంగికిన్"

అని పై భావము ననుసరించెను. మఱియు,

"అబ్బురపాటుతోడ నయనాంబుజముల్ వికసింప కాంతి పె
ల్లుబ్బి కనీకల్ వికసితోత్పలపంక్తుల గ్రుమ్మరింపగా
గుబ్బమెఱుంగుజన్గవ గగుర్పొడువన్ మదిలోన గోర్కెల్
గుబ్బతిలంగ జూచె నలకూబరసన్నిభు నద్ధరామరున్"

అని మనుచరిత్రమున గలభావమే క్రింది పద్యమునఁ బ్రస్ఫురించుచున్నది.

"గట్టసియాడ గబ్బిచనుగుట్టలపై పులకాంకురావళుల్
కెట్టువగట్ట కోరికలు తేటలు వెట్టగ వేడుకల్ మదిన్
కొట్టికొనంగ నచ్చెరువు తొంగలిరెప్పల మీగ నొత్తరగాఁ
బెట్టిన దంతఁపీయక విభీరమృగేక్షణ నూచె నాతనిన్"

మఱియు,

"చిన్ని వెన్నెలకందు వెన్నుదన్ని"

అను మనుచరిత్రభావమును

"ధారాధరము వెన్నుదన్ని పుట్టిన"

అను నీ పద్య మనుకరించుచున్నది.

"అనుటయు మాట లేక హృదయాబ్జము జల్లన మోము వెల్లనై
కనలుచు నీరుదేర కెలిగన్నుల నాలని ఫుల్కుఫుల్కునం
గనుగొని మాటలం దొదవు గద్గదికం దలయూచి"

అను మనుచరిత్రభావమునకును

"అని పచియించునప్పుడు ముఖాబ్జమునం బొడి విన్నబాటు చ
క్కని తెలిసోగకన్నుగవ గ్రమ్ముచు నుండెడి బాష్పముల్ గళం
బున గనిపించుగద్గదిక ముప్పిరిగొ న్వలవంతే దెల్ప ని
ట్లను"

అను నీ పద్యభావమునకును భేద మంతగా కన్పట్టదు. ఇట్లు పూర్వ గ్రంథముల బఠించుటచే నా భావములు కొన్నిపట్టుల దమ గ్రంథ ముల నించుక గన్పట్టుచుండును. సామాన్యముగ నన్ని ప్రబంధము లను నిట్టి భావసామ్యము గాననగు. అంతమాత్రమున నాభావముల నపహరించెననుట కవకాశ ముండదు. కొండొకచో దా మా భావ ముల జూడకున్నను నట్టిభావములు తమకు కల్గుటయుసంభవించును.

ఈ సరసకవి మిగుల హృదయంగమ మగునటుల సరస వచోరచనల నలరారు నీ ప్రబంధమును రచించి యాంధ్రకవి తామతల్లి కలంకృతి చేసెననుట నిస్సందేహము. కాన నిట్లు సుకవి శేఖరుల మన్ననలఁ జెన్నారు నీ ప్రబంధమును బఠించి యా యానం దము నందుదురుగాక.

---

## శివస్తోత్రనక్షత్రమాలిక

శ్రీరామ్ వీరబ్రహ్మకవి గారు.

శంభో ! శంభో ! శివ ! శంకర ! శంభో !
శంభో ! శంభో ! యీశ్వర ! హర ! శంభో !
వరమునిహృదయ నివాసిత శంభో !
పరమకృపారసబంధుర ! శంభో !
సరసిజలోచనసాయక ! శంభో !
ధరణీరథ ! వరదాయక ! శంభో !
నగజాత మనోనాయక ! శంభో !
నగధర ! శ్రీ సంధాయక ! శంభో !
హరహర ! జితకుసుమాంబక ! శంభో !
హరిప్రియసఖ ! యసమాంబక ! శంభో !
దక్షాధ్వర విధ్వంసక ! శంభో !
యక్షేశ్వరసఖ ! యఘహర ! శంభో !
అమరేంద్రప్రముఖార్చిత ! శంభో !
ప్రమథగణాధిప ! పశుపతి ! శంభో !
ఉరగభూష ! మృత్యుంజయ ! శంభో !
గిరినివాస ! ముక్తిప్రద ! శంభో !
శూలాయుధ సంశోభిత ! శంభో !
కాలాంతక ! గంగాధర ! శంభో !
గజముఖజనక ! సుఖప్రద ! శంభో !
రజతాద్రివిహార ప్రియ ! శంభో !
పావకనేత్ర విభాసిత ! శంభో !
దేవదేవ ! భూతిప్రియ ! శంభో !
ఘోరాంధకసంహారక ! శంభో !
గౌరీప్రియ ! బుధకల్పక ! శంభో !
శీతకిరణధృతశేఖర ! శంభో !
భూతగణేశ్వర ! పురహర ! శంభో !
పంచాక్షరమంత్రాంచిత ! శంభో !
పంచవదన సంభాసిత ! శంభో !
నందివాహ ! సుమనస్తుత ! శంభో !
వందితపాదాబ్జద్వయ ! శంభో !
పాలితనిఖిలదివౌకస ! శంభో !
ఫాలోజ్జ్వలితాంబకధర ! శంభో !
సకలలోకరక్షాపర ! శంభో !
అకలంకచరిత్రామృత ! శంభో !
అంకస్థితశైలాత్మజ ! శంభో !
సంకటహరణ ! వృషధ్వజ ! శంభో !
కాలకూటయుతకంధర ! శంభో !
శైలశరాసన ! సన్నుత ! శంభో !
రౌద్రాకారవిరాజిత ! శంభో !
రుద్రగణాధిప ! భద్రద ! శంభో !
రక్షితసకలచరాచర ! శంభో !
సాక్షాత్కైలాసప్రద ! శంభో !
వృజనవినాశక ! మృగధర ! శంభో !
సుజనగణావన ! అజనుత ! శంభో !
శ్రీకాళద్వీపసేవిత ! శంభో !
లోకారాధ్య ! త్రిలోచన ! శంభో !
అసదృశగజచర్మాంబర ! శంభో !
భసితశరీర ! శుభంకర ! శంభో !
వ్యోమకేశ ! బుధపూజిత ! శంభో !
శ్రీమన్నిగమార్చితపద ! శంభో !
విశ్వజగన్నుత ! విశ్రుత ! శంభో !
విశ్వరూప ! విశ్వేశ్వర ! శంభో !
భూరికపాల విభూషిత ! శంభో !
వీరబ్రహ్మకవిస్తుత ! శంభో !

# శ్రీ చల్లపల్లి రాజావారి పరిణయ వైభవము

గున్నేపల్లి మృత్యుంజయ కవి గారు

సిరులిరవొంద సద్గుణవిశేషము లన్నియుఁ గల్గియుండఁగా
సరసత లేకపో దనుచు సత్కృతులన్ బచరించి శారదా
శరదరశారదాభ్ర ఘనసార తుషార శతార తారకా
సరసిజసన్నిభంబగు యశంబు వశంబుగఁ జేయు సత్కవీ
శ్వరుల కొకించుకంతయిన సత్కృతిఁ జేయుట కిచ్ఛలేక బం
ధుర రథ గంధసింధుర మనోహర మందిర సౌధవప్ర గో
తురగ భటాలితోడఁ దులఁదూఁగెడి రాజ్యము పూజ్యమై నిరా
దరముగ నాస్యులన్ గనిన తత్ఫల మిట్లొనఁగూడెఁ గీర్తియే
స్థిరముగదా యటంచు మదిఁ జింతిలు రాజకళింగగంగ భూ
వరముఖ విత్త మత్త నృపవర్గము నెప్పటియట్లఁ దేల్ప నీ
శ్వరపదసేవనైన నగజావర లబ్ధకవిత్వ తత్సుధీ
విరచిత వాక్సుధామధురవీచిక యైనను దిక్కటంచు ధీ
వరులను సూక్తులన్ విని శుభం బొనగూడఁగ భక్తియుక్తి త
త్పరులయి తత్ప్రసాదము సదా మదిఁ గోరెడివారి రీతిగా
కరయఁగ సంస్కృతాంధ్ర కవితాభిరతుల్ నిగమార్థచోదితుల్
పరమకృపాన్వితుల్ చతురుపాయమతుల్ మనయార్లగడ్డవా
రెఱుఁగని రాజధర్మము లిఁకేమియు లేవన మున్న మున్న నే
పరిణయ వైభవోన్నతులు పత్రికలన్ విశదీకరించి చే
సిరి యువరాజు పెండ్లి లిఁకఁ జెప్పదరంబె తదీయశోభ ల
త్తరి ధణధిమ్ తధిమ్ ధిమిత తక్కిట తఝ్ఝణుతా ధిమీతకుం
దరికిట తత్తధిమ్ తకిట తఝ్ఝణు ఝుమ్తక ధిమ్ధిమి ధ్వనుల్
గురియు మృదంగ తాళములకున్ దగ వీణెలపై ఫిడేళ్లపై
నిరిసససీధనీస్నిధమ సీధనిపాధని సారిగామపా
గరిసని ధానిసాధనిస గారిస నీసరి రీసనీరిస
స్వరము లనేకభంగుల నభంగుర తుంగ మతంగ పుంగవో
త్కర మదలోల షట్పద సుఖప్రద నాద వినోదలీలలన్
వఱలఁగఁజేయ గాయకులు వందులు మాగధులున్ యథావిధిన్
బిరుదము లుగ్గడింపఁ బృథివీసురులున్ విబుధేంద్రులున్ గవీ
శ్వరులును బంధు మిత్రులును బౌరులు నాశ్రితు లెందఱెందఱో
సరసిజగర్భరాణి నెఱజాణతనంబునఁ బూర్వపుణ్యపుం
గరిమ లెఱింగి చిత్రఫలకంబుల నృత్యము సేయుచుంటఁ ద
చ్చరణసరోజదివ్యమణిసంజనితాభినవప్రకాశ నూ
పుర ఘలఘల్ ఘలాది రవముల్ బలె బద్యములన్ బఠింపుచున్
బరిమళ వస్తు సమ్మిళిత పాయస గోఘృత సూప పూప సుం
దర కలమాన్న పక్వఫల నవ్యరుచుల్ బహు శాకపాక మే
దుర దధి మాధురీతతులు తోరపుఁ గమ్మనితావు లాచు ము
మ్మరమునఁ గ్రమ్మ ఘుమ్మురన మంజుగతిన్ భుజియించి లేచి క
ప్పురవిడియమ్ములందుచును బొంపిరివోయెడి నృత్యగీత చా
తురి గలనాటకుల్ వెలుఁగుదోపఁగఁ గృష్ణతులాభరాది వి
స్ఫుర దురు నాటకంబులను జూపఁగ మాటికిఁ జిత్తగింపుచున్
బిరబిరఁ బండితోత్తముల పేరులుఁ బేర్కొని వారి కీవికిన్
సరిపడఁ బెక్కురొక్కములు సాలులు ధోవతు లెన్ని యెన్నియో
ముఱియుచు నీయఁ గన్గొనుచు మోహనరాజసభాంతరాళ దం
తురిత లతావితాన వితతుల్ దిలకింపుచు నేత్రపర్వమై
బరఁగెడి దీపికానికరభాసురహర్మ్యతలైకవేదికా
పరిసరకాయమానముల బాపలుదీర్చుచు నిర్జరాంగనా
కరసరసీరుహ ప్రకర కల్పలతాంతము లొయ్యనొయ్య నం
బరమునసుండి జాఱుగతిఁ బల్మరు వెల్గెడి బాణసంచు క్రొ
మ్మెఱుఁగుల కౌదలల్ గదల మెచ్చుచు భద్రగజాధిరూఢుఁడై
వరుఁ డరుదెంచు మార్గముల వైభవముల్ పరికించిచూచు చ
ద్దిర భళి బాపురే యని నుతింపనివారలు లేరటంచు సం
బరమున నెందఱో బలుక వచ్చి గనుంగొనినాఁడ వారి యా
దరమును వారియద్భుతవదాన్యత వారియశోభిలాష యె
వ్వరికిని రాదు రాదనుచుఁ బల్కఁ దలంకరు శాంకరీ! పరా
త్పర కరుణాకటాక్షమున భాసిలు మత్కవితాకుమారి నె
ల్లరుఁ గని సంతసింపఁగ నలంకృతులన్ గయిసేయు దీవు స
త్వరమున యార్లగడ్డ కులవార్నిధి పూర్ణసుధాంశుఁ డౌచు ను
ర్వర విలసిల్లునట్టి శివరామప్రసాద బహద్దరన్ మహీ
శ్వరున కొసంగుచుంటి నొక చంపకమాలికఁ గాన్కగాఁగ నీ
నిరుపమసత్కృపాగరిమ నేఁడు గనంబడఁ జల్లపల్లి యన్
బురమునఁ బట్టభద్రుఁ డయి మోదముఁజెందెడి తద్వసుంధరా
వరున కభీష్టసంపద లవారిగఁ జేకుఱఁజేసి భూపురం
దరుఁ డను పేరు కీర్తు లనారతమున్ ఘటియింపుమమ్మ ని
న్నమరలేక నామది నహర్నిశమున్ భజియింతు నెంతయున్.

# దురభ్యాసములు

పాలపర్తి రామమూర్తి గారు

మానవునియొక్క బాగోగులు అతఁ డవలంబించు అభ్యాసములనుఁ బట్టి యుండును. సాధారణముగ నీ యభ్యాసములు సహవాసవశముచే నలవడుచుండును. సజ్జనసాంగత్యమువలన సద్గుణములును, దుష్టుల సాంగత్యమువలన దుర్గుణములును నబ్బును. అందు సద్గుణములకన్న దుర్గుణములె త్వరలో పట్టుపడును. ఈ దుర్గుణపిశాచములు క్రమక్రమముగా మానవుని నావహించి భ్రష్టునిఁ జేయును. ఈ దురభ్యాసములు పెనుభూతములవలె మనుజుని పీడించి పిప్పిజేయుచున్నవి. అనేకు లీ దయ్యములకు దాసులై రేయింబవళ్లు దాస్యము చేయుచున్నారు. పాలు, పెరుగు, నెయ్యి, పండ్లతో పెంచినశరీరము ఈ దయ్యములపాలు చేయబడుచున్నది. ఈ పిశాచములు మన రక్తమును గ్రోలి యేనుఁగులవంటివారిని పీనుఁగులనుగాఁ జేయుచున్నవి. పుణ్యభూమి యగు ఈ భరతఖండమున జన్మించి, కుచ్ఛమై అనారోగ్యకరమై నీతిదూరమైన దురభ్యాసములకు మానవుఁడు దాసుఁ డగుట కడు లజ్జాకరముకదా !

మానవుని పీడించుచున్న దురభ్యాస పిశాచము లేవి యన—

1. చుట్ట, 2. బీడి, 3. సిగరెట్టు, 4. కల్లు, 5. సారాయి, 6. నల్లమందు, 7. కాఫీ, 8. టీ, 9. గంజాయి, 10. జూదము, 11. దొంగతనము, 12. రంకుతనము.

పై నుదహరించినవాని కన్నింటికిని పరస్పరసంబంధము గలదు. ఇవి దురభ్యాసపిశాచసౌధముయొక్క సోపానములు. ఈ మేడయొక్క క్రిందిమెట్టుపై పాద మిడిన పైమెట్లనుగూడ నెక్కవలెననునిచ్చ బుట్టును. ఈపిశాచములలో మొదటిది చుట్ట. దీనికి ఆధారభూతమైన పొగాకునుగురించి యొక్కింత యోచింతము.

## పొగాకు

పొగాకుకు సరియైన తెలుఁగుపదము గాని, సంస్కృతపదము గాని లేదు. పొగవచ్చు ఆకు గాన పొగాకు అని పేరు పెట్టబడినది. ఇది అమెరికాఖండము నుండి సుమారు 450 సంవత్సరములక్రింద మన దేశమునకు కొలంబసు అను తెల్లవానిచే గొనిరాబడినది. మృగము లైనను మూచూడని యీ పాడు పొగాకును మనుష్యు లమితముగా వాడుచున్నారు. ధనమున కాశించి రైతులు నవధాన్యములుపండు తమ నిక్షేపమువంటి భూములలో నీ పాడు పొగాకునువేసి దేశమును దరిద్రదశకు దెచ్చినారు. ఈ పొగాకువల్ల రైతులకు తిండికి ధాన్యములేకపోగా నోరులేని పశువులకు మేతకూడ లేని దుస్థితి సంభవించినది. పొగాకు వేసిన పొలములలో కొంతకాలము మరొక పంట పండనేరదు. దీనినిబట్టియె యీ మొక్కలో నెట్టి దుర్గుణమున్నదో తెల్లమగును.

## పొగాకు గుణములు

పొగాకులో "నికోటైను" అను నొకవిధమైన విష మున్నది. ఒక పౌను పొగాకులో 380 వడ్లగింజలయెత్తు విష మున్నదనియు, ఇందులో 10వ వంతు విష మొక కుక్కను పదినిమిషములలో జంపగల దనియు, 30 నిమిషములలో నొక మనుష్యుని జంపుశక్తి దానికున్నదనియు వైద్యశాస్త్రవేత్తలు తెలుపుచున్నారు. పదిను ఒక చుట్టపొగాకులో నిద్దరు మనుష్యులను జంపగల విష మున్నదని కనిపెట్టబడినది. పచ్చిపొగాకు కడుపునవేసికట్టినచో వమనములుపుట్టి స్పృహదప్పి క్రిందపడుదురు. ఇంతయేల క్రొత్తగ చుట్ట నభ్యాసముచేయువా రందఱును మైకముచే పడిపోవుదురు. దీనినిబట్టియె పొగాకులో విష మున్నదని మనము గ్రహించవచ్చును. ఇట్టి విషయుతమగు పొగాకును మనవారు నాలుగువిధములుగా వాడుచున్నారు.

1. చుట్ట 2. సిగరెట్టు 3. పొడుము 4. నములుట.

చుట్ట :—చుట్టత్రాగు అభ్యాసమును కొందరకు తల్లిదండ్రులే కారకులు. తాను చుట్టకాల్చుచుండగా పుత్రుడు అవివేకమున దనకది కావలెనని యేడ్చిన, యేడ్పు చల్లార్చుటకో లేక ముద్దుకో తండ్రి తన యెంగిలిచుట్టను యిచ్చిగాని లేక చిన్నచుట్ట చుట్టియిచ్చిగాని బిడ్డ నోదార్చుచుండుట యనేకులు చూచియుందురు. కొందఱు దుస్సాంగత్యమువల్ల దీని నభ్యసించుచున్నారు. ఈతీరున బాల్యమునుండె అభ్యసించి నరులు తమ జీవితకాలమునందెను నీ పిశాచమునకు దాసులై పలురోగముల పాల్పడుచున్నారు.

చుట్టవల్ల నష్టములు :—చుట్ట కాల్చుటవల్ల జీర్ణసాధన మగు నోటిలోని యుమ్మినీరు ఇగిరిపోవును. తఱుచు నుమియుటచే ఉమ్మినీరంతయు వ్యయమై అజీర్ణవ్యాధి కలుగును. ఊపిరి తిత్తులలోనికి నీ పొగ వ్యాపించి అందలి వాయువును విషకలితముజేయును. దానివలన శ్వాస, కఫరోగములు జనించును; గుండె బరువుగాను నిస్సత్తువగాను నుండును; ఱొమ్మెండిపోవును; రక్తము పలుచనగును; దృష్టి మందగించును; కండ్లు గుంటపడును; మెదటియొక్క చురుకుదనము దగ్గిపోవును; పెదవులు నల్లబారును; కొందఱికి పెదవులు తెల్లబారి బొల్లి యేర్పడును.

గంజాము, విశాఖపట్టణము, గోదావరి మండలములలో చుట్టకాల్చు అభ్యాసము అమితముగా నున్నది. అందు ముఖ్యముగా బాలురును స్త్రీలును గూడ నీ దురభ్యాసమునకు లోనైయున్నారు. వీనియందు చాల యిచ్ఛగలవారు చుట్టను త్రిప్పి, నిప్పునైపుభాగమును నోటియం దుంచుకొని, కాల్చుదురు. స్త్రీలు సయితము చుట్టను త్రిప్పి కాల్చుచుందురు.

విదేశ సంపర్కము అధికమైనకొలది నవనాగరకత హెచ్చినకొలది పలురకముల సిగరెట్లు మనదేశములో వ్యాపించుచున్నవి.

సిగరెట్లు :—చుట్టకన్న సిగరెట్టు చాల అపాయకర మని డాక్టర్లు చెప్పుచున్నారు. చుట్ట పల్లెటూరువారు ఉపయోగించుచుండెడివారు. కాని సిగరెట్టు చూచుటకు పైకి నాజూకుగా నుండుటచేతను విద్యార్థులు విశేషముగా కాల్చుటచేతను అయ్యది మన విద్యార్థిలోకములో పూర్తిగా వ్యాపించినది. దొరలు కాల్చి పారవేసిన యెంగిలిచుట్టలను, కొఱమాలిన తుక్కుపొగాకును దెచ్చి మత్తునుగలిగించుటకు నల్లమందు ద్రావకములో నానవేసి సువాసనగా నుండుటకు కొన్ని సువాసనద్రవ్యములను దానిలో జేర్చి సిగరెట్టులనుగా తయారు జేయుచున్నారు. ఈ కాలములో విద్యార్థులలో సిగరెట్టు అభ్యాసములేనివారు చాల అరుదు. ఒకచేత పుస్తకములు మరొకచేత సిగరెట్టు ఇప్పటి విద్యార్థియొక్క ఫ్యాషను అయినది. వీరిలో గొందఱు నోటితో పొగనుపీల్చి నాసికారంధ్రములగుండ దానిని వదలుచుందురు. ఇది మిగుల నష్టదాయకము. చుట్టకన్న దీనియం దెక్కువ దుర్గుణము లున్నవని గ్రహించి నార్వే, స్వీడను మున్నగు దేశములలో 14 సంవత్సరముల వయస్సులోపల బాలురు సిగరెట్టు నుపయోగింపరాదని శాసనము జేసియున్నారు. మనదేశములోగూడ మైసూరు, బరోడా రాజ్యములలో సిగరెట్టు విషయమై కొన్ని కట్టుదిట్టములను జేసియున్నారు. శాన్ ఫ్రాన్సిస్కోలో నొక సంఘమువారు పొగాకును శోధనజేసి సిగరెట్టులలో నల్లమందులో నున్నంత దుర్గుణమున్నదని నుడివిరి. నల్లమందు తినువారు కల్లలాడుదురు; దొంగిలింతురు. అటులనె సిగరెట్టు కాల్చువారును నుందురనియు, వారికి నీతియందు పట్టుదల యుండదనియు చెప్పిరి.

ఒక న్యాయాధిపతి యిట్లు చెప్పెను :— "నావద్దకు విచారణనిమిత్తమై తేబడినవారలలో ననేకులు సిగరెట్టు కాల్చువారు. ఈ యభ్యాసమునకు లోనైనవారెట్టి దుష్టకార్యముల నైనను జేయుటకు జంకరు".

సర్వరోగములకు ఆటపట్టయిన ఈ సిగరెట్టును మనబాలురు కాల్చకుండ తగిన జాగ్రత్త తీసికొనుట తలిదండ్రుల విధియై యున్నది.

పొడుము :—భగవంతుడు మనకు ముక్కునిచ్చినది ప్రాణవాయువును పీల్చుటకును, సుగంధ దుర్గంధములను గనుగొనుటకునుగాని యీ పాడు పొడుమును పీల్చుటకుగాదు. పొడుము పీల్చువారు తమ పొడుముబుఱ్ఱలకు బంగారు, వెండి పొన్నులు గొలుసులు వేయించి ఎంతో అందముగ చేయించి నలుగురికిని కనబడులాగున హస్తములధరించి వీధులలో దిరుగుచుందురు. పొడుముపిచ్చి గలవారు సిగ్గువిడిచి యేనీచునైన ముష్టియడుగుదురు. గొప్ప హోదాలో నున్నను పొడుముపిచ్చి దొడ్డనప్పుడు తారతమ్యమును పాటింపక దగ్గఱనున్న నేవనైన ముష్టియెత్తి ముక్కులకెక్కింతురు.

పొడుమువలని నష్టములు :—పొడుము నాసికారంధ్రములగుండ శిరమున ప్రవేశించి (?) అక్కడి మాంసగ్రంధులను దినివేయును ; మెదడును పాడుచేయును ; ఘ్రాణశక్తిని క్షీణింపజేయును. అందువలననే పొడుము పీల్చువారు ఏదైన నొకపని జేయుటకుముందు చిటికెడు పీల్చిగాని పనిచేయలేరు. ముక్కురంధ్రములు పొడుముచే కప్పబడియుండుటచే ఉచ్ఛ్వాస నిశ్వాసములకు వీలులేక నోటితోనే శ్వాసవిడుతురు. ఇది శరీరావయవములకేగాక శరీరమున ధరించు వస్త్రములను సయితము మలినపఱచును. ఈ మహానుభావులయొద్ద చిన్న జేబుగుడ్డ లుండును. వానిని వెలుపలికి దీసినప్పుడు వాని దుర్గంధము భరింప శక్యముగాదు. వీరి వస్త్రములు మలినముతో నిండి అసహ్యాకరముగ నుండును. వీరు తమ శరీరమును వస్త్రములను మలినపఱచుటేగాక తాము కూరుచుండు ప్రదేశములను చుట్టునున్న గోడలను గూడ మలినపఱతురు. పట్టణములలోని జలదారులనుండి వెలువడు మురికినీటివలె పొడుము పీల్చువారి ముక్కురంధ్రములనుండి మలినము ఎడతెగక కారుచు నొక్కొక్క సమయమున నోటివఱకు దిగుచుండును. కొంద ఱీ ప్రవాహమును చేతులతో దీసి వస్త్రములకును చుట్టుప్రక్కలనున్న గోడలకును బూయుదురు. ఈ దురభ్యాసమునుండి విముఖులనుగా జేయుటకే ఇంత హేయముగ వర్ణించవలసి వచ్చినది. అందులకు జదువరులు మన్నింతురుగాక.

పొగాకు నమలుట :—ఈ యలవాటు చాలవఱకు హీనజాతులవారిలో గలదు. కాని గంజాం మండలములోను, ఆంధ్రదేశములోను, మళయాళ ప్రాంతమందును కొంతమంది అగ్రవర్ణము లనబడు బ్రాహ్మణులలోగూడ నీ దురభ్యాసము వాడుకలో నున్నది. వారు తమలపాకులలో కలిపి పొగాకు నములుదురు. పొగాకు విషయుక్తమైనందునను వెగటును గలిగించుటచేతను వారు దానిని మ్రింగక సదా ఉమియుచుందురు.

నమలుటవలని నష్టములు :—అరుచియైన పదార్థమును నోరు భరింపజాలదు గాన వారు ఉమ్మి వేయవలసివచ్చును. ఉమియుటచే నోటిలోని లాలాజలము వృథయైపోయి అజీర్ణవ్యాధి పుట్టును ; కొంత అన్నకోశమున జొరబడి జీర్ణశక్తిని చెరచును. స్త్రీలకు గర్భస్రావము గలుగును ; మనసునకున్నశక్తి క్షీణించును.

కావున పొగాకును ఏరూపమున సేవించినను హానికర మని స్పష్టపడుచున్నది. పొగాకు శరీరపోషణకుగాని బలమునకుగాని అక్కఱకువచ్చు వస్తువుగాదని విదితమగుచున్నది. దీనివల్ల శరీరహానియేగాక ధనహానిగూడ అమితముగ నున్నది. ఒక్కొక్కరు చుట్ట, సిగరెట్టు, పొడుములకై దినమునకు అణా, రెండు అణాలు ఖర్చు చేయుచున్నారు. ఈ విధముగ మనదేశములో కోట్లకొలది ధనము వ్యర్థమగుచున్నది. ఒక సిగరెట్టులవల్లనే రెండుకోట్ల రూప్యములు విదేశములకు బోవుచున్నవని చెప్పుచున్నారు. ఇప్పుడు వంగదేశములో సిగరెట్టులను బహిష్కరించుచున్నారు. కలకత్తా ప్రాంతమున సిగరెట్టును త్రాగుచు నెవడైన వీధిని బోవుచున్న వానిని హేళనచేసి ఏడిపించుటేగాక వాడు సిగరెట్టును పారవేయకున్న వాని మొగమున నుమియుటగూడ గలదట.

పై వివరించిన విషయములనుబట్టి పొగాకువలన మన కనేకములైన నష్టములు గలుగుచున్నవని మనకు విదితమగుచున్నది. ఈ పిశాచమునకు హీనజాతులవారేగాక కండలములను, శాలువలను ధరించి పండితుల మని పేరందిన బ్రాహ్మణోత్తములును, బి.ఏ., ఎం.ఏ., పరీక్షలలో గడతేరిన పట్టాణవిద్యాధికులును, ఉన్నతోద్యోగులును, న్యాయవాదులును మొదలగు నాగరికులందఱును నీ పొగాకుకు దాసానుదాసులై లేయింబవళ్లు సేవజేయుచున్నారు. సర్వజ్ఞుల మని విఱ్ఱవీగువారే యీ దురభ్యాసములకు లోనగుచుండగా నిక మూఢులను, విద్యార్థులను అనవలసిన పనిలేదు. దీనివలననే మనుజుని జీవితము వ్యర్థమగుచున్నది.

కావున పొగాకును సేవించుబుద్ధిగలవారందఱు పై విషయములను జక్కగా నాలోచించి యనారోగ్యమైనట్టియు, అసహ్యాకరమైనట్టియు, ధననాశనకరమైనట్టియు, నీతిదూరమైనట్టియు నీ పాడుపొగాకును సేవించుట మాని యారోగ్యవంతులై సుఖముగా నుందురని నమ్ముచున్నాను.

## మ ద్య ము

పొగాకుకన్న మద్యపానము చాల హానికరమైనది. ఈ దురభ్యాసమువలన ధన మాన ప్రాణములు గోల్పోయినవా రనేకులు గలరు. చలిదేశములగు అమెరికా ఇంగ్లండు మున్నగు పాశ్చాత్యదేశములవారు సయితము దీనియందున్న మహానష్టమును గ్రహించి మద్యపాననిషేధసంఘములను స్థాపించి పాన నిర్మూలమునకు కృషిసలుపుచున్నారు. అమెరికాలో మద్యపానము పూర్తిగ తొలగింపబడినది. ఇంగ్లండులో అమెరికావారివలె రాజశాసనముచేయకున్నను నిషేధప్రచారము జేయుచున్నారు. మనదేశములోగూడ మద్యపాననిషేధసంఘములు సర్వత్ర వ్యాపించియున్నవి. మన చెన్నపురిప్రభుత్వమువారు గత రెండుసంవత్సరములనుంచి మద్యపానమును తగ్గించుటకు ప్రతిమండలములోను నిషేధసంఘములను స్థాపించి ప్రచారముల నేర్పాటుచేసి కృషిసలుపుచున్నారు. కాంగ్రెసువారు తమ కార్యక్రమములో మద్యపాననిషేధము ముఖ్యవిషయముగా నెంచి పికెటింగుమూలమున త్రాగుడును తగ్గించుటకు కృషిసలుపుచున్నారు.

చలిదేశములగు పాశ్చాత్యదేశములలోనే నిషేధప్రచారము చేయుచుండగా ఉష్ణదేశమగు హిందూదేశమునకు మద్యపానము అనవసరమును హానికరమును అని వేరుగ జెప్పనక్కఱలేదు.

మనపూర్వులు సురాపానము సప్తవ్యసనములలో నొక్కటిగ పరిగణించియున్నారు. మహాభారతములోని ఈ క్రిందిపద్యము దానిని ధృవపఱచుచున్నది.

గీ. వెలది జూదంబు పానంబు వేట పలుకు
ప్రల్లదంబును దండంపుపరుసదనము
సొమ్మునిష్ప్రయోజనముగనమ్మసేత
యనెడి సప్తవ్యసనముల జనదు తవుల.

దీనినిబట్టి మద్యపానము చిరకాలమునుండి భారతదేశములో గడునీచముగ జూడబడుచున్నట్లు స్పష్టపడుచున్నది. కాని పాశ్చాత్యనాగరికత ప్రబల నారంభించినదిమొదలు నీ త్రాగుడు హీనజాతులలోనేగాక అగ్రజాతులలోని విద్యాధికులలో గూడ వ్యాపించినది. దీనికిదోడు పలురకముల విదేశసారాయములు దిగుమతియగుటబట్టియు వీధివీధియందును నిట్టిదుకాణము లనేకములు వెలయుటబట్టియు సురాపానము మనదేశములో వృద్ధి కాజొచ్చినది. ఇప్పుడిప్పుడు మన ప్రభుత్వమువారు త్రాగుడును తగ్గింప కృషిసలుపుచున్నను కావలసినంత ఫలితము అగపడుటలేదు. దీనిని తగ్గింప హెచ్చుపన్నులు విధింపబడెను గాని దానివలన రాబడి హెచ్చెనేగాని త్రాగుడు తగ్గలేదు. 1929-30 సంవత్సర రిపోర్టునుబట్టి మత్తుపదార్థములవల్ల ప్రభుత్వమువారికి 5 కోట్ల 90 లక్షల 94 వేల 305 రూపాయలు ఆదాయము లభించినట్లు తెలియుచున్నది.

గతనివేదికనుబట్టిచూచిన 1929-30 లో 27 లక్షల చిల్లర ఆదాయము హెచ్చుగా వచ్చినది. వివరములనుబట్టిచూచిన దేశీయసారాయముల రాబడి 224 లక్షలనుండి 234 లక్షలకు హెచ్చినది. కల్లు రాబడి 255 లక్షలనుండి 267 లక్షలకు హెచ్చినది. విదేశసారాయముల దిగుమతి 725658 గ్యాలనులనుండి 801180 గ్యాలనులకు హెచ్చినది. దీనిపై వచ్చు రాబడి 1509666 రూప్యములనుండి 1613087 రూపాయలకు హెచ్చినది. ఈవిధముగ రాబడి హెచ్చినందున త్రాగుడుగూడ అధికమైనదని యొప్పుకొనక తప్పదు. ప్రభుత్వమువారు మద్యపాననిషేధసంఘములను స్థాపించినను త్రాగుడు అధికమగుచున్నప్పుడు నీసంఘములవల్ల ప్రయోజన మేమాత్రము లేదని ప్రభుత్వమువారు గ్రహించుట మేలు. దీనికై వ్యయపఱచుచున్న ద్రవ్యమును మఱొక దేశోపకార కార్యమునకై వెచ్చించుట శ్రేయోదాయకము.

మనుజునకు నిత్యావసరములగు ఉప్పు పప్పు దుకాణములు లేకున్నను, సారా కల్లుదుకాణములు ప్రతి గ్రామములోను వెలసియున్నవి. పూర్వము స్వల్పక్రయమునకు లభించెడు కల్లు, సారాయి మున్నగు నాటుసారాయములను త్రాగుచుండెడివారు. ఇప్పుడన్ననో యధికధనమును వెచ్చించి బ్రాంది, విస్కి, బీరు మొదలగు విదేశసారాయములను త్రాగి ఇల్లును వళ్లును గుల్లచేసికొని ఆలుబిడ్డలను అష్టకష్టముల పాలుచేయుచున్నారు. ఇంగ్లాండులో నొకడు ఒక బీరు సారాయిబుడ్డికై తనభార్య నమ్మెనట ! త్రాగుడువల్ల అనేకహత్యలు జరుగుచుండగా భార్యను అమ్ముటంత అల్పకార్యములలోనిది కాదు. త్రాగు డెంత ఘోరకార్యములైనను జేయించగలదు. సాధారణముగ జరుగు నేరములలో నూటికి 99 త్రాగుడువల్లనే యని చెప్పవచ్చును. త్రాగమరిగినవాడు డబ్బులేక దొంగతనమునకుగూడ సిద్ధపడి తుదకు కారాగృహవాసమునకు బాత్రుడగుచున్నాడు. త్రాగుబోతులు ఒడలుదెలియక పరులను దిట్టుటయు గొట్టుటయేగాక స్త్రీలను చెరబెట్టుటయు సంభవించుచున్నది. జూదమును, జారచోరత్వములను త్రాగుబోతులు వెనుదీయరు. ఇవి యని యననేల త్రాగుబోతుతనము ఎన్ని మహాఘోరకార్యములనైన జేయించును.

ఇన్ని చెడుగులకు ఆలవాలమైన యీ మద్యపానము మానవశరీరమునకు కట్టి హానిచేయునో విచారింతము :—విప్పపూవు, జొన్నలు మొదలగువానిని పిండిగాచేసి నీళ్లలోగలిపి పులియబెట్టుటచే నేర్పడిన పదార్థమును బట్టిపట్టి కాచినసారమే యీ మద్యసారము. తాటి, ఈత, కొబ్బరి చెట్లనుంచి తీయబడిన సారము పులియ బెట్టుటచే కల్లుగా నేర్పడుచున్నది. కల్లు సారాయి అంత ఘాటుగా నుండదు. సారాయి కిరోసిన్‌నూనెవలె మండెడి వస్తువు. ఇది శరీరమునకు మంటను మత్తును ఉద్రేకమును గలిగించును. ఇట్టి ఘాటుగలపదార్థము మృదువగు అన్నకోశములో చేరి అందలి పొరలను కాల్చివేసి పుండుగా చేయును. ఇది శరీరములో ప్రవేశించి నాడే రక్తములోని నీరునంతయు పీల్చివేయును. రక్తములో నీరు తరిగిరకొలది దాహ మధి కయించును. అందువల్ల అతనికి త్రాగ నిచ్చపుట్టును. ఎంతత్రాగినను తృప్తిలేక పోవుట ... కారణము. అతనికి ప్రావినకొలది రక్తము గడ్డకట్టి నాశనం చును. దీనిదృష్టాంతమును గనుగొనదలచినచో కోడిగ్రుడ్డులోని తెల్లనిసొనను చెప్పి గ్లాసులోబోసి రెండుచెమ్చాలు సారాయమునుబోసి కలిపినచో అదియంతయు గడ్డ కట్టిపోవుట చూడగలరు. ఇదేవిధమున మనదేహములోని రక్తముగూడ మద్యపా నమువలన గడ్డకట్టును. మనశరీరములో ప్రాణాధారమగు కొన్నిజీవాణువులు గలవు. మద్యము ఆ యణువులలోని రక్తమును నీరును పీల్చుటచే ఆ జీవాణువులు ముడుచు కొనిపోవును. జీవాధారములైన శ్వాసధర్మము చెడిపోవును.

మన అన్నకోశములో అసంఖ్యాకము లగు నరములు దట్టముగ నల్లుకొని యున్నవి. మద్యపానముచే నా నరములన్నియు నుబ్బి రక్తప్రసారమును నాపి అన్న కోశమును మందగింపజేయును. త్రాగుడువల్ల గర్భకోశములో నీలవర్ణములగు కణు తులుగూడ నేర్పడును. దానివల్ల రక్తముచెడి మనుష్యుని వ్యాధిగ్రస్తునిగ జేయును.

మద్యము ఆహారపదార్థములను జీర్ణింపజేయదు. దీనికి దృష్టాంతముగ నొక గ్లాసులో సారాయిని మరొకగ్లాసులో జలమును పోసి ఆరెండుగ్లాసులలో ఒక్కొ క్క మాంసపుముక్కను వుంచిన సారాయిలో నున్న మాంసపుముక్క గట్టిపడి అదే విధమున నుండును. నీళ్లలోనున్న మాంసపుముక్క చివికి ముక్కలుముక్కలుగా విడిగి కుడవ పల్చని రసముగా కరిగిపోవును. ఈ దృష్టాంతమునుబట్టి మద్యపానము జీర్ణశక్తిని ఆటంకపఱచునని స్పష్టపడుచున్నది. తేయాకు, కాఫీగూడ జీర్ణకోశమును మందగింపజేయును గాని అవి మద్యమంత హానికరములుగావు.

మనదేహమునంతయు ప్రాణాధారమైనది గుండె. అది రక్తపుగూళ్లలో నేర్ప అపబడి బోలుబంతివలె నున్నది. అది సదా ముడుచుకొనుచు విప్పుకొనుచు నుండును. దానినె గుండెకొట్టుకొనుట యందురు. ఆరోగ్యవంతుని గుండె దినమునకు లక్షసార్లు కొట్టుకొనును. ఒకడౌన్సు సారాయి పుచ్చుకొన్నచో లక్షపర్యాయములకు మారుగ లక్షా నాలుగువేలసార్లు కొట్టుకొనునట్లు చేయును. అందువల్ల గుండెలో ఆయా సముత్పత్తి ప్రాణాపాయముగూడ సంభవింపవచ్చును.

దేహమున తంతిఆఫీసు అనబడు మెదడుగూడ మద్యపానముచే తన సహజ మృదుత్వమును గోల్పోయి కఠినమై, జ్ఞాననాడులు బలహీనములై మనుజుని యసం దర్భప్రలాపములలోనికి దింపును. అందుననే త్రాగుబోతులు అసందర్భప్రలాపము లాడుచుందురు.

కొందఱు మితపానులు అనుదినము కొద్దికొద్దిగ మద్యమును సేవింతురు. అట్టి వారు తప్పత్రాగువారివలె క్రిందపడి పొరలాడరు గాని వారికి ఉత్సాహము చురుకుదనము నశించును. వారికి కాలక్రమమున గుండెరోగ మేర్పడును. వీరు జబ్బుపడినప్పుడుగాని, వృద్ధులైనప్పుడుగాని మద్యమురొక్క దుర్గుణములు బహిర్గత ములగును. ఇట్టి మితపానులు విశేషకాలము జీవింపజాలరు. అథవ జీవించినను జీవ చ్ఛవములవలె నుందురు.

త్రాగుబోతులకు మనోబలము తగ్గుననుటకును, దృష్టి మందగించుననుటకును దృష్టాంతములు గలవు. ముద్రణాలయములలో అచ్చుకూర్పువారిలో త్రాగనివారి పనికంటె త్రాగుబోతులపని నూటికి పదివంతున తగ్గిపోయినది. ఆవిధాన తెలుపు, ఎఱుపు, పచ్చరంగుల దీపములు మార్చిమార్చి చూపిన త్రాగుబోతులు తారుమారుగ చెప్పుదురు. పూర్వము దక్షిణాఫ్రికాయుద్ధములో బోయర్లకు ఆంగ్లేయులకు యుద్ధ మొనరించినప్పుడు బోయర్లు మిగుల ధైర్యసాహసములతో పోరాడిరి. దీని ముఖ్య కారణము బోయర్లు మద్యపానాసక్తులు కాకపోవుటయే యని చరిత్రకారులు వ్రాసి యున్నారు. ఇట్లు త్రాగుబోతులవనమువల్ల శరీరావయవములు తమ విధులను నిర్వర్తింప జాలవని స్పష్టపడుచున్నది.

ఈవిధముగ మధుపానముచే ననేకనష్టములు ఏర్పడుచున్నవి. శరీరము రోగములకు కాపురమగును ; బుద్ధివికాసము తగ్గును ; అవయవములపటుత్వము సన్న గిల్లును; మానము మంటకలియును ; ధనముపోయి దారిద్ర్యముసంభవించును ; కుటుం బము సదా దుఃఖములపాలగుచుండును. ధన మాన ప్రాణములకు నష్టదాయకమగు నీ సురాపానమును వీడి ఆరోగ్యప్రదమగు క్షీరమును నిర్మలోదకము నేల త్రావ రాదో తెలియకున్నది. మృగములు పక్షులుసయితము మూచూడని యీ పాడుసారా యమును మానవులు త్రాగుట లజ్జాకరము ; హానికరము. ప్రభుత్వమువారు దీనిని శాసనముచే తొలగించినగాని యీ దురభ్యాసపిశాచము మనదేశము వీడిపోజాలదు.

## న ల్ల మం దు

దురభ్యాసములలో నల్లమందుగూడ నొకటి. ఇదియు మానవుని జవశక్తులను నాశనముచేయునట్టి విషవస్తువే. ఇది గసగసాలచెట్టురొక్క పువ్వులనుండి తీయ బడును. పువ్వుపక్వమగునప్పటికి కాయను కత్తితో గాటులుపెట్టుటచే నొకవిధమైన నల్లని రసము స్రవించును. దానినిదీసి ఎండబెట్టుదురు. అదే నల్లమందు. ఇది నిద్రను మత్తును గలిగించెడు మత్తుపదార్థము. ఇది దేహపోషణ కేమాత్రము పనికిరాదు. ఇది ఆకలిని జంపును. పూర్వము బౌద్ధులు, హిందువులు, మహమ్మదీయులు ఉపవా సములుండి ఆకలిని జంపుటకై నల్లమందును దినెడివారట. ఈవిధముగ ఇది మనదేశ ములో వ్యాప్తిగాంచినది. చీనాదేశములో నీయభ్యాసము పూర్తిగానుండెను గాని చీనా రిపబ్లిక్కు ప్రభుత్వము అయినతరువాత ప్రభుత్వమువారు 'దీనిని సేవించినవారు ఉరిశిక్షకు పాత్రులు' అని శాసనము జేసినతరువాత ఈ దురభ్యాసము అచ్చట రూపు మాసినది.

నల్లమందు పొగాకు సారాయిలకన్న విషయుతమైనది. నల్లమందు నూనెత్రాగి చచ్చినవారి కేసులు గలవు. ప్రాణత్యాగముచేయదలచినవారు పలువురు యీ మిశ్ర మమును త్రాగుచున్నారు. ప్రాణోపద్రవకరమగు నీ దురభ్యాసమును మానవులు త్యజించి సౌఖ్యవంతు లగుదురుగాక.

## కాఫీ—టీ

దురభ్యాసములలో కాఫీ-టీలను గూడ చేర్పవచ్చును. ఈ పానీయములు మద్యపానమంత హానికరములుగాకున్నను నివిగూడ అనారోగ్యకరములే యని చెప్పక తప్పదు. పొగాకులో "నికోటైను" అను విషపదార్థ మున్నటులనే కాఫీలో "కఫీన్" అనునదియు, టీలో "టానిక్" అనునదియు విషపదార్థములు గలవు. ఇవి ఆకలిని చంపు వస్తువులు. ఇవి ద్రవపదార్థము లగుటచే త్రాగినప్పుడు కడుపు ఉబ్బును. కాని వెంటనే పొట్ట సల్లును. సారాయమువలె నివియును ప్రథమమున చురుకుదనమును గలిగించును గాని తరువాత నీరసమును గలిగించును. వీనిని అను దినము సేవించుటవల్ల గుండెలో పోటు, వికారము, మంట, ఆయాసము, నీరసము, కాలుచేతులు లాగుట మున్నగు రోగములు జనించును. ఉష్ణతత్వము గలవారికి వీని వల్ల అపకారము మెండు. వీనివలన ఆకలి మందగించి జీర్ణశక్తి తగ్గును. మలబద్ధక మేర్పడును. కడుపునొప్పి, తలనొప్పి జనించును.

కాఫీవలన మూత్రకోశమునకు ఉద్రేకము గలుగును. అందువలన అనేకసార్లు మూత్రవిసర్జనమునకు వెళ్లవలసివచ్చును. ఇటుల క్రమముగా అతిమూత్రరోగ మేర్పడును. అనుదినమును కాఫీ సేవించువారికి వయస్సు ముదిరినతరువాత వృద్ధ దశలో అతిమూత్రవ్యాధి తప్పక వచ్చితీరును.

కాఫీ-టీ పానమువలన మెదడునకు వేడి కలుగును. అందువలన నిద్రకు భంగము కలుగును. కొందఱు విద్యార్థులు రాత్రులయందు విశేషకాలము మెలకు వలో నుండుటకుగాను టీని పుచ్చుకొందురు. దీనివల్ల ఆరోగ్యము చెడుటేగాక బల హీనులకు మరణము గూడ తటస్థించును. బలహీనముగానున్న ఒక విద్యార్థి పరీక్షకు చదువునిమిత్తమై రాత్రులు విశేషకాలము మేలుకొనియుండుటకై టీని దగ్గఱపెట్టు కొని నిదురవచ్చినప్పుడెల్ల టీ ద్రావుచు కొన్నిదినములు చదువు చుండెను. ఇలేడు సరిగా పరీక్ష రే పనగా అకస్మాత్తుగా మరణించెను. కాఫీ-టీ త్రాగుటవల్ల పక్ష వాతము, మేహవ్రణములు సంభవించినవారుగూడ గలరు.

ఇన్ని దుర్గుణములకు మూలహేతువులైన యీ కాఫీ-టీ పానీయముల నేల త్రాగవలెనో తెలియకున్నది. దురభ్యాసములు త్వరలో పట్టువడును గాని వానిని తిరిగి వదిలించుకొనుట దుర్లభము.

ఈ కాలములో కాఫీ త్రాగుట ప్రతివానికిని విధియైనది. పట్టెడు కూడు దొరకని కుగ్రామములలోగూడ నీ కాఫీ హోటళ్లు ప్రబలినవి. ఇక బస్తీలలో వీని వ్యాప్తి చెప్పనక్కఱలేదు. వీధికి పదిమొదలు ఇరువదివరకు వెలసినవి. మద్రాసు మున్నగు నగరములలో వీని వ్యాప్తికి లెక్కయే లేదు. ఈ ప్లేగు ప్రథమమున మన ఆంధ్రదేశమునకు దక్షిణదేశమునుండి వచ్చినది. దినమునకు 8 అణాలు సంపాదించు

కూలివాడుగూడ దినమునకు రెండుఅణాలైనను కాఫీకొఱకు వ్యయపఱచుచున్నాడు. ఎవరైన యిద్దరు కలుసుకొన్నప్పుడు లేక స్నేహితులయింటికి వెళ్లినప్పుడు కాఫీ పుచ్చుకున్నారా అను కుశలప్రశ్న ముందుగా వేయుచున్నారు. తుదకు తాను కాఫీ త్రాగలేదనిచెప్పిన స్నేహితుఁడేమనుకొనునో యని ఒక్కొక్కప్పుడు పుచ్చుకొన్నా నని అబద్ధముకూడ ఆడవలసివచ్చుచున్నది. ఇది యొకగౌరవచిహ్నముగ గూడ ఏర్పడి నది. వివాహసమయములలో పూర్వము ఉదయమున చల్దిఅన్నము పెట్టువారు, ఇప్పు డన్నో కాఫీ ఉప్మామాలు విధిగాయెనవి. కొందఱు కట్నములతోపాటు కాఫీ ఉప్మా మాలు సప్లయిగూడ నిర్ధారణ చేసుకొనుచున్నారు. అవి సప్లయిచేయనిచో వివా సంబంధమే మాకక్కఱలేదను మహానుభావులుగూడ నున్నారు.

ఆరోగ్యము విచారించిన వీనిలో అనేక చెడుగు లున్నను ఆర్థికముగగూడ వీనిలో చాల నష్టము కనబడుచున్నది. ఒక్కొక్కఁడు దినమునకు హీనపక్షము మూఁడణాలైనను ఖర్చుచేయుచున్నాఁడు. అటుల ఒక కుటుంబములో నలుగురున్న 12 అణాలు దినమునకు ఖర్చు అగును. నెలకు 20 రూపాయలు దాటుచున్నది. బీదలకు సారాయి, భాగ్యవంతులకు కాఫీ దయ్యములవలె పీడించుచున్నవి. కాఫీ దుకాణములలోనున్నంత అమ్మకము మరే యితరదుకాణములకును లేదు. ఈ ప్రాంత ములలో ప్లీడరువృత్తిలోకన్న యీ కాఫీదుకాణ వృత్తిలో విశేషధన మార్జించు చున్నారని ఒక పెద్దమనిషి నాతో చెప్పినాఁడు. ఇందులో అతిశయములేదు.

కాఫీదుకాణములు చాల అనారోగ్యకరములుగా నున్నందున చాలమంది వ్యాధిగ్రస్తులగుచున్నారు. పాత్రలు శుభ్రముగా లేకపోవుటచేతను అన్నిపాత్రలను ఒకే బక్కెట్టులో వేసి కడుగుటచేతను పాత్రలు పరిశుభ్రముగానుండవు. పంచదార కలుపుటచేత తీపుకొఱకు ఈఁగలు, చీమలు వేనవేలు యీ పాత్రలపై ముసురు కొనును. ఒక్కొక్కప్పుడు త్రాగు కాఫీలోగూడ ఈఁగలు చచ్చియుండుటకూడ గాంచుచున్నాము. ఇట్టి అనారోగ్యమైన పానీయమును మనము త్రావి ఆరోగ్య మును పాడుచేసుకొనుచున్నాము.

ఇండ్లయందు యిప్పటి నవనాగరిక స్త్రీలు తమ బిడ్డలకు అన్నము వండిపెట్టుట మాని తమతోబాటు ఉదయమున కాఫీ యిచ్చుచున్నారు. పిల్లలకు కాఫీ చాల హానికరమని డాక్టర్లు చెప్పుచున్నారు. వారి అన్నకోశము చాల మృదువుగా నున్నం దున కాఫీ త్రాగుటవలన అందలి జీర్ణశక్తి నశించిపోవుచున్నది. ఈ విధముగ కొందఱు శిశువులు మరణమునకుగూడ పాల్పడినవిషయమును నేనెరుగుదును.

దక్షిణదేశములో కాఫీ ఏవిధమున వ్యాప్తిలోనున్నదో ఉత్తరదేశమున టీ అంత వ్యాప్తిగానున్నది. కలకత్తా బొంబాయి ప్రాంతమున 'హిందూ చా, హిందూ చా' అని వీధులవెంట విక్రయింతురు. చా అనగా టీ అని అర్థము. స్నేహితుల యింటికివెళ్లినప్పుడు మర్యాదకొఱకు ఒక గిన్నెడు టీని ఇత్తురు. తేనీరులో పైత్యా ధిక్యము ఉన్నదనియు ఇదియును జీర్ణశక్తిని మందగింపజేయుననియు వైద్యులు చెప్పుదురు.

అనారోగ్యమును ధననష్టమును గలిగించునట్టి యీ దురభ్యాసములను మనము ఎంత త్వరలోమానిన అంత శ్రేయస్కరము. దేహము ఆరోగ్యముగా నుండవలెనన్న మనము భుజించు ఆహారము, త్రాగు జలము, పీల్చు వాయువు పరి శుభ్రముగా నుండవలెను. ఈ కాలములో పలువురు పైదురభ్యాసములకు లోనై తమ ధన మాన ప్రాణములను గోల్పోవుచున్నారు. కావున దేశీయులందఱును అందు ముఖ్యముగ విద్యార్థిలోకము చుట్ట, సిగరెట్టులు కాల్చమనియు, కల్లు, బీరు, బ్రాంది, విస్కి మున్నగు సారాయములను మూచూడమనియు, కాఫీ, టీ మున్నగు పానీయములను వర్జింతుమనియు, నల్లమందు, గంజాయి, మున్నగు విషా వస్తువులను దరికిరానివ్వమనియు దీక్షపట్టవలయును. ఈ దురభ్యాసపిశాచములను మనము దరికిరానివ్వనిచో మనము బాగుపడుటేగాక మన సంతతివారును బాగు పడుదురు. తద్వారా దేశమును బాగుపడును.

షరా:—ఈ వ్యాసమును నా అనుమతిలేక యితరులు వ్యాసరూపమున గాని పుస్తకరూపమునగాని ముద్రింపగూడదు.

# బుద్ధుఁడు

వారణాశి సూర్యనారాయణమూర్తి గారు

శ్రీ రంజిల్లెడి యుత్తరాద్రిదరి వాసిన్‌గాంచు పున్నెంబుకున్
కారుణ్యంబుకు నాటపట్టునగుచున్ కల్యాణవారాశియై
వీరాగ్రేసర జన్మభూమి యగు నా వీటన్‌బుధేంద్రుండు దా
సారించెన్ మతబోధనక్రియల శశ్వత్కీర్తివాటిల్లగన్.

క. శుద్ధోదనునకు మాయకు
బుద్ధికి నిలయం బగుచును బుట్టెను కపిలన్
ఇద్ధరలో సిద్ధార్థుఁడు
శుద్ధులుగాఁ జేయ మానిసుల సద్వృత్తిన్.

చ. విడిచెను రాజ్యభోగముల విశ్రుతిగాంచిన తన్విపిన్ తా
నుడివినధర్మమార్గముల నుండగ శక్తిని మానవేంద్రులే
నడవగజేసె నాత్మజుని న్యాయముగన్ తనదారిబెట్టె నే
దుడుకును లేక శాంతమున దుష్టులశిష్టులఁజేసె బుద్ధుఁడై
పుడమిని మాయకన్నప్రియపుత్త్రుఁడు దేవతలెల్లమెచ్చగన్.

సీ. సర్వభూతములను సమముగా జూచుచు
జీవహింసను మానజేసె నెవఁడు
కోరిక మనమునగూడదంచును బల్కి
వైరాగ్యమును బోధపఱిచె నెవఁడు
సతి సుతున్ రాజ్యంబు సర్వంబు విడనాడి
సన్యాసి యగుచును జనియె నెవఁడు
ధర్మజీవన మెంతొ ధైర్యమిచ్చు నటంచు
న్యాయమార్గంబున నడచె నెవఁడు

గీ. జాతి మత భేదములులేక జరిగె నెవఁడు
సర్వమానవసోదరసమత జగతి
బోధచేసిన సిద్ధార్థబోధకుండు
బుద్ధుఁ డయ్యెను మతములన్ బొందుగూర్చ.

# ఇండియా చక్రవర్తి శ్రీ పంచమజార్జి ప్రభువు

కవితావినోద డాక్టరు నిడమర్తి ఈశ్వరప్పగారు

ఆంగ్లదేశమునుగూర్చి పసిఫికు అట్లాంటికు సముద్రముల కావలనుండి సూర్యుఁ డెన్నడు నస్తమింపని గొప్ప రాజ్యమై, యాంగ్లేయుల మహిమోన్నతులకు స్థానమై ధాత్రీరాజ్యముల మాత్సర్యమునకు హేతువై యలరుచుండిన యాంగ్లసామ్రాజ్యవైభవము తెలియునా? ఆ రాజ్యవిభాగములలో మిక్కిలి పెద్దది గాకపోయినను హిందూదేశ మమూల్యమణియై విరాజిల్లుచున్నది. ఈ చిన్నఖండమునందు జాతి, మత, భాషాదివైషమ్యములు గల జనులు వసించు పెక్కురాజధానులు నిమిడియున్నవి. ఉత్తర దక్షిణములకు 1900 మైళ్లు. తూర్పు పడమరలకును నెక్కువ వెడల్పుగలచోట నంతియే వైశాల్యము. విస్తీర్ణమునందిది రష్యను దేశము దక్కఁ దక్కిన యూరోపుఖండముకంటె నిది పెద్దది. బ్రిటిషు దీవులంత విస్తీర్ణముగల దేశములుగా హిందూదేశమును విభజించినఁ బదునాలుగుదేశము లగును. వెస్టుమినిస్టరు నగరమునుండి పదిమైళ్లదూరమందున్న స్ఫటికశిలాభవనమువలెనను వెల్లువనము యమునా వ్యాపించఁగల యొక గొప్పనది యీదేశమునఁగలదు. ఔన్నత్యమున బ్లాంకు శిఖరమును మించి మిన్నుముట్టుచుండు హిమాలయపర్వత పఙ్క్తి లా మహానదులను హిమప్రవాహములచేఁ బోషించుచుండును. ఆ పర్వతరాజమం దొక్కలోయ ఆల్ప్సు పర్వతముల నగపడకుండ దాఁచివేయఁగలదు.

ఈ దేశమున ముప్పదియైదుకోట్లజనులు నివసించుచున్నారు. వీరు ఫ్రెంచి వారి కారింతలును, అమెరికా సంయుక్తరాష్ట్రములవారికి రెండింతలును, ప్రపంచ జనసమూహమున నైదవపాలును నున్నారు. మోటారులు,విమానము, అయోమార్గము లిన్నియున్నను వీరు వ్యాపించియున్న 1800000 చదరపుమైళ్లలో శతాంశమునైన నొక్కఁడును జూచిలేఁడు. ఇకఁ జూడఁబోఁడు. వారు మాటలాడు భాషలన్నిటఁ బ్రావీణ్యమును బొందినవాఁ డొక్కఁడుడును లేఁడు. ఇక నుండఁబోఁడు. హిందూదేశ భిన్నత్వ మింత దురవగాహము. ప్రపంచమందలి శీతోష్ణస్థితులన్నియు నిచటఁ గానవచ్చును. ప్రపంచమునందున్న వృక్షములన్నియు నిటఁ బెరుగును. దీని నొక చిన్న ప్రపంచ మనవచ్చును. ఈ దేశమునుగూర్చి గిల్డుహాల్‌లో జార్జి యువరాజు, "హిందూదేశపు విపరీతవైశాల్యము, నిస్సీమ రామణీయకము, వివిధజాత్యుపజాతులు, భిన్నశీతోష్ణస్థితులు, హిమమయపర్వతశిఖరములు, అనంత నీరధితరంగములు, మహా ప్రాంతములు, శిల్పక చాతుర్యమును దెల్పు కట్టడములు, ప్రాచీన గాథలును నా హృదయము నాకర్షించిన" వని నుడివించెను. హిందూదేశము నంతయు నేకచ్ఛత్రముగ నేలుటకుఁ జక్రవర్తు లెందరో యత్నించినను శక్తిచాలనిచో ప్రయత్నించియుఁ బూర్ణమనోరథులు గాకపోయిరి. కాని శతాబ్దంబులనుండి యించుమించు దుస్సాధ్యమైన మహాకార్యమును, హైందవుల నెల్లఁ దన కన్నబిడ్డలమాడ్కిఁ గాపాడి వారి మన్ననల కపాత్రమైఁ బాత్రురాలైన విదేశ ప్రభ్వి శ్రీ విక్టోరియా మహారాజ్ఞి 19వ శతాబ్దంబున సాధించి యీ మనోరథము జయప్రదముగా నెర వేర్చెను. ఆమె పౌత్రుఁడే యీ దేశపు ముప్పదియైదుకోట్ల ప్రజ లీనాఁడు తమ చక్రవర్తి యని భక్తిపూర్వకముగఁ గొల్చుచున్నారు.

విక్టోరియా మహారాజ్ఞి 1837-1901 రాజ్యమేలినదని యందఱకుఁ దెల్లమే. ఈ దేశమేలిన మొదటిరాణి యామెయే. ఆమెపరిపాలన కలకాలము సౌఖ్యదాయక మైనదని దేశచరిత్రమే తెల్పుచున్నది. నిష్కళంక ప్రవర్తనమునందును, స్వధర్మాచరణదీక్షను, స్వార్థపరిత్యాగశీలమునను, జనారోగ్యచింతనమునను నామె ప్రజల కెల్ల మార్గదర్శినియై సుభిక్షప్రదముగా రాజ్యమేలెను. కాన నామెను గురుస్థానీయముగా మన మెన్నుచున్నాము. ఆమెకు హిందూదేశముపైఁ బ్రేమ మెండు. హైందవులన్న నభిమాన మెక్కువ. ఆమెచెంత హైందవసేవకులుగూడ నుండెడివారు. ఆయమను సేవించి ధన్యులగుటకు వా రంతఃపురము ముందఱ నేఁగుచుండెడివారు. దేశభాషలఁ జేరుగాంచిన హిందూస్థానీభాష నామె చక్కఁగా నేర్చెను. హైందవులయెడ నామెకుండిన వాత్సల్యమును, "వారి శ్రేయస్సే మాబలము; వారిసంతృప్తియే మాక్షేమము; వారి కృతజ్ఞతయే మాకు బహుమాన" మని యామె 1858 సం॥న సంకలించిన ప్రకటనమే తెలుపుచున్నది. 1875-1876 చలికాలమున యువరాజుచే హిందూదేశమున పర్యటనముఁజేయించి యామె వాత్సల్యమును మఱింత స్పష్టపఱిచెను. "మా ప్రియపుత్రునకు వా రొసంగిన యసమానసమ్మానమునకు వారి భక్తి విశ్వాసములకును మాహృదయ మమందానంద మొందినది. ఈ యువరాజపర్యటన సందర్భమున మాకును మా ప్రజలకును నన్యోన్య ప్రేమానుబంధము మఱింత దృఢపడినదని మా నమ్మకము. మా పరిపాలనమందు నిరుపేదయు, ధనికుండును నొక్కరీతిని నిష్పక్షపాతమగు న్యాయముఁ బడయఁగలఁడు. "ఎల్లర సంపదలు నాయురారోగ్యములునే మా యాశయము" లని యామె పలికెను. యువరాజిట్లు జయప్రదముగ దేశయాత్రఁ జేయుటవలనఁ గోట్లకొలఁది హైందవుల కొక్కచేరిక యున్నదని విశదమాయెను. 1877 సం॥ జనవరి మొదటిదినమున శ్రీ విక్టోరియామహారాజ్ఞి చక్రవర్తినీబిరుదమును స్వీకరించి తమ యధికారము నౌన్నత్యమును హైందవులకుఁ జక్కఁగాఁ దెలియఁజేసెను.

1901 సం॥ ఎడ్వర్డుప్రభువు సింహాసన మలంకరించుతఱి "శ్రీ విక్టోరియా సార్వభౌమి, హిందూదేశ ప్రథమచక్రవర్తిని, పూజ్యురాలగు మాతల్లిగారి సింహాసన మధిష్ఠించితిఁ గాన, నేపరిపాలనావిధానమున నామె హైందవప్రేమను జూరగొనెనో, సమస్తజనతాపూజ్యలను గనెనో యావిధానమునే నే నవలంబించి సర్వకార్యములు నిర్వర్తించెద" నని లోకమునకు నెల్లడించెను. ఆడినమాటఁదప్పక యటులే దొల్లి నడచెను. కుడివలుకఁ బ్రజల సంతోషాతిశయములతో పాటునడచి క్రమమునఁ బాలించెను.

సాధ్వీమతల్లియగు విక్టోరియాయును శాంతిస్థాపకుండగు నెడ్వర్డును దమబిడ్డల కెట్లు విద్యగఱపించిరో యట్టి శ్రద్ధతోఁ బ్రజలక్షేమము నరయుచుండిరి. ఏలయన నెవ్వనికిఁ దగుశిక్షయు, విద్యయు నుండదో వాఁ డొరులఁ బాలింప నసమర్థుఁడనియు, విధేయత నెఱుఁగనివాని కధికారార్హత లేదనియుఁ జక్కఁగా నాకళించిరి. బాల్యమునుండియు జార్జియువరాజు వినయశీలమున సుశిక్షితుఁ డయ్యెను. భాగ్యవంతుల బిడ్డలవలెను, గొందఱు పేదబాలురవలెను, తన యిష్టానుసారము సంచరించుటకు జార్జి విడువఁబడలేదు. ఐశ్వర్యమున విఱ్ఱవీఁగక, లఘుపదార్థముల భుజించి, వ్యాయామమున శరీరమును గష్టపెట్టి, పఱువులెత్తి, స్వారిచేసి, తోడిబాలురతోఁగూడి యాడి సులభజీవనమున కలవాటుపడునట్టు లతఁడు క్రమశిక్షణము వడసెను.

యువరాజు ద్వాదశవర్ష వయస్కుఁడు కాఁగాఁ దండ్రి యాతని రాజనౌకాదళంబున నుద్యోగిం జేయ నెంచెను. మానవస్వభావమును జక్కఁగ గుర్తెఱుఁగుటకుఁ బాఠశాలయందలి విద్య చాలదని యతఁడు స్వానుభవమునఁ దెలిసికొని యువరాజు గ్రంథశిక్షణసంపాదనమునేగాక మానవలోకవిచారణమునుగూడ నెఱుఁగవలయునని కోరెను. ఎంతటి లక్ష్మీపుత్రునకైన స్వయంకృషివలన నలవడినజ్ఞానమే శ్రేష్ఠమైన దని యాతని నమ్మిక.

తనయుత్సాహము ననుసరించి యువరాజునకు విద్యగఱపుటకు పాఠశాలకంటె సుస్థిరమైన స్థానమునే దండ్రి యెంచెను. ఆంగ్లేయుల కట్టిజ్ఞాన మలవడుటకు నావికయుద్ధనావలకు మించినది వేఱొకతావు లేదని నాలవ విల్లియమ్‌రాజు చెప్పెనట. తదనుగుణముగా 1877 సం॥న నెడ్వర్డు తనకుమారుని ప్రభునౌకాదళమున సమాన వయస్కులగు నితరబాలురు శిక్షితులగుచుండిన "బ్రిటానియా" నావకుఁ బంపెను.

అం దితరబాలురవలెఁ బాఠముల నేర్చికొని, వ్యాయామక్రీడలసల్పి, యోడ నడపి, ఫిరంగులఁ బేల్చి, తెడ్లవేసి, మోకుల నెగఁబ్రాకి, తనడుస్తులఁ దానే బాగుచేసికొని రాచబిడ్డఁ డని యాభిజాత్యముఁ బాటింపక నావికావిధుల నతఁడు గమనించెను. పారపాట్లొనరించినచో సామాన్యునివలె శిక్షితుఁడయ్యెను. తనవంతువచ్చునెడ రాత్రి యనక, పగలనక వాతావరణస్థితి యెట్లున్నను గావలిఁగాచువాఁడు. ఏవేళ నధికారుల కనుసన్నల మెలంగి వారియెడ నొజ్జలయెడను వినయవిధేయతలతో ననువర్తించి వారితో నమస్కారపురస్సరంబుగా సంభాషించువాఁడు. ఇట్లు చదువ నావికోద్యోగి

యగుటయేగాక బాహాబాహి పోరటయు నేర్చెను. ఏ సుగుణసంప్రదాయ సంపాదనములేక మానవుండు మహోన్నతపదవిఁజెందఁజాలఁడో యట్టి వినయము, గ్రమశిక్ష, వినమ్రత మొదలగు గుణగణము నార్జించి ధైర్యశాలియై సర్వ్వభావుండై పెరిగి యెట్టి కష్టకార్యమునైన నవలీలఁజేయుటను ముందంజవేయుచు నప్పుడప్పుడు సల్లాపముల వినోదించుచుఁ దండ్రి నానందవార్ధి నోలలాడించెను.

నావికవిద్యానంతరము జార్జి పరీక్షలందు త్తీర్ణుండై దీర్ఘ నౌకాయాత్రఁజేసెను. ప్రథమమున సాధారణోద్యోగిగా యజమానుని యాన మన్నించి తనధర్మములఁ గ్రమమదప్పక పాటించెను. కావలిగాచుటయందును, నోడకంబములనెక్కుటయందును, బతాకసంచాలనమందును, బడవపనులందును, నన్నికాలములఁ దనవిధులఁ జూపేర్చెడివాఁడు. ఐనను దనకిష్టమగు నాటల నాడుకొనుట కవకాశముండుటఁజేసి "బసాంటి" నావపై సుఖముగఁ గాలక్షేపముఁ జేసెను. తనయోడ విదేశపురేవులఁ దాఁటునెడఁ దీరమున కేఁగి నేత్రానందదాయకములగు చిత్రవిచిత్రంబులం గనుచు దేశకాల పాత్రంబుల నరసికొనుచు నపార లోకజ్ఞానం బుపార్జించెను.

ఒకనాఁడు "బసాంటి" యుత్తర అమెరికా రేవులో బొగ్గు సేకరించుచుండ వేల్సుయువరాజపుత్రునిఁ బనిచేయుచుండఁ జూచి కుతూహలుఁ డగు స్వదేశస్థుఁ డొకఁ డోడమీఁదనుఁ బోయెను. ఓడ యజమానుఁ డోడనంతయు నాతనికిఁ జూపుచు మలీమసవదనుండును, ధూమధూసరిత వస్త్రాలంకారుండును నగు నావికోద్యోగి నొక యువకుని నియమించెను. ఆ దేశస్థుఁడు నావనుఁ దిలకించి రాజపుత్రుం దర్శింపఁ జాలమికి మిగుల వగచి "ఇట్టి మలినకార్యావసరంబుల యువరాజపుత్రుని శుభ్ర దుకూలంబులఁ గప్పి యోడ మఱలఁ బరిశుభ్రంబగుదనుక నొకచోఁ గూర్చుండఁజేసెదరా?" యని యడిగెను. ఆ జవ్వనుఁడు చిఱునగవుతో, "నేన జార్జి యువరాజపుత్రుండ" నని మాఱుపలికెను. కతిపయాబ్దంబులు గడచినవెనుక మన రాజపుత్రుఁ డొక గొప్ప నౌకావ్యూహమున కధిపతి యయ్యెను. ఆంగ్ల నావలలోనికెల్ల శ్రేష్ఠము "ఇండామిటబిల్" నావపై జార్జి యుండెను. కెనడానుండి మఱలివచ్చుచు నోఁడా నావ గమనవేగము బరీక్షింపనెంచి యంత్రముల కవకాశ మున్నంత వఱకు హెచ్చుపని చేయించుట కత్యుష్ణముగనుండునౌటచే నైనను, మాలిన్యమునకు నెలవైన బొగ్గుగదిం జొచ్చి పారలతో బొగ్గులను గొలిమిలోఁబోసి పనివాండ్రకు సహాయపడెను. నావ త్వరితగతిఁ బఱుగుటఁ గని కృతార్థుఁడ నైతినని సంతసించెను. నాఁ డాతఁ డుపయోగించిన పార నేఁటికిని నావికసంఘములచే నమూల్యాలంకారముగఁ బరిగణింపఁ బడుచున్నది. పాఠకమహాశయా! నీ వేదే నొక కార్యము చేయవలసిన నది నీ గౌరవమునకు భంగమనియు, నీచమనియు, దోఁచెనేని "ఇండామిటబిల్" నావపై జార్జి బొగ్గుం ద్రవ్వినైచుట నించుక జ్ఞప్తికిందెచ్చుకొని నీ విధ్యుక్తధర్మమును నెరవేర్చుము. స్వధర్మాచరణంబున ఘనత్వ నీచత్వపరిగణనంబునకుఁ దావులేదు.

ఆంగ్లకుల్యారక్షణార్థము నావికదళమున 1889 సం॥లో జార్జి చేరి, యొక టార్పిడోనావ కధికారి యయ్యెను. అందలనికి మునుపటికంటెఁ బని కష్టతరమైనను గొలఁదికాలములో నిపుణుం డగు దళవాయి యనిపించుకొనెను. వారు "పోర్ట్సుమత్" అను రేవునకుసుండి సమీపమారంబున "గుడ్వుడ్" అను పట్టణంబున నెడ్వర్డు తన కుమారునిఁ జూడఁగోరి యోడల ప్రధాననాయకునకు వర్తమాన మంపెను. "అయ్యో! నా టార్పిడోగతి యేమగు?" నని జార్జి యన, నధికారి, "మీ తండ్రిగారు మిమ్ముఁజూడ నాతురపడుచున్నారు. నేఁటికి మీరు సెలవీయగల" మనెను. 'అయ్యా! ఇప్పుడేబా స్పితెడు పట్టణమున కీ టార్పిడోపైఁ బొమ్మని నా కాన తిచ్చితిరి. నేఁ బోక తీఱ' దని బదులుపలికి యచ్చోనొక్కనాఁ డిష్టగోష్ఠిఁ బ్రొద్దు పుచ్చుట కాతఁ డిచ్చగించక యెదురుగాలిలోఁ గష్టమైనను స్పితెడునకేఁ బయనము సాగించె. అద్దిరా! విధివిహితకార్యాచరణానురక్తి!

భావిచక్రవర్తికి మానవాంతరాత్మయొక్క నిజశక్తియం దెక్కుడునమ్మకము. "ఫ్రష్" అను శతఘ్నినౌకాధికారిగా నున్నప్పు డతఁడు కారాగార విమోచన సమయమున నొక బందికి "గతించిన నీ దుష్ప్రవృత్తిని మఱచెదను. నీ భావిప్రవర్తనమునుగూర్చి నీ వేమియు నొప్పికొన నక్కఱలేదు. నీ యంతరాత్మనే సూక్షిగ నమ్ముము. అదియే మనలఁ బాలించునది. దాని యానల శిరసావహించుము. వెడమార్గమున జరింపకుము. నీవును నేనును "నిది చేయదగు, నిది చేయరా" దని చక్కఁగ నెఱుఁగుదుము. దేవుఁడు నిను ఋజుమార్గమున నుంచి దౌర్మార్గ్యమునుండి తొలఁగించుగాక?" యని యుపదేశించెను. ఈ సాదరవాక్యసారమును నాతఁడు గ్రోలి సన్మార్గావలంబియై యనతికాలంబున నొక నావికశ్రేష్ఠుం డయ్యె.

1901 సం॥న జార్జి యార్కు ప్రభువుగానుండి కెనడా, ఆస్ట్రేలియా, దక్షిణాఫ్రికా మొదలగు నాంగ్ల వలసరాజ్యముల కేఁగెను. ఈ విదేశయాత్ర విక్టోరియా మహారాజ్ఞివలన నేర్పాటుచేయఁబడెను. ఆస్ట్రేలియా ప్రథమ దేశీయమహాసభను భావిరాజే సమావేశపరుపవలెనని యామె కోరిక. ఎడ్వర్డు పట్టాభిషేకసమయమున జార్జిదంపతు లాస్ట్రేలియా, కెనడా, దక్షిణాఫ్రికా దేశముల కేగునటుల నిశ్చయింపఁ బడెను. ఎడ్వర్డు రాజైనప్పుడు "ద్వీపాంతర రాజ్యాధిపతి" యను క్రొత్త బిరుద మాతఁడు స్వీకరించెను. దీనంజేసి వలసరాజ్యపరిపాలనాపద్ధతుల మార్పు స్పష్టమాయెను. ఆంగ్లేయ రాజనీతిజ్ఞుఁడు వక్కాణించినటుల నికమీఁద వలసరాజ్యములు మాతృరాజ్యమునకు బరువుగాఁ దోఁచవు. అన్నియుఁ గలసి యొక్క సామ్రాజ్యమే యను భావము ప్రబలెను. కావున యువరాజు వలసరాజ్యముల కేఁగి సామ్రాజ్యమందంతటఁ దన తండ్రి సింహాసనమెక్కుటను దానే దెలియఁజేయుట కది యవకాశము. విక్టోరియా చనిపోయినను రాజపుత్రుని వలసరాజ్యయాత్ర విలంబముఁ జెందలేదు. ఈ సందర్భమున నెడ్వర్డు "ఇట్టి సమయమునఁ బుత్రవియోగము నాకు మిగులఁ గష్టమే, కాని మా తల్లిగారి కోర్కె నెరవేర్చుటకును, వలసరాజ్యక్షేమమం దామెకు నాకును గల యభిలాషను స్పష్టీకరించుటకును యువరా జాస్ట్రేలియాకే గాక న్యూజిలాండు కెనడా దేశములకుఁగూడఁ బోయి వచ్చునటులనే నిశ్చయించితి" నని తన మనోభావముం దేటపఱచెను.

తాను రాజ్యభారము వహించినంతనే కొలఁదిమాసములవఱకైన నేకపుత్ర వియోగము నెడ్వర్డునకుఁ గొంచెము విచారకర మైనదిగదా! చిన్నిపాపల నతికష్టమున విడనాడి విదేశములకేఁగుట యువరాజదంపతులకుఁ గష్టతర మాట యాశ్చర్యమా?

ఓడ సాగుచుండ యువరాజ ముఖవైలక్షణ్యమును దండ్రి కనిపెట్టి "పిల్లలఁ గాపాడెదము భయపడకు" మని తీరమునుండి హెచ్చరించెను. భావగర్భితంబు లగు నా సౌహార్ద్దవచనంబు లేహృదయంబులఁ గరంచవు?

ఈ విదేశయాత్రలో యువరాజపరివారము భూమధ్యరేఖం దాఁటవలసియుండెను. అసమయమున రేఖోత్తీర్ణ మనువిధి జరుగవలెనఁట. యువరాజదివఱకెన్నిసారులు రేఖం దాఁటలేదు? అయినను నావికులందఱితోడ క్షౌరముఁజేయించుకొని జలనిధిజలంబుల స్నానముచేసి నానావిధముల వేడుకతో జరిపెను. ఎడ్వర్డు నయితము బాలుర వినోదంబులం దిలకించి వానలలో నాడి యందఱ నానందింపఁజేసెడివాఁడు.

యువరాజాగమనసందర్భమున వలసరాజ్యములవారు తమ రాజభక్తిం దెలుపుచు గొప్పనార్థ మున్సవశతంబులఁ జేసిరి. భావిరాజదంపతుల సందర్శించుటకై దేశదేశములనుండి జనులు వేనవేలు విచ్చేసి యాంగ్లజనసమ్మేళనమును సూచించిరి. సంకలజనముఖములనుండి జయజయధ్వానమ్ము ససంభ్రమమ్మున మిన్నుముట్టె. విదేశయాత్ర యావంతేని కొఱంతలేక మిక్కిలి జయప్రదంబుగాఁ గొనసాగె. లామాల ఘోరనృత్యంబుల నీక్షించి, స్వదేశసంస్థానంబుల శ్రోత్రపేయం బగు సంగీతంబున కలరి, కల్లారి గోపబాలుర విపినాశ్వవినోదంబుల కచ్చెరువంది సేనానివహంబులఁ బరిశీలించి, స్వదేశాధిపతుల గౌరవించి, విశ్వవిద్యాలయములం దెఱచి, సర్వకళాశాలలకు శంకుస్థాపన మొనరించి, దక్షిణాఫ్రికా యుద్ధములోఁ బోరుసల్పు సైనికులకుఁ బతకంబు లర్పించి, యాస్ట్రేలియాలో నొక యున్నతప్రదేశంబున వేనవేలు పశుగణంబులం బోషించు తావంబులం గన్నులపండువుగఁ గాంచి, వన్యాహారంబుల మెసవి, కెనడాలోఁ గూలివాండ్ర కష్టజీవనము నెఱింగి, "అట్టవా" పట్టణమున దేశస్థులలో దూఁబుల జార్చి వినోదించి యువరాజంతయు సంతసించెను. రాటోరువా పట్టణమున మవోరీ లొనరించిన "హక్కా" యను యుద్ధనాట్యమే కడు చిత్రమైనది. ఒక వృద్ధమవోరీనాయకుండు పక్షియీకెలతోఁగూడిన యంగీ దొడిగికొని మవోరీయుద్ధములో సామ్రాజ్యమునకుఁ దాఁ జేసిన సేవను మెచ్చి సీమరాణి పంపిన ఖడ్గమును ధరించి యుత్సవమునకు విచ్చేసెను. తన గర్వహేతువగు నా హేతి నా రాణి మనుమనికిఁ జూపవచ్చెను. యువరాజేయెడ కేఁగిన నాయెడఁ బ్రజల కామెయం దుండిన గౌరవముం గని సంతసించెను. స్వదేశమునకువచ్చి గిల్డుహాలున నుపన్యసించుచు, "వలసరాజ్యములవారింగూర్చి చెప్పునపుడు వారి రాజభక్తిని మాతృదేశభక్తిని ప్రప్రథమమునఁ గొనియాడి తీఱవలెను. అందులకు శ్రీ విక్టోరియామహారాజ్ఞిగారి యాదర్శప్రాయమగు పావనజీవనమే కారణము. నేఁటికిని వా రాయమ్మను నెమ్మనమ్మున ధ్యానించెద" రని రాజపుత్రుఁడు పలికెను. నిస్సీమలావణ్యసీమలగు నాసీమల కేఁగి తా గర్వించితి ననియు, నివాసయోగ్యమ్మగు తావునకుఁ గొఱవడిన యాంగ్లదేశమునువీడి కొంద ఱా విశాలదేశమ్ములకు వలసబోయిన మేలనియు నందునకుఁ దగిన యుత్తమోత్తము లేఁగవలయు ననియును నతఁడు చెప్పెను.

పిమ్మటఁ గొలఁదికాలములో జార్జి వేల్సుయువరాజుగను చెస్టరుప్రభువుగను జేయఁబడెను. వేల్సుయువరాజై తాఁ జేయవలసినపనులఁ గ్రమముగ నెఱవేర్చెను.

తండ్రివలె సమస్త సాంఘికవ్యవహారముల నతిశ్రద్ధతోఁ జక్కఁబరుచుచుండెను. బొంబాయియందు మహమ్మదీయ విద్యార్థిసమాజసమావేశమున కొకతూరి యగ్రాసనాధిపత్యము వహించి యందు సామాజికులుగ నెన్నుకొనఁబడి యూసఫను గౌరవించెను. ఇదిగదా మూఁదేశ సంఘములతో గలసి మెలసియుంట కొక చక్కని యాదర్శము !

1905 సం॥న యువరాజు మన హిందూదేశమును పావనముచేసి మనలను గారవించెను. "ఆఫిక్" నావపై నతఁ డొనర్చిన సమస్తసామ్రాజ్య విస్తార సంచార మతనికి ప్రజల రాజభక్తిఁ దెలుపుట కానందదాయకంబయ్యె. హిందూరాజులను, ప్రజలను బరివారసమేతుండగు యువరాజు సుచిరకీర్తి మహావైభవముతో సత్కరించి. యువరాజనుపైన సుందరపురములు వీడి యువరాణికి స్వాగతమిచ్చి రాజభక్తిఁ దెలిపెను. శోభాయమాన ప్రాచ్యదేశాడంబరమున నుత్సవంబులు జరిగెను. బొంబాయిలో నొడలం జక్కఁజేయు దొరవును కష్టిభారము వేసి, చిత్రవస్తు ప్రదర్శనశాలం దెఱచి యువరాజు స్వదేశరాజపుంగవుల దర్శించెను. జయపురమున దెబ్బులుఁ గూల్చేసి, బికానీరున నడవికోళులంజంపి, తన మృగయానైపుణ్యముం జూపెను. సుప్రసిద్ధచరిత్రఁగల లక్నోపురమున నేగి మొగలుల సామ్రాజ్యవిధివమున కాటపట్టుగ ఢిల్లీ ఆగ్రా పట్టణంబులఁ జిత్రంబులఁజూచి పురాతనౌన్నత్యచిహ్నాలంబులఁ గాంచి తనశ్రద్ధవహించెను. సైనికుల తియనుచాటుచే దేశ మల్లకల్లోల మైనరేటి నతఁ డప్పుడేసున్న పెగుట దృఢభక్తివిశ్వాసములతో మెలఁగిన సిక్కుల గౌరవించుటకై. యువరాజ్ఞి యొక గొప్ప మహిళాసమావేశముతో రాణివాసమున ముచ్చటించెను. క్రిస్టమస్ వేడుకలతోఁబాటు బాలకసింధ్యామహారాజు కొలువుకూటమును దెఱచెను. యువరాజదంపతులు మహోత్సవసంరంభమ్ములను నవీనాలంకృతశక్యులం గని పట్టరాని యానందంబుఁ జెందిరి.

రావల్పిండిలో శతసహస్రానీక బృందావలోకనమును, పెషావరులో సనికి యును వారికి విదేశయాత్రలో ముఖ్యమైనవి. హైందవసమప్రదేశములనుండియుఁ గాబూలు పర్వతప్రాంతములనుండియు, సాహసస్వభావశీలురగు పఠాణు లన్యోన్యవిశ్వాసములతో నొకరిమేలొకరుగోరుచు వీధులఁ గ్రిక్కిరిసియుండిరి. వంకమున్కలును, నల్లపాగాలును గల పఠానులు డీర్ఘములగు కైజరు విచ్ఛుకస్తులను నడుమ పటకాల ధరించిరి.

పిమ్మట శ్రీవారు లండికోటలఁ బ్రవేశించిరి. ఆంగ్లేయులఁ దిరస్కరించుట నెఱుంగనిన్నను, నితర త్ర యెన్నడు సంతకలహములు లేనంద నుండని "యాఫ్రిడీ" ప్రముఖు లచట యువరాజును భక్తిపూర్వకముగ సందర్శించిరి. అత్తరి వారిలో నంఘుఁ డొకఁడు రాజపుత్రునిహస్తమును స్పృశింపఁగోరెను. యువరాజందున కంగీకరింపనందునా ? హీనకులజుం డాసట కొప్పికొను నాభిజాత్య లెందు ఉండునో ? ప్రథమమున మానవుఁడే గదా పిమ్మట మానవాధిపతి! తన వివాహసమయమున విక్టోరియా ప్రభ్వి పురోహితున కిట్లనియెఁ: "వైవాహిక ప్రామాణికము లన్నియు నాచేఁ బలికింపుడు. ఈసమయమున నే నొక సామాన్య స్త్రీ ననియే యెంచుడు. రాణినిగా ననుకొనకుఁడు." విక్టోరియావంశమంతయు మానవవిథులను, స్వభావములను జక్కఁగా నెఱింగినదిగదా !

బొంబాయి పురపాలకసంఘము వారి కిచ్చిన సన్మానపత్ర మందుకొని "చక్రవర్తియగు మాతండ్రి ముప్పదిసంవత్సరములక్రిందట నిచ్చో నొకనాఁ డుండి బహుదినంబులనుండి తను హిందూదేశ దర్శనమం దుండిన మనోరథమును మాకుఁ దెల్పుచుండెను. మాకును వల్లెయుండె. ఈనాఁడు ఫలియించె. ఆతఁడు ప్రారంభించిన యాచార మనూచానముగఁ దరతరములు జరుగఁగలదని నమ్మెదను. తద్దర్శనంబున నా తండ్రి కీదేశంబున నెట్టివిచ్ఛిన్నాభిమాన ముదయించెనో యట్లే నాకును గలుగక తీఱదు. మే మెల్లప్పుడు హిందువులఁ బ్రేమించి మా సౌహార్ద్రభావముఁ జూపుటయేగాక హైందవాశయములను, సమస్యలను నితోధిక శ్రద్ధతో నిర్వర్తించెద" మని యువరాజు నొక్కి వక్కాణించెను.

జార్జిప్రభువు స్వదేశాటనమొనర్చి తాఁ గన్నులారఁ జూచివచ్చిన దేశమును తెలుపుచున్నాఁడు. దేశసంచారము జ్ఞానార్జనమున కొక ముఖ్యాంశమని విక్టోరియా రాజ్ఞియు నామె కుమారుఁడును నమ్మిరి. ప్రజానురాగము సంపాదింపవలసినరీతిని రాజతంత్రనిర్వహణమున మార్గదర్శులైన తండ్రిగారియు నవ్వగారియు చరిత్రలవలన జార్జిప్రభువు గ్రహించెను. పాలకునికిఁ బాలితులకు ననూనానురాగ మతిశయించుచుండెను.

హిందూదేశయాత్ర ముగించి 1906 లో నతఁ డింగ్లండునకుఁ బోయి హైందవుల కపూర్వప్రేమపూర్వక సమాచారమును బంపెను. గిల్డుహాలున నతఁడు 'హైందవుల సహజమగు నోర్మి, యాడంబరరహితంబగు జీవనము, రాజభక్తి, మతాభి

మానము నా హృదయము నాకర్షించినవి. మన న్యాయపరిపాలనమందు వారికి విశ్వాసము కలదు. వారియెడ మన మింతకంటె నెక్కుడు సానుభూతిం జూపిన నా దేశపరిపాలన మతింత సుఖకరమగునని నా నమ్మకము. అందులకుఁ దగినట్లు వారును మనయం దధిక శ్రద్ధాభక్తులం గలిగియుందురు. అన్నిసంఘములవారి యభివృద్ధిని దేశక్షేమమును గోరితిమేని మనము వారి నింతకంటె నెక్కువగానమ్మి వారికిఁ దోడ్పడవలదా ?" యని ముచ్చటించె.

అచిరకాలంబున నెడ్వర్డుప్రభువు దివి నలంకరించెను. జార్జిప్రభువు సామ్రాజ్యవిస్తారపరిపాలనాధూర్వహుండై, "నా ప్రియమిత్రుండును, నుపదేశికుండును నగు నా జనకుండు నను వీడిపోయె. అయిన నాతఁడు చూపిన పరిపాలనా సూత్రము ననుసరించి వర్తించువాఁడను. సర్వదా మీ క్షేమమునకై పాటుపడి నా జీవితమంతయు ధారవోసెదను. ఈ విషయమున నా భార్యయు నాకుఁ దోడ్పడఁగల" దని నిజాంతరంగమును దెలిబుచ్చెను.

ఎడ్వర్డు నాత్మశాంతికై యనేకప్రార్థనలు జరిగెను. జార్జి పూజ్యభావముతో వాని నెఱవేర్చెను. దుఃఖాక్రాంతుం డగు తనయుండు తన తండ్రి శయనాగారముం జేరి యాతని నిశ్చలగంభీరాకృతిం గని క్షణికమ్మగు నోదార్పుగనుచుండెను. కళేబరమునుంచు మంచమును దానే జాగ్రత్తగాఁ జేయించెను. ఎడ్వర్డులలో మహోన్నతుండగు తండ్రి శాశ్వతవిశ్రమస్థానమునకుఁ గొంపోబడునెడ జను లాతని గౌరవింపవలయునని విషాదచిహ్నముగ నలుపుగాని, రాజచిహ్నముగ నెఱుపుగాని యుపయోగింపక పరిశుభ్రంబగు స్వేతాంబరమున నాతని గప్పించెను.

ఎడ్వర్డు చనిపోవునపుడు రాజ్యతంత్రవిషయమునఁ బ్రజలెల్లరు కిందుకక్షులై యుండిరి. ప్రభువులకును సామాన్యులకును సమాధాన మనుకూలముగఁ గలిగిననేగాని దన తండ్రియాత్మకుఁ బ్రశాంతి కలుగదని జార్జి నమ్మెను. ఇంగ్లండుదేశచరిత్రమం దదియే ప్రప్రథమమైనను నిరుపక్షములవారును గలసి మృతుండగు రాజునకై మిగుల విచారించిరి. భిన్నాభిప్రాయములు ఘోరముగఁ జెలరేగి దేశము కిందుచీలికలైన తరుణమునఁ దండ్రిని భూస్థాపితముజేయుట జార్జి కుత్తమముగాఁ దోఁచలేదు. కానఁ దానే వారి సమాధానమునకు మిగులఁ బాటుపడి కృతకృత్యుం డయ్యెను. రాజమరణమున సమాన దుఃఖముచే నిరుకక్షులును స్పర్ధలనుమాని కలసిరి. ఆ యైకమత్యమునకుఁ గారకుండగు జార్జికి మెప్పును, శాంతికరుండగు నెడ్వర్డునకు గౌరవమును గలిగెను.

ఎడ్వర్డు సమాధిసమయమున గృహస్థధర్మము ననుసరించి కైజరు జార్జి ప్రభువును బరామర్శించుట దేశచరిత్రయందొక మిక్కిలి జాలికలిగించు నంశము. నాకలోకసంబంధియగు నెడ్వర్డునిశ్చలాకృతిముందల వారిరువురు మోకరించి వాని యాత్మశాంతికైఁ బ్రార్థించి పగంగుండిరి. ఆ శాంతికర శాంతాకార ప్రేరితులై యిండొరుల హస్తములు గ్రహించి వారు బంధుప్రేమను దృఢపఱచికొనిరి. మరందు లిఱువురు నట్టి మందసమును జూచిచూచి దుఃఖించి చింతాంబుధి మునింగిన జనంబుతో మెల్లఁగ మఱలిరి.

జార్జిప్రభువు సమాన దుఃఖావస్థలోనున్న తల్లి నాశ్వాసించుచు నామె మనశ్శాంతి కూఱదఁ బలుకుచుండెను. జార్జి చక్రవర్తి యయ్యె నని మరగురువు ప్రకటించి యాతని బిరుదావళులఁ జదివి యాశీర్వదించుతటి నతఁ డేడ్చెను. తన ప్రియమగు తండ్రి గతించెనని లోలోనఁ గుందుచుండెనేగాని తనకు లభించిన మహోన్నతపదవి నెదం దలఁప లేదు.

1911 సం॥ జూన్ నెల తే 22 దీని జార్జిదంపతులకు వర్ణనాతీతం బగు వైభవముతోఁ బట్టాభిషేకము జరిగెను. కొలఁదికాలములోనే హిందూ సామ్రాజ్యపట్టాభిషేకమును బొందుటకు వా రీదేశమునకు విచ్చేసిరి. హిందూదేశమున కట్టి గౌరవ మిదివర కేనాఁడును లేదు. వారి రాకయే దేశమందుండిన యశాంతికి శాంతిఁ గలిగించెను. స్వదేశసంస్థానాధీశులభక్తిం గైకొనిన వారిదివ్యస్వరూపంబుల నెవ్వరును మఱవలేరు. చక్రవర్తియొక్క నిజబలమునుఁ జక్కఁగఁ దెలుపుచుండిన యా ఢిల్లీ మహాసమావేశమువంటి నయనోత్సవమును మఱలఁ గానలేము.

తమదర్శనార్థమై కోలాహలముతోఁ గూడిన జనసహస్రంబుల మధ్యఁ గాంతులీను స్వర్ణవితానముక్రింద నొక వేదికపై నున్నతసింహాసనముల నొక్క మహాసమయమున నలంకరించిన చక్రవర్తిదంపతులు కలకాలము ప్రేక్షకుల కన్నులఁ గట్టినట్లుందురు. ఆ మహోత్సవమున జనులు సంతుష్టస్వాంతమ్ములం దెలుపఁ జేసిన జయజయధ్వానమ్ము లీ ప్రాచ్యదేశంబున నాంగ్లసామ్రాజ్యస్థైర్యమును సూచించినవి.

తన హిందూదేశయాత్ర దేశజు లెన్నఁటికిని మఱవకుండున ట్లాతఁడు విద్యాభివృద్ధి కేఁబదిలక్షలరూప్యముల వర్షవిరాళము నొసంగెను. ఆ ధనము చాలనన్న

హెచ్చించెదనని వాగ్దాన మిచ్చెను. కలకత్తా విశ్వవిద్యాలయమువా రిచ్చిన సన్మాన పత్ర మందుకొని చక్రవర్తి "నేఁడు హిందూదేశమున నాశ యనుబీజాంకురము నాటితిని. విద్యాలతిక మొలచి, పెరిగి యౌన్నత్యముం గని, యాశల కెగఁబ్రాకి, దేశ మంటట నల్లుకొని, పాఠశాలలు, కళాశాల లను సుమరాజములవహించి రాజభక్తిని ధైర్యమునుఁ గార్యకరణదీక్షను గల పౌరులను ఫలంబులఁ బడసినఁ జూడ వేడుక గలదు. హైందవ విద్యావ్యాపనమే నా కోరిక" యని బలుకులవలికెను. ఇక్కారుణ్య భూయిష్ఠం బగువచనంబుల నెవఁడు మరవగలఁడు?

కలకత్తాలోఁ జక్రవర్తిని దర్శించుట కేఁగిన జనసంఘమును రక్షకభటు లపుడు వలనివచ్చెను. నిజాంగరక్షకుల వీడి హైందవప్రజాళిని విశ్వసించి వారిమధ్య నతఁడు పాదచారియై తిరిగెను. ఇదివర కేరాజును నట్టిదేశమున ప్రజలతో మెలఁగలేదు. సామాన్యోద్యోగియు దన యధికారవర్గమం దిట్లు చరింపలేదు. దేశమున మిక్కుటమగు నశాంతి ప్రబలియుండఁ జక్రవర్తి యిట్లాచరించెనే? ఏమి యాతనినిర్వ్యాజ హైందవ ప్రేమాతిశయము! మన రాజభక్తియం దాతని కెంతటి విశ్వాసగరిమ!

వారి యాగమనమూలమున నీ దేశము రాజభక్తిని దగునట్లు సూచించుట కవకాశము కలిగినది. ఇట్టి రాజభక్తి నిదర్శన మిదివఱకు లేదు. చక్రవర్తి దంపతులకు హిందువులు హృదయపూర్వకంబుగ సమర్పించినవి భక్తిపూర్వకమగు నభివందన శతంబులే, ఢిల్లీలోఁ జక్రవర్తులుగాఁ బట్టాభిషిక్తులగుట (దేశచరిత్రఁ జిత్రాంశమే) జార్జి దంపతులు దేశమున కేతెంచి మనల ననుగ్రహించిరని హైందవులును హైందవుల రాజభక్తిం దాఁ గనులారఁ గాంచితి మని శ్రీవారును సమ్మదముఁ జెందిరి. పిమ్మట శ్రీవారు స్వదేశమున కేఁగిరి.

కొలఁదివత్సరంబుల క్రిందటనే ముగిసిన ఐరోపామహాసంగ్రామసమయమున నతఁడు సైనిక నావికాదళముల సౌఖ్యమున కమితమగు శ్రద్ధవహించి, వారి స్వార్థత్యాగమునందును, గష్టములందును బాల్గొనెను. చక్రవర్తినియు నీతనికి మిగులఁ దోడ్పడెను.

అగత్తలను సందుగిడ్డంగులను స్వయముగఁ బరిశీలించుచు వ్రణితచికిత్సాలయంబుల దర్శించుచు, తారతమ్యభావములేక సైనికులనెల్ల బహూకరించుచు కార్యదక్షులను యోధవీరులను, జతురోద్యోగులను జేరంజీరి మన్నించుచు, గుణలేశ మున్నఁ గొండంతఁ జేసి మెచ్చుచు వారల హెచ్చరించుచునుండెను. ఘోర రణరంగమున దిక్కులు పిక్కటిలం బ్రేలు శతఘ్నులచెంతను నాతఁడు పెక్కుసారులు గానవచ్చెను. భోజనసామగ్రి కలవైనపుడు ప్రప్రథమమునఁ దానే భోజనమును లగ్గించుకొనెను. ఏమి సదయహృదయము! ఎంత స్వార్థత్యాగపరాయణత్వము! తన సర్వస్వము ప్రజలకొఱకే ధారవోయునట్టి చక్రవర్తియొక్క సామ్రాజ్యక్షేమముకొఱకుఁ బ్రజలు తమ జీవితమును ధారవోయవలదా? "ఇంగ్లండు నాకు సహాయపడని యంశములేదు. నేనెట్లింగ్లాండున కుపచరింపఁగల" నని యోజించుకొనుము. ఆంగ్లసామ్రాజ్యమున మనికియే మన కమూల్యపిత్రార్జితము. అం దేయెడనున్న నందలి జనుల యభివృద్ధికిఁ దోడ్పడుచుంటిమేని మన పిత్రార్జితమును మఱింత మూల్యవంతముగఁ జేసికొందుము. ఒరుల కుపచరించుటయే సామ్రాజ్యశపథము. చక్రవర్తియే తార్కాణము.

1908 సం॥న నాంగ్లభాష మాతృభాషగాఁ గల దేశముల నౌకావ్యూహముల నాతఁడు పరీక్షించెను. ప్రపంచచరిత్రమున నింగ్లాండు నావలను నమెరికావారి నావలను నొక్కచోఁ జక్రవర్తి తిలకించుట కిదియే మొదటిసారి. "న్యూయార్కు" యోడభాగముల సన్నింటి నాతఁ డుత్సాహముతోఁ గనుట నుద్యోగులు నితరులును మెచ్చిరి. చీనావారు బట్ట లుదుకుచోటుం గాంచియు, నైరోపాలోని కెల్ల శ్రేష్ఠమగు రొట్టెలం గాల్చు తావుంజూచియు, పలుసములనిలువఁజేయు శీతలాగారముల నీక్షించియు, నస్వస్థుల విశ్రమస్థానముం జొచ్చియు నాతఁ డామోదించెను. "పారిశుధ్యమున నమెరికావారి నావలు స్వర్గతుల్యము" లని మెచ్చుకొని యతఁ డాయోడ సన్నియంత్రంబులను దిరిగి యంత్రాగారమును గొలిమి గదిని గూడఁ జూచెను. అందుఁగూడ నతఁడు బొగ్గుపోసిన పాఱ నేఁటికి నమూల్యాభరణంబుగఁ బరిగణింపఁబడుచున్నది. మహాసంగ్రామమూలమున ఫ్లాండర్స్ ఫ్రెంచిదేశములలోఁ దమ శౌర్యవీర్యపరాక్రమంబులం జూపుటకు భారతసేనల కవకాశము కలిగెను. లండనుపురవీథులలో వారుత్సాహమున నడచునపు డంతటి యోధు లీదేశమున నుండిరే యని వారిం గని యాశ్చర్యమును బొందనివారు లేరు.

స్వంతసైన్యమునకు సేనానిగా హైందవుల దుస్తుల ధరించిన యాతని చిత్రపటమే హిందువుల పరాక్రమమందుఁ జక్రవర్తి కున్నగౌరవము తేటతెల్లముగఁ దెలుపుచున్నది. భారతీయుల నెక్కుడుగఁ బ్రేమించి భారతవర్షంబున పట్టాభిషిక్తుండై భారతీయాంగరక్షకుండై, లండనునగరమున స్వారిచేసిన ప్రథమచక్రవర్తి మన జార్జి ప్రభువే. హిందూదేశ మెన్నియోమాసములు తనకు నెంతవస్వగృహ మాయెనని రాజచక్రవర్తియే పలికెను. ఆంగ్లహైందవదేశములకుఁ బరస్పరానురాగము మఱింత దృఢపడుట కాతఁడు సర్వదా పాటుపడుచు హైందవులయెడ నమితవాత్సల్యముం జూపుచుండును.

దేశచరిత్రలో 1919 సం॥ డిసంబరునెల తే 23 దీ హైందవులెల్లరు శాశ్వతముగ జ్ఞాపకముంచుకొనవలసిన దినము. మిక్కిలి కృతజ్ఞతలో వంశపారంపర్యము సాదరమున మనము సంస్మరింపవలసిన సార్వభౌమప్రకటన మా దినముననే చేయఁబడెను. ఈ యమూల్యమగు ప్రకటనమునకే ఆ దినము చక్రవర్తికినిఁ దరతరముల రాజకుటుంబములోనివారికిని, హైందవులయొక్క రాజకీయాశయములయెడలను, హైందవ సామ్రాజ్య పురోగమనంబునందును గల సానుభూతిని దెలియఁజేయు పవిత్రదినమయ్యె. చక్రవర్తికి హిందూదేశాభ్యుదయమం దున్న యాదరము, వారి ధైర్యసాహసములు, రాజనీతిజ్ఞత, శ్రద్ధయు నను సుగుణగణమ్ములన్నియు రాజద్రోహుల క్షమించి, గతమును మఱచి, "భావిభాగ్యోదయమే సర్వదా మనంబుల నుంచికొని నెమ్మది నైశ్వర్యములనే కాంక్షించుట కిదె మీహృదయక్షేత్రంబుల నాశాబీజంబుల వెదచల్లుచున్నా మని నమ్ముఁ" డని శ్రీవారే స్పష్టీకరించిరి. దైవానుగ్రహంబునఁ బాలితులకుఁ బాలకులకు నుభయశ్రేయోదాయకఫలితములు గలుగునని శ్రీవారితో మనమును గాఢముగ నమ్ముదము.

ఈ సామ్రాజ్యవిస్తారమును దగినబాధ్యతతోఁ గలకాలముఁ బరిపాలింపఁగల దీక్షను, శక్తిసామర్థ్యములను మన చక్రవర్తిగారికి సర్వేశ్వరుఁ డమితముగాఁ బ్రసాదించుఁగాత!

[చీపురుపల్లి రేంజి స్కూళ్ల డిప్యూటీయిన్స్పెక్టరుగారగు మ-రా-శ్రీ కూచిభట్ల సదాశివ పరబ్రహ్మం పంతులుగారి ఆంగ్లవ్యాసమునకుఁ దెనుఁగు.]

---

## ప్రియావిలేఖనవిలోకనము

బోడపాటి పూర్ణచంద్రరావు గారు

లాలితమైన యంగజు విలాసపుగద్దియ నుండునట్టు లీ
వా లస దేందుకాంతమయమై తగు వేదిక విశ్రమించి ము
త్యాలసరాల నేలు మధురాక్షరపంక్తులు వ్రాయు వేళ హే
రాళదిదృక్షు నాకు నమరత్వము సంధిలె నిన్నుఁజూడఁగన్.

# వ్యవసాయపరిశ్రమ—కొన్ని ముఖ్యసంస్కరణములు

చావలి వెంకటహనుమంతరావు, ఎం.ఏ., గారు

మన దేశపు ముఖ్యవృత్తులలో వ్యవసాయవృత్తి ప్రధానస్థానమాక్రమించుచున్నది. మన దేశ ప్రజలలో నూటికి 70 మంది హెచ్చున వ్యవసాయమువలననే తమ జీవితమును గడపుచున్నారు. అట్టి ప్రధానమగు వ్యవసాయపరిశ్రమ ఏవిధముగ నడుపబడుచున్నది, దానియందు పనిచేయువారి స్థితిగతు లెట్లున్నవని మన మాలోచించిన, విచారముగొల్పు ననుటకు సందేహము లేదు. దేశ సౌభాగ్యమును గోరు ప్రతివారును దాని ప్రస్తుతావస్థకు విచారమును దాని నభివృద్ధిపరచుటకు ఆతురతయును చూపకుండ నుండరు. వ్యవసాయదారుల, ముఖ్యముగ చిన్న వ్యవసాయదారుల, కష్టము లనేకము లనియు వానిని తొలగించి, వారికి తగినట్టి బలము చేకూర్చినప్పుడే వ్యవసాయవృత్తి లాభకరముగనుండి దేశాభ్యుదయము మేర్పడుననియు వేరుగ చెప్పనక్కరలేదు. ప్రస్తుత కాలములో ఈ వ్యవసాయసంబంధమైన విషయములు ప్రభుత్వముయొక్కయు ప్రజాప్రతినిధులయొక్కయు దృష్టి నాకర్షించుచున్నవి. వ్యవసాయ పరిశ్రమను లాభదాయకముగచేసి దానియందు పనిచేయువారి యభివృద్ధి పెంపొందించుటకు చేయవలసిన పనులు రావలసిన మార్పు లనేకములు గలవు. వానిలో ప్రధానమగు రెండు విషయములనుగూర్చి ఈ వ్యాసములో చర్చించెదము.

### వ్యవసాయపు పెట్టుబడి ధనము

ఇందు మొదటిది వ్యవసాయదారులకు గల ధనలోపము. ధనమే ప్రతి పనికి మూలాధార మని అందరకును తెలిసినదే. అది లేకపోయిన ఏ పనియును సరిగ కొనసాగుట కవకాశములు లేవు. మన దేశములో వ్యవసాయదారులకు ఈ ధనలోపము చాల ఎక్కువగా నున్నది. భూమిని దున్నుట మొదలుపెట్టినప్పటినుండి చేను కోతకు వచ్చువరకు, మరల కోత అయినదగ్గరనుండి తిరిగి దున్నువరకు వ్యవసాయదారుడు డబ్బు ఖర్చుపెట్టుచునే యుండవలెను. ఈ ఖర్చంతయు పెట్టుబడిపెట్టినతరువాత ఆతనికి మిగులునది ఏకొద్దిగనో ఉండును. దానితోడనే ఆతడు కుటుంబఖర్చును ఇతర గృహసంబంధమైన ఖర్చులను భరించవలెను. వీని కన్నింటికిని వ్యవసాయదారునికి సొమ్మెక్కడనుండి వచ్చుచున్నదని మన మాలోచించిన, ఆతడు మొట్టమొదట ఏ సాహుకారువద్దనో అప్పు చేయుచున్నాడనియు, ఏటేట ఆ అప్పు ఖర్చులెక్కువ యగుకొలదిని తీరుబడికాక పెరుగుచున్నదనియు మనము తెలిసికొనగలము. దేశమందలి వ్యవసాయదారులందరును ఇట్టి స్థితియందే యున్నారా యను ప్రశ్న ఈ సందర్భములో వేయవచ్చును. దానికి జవాబుగ ఏ కొద్దిమంది పెద్ద వ్యవసాయదారులో తప్ప మిగిలినవారందరును ఈ కష్టముల ననుభవించుచున్నారని చెప్పవలసియున్నది. ఈ విషయము లిట్లుండగా ఏ సంవత్సరమైనను వర్షములు సరిగ పడకపోయినను మరి ఏ ఇతర కారణములవల్లనయినను పంట ధ్వంసమైనయెడల వారి అవస్థ ఆలోచించుకోవలయునే కాని వ్రాయుట కష్టము. ఇట్లు సామాన్యముగ అన్నివిషయములందును వ్యవసాయదారునికి నష్టము సంప్రాప్తమగుట కవకాశము లున్నప్పుడు ఆతడు అభివృద్ధిని పొందుటకుగాని, వ్యవసాయపరిశ్రమ లాభకరముగా నుండుటకుగాని ఎట్లు సాధ్యమగును? మన దేశపు వ్యవసాయదారులు అనవసరమగుఖర్చుల కలవాటుపడియున్నారనియు, వారికా విషయములందు విజ్ఞానము లభించినగాని వారి స్థితిగతు లభివృద్ధిగాంచుట కష్టమనియు కొంతమంది పాశ్చాత్య ఆర్థిక శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. కాని ఆ మాటలయం దంతనిజము లేదనియు, వ్యవసాయదారుని ఖర్చులో చాలవరకు వ్యవసాయమునకు సంబంధించిన ఖర్చే యనియు, కాన వారి ఆర్థికస్థితికి వేరు కారణముల నారోపించి వారిని నిందించుట పొరపాటనియు, గ్రామములలోని ప్రజల స్థితులను విచారించిన వారికి తెల్లమగును. వారి ప్రాత అప్పులను తీర్చివేసి, క్రొత్తగా వారిని వారి వృత్తియందు ప్రవేశపెట్టి, పెట్టుబడిధనమును ఎక్కువ కష్టములేకుండ తీర్చుకొనుటకు వీలగునట్లు తక్కువ వడ్డీకి అప్పు దొరకునట్లు ఏర్పాటులు కావించిన పైని చెప్పిన విషయములోని నిజము ప్రకటితమగును. అప్పుడు నిజముగ వ్యవసాయదారులు అవసరమగు ఖర్చెంత చేయుచున్నారో, అనవసరమగు ఖర్చెంతవరకు చేయుచున్నారో తేలుట కవకాశము లుండును. ఊరక వట్టి మాటలతో ఇట్టి విషయములో వాదించుట కేవలము లాభములేనిపని. ప్రభుత్వమువారు వ్యవసాయదారుల కష్టములను తొలగించి వారిని ఉద్ధరించుటకు నిజముగ పూనుకొనినచో వారు చేయవలసినది వ్యవసాయదారుల కున్నఅప్పును అంచనా తీయించి, దానిలో నెంత మొత్తము ఏ కారణమునకై చేయబడినదో వీలయినంతవరకు తేల్చి, వ్యవసాయపు నష్టములు వ్యవసాయపు పెట్టుబడి వీనికొరకై చేయబడినదానిని కొట్టివేసి, పెట్టుబడికొరకై వారికి కావలసిన ధనమును సమకూర్చు బ్యాంకులను ఏర్పాటు చేయుటయే మై యున్నది. ప్రస్తుత కాలములో వ్యవసాయదారుని ప్రాణములన్నియు సాహుకార్ల చేతులలో నున్నవి; వారి నా పట్టు నుండి విడిపించుటకు చేయు ప్రయత్నములే వారికి లాభముగా నుండును గాని ఇతర మేమియుకాదు. మన మద్రాసు రాజధానిలో యీ మధ్యను ఇప్పుడు చర్చింపబడిన విషయమై కొంత లాభకరమగు పనులు జరిగినవని చెప్పుటకు ఆనందముగానున్నది. మద్రాసులో ప్రభుత్వమువారి ప్రోత్సాహమువలన కేంద్ర భూమితనఖా బ్యాంకొకటి స్థాపింపబడినది. దానిక్రింద పనిచేయుటకు ఇతర ప్రదేశములలోకూడ అట్టి బ్యాంకులను స్థాపించుటకొరకు ప్రయత్నములు జరుగుచున్నవి. వీనిద్వారా వ్యవసాయదారులకు పెట్టుబడి ధన సమస్య కొంతవరకు పరిష్కారమయి సాహుకార్ల దురాగత

ములు కొంత తగ్గుట కవకాశములు కలుగునని సంతోషింపవలసి యుండును.

పంట అమ్మకము

వ్యవసాయదారుల దుస్థితిని బాగుపరుచుటకు అవసరమగు రెండవ విషయము పంటలను సరియైన లాభకరములగు మార్గములద్వారా విక్రయించుట. ప్రస్తుత పరిస్థితు లెట్లున్నవనిన వ్యవసాయదారుడు పంట కోతకురాకముందే దానిని ఏ సాహుకారు నకో ఏ వర్తకునకో తనఖా పెట్టి పెట్టుబడిధనమును సంపాదించుకొను చున్నాడు. కోతలు పూర్తియైనతోడనే, కొన్ని సమయములలో ఇంకను పూర్తికాకముందే, ఆ పెట్టుబడిదారు డా పంటను వశపరము చేసుకొని తన యిష్టమువచ్చిన చొప్పున దానికి ధర కట్టి తన బాకీపోను మిగిలిన సొమ్మును ఇచ్చుచున్నాడు. వ్యవసాయదారుని అసహాయత, ఆతని అజ్ఞానము, ఆతనికి తగినట్టి సలహానిచ్చు సంస్థలు లేకపోవుట, ఈ కారణములవలన ఆతడు తన పొలమునందు పండిన పంటను లాభముగా నుండు సమయములందుగాని, లాభముగా అమ్ముడుపోవు స్థలములందుగాని అమ్ముకొనుటకు తగు నవకాశములు లేనివాడుగ నున్నాడు. వీనికితోడుగ మన దేశములో బాటలు, రైలు రోడ్లు, నీటిమార్గములు విరివిగ లేకపోవుటచేత ఎగుమతి దిగుమతి మార్గములుకూడ సంకుచితపరచబడినవి. ప్రభుత్వమువారు రోడ్లను బాగుపరచి అభివృద్ధి చేయుటకు పూనుకొనుచున్నారు. క్రొత్త రైలుమార్గములనుకూడ వీలగుచోట్లలో వేయుటకు ప్రయత్నములు చేయు చున్నారు. (తెలుగు జిల్లాలలో ఈ మధ్యనే ఎమ్. ఎస్. ఎమ్. రైల్వే కంపెనీ వారు నిడదవోలు, నరసాపురం, కాకినాడ, కోటిపల్లి రైలుమార్గముల నేర్పాటుచేయుటవలన చాలవరకు వర్తక వ్యాపారము సులభసాధ్యమగుట కవకాశము లున్నవి). ఈ మార్పు లన్నిటివలనను ఇకముందు వ్యవసాయపుపంట అడ్డంకులు ఇబ్బందులు లేకుండ ధారాళముగ ఎగుమతి యగుటకు అవకాశము లుండునని తలంపవచ్చును. కాని అన్నిటికంటెను ఈ సందర్భములో ముఖ్యముగ కావలసిన సంస్కరణ మొకటి కలదు. వ్యవసాయపు పంటలను అమ్మకము విషయములను సరిచూచుటకు కొన్ని సంస్థల నేర్పాటు చేయుటయే ఆ సంస్కరణముయొక్క ప్రధాన సూత్రముగా నుండవలెను. ఇట్టి సంస్థలు సహకార పద్ధతిపై నేర్పాటు చేయుట సులభమును లాభదాయకము నై యుండును. దేశమున కంతకును కేంద్ర సహకార విక్రయ సంఘము నొకదాని నేర్పాటుచేసి దానికి బ్రాంచిలుగ ప్రతిరాష్ట్ర మందును, ప్రతి జిల్లాలయందును అమ్మకపు సంఘముల నేర్పాటుచేయుట ముఖ్యము. కొద్దిగ కమీషను పుచ్చుకొనుచు వ్యవసాయదారులకు లాభము కలుగచేయు నుద్దేశములతో ఈ సంస్థలు పనిచేసిన దేశమునకు చాల మహోపకారము జరుగును.

ఇతర విషయములు — ముగింపు

వ్యవసాయ పరిశ్రమ అభివృద్ధి బొందుటకు కొన్ని ప్రధాన మార్గము లింతవరకు చర్చింపబడినవి. ఇవికాక ఇంకను అనేక విషయములలో సంస్కరణము లవసరమని మొదటనే చెప్పియుంటిని. వ్యవసాయదారుల అజ్ఞానమును తొలగించి వారికి వారి మంచిచెడ్డలను తెలిసికొనుటకు కావలసిన విజ్ఞానమును ప్రసాదించుటకు మార్గముల నరయుట ముఖ్యము. అట్టి విజ్ఞానమే వారికి అన్నివిధముల లాభకారిగ నుండగలదు. అది లేనినాడు ఎన్ని సంస్కరణములను ప్రవేశపెట్టినను వాని లాభము నాతడు గ్రహించలేడు, పొందలేడు. భూమిపన్నును విధించుట, దానిని వసూలుచేయుట, ఈ విషయములలోకూడ మార్పు చాల అవసరమే. వ్యవసాయదారునికి వ్యవసాయమువలన వచ్చు లాభము చాల తక్కువగా నుండగా ప్రభుత్వమువారు భూమిపన్ను మూలకముగ ఏ కొద్దిలాభ మున్నను దానిని లాగుకొనుచున్నారు. అట్లు చేయుటవలన వ్యవసాయపరిశ్రమ మఱియు ఎక్కువ అధ్వాన్న స్థితిలోనికి పోవుట మనము చూచుచున్న విషయమే. దేశాభ్యుదయమును కోరువారందరును పైని సూచించిన సంస్కరణముల కొరకై ప్రయత్నించిన దేశమునకు చాల ఉపకారము చేసినవారగుదురు.

---

# భగవల్లీల

జాలా రంగస్వామి గారు

ఎరమె వర్ణింపఁగాఁ బరాత్పరుని మాయ!
మహిమ లెన్నంగ వశమౌనె మనకు నెల్ల?
అఖిలమును భగవల్లీల యగునుగాదె!
జగము నాటకశాలగఁ దగనొనర్చి
నటకులనుగాఁగ జీవుల నాడఁజేసి
శాశ్వతం బనిపించు సంసార మెల్ల;
అంత నాదనిపించు దురాశమించ.
దీని మూలంబు రవ్వంత తెలియలేక
గాలమునఁ జేపచిక్కిన కరణి నహహా!
గాఢ తిమిరంబునంబడి కాల మెల్ల
గడప నెంచెదవేల చీకాకులేక?
జన్మసార్థక్యమగుచర్య జగతిలేదె?
"మంచి నెంచుచు, మంచినే యెంచిచేయ
సార్థకంబగు కాదె యీ జన్మ" మంచు
బుధులు చెప్పెడునట్టి యా బుద్ధి వినుము,
పాపకూపానఁ బడకు మో పాడుమనస!

# కులవృత్తులు

రాజా విక్రమదేవ వర్మ గారు

ఈ వ్యాసమునందుఁ గులములఁ గూర్చియు, వృత్తులఁ గూర్చియు వివరింపఁబడుటవలన దీనికి "కులవృత్తు" లను నామ మిడఁబడెను. కులము, వర్ణము, జాతి యనునవి పర్యాయ పదములు. కులమ్—కులతి = సంఘీభవ తీతి కులం [సజాతీయ ప్రాణుల కూడిక కులము]. లేక కుల్యతే బంధువర్గోఽనే నేతి కులం—కులసంస్త్యానే [దీనిచేత బంధువర్గము కూర్పఁబడును]. ఇట్లు కుల శబ్దమునకు రెండు నిర్వచనములు గలవు. అందు మొదటిది ప్రాణి సామాన్యమునందును, రెండవది కేవలము మానవసంఘము నందును వర్తించును.

జగమునందు వివిధప్రాణు లుండుటవలనఁ బ్రాణిసమూహమునందుఁ గులభేద మొప్పను. కాని కేవలము మానవులందు నది దగునా? మానవసృష్టి యేకవిధ మయినది గాదా? మానవులందు—ముఖ్యముగా భారతీయులందు—ఇప్పుడున్నట్లు కులభేదము సృష్ట్యాది నుండెనా? ఆ భేదకల్పనము మానవకృతము గాదా? అని కొంద అనవచ్చును. ప్రాణులసృష్టి కాదియందుఁ బెఱవానియందుఁ బోలె మానవులందు స్త్రీపురుషభేదముమాత్ర ముండెను. మానవ కులము క్రమాభివృద్ధి నొందుటవలనను, అది బుద్ధిగలది యగుట వలన వివిధకర్మాచరణమునం దాసక్త మగుటవలనను, ప్రాణులకు గుణభేదము సహజ మగుటవలనను మానవుల పురోభివృద్ధి కొఱకు భగవానుఁడు వారిలో నాలుగు తెగల నేర్పరించెను. [చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మ విభాగశః. గీతా-]. ఆనాలుగు తెగలే కుల వర్ణ జాతి నామము లొంది భారతదేశము నందు బ్రహ్మ క్షత్త్రియ వైశ్య శూద్రాఖ్యలచేత వ్యవహరింపఁబడెను. తాము జ్ఞానమును సంపాదించి తమతోడివారికి జ్ఞానోపదేశము సేయుచుండినం గాని దేశము పాపభూయిష్ఠమయి చెడును. కనుక జ్ఞానోపదేష్ట లుండవలెను. వారే బ్రాహ్మణులు. జీవనోపాయము కొఱకుఁ బోరాటలు గలుగుచుండును. కనుక దాయలధాటినుండి తమయొక్కయుఁ దమవారియొక్కయు మానప్రాణాది సంపత్తులను గాపాడు శూరు లుండవలెను. వారే క్షత్త్రియులు. తమ దేశ వాసుల భోజనాదులకొఱకును దమదేశముయొక్క సమృద్ధికొఱకును గృషి వాణిజ్యములు సేయువా రుండవలెను. వారే వైశ్యులు. ఆ పనులకు, నా పనులు సేయు జనులకును సహాయు లుండవలెను. వారే శూద్రులు. ఈ దేశమునం దక్కఁ దక్కిన దేశములం దా పేరులు గలవారు లేకున్నను, ఆ కార్యముల నాచరించువారు సకల దేశములందును గలరు. కాని యన్యదేశములందుఁ దండ్రి యొక పనిని జేయుచుండినఁ గొడుకు మఱొకపనిని జేయును; మనుమఁడు వేఱొకపనిని జేయును. వంశానుక్రమముగాఁ జేయఁబడుచుండు పనులే సమగ్రము లయియుండు నని భావించు భారతీయులు దండ్రులు సేయు పనులనే కొడుకులును మనుమలును జేయుచుందురు. ఈ దేశమునం దా నాలుగుతెగలవారి యాచార వ్యవహారములు క్రమముగా భేదించుటవలనను, ఈర్ష్యాసూయలు ప్రబలుటవలనను వారు పరస్పరము భోజనప్రతిభోజనములను జుట్టఱికములను మానుకొనిరి. కనుక నా నాలుగుతెగల కూడిక దవ్వయ్యెను. మఱియు నా నాలుగుతెగల యనులోమవిలోమ సంపర్కములవలనను [పురుషుఁ డెక్కువ కొలమువాఁడుగన స్త్రీ తక్కువకొలముదిగనుండి కన్న బిడ్డ లనులోమజాతులు; స్త్రీ యెక్కువ కొలముదిగను బురుషుఁడు దక్కువ కొలమువాఁడుగ నుండి కన్న బిడ్డలు విలోమజాతులు] ప్రదేశ భేదములవలనను, చేయుకారుప్రభృతి కర్మముల వలనను లెక్కకు మిక్కుటములగు కులములు భారతీయులచేత సృష్టింపంబడి దేశమునందు వ్యాపించెను. మేనికిఁ దలమొదలు కాలువఱకు నన్ని యవయవములును ముఖ్యము లయినట్లే దేశమునకు నన్నివృత్తులును ముఖ్యము లని యెఱుంగవలెను. పూర్వ మే కులమునకు నియమితమయిన వృత్తి నా కులమే నలుపుచుండుటవలన నొక కులమునకు వేఱొక కులముతోడ బాంధవము సేయుటయందు భేదభావ ముండినను, సఖ్యమునకు లోటు లేకుండెను. కులవృత్తులను మానినవారిని రాజులు దండించుచు వృత్తులను వృద్ధిసేయుచుండిరి. అట్లగుటవలన దేశము సమృద్ధమగుటయేకాక, వస్తువులను జౌకగాఁ బొంది ప్రజలు సుఖించుచుండిరి.

కులమునుబట్టి వృత్తి గలిగెనా? వృత్తినిబట్టి కులము గలిగెనా? అను సందేహము గొందఱకుఁ గలుగవచ్చును. కాని పై నున్న పంక్తులవలన వృత్తినిబట్టియే కుల మేర్పడెననుట సుస్పష్టము. అట్లయిన నేర్పడిన కులము వృత్తి భేదమువలన నిఁక మార్పునొందదు.

వృత్తి యనఁగా జీవనోపాయము. అది ప్రారంభమునఁ గృషి, పాశుపాల్యము, వాణిజ్యము, సేవ యను చతుర్విధముగా నుండి క్రమశః పెక్కురూపులను దాల్చెను. ఇప్పటి భారతీయులు

"శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్ ।
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః॥"

అను గీతాబోధనమునందు లక్ష్య మిడక స్వవృత్తిత్యాగులును బరవృత్త్యవలంబులు నగుటయేకాక, దాస్యమే పరమార్థ మని నమ్మి దానికొఱకె పాటుపడుచున్నారు. అందఱును దానికై యత్నించుట వలన నదియు దుష్ప్రాప్య మగుచున్నది; మఱి జనులందు నన్యోన్య సాహాయ్యమునకు మాఱుగా విరోధభావము ప్రబలుచున్నది. అంతేకాక దినదినాభివృద్ధి నొంది ఘనతను గడింపవలసిన యితరవృత్తులు క్షీణించుచున్నవి; ఇఁక లక్ష్మీవంతులు గావలసిన భారతీయులు దరిద్రులయి దైన్య మొందుచున్నారు.

వృత్తులలోఁ గొన్ని గౌరవయుక్తము లనియు మఱికొన్ని గౌరవహీనములనియుఁ గొందఱు దలంతురు. కాని బాగుగా నాలోచించినచో దాస్యముకంటెను బిచ్చముకంటె నే వృత్తియు నీచమయినది గాదని బోధపడక మానదు. స్వతంత్రజీవనము సేయుటకు వలనుపడు నెట్టి వృత్తియు గౌరవాస్పద మనియే నమ్మవలెను. కులవృత్తినాశనమే యిప్పటిజనుల దారిద్ర్యమునకుఁ గారణము. కులవృత్తులు మరల నుద్ధరింపబడినం గాని దేశమునుండి దారిద్ర్యము దొలఁగదు. కనుక భారతీయులు దమ మనములను గులవృత్తులందే లంకించి తమ దేశమునకుఁ బూర్వగౌరవమును దమకు సుఖ స్వచ్ఛందజీవనమును సంపాదింతురుగాక!

# రామమోహనరాయలవారు విగ్రహారాధకులు కారా?

విమర్శకాగ్రేసర కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రి గారు

మతప్రధానం బగు మానవుని ముఖ్యకృత్యములలో నగ్రగణ్యమైనది యీశ్వరారాధన మని యాస్తికులెల్లరును నొక్కి వక్కాణించుచున్నారు. కాని యీ యారాధన మొనరించుట బహుదుర్లభము. ఏమనఁ, బరాత్పరుఁడు మనస్సునకుగాని వాక్కునకుగాని యందరానివాఁడు. ఇంద్రియాగోచరుఁడు. ఇట్టివాని నారాధించుటకుఁ బ్రతిమార్చనముతప్ప మఱొండుపాయము లేదని తపోమహిమముచే సత్యజ్ఞానసంపన్నతను సంపాదించుకొనిన మహర్షులు నుడివియున్నారు. ఇట ప్రతిమ యనఁగా దైవలక్షణములు సాధ్యమైనంతవఱకుఁ దెలిసికొనుటకు నుపకరించు చిహ్నము. ఈ గుఱుతు నాధారముగాఁ జేసికొనుచుండిన సాధారణముగా లక్ష్యము కుదురదు. అందులకై రూపరహితములగు నక్షరాదులకు రూపము లేర్పాటులు చేయఁబడినవో, యట్లే యీశ్వరునకుఁగూడఁ బెద్దలచేఁ బ్రతిమ లేర్పాటుచేయఁబడినవి. అన్నిదేశములందును నన్నిమతములందును నీ విగ్రహారాధనము కలదు. కాన విగ్రహారాధన మవశ్యకర్తవ్యము. సామాన్యముగా దానిని మించి యాత్మధ్యాన మొనరింపఁగలవా రరుదు. విగ్రహ మనఁ బ్రతిమ యనియే భావము.

ఈ యారాధన మాదినుండియు నన్నిదేశములందునుగూడ నుండినను నొకానొకప్పుడు కొందఱు బయలువెడలి, ప్రతిమార్చనతత్త్వమును సరిగఁ దెలిసికొనఁజాలక దానిని నిరసించుచుండుటయును గలదు. ఆత్మజ్ఞానుల కది యవసరము లేదని మన మహర్షులును బోధించియున్నారు. కాని స్వల్పబుద్ధులకు నయ్యది యత్యంతావశ్యకమని బోధించిరి.

రాజా రామమోహనరాయలవారు విగ్రహారాధన మొల్లని యాత్మజ్ఞాని యని బ్రాహ్మసామాజికు లెల్లరు దంభములు కొట్టుచుందురు. రామమోహనులవారు విగ్రహారాధనమును ద్వేషించినమాట సత్యము. కాని వీ రాత్మజ్ఞానసంపన్నులై విగ్రహారాధనముఁ ద్యజించియుండలేదు. వీరు విగ్రహారాధనముపై దాడివెడలుటకుఁ గారణము వేఱు. అది యేదియన: వీరి తాత తండ్రులైహికప్రధాను లగు లౌకికులు. ఆకారణమున వీరిని బాల్యముననే యప్పటికింకను రాజభాషగా నున్న తురుష్కభాష నభ్యసింపఁజేసిరి. వీరు మొదటనే స్వమతగ్రంథములను వేనిని దెలిసికొనుటకుఁ బూర్వమే పరమతస్థులచేతులలోఁబడి వారి బోధల నందినవా రగుటచేతను, వీరి గురువులగు మహమ్మదీయులు హిందువుల విగ్రహారాధనమును నిరసించువా రగుటచేతను, నట్టి గురుబోధల నందిన వీరు విగ్రహారాధనమందలి మంచిచెడ్డలను గొంతవఱకు బాగుగఁ దెలిసికొనుటకుఁ బూర్వమే దానిని ద్వేషింప మొదలిడిరి. అంతియేకాని తత్త్వమెఱిఁగి కాదు. ఏమన, వీ రాచరణములో నేవిధమునఁ జూచినను విగ్రహారాధకులకంటెఁ బైమెట్టెక్కినవారు కారు. ఒకవిధమునఁ జూచిన మొదటిమెట్టుమీఁదనే యున్నవారుగఁ గాన్పించుచున్నారు. ఇందులకుఁ దగు నుదాహరణముల నీక్రింద నిచ్చుచున్నాను.

1. వీరు విగ్రహారాధనము కూడదని వాదించినను దుదకు విగ్రహముల కాళ్లకు మ్రొక్కినవారుగ నున్నారు. ఒకపరి వీరు తమ తల్లిగారి యనుగ్రహ మపేక్షించి వారి దర్శించియుండఁగా నా సాధ్వీమణి "నీవు నాదయను గోరుచో నేను బూజించు రాధాకృష్ణ దైవములకాళ్లకు మ్రొక్కవలసిన" దని యాజ్ఞాపించె. పుత్త్రుఁడును మాతృదేవతయొక్క దయను సంపాదించికొనుటకొఱకై యా విగ్రహములకడకుఁ బోయి వానికాళ్లకు మ్రొక్కె. ఇదంతయు విగ్రహారాధనమును ద్వేషించుటకుఁ బిమ్మటనే జరిగినది. ఇది విగ్రహారాధనముకాదా! దీనికి మన బ్రాహ్మసామాజికసోదరు లొకకారణముఁ దెలుపుచున్నారు. అది యేది యన, తల్లిగారి సెలవును గొనసాగించుటకై యామె పూజించు రాధాకృష్ణ విగ్రహములకడకుఁ బోయి "నా తల్లిగారికి దైవతము లగు నో విగ్రహములారా! ఆమె యాజ్ఞచొప్పున మీకాళ్లకు మ్రొక్కుచున్నాను" అని పలికినాఁడే కాని నిజముగా విగ్రహారాధనమునందు భక్తికుదిరి యా విగ్రహములకు మ్రొక్కలేదు కావున నియ్యది విగ్రహారాధన కానేర దనునది యై యున్నది. నిజముగా నిది కారణాభాసముకాని మంచికారణము కానేరదు. వీరు చెప్పు కారణముచేతనే రామమోహనులవారు దైవభక్తిలేని కేవల విగ్రహారాధనమును గావించినవారని రూఢిపడుచున్నది. నిజముగా విగ్రహములు దైవప్రతిమలు అను భక్తికలిగి వాని నర్చించుటయందు దప్పేమియును లేదు గాని, తనకు భక్తిలేకున్నను బరులప్రీతికై విగ్రహములకాళ్లకు మ్రొక్కుట కడు హేయమగుపనిగా నున్నది. ఇట్టివారలే నింద్యమగు విగ్రహారాధనమును చేయువారలు. భక్తులు నిజముచే విగ్రహారాధకులు కారు. ఏమనః- వారు దైవభక్తులై దైవమునందు గురియుంచికొని యాతఁ డింద్రియగోచరుఁడు కాఁడు గావున, విగ్రహములను వానికిఁ బ్రతినిధులుగాఁ బెట్టికొని తద్ద్వారముగ నీశ్వరు నారాధించువారుగ నున్నారు. నిజమగు విగ్రహారాధకుఁడు "ఓ విగ్రహమా! నీ కాళ్లకు మ్రొక్కుచున్నా" ననఁడు. ఓ దైవమా! నీ కాళ్లకు మ్రొక్కుచున్నా ననును. ఒక చిన్న ఱాతిబొమ్మకడకుఁ బోయి యావిగ్రహమునెదుట నిలిచి "శాంతాకారమ్ భుజగశయనమ్ పద్మనాభమ్ సురేశ" మ్మని ధ్యానింప మొదలిడును. ఇంకను ముఖాద్యవయవరహితమగు లింగముకడకుఁ బోయి "వందే శంభు ముమాపతిమ్ సురగురుమ్ వందే జగత్కారణ" మ్మని నుతింప మొదలిడును. అప్పుడా భక్తుని హృదయమునందు విశ్వాకారుఁడును జగత్కారణుఁడును నగు పరాత్పరుఁడే కలఁడు. ఆతనినే యాతఁడు చూచుచున్నాఁడు. ఈశ్వరునిజ్ఞప్తి యాతనికిఁ గలుగుటకే విగ్రహ మక్కఱకు వచ్చినదిగాని మఱొండు కాదు. ఆతఁ డీశ్వరునే చూచుచు నీశ్వరునే యారాధించుచున్నా ననుకొనక, మన రామమోహనరాయలవారివలెఁ గేవలము ఱాతివిగ్రహాదికమునే భావించుచున్నవాఁ డగుచో మోహనులవారివలెనే ఓ మూరెడు జానెడు పొడవుగల ఱాతివిగ్రహమా! యో పాత్రమువలెనుండు ఱాతిలింగమా! నీకు మ్రొక్కుచున్నా నని పలుకును. అట్లనక "శాంతాకారుఁడా! విశ్వాకారుఁడా! జగత్కారణుఁడా!" యని సంబోధించుటచే ఱాతివిగ్రహమును బూజించుట లేదని స్పష్టముగ బోధపడుచున్నది. ఱాతికి మ్రొక్కుచున్న యొక మూఢవనితకడకుఁ బోయి నీ వేమిచేయుచున్నా వనిన దైవమునకు మ్రొక్కుచున్నా నని సమాధానము చెప్పును. ఆమె హృదయమునం దప్పుడు దైవమే నిండియుండును అని కేశవచంద్రసేనులవారు వ్రాసియుండిరి. నిజమగు భక్తునకా ఱాతివిగ్రహమొక ప్రతిమ. అనఁగా నీశ్వరుని స్మరించుకొనుట కొక సాధనముగాఁ బెట్టికొనిన యుపకరణము, కావున నియ్యది విగ్రహారాధనము కాదు. ఆ భక్తుని నీ వెవనికి మ్రొక్కితి వని యడిగిన దైవమునకు మ్రొక్కితి నని సమాధానముచెప్పును. కావున నిది దైవారాధనముగాని విగ్రహారాధనము కాదు. మన రామమోహనరాయలవారు చేసిన దన్ననో నింద్యమగు విగ్రహారాధనము. ఏమన, వీ రావిగ్రహముల కాళ్లకు మ్రొక్కలిడిరో యా విగ్రహములమీఁదనే వీరికి దృష్టికలదు గాని దైవతమునందు దృష్టి లేదు. కావుననే నిజమగు భక్తునివలె "ఓ శాంతాకారుఁడా! విశ్వాకారుఁడా! జగత్కారణుఁడా! నీకు మ్రొక్కుచున్నా" ననక "యో విగ్రహములారా! మీకు మ్రొక్కుచున్నా" నని పలికినాఁడు. ఈతఁడు విగ్రహములనుమాత్రమే పూజించెను కాన, రామమోహనరాయలవారిప్పటునఁ జేసినది నిందాస్పదమగు విగ్రహారాధనము. అట్లెందులకుఁ జేసిరనిన, తల్లిగారి యనుగ్రహమును సంపాదించుకొనగలందులకును, తద్ద్వారముగ ధనలాభమును బొందుటకును రామమోహనరాయలవారు నింద్యమగు విగ్రహారాధనమును గావించియున్నా రనుటకు సందేహింప నవసరము లేదుగదా?

2. వీరు విగ్రహారాధకులనుట కిది యొక్కటియే యుదాహరణము గాదు; వీరు తమ ముగ్ధభావములఁ బ్రకటించుటలో విగ్రహారాధనము నెంత నిందించినను,

నిక్కమగు నాత్మజ్ఞానముకలవారు కాకపోవుటచేఁ దమరు తాముచేసిన దైవారాధనము ప్రతిమార్చనముద్వారముగనే కావించుకొనియుండిరి. వివేకానందస్వామి తెల్పిన రీతిగాఁ దాము చేయుననియుఁ బ్రతిమార్చనమే యైనను దానిని గ్రహించికొనఁజాలక తోడి హిందూసోదరులను మూఢభక్తులని విగ్రహారాధకులని వీరు నిందించుచు వచ్చిరి. వీరి యర్చనములో విగ్రహారాధన మున్నందుల కొక యుదాహరణ మిచ్చుచున్నాను.

వీరు దైవార్చనమునకై యొక చిన్న మందిరమును గట్టికొనిరి. ఇది తమ వాసగృహమునకుఁ గొంతదూరమున నున్నది. ఆ ప్రార్థనమందిరములోని గోడలపై "ఓం" అని యొకచోటను "ఏకమేవాద్వితీయమ్" అని యొకచోటను నీ రీతిగాఁ జిత్రించిరి. ఆ మందిరమునకును వీరు పోవునప్పుడు పాదచారులై చని మందిరమునకుఁ బ్రదక్షిణముచేసి లోనఁ బ్రవేశించి దైవధ్యానముఁ గావించుకొని మరల నింటికి వెళ్లునప్పుడు బండినెక్కి పోవుచు వచ్చిరి. దీని తత్త్వమును జనవరులు తెలిసికొనవలసియున్నది. రాయలవారు ప్రతిమార్చనముచేయు స్వల్పబుద్ధులుగాక యని యక్కజపడని యాత్మజ్ఞానసంపన్నులే యగుచోఁ దాము దైవారాధనమున కేర్పఱచుకొనిన దైవాలయమునకుఁ బోవునప్పుడు పాదచారులైపోవుట యేల? తన యాలయమునకు వచ్చునప్పుడు బండి నెక్కివచ్చుట యేల? ఏల యన, తాము ప్రార్థనకై యేర్పఱచుకొనినతావు దైవనిలయమను భక్తి వీరి హృదయమునఁ గలదు. ఆ హేతువుచే దైవగృహమునకుఁ బోవునప్పుడు బండి నెక్కిపోవుట యుచితము గాదని యెంచి, దైవమునందు వినయముఁ జూపుటకై పాదచారులై పోవుచు వచ్చిరి. ఇక స్వగృహమునకు వచ్చునప్పు డన్ననో యయ్యది తమ యాలయముగాని దైవాలయము గా దనుభావ మున్నది. కావున స్వేచ్ఛగా బండినెక్కి పోవుచు వచ్చిరి. అనఁగా మూఢభక్తు లెట్లు దేవాలయములందుమాత్రమే దైవమున్నాఁడని తలంతురో యట్లే వీరును దాము కట్టించికొనిన దైవాలయములోమాత్రమే దైవమున్నాఁడని భావించువారైరి కాని, యంతటను దైవమున్నాఁ డనుభావముకలవారు కాలేరు. కావుననే తమయింటిని దైవముయొక్కయింటిని వేఱువేఱు దృష్టులతో వీరు చూడఁజొచ్చిరి. ఆహా! ఇట్టివా రాత్మజ్ఞానసంపన్ను లెట్లు కాఁగలరు? "ప్రతిమా స్వల్పబుద్ధీనాం సర్వత్ర విదితాత్మనామ్" అని శాస్త్రములు మొఱలిడుచున్నవి. ఆత్మజ్ఞానము గలవానికి దైవ మంతటను గాన్పించును. వీరి కట్లు కాలేదు.

3. మఱియును ఆ మందిరమునకు వీరు ప్రదక్షిణముచేసిరి. విగ్రహారాధకులు దేవాలయమునకుఁబోయి చేయుపని యేమి? మొదటిపని ప్రదక్షిణము చేయుటయే కదా! కావున నాలయప్రదక్షిణము విగ్రహారాధనముయొక్క ప్రథమాంగము. ఆ పనిని వీ రొనరించిరి. వివేకానందస్వామి కొందఱు విగ్రహములను మ్రొక్కుదురనియు, మఱికొంద ఱాలయములఁ బూజింతురనియు రెండును విగ్రహారాధనములే యనియు సరిగ నుడివియుండె. కావున మోహనులవారు దైవాలయారాధనము చేసినవారే కాని వేఱుకారు. ఇంకను దమ దైవాలయములో దృష్టిపథమున కెదురుగా "ఓం" మున్నగు ప్రతిమలఁ జిత్రించికొని యుండిరి. అవి ప్రతిమలుకావా! వానిని గోడలపై నేల వ్రాయవలసివచ్చె! హిందువు లారాధించు దేవాలయము లన్నిటియందును జాతి విగ్రహము లుండవు. కొన్నియాలయములలో గోడలపై విగ్రహములు చిత్రింపఁబడియుండును. ఆ యాలయములకు భక్తులు పోయి యా ప్రతిమలందు బుద్ధినిలిపి దైవారాధనముఁ గావింతురు. రాయలవారు వీరికంటె హెచ్చగు స్థితియం దున్నవా రెట్లయిరి? హిందువులు ఓంకారస్వరూపుఁ డగు విఘ్నేశ్వరుని గోడపైఁ జిత్రించికొని దాని నారాధించియుండ, వీ రోంకారమును గోడపైఁ జిత్రించికొని దాని నారాధించిరి. ఈ రెండింటికిని భేద మేమి? హిందువులు పూజించు విఘ్నేశ్వరప్రతిమము ఓంకారరూపమే! అతని తుండము ఓంకారపుఁ దుండమే! అతనిపొట్ట ఓంకారపుఁబొట్టయే! అతని యుండ్రము ఓంకారపు సున్నయే! అతని యేకదంతము ఓంకారపు పైఁ జెక్కిలియే! అతని గుజ్జురూపము ఓంకారపు గుజ్జురూపమే! "ఓం" అనెడు గుఱుతును ప్రతిమగాఁ బెట్టికొనువారు విఘ్నేశ్వరప్రతిమను గుఱుతుగాఁ బెట్టికొనువారితో నేమనుమించుగాఁ దుల్యులే! భక్తుఁడు విఘ్నేశ్వరాలయమునకుఁ బోయి: "యం బ్రహ్మ వేదాంత విదో వదంతి పరం ప్రధానం పురుషం తథాన్యే। విశ్వోద్గతేః కారణమీశ్వరం వా తస్మై నమో విఘ్నవినాయకాయ" యని ధ్యానించును. ఇది పరాత్పరధ్యానము కాదా? ఇంతకంటె నెక్కుడుమాటలు రామమోహనరాయలవారు వాడఁగలరా! కావున గోడలపై పదరూపమగు ప్రతిమలఁ జిత్రించికొని వానిద్వారముగ నీశ్వరు నారాధించిన మోహనులవారు ప్రతిమార్చకులే కాని వేఱుకాదు.

4. వీరు ప్రార్థనమందిరమునకుఁ బోవునప్పుడు సుల్తానునివలె పెద్ద వేషము వేసికొని పోవుచుండెడివారు. ఆ మందిరమునకు వచ్చు భక్తులెల్లరు తమవలెనే పెద్దవేషములను వేసికొనవలెననెడు పట్టుగూడ వీరి కుండెడిది. సామాన్య వేషములతో వచ్చిన యొక భక్తుని వీరు పెద్దవేషము వేసికొనిరానందులకై మందలించిరి. ఆ భక్తుఁడు దైవముపట్ల నడఁకువఁ జూపుటకై యిట్లల్పవేషముతో వచ్చితి నని సమాధానము చెప్పియుండఁగా వానిపై నాగ్రహించి ఒక "సుల్తాను దర్బారు"నకు మనము పోయినపుడు దర్బారునకుఁ దగినవేషము వేసికొని పోవలయునేకాని చింకి గుడ్డలతోఁ బోవచ్చునా? అట్లు పోయిన సుల్తానున కాగ్రహమురాదా! అట్లే దైవముకట్లను నడుచుకొనవలెనని వీరు సెలవిచ్చిరి. దీనింబట్టిచూడ దైవ మొక్క నిరంకుశాధికారివంటివాఁ డనుభావము వీరికిఁ గలదు గాని యాతఁడు లోకపిత యను భావము వీరి కున్నట్లు లేదు. నిజముచే దైవము కరుణామయుఁడు గదా! అతనిని దురహంకారి సుల్తానునివలె దాంభిక వేషప్రియునిగాఁ దలంచుట న్యాయమా? కావున వీరు నిక్కమగు దైవారాధనముఁ జేసినవారు కారు. దంభప్రియులై పెద్దపెద్ద వేషములను వేసికొని దైవమందిరముల నలంకరించి లోకులకు తద్వారముగా మెచ్చుటఁ గలిగింపఁ బాటుపడినవారు. ఇట్టివారు విగ్రహారాధకులకంటె ఘను లెట్లుగాఁ గలిగియుందురు? వీరి యారాధన మేవిధముగా విగ్రహారాధనమును మించినదై యున్నది? కావున రామమోహనరాయలవారును గ్రియచే విగ్రహారాధకులేకాని వేఱుకాదు.

మోహనులవా రొనరించిన యారాధనము చాల లోపములతోఁగూడినదనియు, సరియైనదికాదనియు సీతానాథతత్త్వభూషణులవారే నొక్కి వక్కాణించిరి.

5. యజ్ఞోపవీతమును దాల్చుట విగ్రహారాధనమే యగునని బ్రాహ్మసామాజికులు నుడువుదురు. మోహనులవారు జన్నిదమును గడవఱకును దాల్చిరి. కాన వీ రీ విధమునను విగ్రహారాధకులే.

వీరు విగ్రహారాధనమును ద్వేషించిరే యందురేని దానికిఁ గారణాంతరము కలదని నేను మొదటఁ దెల్పియేయున్నాను. అదిగాక వీరు విగ్రహారాధనమునంతను నిందించివేసి యుండలేదనియుఁ గొన్ని ఘోరకృత్యములతోఁ గూడిన యుత్తరదేశపు కాళికారాధనము మాత్రమే వీరు నిందించిరనియు, నితరదేవాలయములందుఁ గల యర్చనము వీరి కిష్టమే యనియు ధ్వనిరాఁ బ్రార్థనసామాజికులలో నొక్కరగు జస్టిస్ మహాదేవ గోవిందరానడేగారు నుడివియుండిరి. కాన లోకమునందలి బుద్ధిమంతు లెల్లరును జాలవఱకు విగ్రహారాధకులే యనియుఁ, తద్ద్వారముగ దైవమును దెలిసికొనువారే యనియు మనము గ్రహింపవలసియున్నది. విగ్రహారాధన మొనరించి నిక్కమగు దైవజ్ఞానమును సంపాదించికొనువారు కలరా యని బ్రాహ్మసామాజికు లడుగుచుందురు. అట్టివారు కలరని బ్రాహ్మసామాజికులలో నగ్రగణ్యులగు ప్రతాపచంద్ర ముజుందారుగారే నొక్కి వక్కాణించియున్నారు. వా రెవ రన, రామకృష్ణ పరమహంస. కాన నో భక్తవరులారా! నిక్కమగు భక్తితోఁ బ్రతిమార్చన మొనరింపఁ బ్రయత్నింపుఁడు.

ఎంతటివారికైనను బ్రతిమార్చన మవశ్యకర్తవ్య మగునను నంశమును ఋజువు చేయుటకై రాజా రామమోహనరాయలవారి దైవార్చనముఁగూర్చి ముచ్చటించితినే కాని వారి యారాధనక్రమము నధిక్షేపించుటకుఁ గాదని బ్రాహ్మసామాజికసోదరులు మున్నగువారలు గ్రహించికొందురుగాక! కేశవచంద్రసేనులవారు ప్రతాపచంద్ర ముజుందారుగారు మున్నగు బ్రాహ్మసామాజికాగ్రగణ్యులుగూడ విగ్రహారాధనమందు విశేషము గలదని గ్రహించికొనుస్థితిలోనికి వచ్చిరని దెలుపుట కెంతయు సంతసముగ నున్నది.

క్షితిఁ గల మతముల నన్నిటఁ
బ్రతిమార్చన మేదొ యొక్కభంగిని వెలయున్,
హితమగు భక్తినిఁ గూర్చును,
మతి యుండిన నట్టి యర్చ మానఁగ నేలా?

—••—



# రాజయక్ష్మ

కామఋషి. మృత్యుంజయ వర్మ గారు

"అనేకరోగానుగతో బహురోగ పురోగమః
రాజయక్ష్మా క్షయ శ్శోషో రోగరాజ ఇతి స్మృతః."

అనేక రోగములతోఁగూడి తనను ముందనేక రోగములు గలదియై సకల రోగములకు ప్రభువైయుండు నియ్యది రాజయక్ష్మ యనియు, క్షయరోగ మనియు, శోషయనియుఁ జెప్పంబడును. సకలరోగములకు రాజగుటవలన రోగరాజ మనియు, శేక రాజయక్ష్మయనియు. రస రక్త మాంస మజ్జాస్థిగతజ్వరములు ధాతుగతంబులై శరీరాశ్రితరసాదిధాతువులు క్షయించుటవలన క్షయరోగ మనియు, రసాదిధాతువులు శోషించుటవలన శోష యనియు నీ రోగము పిలువంబడును. వాత మూత్ర పురీషాదుల నడ్డగించుట, అతిమైధునము, ఉపవాసాది క్లేశములు, విషమాన్నపానములు మొదలగు వానివలన త్రిదోషములు ప్రకోపించి యక్ష్మరోగమును జనింపఁజేయును. వేగనిరోధాది కారణములవలన వాతము ప్రకోపించి జఠరాగ్ని దుష్టంబై పిత్తశ్లేష్మములం బ్రకోపింపఁజేయును. వేగనిరోధాది హేతువుల మధ్య ననంఖ్యాకరోగ హేతువు లంతర్భావమును జెందియుండును. అందువలన జ్వరము రాజుగ, కామిలారోగము ధర్మపత్నిగ, పాండురోగము సేనాధిపతిగ, రక్తపిత్తము పుత్రుఁడుగ, శోథాతిసారములు స్నేహితులుగ, శ్వాసకాసలు మంత్రులుగ, వాతపిత్తములు గూఢచారులుగ, వాంత్యరుచులు అశ్వములుగ, గ్రహణ్యర్శస్సులు గాయకులుగ, గుల్మశూలలు వాద్యములువాయించువారుగఁ గలదై యనేకరోగములతోఁగూడి యనేకరోగములఁ బురస్కరించుకొని క్షయరోగ మీవిధముగా రోగరాట్టగుచున్నది. "అసాధ్యోఽయం మహారోగో సహస్ర దివసావధిః" ఇట్టి మహారోగము వేయిదినములు (సం 2 మా 9 ది 10) ప్రమాణకాలము గలదిగా నున్నది. కఫప్రధానము లగు వాతాదిదోషములు రసవాహినులగు ధమనుల నడ్డగించుటవలన రసము హృదయగతమై యచ్చట దుష్టమై నోటిమార్గముగ వెడలును. అందుచే రసాది సప్తధాతువులు నొకదానివలన నొకటిగ శుక్రధాతువువరకు క్షయించి అనులోమక్షయను గలుగంజేయును. అతిమైధునాదులవలన శుక్రధాతువు క్షయించి క్రమముగా నొకదానివలన నొకటిగ రసధాతువువరకు క్షయించి ప్రతిలోమక్షయను కలుగంజేయును. సిదప నరుఁడు శుష్కించును. కార్యభూతమగు శుక్రము క్షయించుటవలన కారణీభూతములగు మజ్జాదిధాతువులును క్షయించును. అన్నద్వేషము, జ్వరము, దగ్గు, ఉబ్బసము, రక్తమును గ్రక్కుట, స్వరభేదము-ఈ ఆఱును రాజయక్ష్మకు ప్రధాన రూపములు. మఱియు భుజము, శిరస్సు, పార్శ్వము, కరపాదములయందును సంతాపము, మంట కలుగుట, సత్వహైన్యము, అగ్నిమాంద్యము, శరీరము కృశించుట, పిట్టూపు, అజీర్ణము, శరీరము బరువుగానుండుట, వమన విరేచనములు ఈ లక్షణములవలన క్షయరోగముయొక్క పూర్ణపరిణామము నెఱుంగఁదగును. ఏపురుషునికి క్షయరోగముతోడ ననేకోపద్రవములు గూడి కాళ్లు, కడుపు, మర్మస్థానములు, ముఖము వీనియందు శోథ (వాపు) కలిగినను, ముఖము కరపాదములు శుష్కించి శరీరము మర్మస్థానము వాచియుండినను, జ్వరాతిసారము ముదిరినను, రోగి యసాధ్యస్థితియం దుండినట్లు గ్రహింపవలయును. అందు ముఖ్యముగా శోష, ఉదరము, మూలవ్యాధి, గ్రహణి, జ్వరము, గుల్మము అను నుపద్రవంబులు గలిగినను, లేక విసూచి, కఫము, అంగహీనత, శూల, శుష్కోదరము, ఊర్ధ్వశ్వాస, నేత్రములు రక్తహీనముగానుండుట, బుద్ధిమాంద్యము, యింద్రియజ్ఞానశూన్యత, ఎక్కిళ్లు, వ్రణములు మొదలగు నుపద్రవములలో నొకదానితోఁగాని యన్నింటితోఁగాని గూడియుండెడి క్షయరోగి నిస్సంశయముగ మరణమును బొందును. ఐనను, "తథాప్యపి ప్రకర్తవ్యా చికిత్సా జీవితావధి" మఱియు "యావత్కంఠ గతాః ప్రాణాః తావత్కుర్యా చ్చికిత్సనం" అను న్యాయములచే నెట్టి యసాధ్యరోగములకైనను కంఠమున నూపిరి యున్నంతవరకు చికిత్స చేయుచునే యుండవలయును. అందు క్షయరోగము మిక్కిలి ఘోరమైనది. అసాధ్యమైనది. కనుక చతురుపాయములచే దీనిని సాధింపవలయును. వ్యాధి చికిత్సను లొంగినట్లు భ్రమింపఁజేయును. రోగి యొకక్షణములో సంతుష్టి నొందును. ఉత్తరక్షణములో బలహీనుఁడై యధైర్యపడును. శరీరబలముతోపాటు మనోబలము తగ్గుచుండును. ఇందువలన క్షయరోగి యనుక్షణము నసంతుష్టి నొందుచుండును, వ్యాధియొక్క పరిణామము దినదినాభివృద్ధి యగుచుండుటచే రోగికి వైద్యునియందును చికిత్సయందును నుపేక్ష కలుగుచుండును. సర్వవిధముల వైద్యుఁడు రోగికి ధైర్యమునుకల్పించి సంతుష్టిపఱచుచుండవలయును. ఈరోగికి మనోబలము శరీరబలము నున్నంతవరకు ప్రాణభయము లేదు. ఇది యొక సాంక్రామికవ్యాధి యనియును, క్రిమిజన్యమైనది యనియును తలంచి, రోగి మంచమును వస్త్రములను ముట్టక బహిష్కరించుటవలన రోగి మిక్కిలి యసహాయుఁడై అధైర్యపడి రోగముయొక్క సంపూర్ణపరిణామావస్థను వచ్చి, శీఘ్రకాలములో నకాలమరణము నొందుచున్నాఁడు. పాశ్చాత్యులీ రోగనివారణోపాయములం గనిపెట్టుటకు విశేష పరిశ్రమచేయుచున్నారు. ఈవిషయములో సర్వసామగ్రీయుతులై చతురుపాయములచే సాధింపఁగల ఆయుర్వేదవేత్తలుకూడ ప్రోత్సహింపఁబడిన మిగుల లాభకరముగా నుండును. అసాధ్యమైన ఈ క్షయరోగమునకు సమగ్రనిదానము, సంపూర్ణచికిత్సాపద్ధతి, చరకసంహిత మొదలగు సద్గ్రంథములలో విపులముగాను, వివరముగాను వర్ణింపఁబడినది. బుద్ధిమంతులగు వైద్యులు ఆయుర్వేదచికిత్సాపద్ధతులను గ్రహించి స్వబుద్ధివైశారద్యముచే ననేకవిధముల నీ యసాధ్యరోగమును నిర్మూలింప సమర్థులుకావచ్చును. ఇట్టి రాజరోగమును చికిత్సింపఁగల సమర్థునకే "రాజవైద్యుఁ" డను బిరుదము తగును. సుఖభోగములు, సుఖాభిలాషలు, సుఖాహారవిహారములు, సుఖసాత్మ్యశయ్యావిలాసములు, సుఖపారవశ్యములు కల్పించి, రోగియొక్క బలాబలము లెఱింగి, యిచ్ఛాపరిపూర్తిచేసి, సుఖానుపానములచేతను, సుఖోపచారములచేతను, సుఖకథాలాపసంబులచేతను, రోగికి శరీరబలమును మనోబలము నొసంగి సంతుష్టిఁ గలుగఁజేసి రాజరోగమును సాధ్యపఱచుకొనఁగలిగిన వైద్యుఁడే "రాజవైద్యుఁ" డగును గాని, రాజాస్థానోద్యోగియగు వైద్యులకు "రాజవైద్య" బిరుదము చెల్లదు.

రాజోపచారములచేఁగాని యుపశాంతింపదు గనుక నీ క్షయ రాజరోగ మనఁబడును. ఈ వ్యాధిని నిర్మూలించుటకు ఔషధ మొకయెత్తు రాజోపచారములు మూఁడు ఎత్తులుగాఁ జూచుకొని చికిత్స ప్రారంభింపవలయును. శరీరజన్యధాతువులు-రస రక్తమాంసశల్యాదులు, ఖనిజధాతువులు-రత్న సువర్ణాదులు. రసాది సప్తధాతువులకు నేకకాలమున బలమునిచ్చునవి రత్నసువర్ణాదులు. ఈ రత్నసువర్ణాదులయొక్క యుపయోగము లాయుర్వేదమున విదితములు. వజ్రాది నవరత్నములు, స్వర్ణాది లోహములు, ప్రత్యేక ప్రత్యేకము మూలికాదులచే ఛేదించి - భస్మీకరింపఁజేయుటవలన సేవ్యము లగుచున్నవి. ఇట్లు భస్మీకరింపఁబడిన రసోపరస ధాతువులు యథాన్యూనాధిక భాగక్రమముగ నోషధీసమ్మేళనమున పరస్పరసమావేశము నొంది యొక్కొక్క యౌషధముగా బ్రసిద్ధ మగుచున్నవి. ఇట్లు చేయఁబడిన కొన్ని ప్రధానౌషధముల వలన యక్ష్మరోగము శాంతించు చున్నది. రసహారస్వర్ణ ధాతుసమ్మేళనమువలన మృగాంకము అను నౌషధములు కల్పింపఁబడినవి. ఇందు కాసహరద్రవ్యంబు లగు శంఖప్రవాళాది భస్మ సమ్మేళనము చేయఁబడినది. కఫమును ద్రవీభూతముగాఁ జేసి జాతరాగ్నిని కప్పిన ఆమాది దోషములను హరించి జీర్ణకోశమునకు శక్తి నిచ్చుటవలన రసాదిధాతుపోషణము జరుగును. అందువలన రసాదిధాతుపోషణము, బలిమి కలుగును. హృదయ బలకారులగు స్వర్ణాదిధాతువులు ప్రాణశక్తి నిచ్చును. ఇట్టి రసోపరస ధాతు సంమిశ్ర రూపము లగు రాజమృగాంకాద్యనేకౌషధములు సేవ్యములైయున్నవి. నీరసమును తగ్గించి సర్వధాతు బలము నిచ్చుటకు ప్రధానములైన వస్తుసమ్మేళనముఁ గల వసంతకుసుమాకరరసము, ఏకోత్తరవృద్ధి లక్ష్మీ విలాస

రసము మొదలగు నౌషధములు రోగనిర్మూలనకరంబులై యున్నవి. రసాదిధాతు శోషణద్రవ్యము లుపయోగించిన వేడిచేసి నీరస మధిక మగును. ప్రత్యేకము నయస్సంబంధములగు నౌషధము లిచ్చుటవలన ప్రయోజన మంతగా కనుపింపదు. కొన్ని పోటలీరసములు, స్వర్ణాభ్రక రస సింధూర సమ్మేళనము, విశేష ప్రయోజనకారిగా నున్నవి. హృదయ దౌర్బల్యమును. మాంసాది ధాతువులయందుగల స్నేహద్రవ్యము వాతాది దోషములచే శోషింపఁబడుటవలన కలిగిన రొంపు (పుండువంటి పచ్చి)ను మాన్పుటకు స్వర్ణాది ధాతుభస్మములు విశేష ప్రయోజనకారిగా నున్నవి. రాజరోగ గతంబగు జీర్ణజ్వరము తగ్గుటకు—బృహన్మాలినీవసంతరసము, స్వర్ణవసంతమాల్య రసము, మహాలక్ష్మీవిలాసరసము, కనకసిందూరరసము, బృహత్సిందూరభూషణ రసము, కనకబాలసూర్యోదయరసము, మొదలగు ననేక సుప్రసిద్ధౌషధములు విశేష ప్రయోజనకారులుగా నున్నవి. కాస తగ్గుటకు లోకనాథరసము, హృదయ దౌర్బల్యము—గుండెదడ—తగ్గుటకు రాజమృగాంకరసము మొదలగు ననేకౌషధ రాజములు యుక్తానుపానములచే ప్రయోగింప నీ రాజరోగము, దాని నుపద్రవములు యుపశమించును. బుద్ధిమంతు లగు రాజవైద్యులు ఔషధముయొక్క విశేషప్రయోజనము గ్రహించి రోగ బలాబల తారతమ్యము లెఱింగి తత్త్వానుగుణ్యముగా నుపయోగించి రోగ నిర్మూలనమునకు గడంగుదురు. వేడిచేయని సన్నితములగు ద్రాక్షాదిరసము లనుపానములుగా నుపయోగింపవలయును. కఫ శోషణద్రవ్యములు (ఆర్చివేయునవి తేనె మొ.); వేడిచేయునవి. (రక్తమును విరుచు లేక శ్లేష్మమును పెంచు) విస్తారము కారము, పులుపు, మొదలగు ననుపానములు, ఆహారములు వర్జింపవలయును. మఱియు, లోపలికిచ్చు నౌషధములతో పాటియగు బలకర మైనవి, రసాది సప్తధాతుపోషణకరము లైనవి, శీఘ్రజీర్ణకారులయినవి సాత్వికాహారములు సేవింపఁ దగును. శ్లేష్మ వృద్ధికరముగాని చమురు పదార్థములు (స్నేహద్రవ్యములు) విశేషముగా నుపయోగింపవలయును. ఆవునేయి, మేకనేయి, సీమబాదముపప్పు మొదలగు స్నేహద్రవ్యములు విశేష ప్రయోజనకారులుగా నున్నవి. కాడ్లివర్ ఆయిల్ కంటె సీమబాదముపప్పుయొక్క రసము విశేష ప్రయోజనకారిగానున్నది. దీని చమురు కాడ్లివర్ ఆయిల్‌కు బదులుగా వాడిన విశేష లాభకారిగా నుండును. పులుపులేని బత్తాయి, నారింజ, సపోటా, ద్రాక్ష, సీమమేడి (అంజూరా) మొదలగు సాత్వికఫలజాతులు తరుచుగా నుపయోగించుచుండవలయును. వంకాయ, తిలతైలము, కాకరకాయ, రస విరోధము లగుశాకములు (ఆకుకూరలు) నిస్సారములగు శాకపదార్థములు, కఫకరంబులగు దుంపకూరలు సంపూర్ణముగా వర్జింపఁ జేయవలయును. ఈ రోగులకు కోపము అను మనోవికారము వినుగువలన, నీ రసమువలన తరుచుగా కలుగును. దానివలన మనోదార్ఢ్యము చెడి హృదయ దౌర్బల్యము కలుగును. కనుక కోప హేతువులు కలుగకుండ చూచుట ముఖ్యపథ్యముగా నున్నది. అనేక కారణముల వలన వాంఛితార్థసిద్ధిలేక అస్థైర్యాదిమనోవృత్తులకు లోనగుటవలన విశ్రాంతిలేక దుఃఖసంకలితుఁ డగునప్పుడు గూడ హృదయదౌర్బల్యము కలిగి ప్రాణశక్తి తగ్గిపోవును. కనుక నిరంతరసంతోషజనకములగు లేక తృప్తికరములగునట్టి పుణ్యకథాలాపనములచేతను, సుగంధపుష్పాలంకారములచేతను, నాట్య గాన పాండిత్య సాహిత్య కవితాగోష్ఠివలనను, మనోవహధమనీనాడులను: ఆనందరసపూర్ణములుగాఁ జేయుచు ప్రాణశక్తిని కాపాడవలయును. మఱియు "శుక్రాయత్తం బలం పుంసాం। మలాయత్తం హి జీవనం। అతోవిశేషా త్సంరక్షే। ద్యక్ష్మిణోమలరేతసీ" సర్వాంగ బలము శుక్రాయత్తమై యున్నది. సకల జీవనము (ఉపాధి = ఆహారాదికము) మలాయత్తమై యున్నది. అనఁగా రసాది సప్తధాతువులలో శుక్రధాతువు సారభూతమైనది. కనుక బలము శుక్రధాతువుపై నాధారపడియున్నది. అనఁగా బల రక్షణమునకు శుక్రమును సంరక్షింపవలయును. అట్లే జీవనము నిమిత్తము మలరక్షణ మావశ్యకము. ఇందువలన క్షయరోగులకు శుక్రక్షయకరములగు లేక శుక్రమును శోషింపఁజేయు పదార్థ చేష్టాదులు, వర్జ్యములు. బలమునకు శుక్ర వృద్ధికరములగు నౌషధములు మనోవహనాడీ పుష్టికొఱకు విలాసచర్యలు కల్పింపఁ బడినప్పుడు శుక్రధాతువు పూరించి స్ఖలనాదిదోషములు కలుగును. అందువలన ధాతునీరసము కలుగును. కనుక సంతృప్తివలన కామవృత్తిని నిరసించి శుక్రధాతువును రక్షింపవలయును. పౌష్టిక ద్రవ్యసేవవలన శుక్రము క్షయించిగాని, బలువ బడిగాని, వృద్ధివలన కలిగిన కామేచ్ఛ తీరనప్పు డుద్రేకించిగాని స్ఖలనమగును. కనుక కామేచ్ఛను నిరసించి చిత్తమును పుణ్యకథాయత్తము చేయవలయును. కామోద్రేకశాంతికొఱకు మాత్రమే "సంవర్శనం మృగదృశామపి" అనుటచేత నిష్టవనితాసందర్శనమాత్రసంతుష్టి కలిగించి శుక్రధాతుసంరక్షణము చేయఁదగినది.

అనఁగా సంయోగమును వర్జించి శుక్రరక్షణముచేసి బలము నభివృద్ధి నొందింపవలయును. ఇట్లే అతిసారాదులవలన మలక్షీణము నందువలన బలక్షీణత కలుగును. మలబద్ధప్రకృతివలన నగ్నిమాంద్యాజీర్ణాదులు గలిగి అన్నద్వేషము దాన బలక్షీణత కలుగును. కనుక మలరక్షణముకూడ ఆవశ్యకమే యగును. ఇట్లు మల శుక్ర రక్షణము వలన జీవ బల రక్షణముచేసి ప్రాణశక్తులను కాపాడవలయును. మఱియు ప్రతిదినము మల మూత్ర శుక్రములు దోషదూషితముకాకుండ చూచుచుండవలయును. బలము నిమిత్తము పాలు, నేయి, మీఁగడ, వెన్న తఱుచుగా సేవించుచుండవలయును. పాలయందు గల పైత్యకఫప్రకృతులు బాధింపకుండ పైత్య కఫ హర ద్రవ్యములతో సంసిద్ధపరచు చుండవలయును. మాంసాహారులు శల్యబలమునిమిత్తము ఎముకల సారము (షేరువా) మాంసబలము నిమిత్తము మాంససారము తఱుచుగా నుపయోగించుచుండవలయును. కోడిగ్రుడ్డుయొక్క తెల్లసొనయు, దానికి నాలుగింతలు పాలును, చిటికెమాత్రము మిరియాల పొడియు, పటికి పంచదారయు చేర్చి బాగుగా కలిపి ఉదయాస్తమయకాలములయందు సేవించుట రోగికి శీఘ్ర బలవృద్ధిసాధకముగా నుండును. మఱియు, గసగసాలు, ద్రాక్షపండ్లు, సీమ బాదముపప్పు, గోధుమగింజలు, యథోచితముగా చేర్చి నీళ్లతో నూరి రసము పిండి యందు పాలుచేర్చి పటికిపంచదార కలిపి క్రమాగ్నిచే వండిన కోవా వలె నగును. ఇయ్యది హృదయమునకు బలమునిచ్చి ప్రాణశక్తి నుజ్జీవింపఁ జేయును. మలరేతస్సులను సంరక్షించును. పైత్యోపశాంతికొఱకు అల్లమును లేక అల్లపుమురబ్బాయైనను, తఱుచు వాడుక చేయవలయును. యవలు, గోధుమలు, పాలు, ఉచితాహారములుగా గ్రహింపవలయును. తాంబూలము, వెల్లుల్లి, యింగువ, పులుపు, కారము, వగరు, చేదుగలపదార్థములు, క్షారపదార్థములు, విషమాశనము, విరుద్ధాన్నము, అత్యాహారము, దొండకాయ, దోసకాయ, విదాహకరద్రవ్యములు, మొదలగునవి యపథ్యములు. ఇవి వర్జ్యములు. హృదయ, నాసికా, శ్రవణ, కంఠ, కరతలాంగుళీ, మణిబంధాది స్థానములయందు రత్న మౌక్తిక స్వర్ణాది ధాతుఖచితాద్యలంకారములు ధరించుట, శుభ్రవస్త్ర పుష్పమాలా సేవనము, శుభ్రమైన గాలిని పీల్చుట, మొదలగు సముచిత క్రియలవలన మనోబలముకలిగి ప్రాణశక్తు లుజ్జీవింపఁ బడును. ధాతుక్షీణదశయందు మనోబలము తగ్గుటవలన జ్ఞానేంద్రియ పంచకము, కర్మేంద్రియపంచకము తత్తదధిష్ఠానశక్తులు మందగించును గనుక యింద్రియ జ్ఞానమును బలపరచుటకు సర్వేంద్రియాహ్లాదజనకములగు నుపచారముల నొసఁగి, మనోబలమును వృద్ధిచేయవలయును. "ఛాగమాంసం, పయశ్ఛాగం, సర్పిః సనాగరం। ఛాగోపసేవా శయనం ఛాగమధ్యేతు యక్ష్మనుత్" మేక మాంసమును సేవించుట, మేకపాలు త్రాగుట, మేకనేయి సేవించుట, శొంఠితోచేర్చి మేక సంబంధమగు సర్వావయవసారములను సేవించుట, మేకలమందమధ్య శయనించుట, నివసించుట మొదలగు ఛాగోపసేవవలన రాజయక్ష్మ యుపశమించును. ఇట్టి ఛాగపరిచర్యవలన విశేష ప్రయోజనము కలుగును. "ఛాగానిమాంస నవనీత పయోఘృతాని" "జాంగల జారసాశ్చ", "గోమహిషీఘృతంచ", "ఛాగాశ్రయశ్చహితదంతకమాత్రలేపః" అని మేకయొక్క సర్వావయవసేవ విశేషప్రధానముగా చెప్పఁబడినది. మఱియు అడవిజంతుమాంసరసములు, ఆవునేయి, గేదనేయి పథ్యముగా నెంచఁబడుచున్నవి. మాంససారములుగాని, తత్తుల్యంబులగు పాలు నేయి మొదలగునవిగాని, బల్యములు వృష్యములు నగు నాహారవిహారములు ముఖ్యసేవ్యములుగాఁ దెలియవలయును. రసశోషణద్రవ్యములగు నల్లమందును, తత్తుల్యములగు కాఫీ కోకో టీ మొదలగు నిషాద్రవ్యములు నిష్ప్రయోజనములగుటయేకాక దుర్గుణకరములగును. కావున అలవాటులేని రోగులకు క్రొత్తగా నలవాటు చేయుట మంచిదికాదు. నీరసములేనప్పుడు గోరువెచ్చనిజలముతో నిత్యము స్నానము చేయించుచుండవలయును. నీరసముగా నున్నప్పుడు శరీరమును వెచ్చని జలములో తడిపి పిడిచిన గుడ్డతో తుడుచుచుండవలయును. కట్టుబట్టలు, ప్రక్కదుప్పట్లు దినమునకు అనేకపర్యాయములు మార్చుచుండవలయును. నిద్రించు స్థలము సుగంధ ధూపవాసితమై మనోహరవిలాససంపన్నమై యుండవలయును. ఆప్తమిత్ర బంధు సమాగమము, శుభవార్తాశ్రవణము మొదలగు సుఖకాలక్షేపము చేయుచుండవలయును. గుండెలయందు తఱుచుగా బాదమునూనె రాచి గాలితగులకుండ గుడ్డలచే కప్పియుంచవలయును. శరీరమునకు చెమటపట్టినప్పుడు ఆ చెమట శరీరమునందే యింకిపోవుట మంచిదికాదు. కనుక వెంటనే తుడిచివేసి సుగంధ కర్పూరాది సువాసితమగు చందనాదుల నాలేపనము చేయవలయును. తాపనివృత్తికొఱకుగాని యుక్కగా నున్నప్పుడుగాని గాలినిమిత్తము నెమలిపింఛముతో చేయబడిన పంచె లేక, విసనకఱ్ఱతో విసరుకొనుట మంచిది. ఇట్టి వివిధోపచారములచేత నీ రోగరాజమగు రాజరోగము సాధ్యమగును.



ఆంధ్రకళాపరిషత్తు ప్రోఛాన్సలర్ శ్రీ బొబ్బిలిరాజావారు



మదరాసు కార్పొరేషన్ సభాపతి రా||బ|| పి. టి. కుమారస్వామి శెట్టి గారు



శ్రీ రాజా విక్రమదేవవర్మ
మహారాజావారు
జయపుర సంస్థానాధీశ్వరులు



చెన్నరాష్ట్ర శాసనసభాధిపతి గా|| బి. రామచంద్రా రెడ్డి గారు



ఆంధ్రకళాపరిషత్తు వైసుఛాన్సలరు సర్. యస్. రాధాకృష్ణన్ గారు



జయసింగ్ లాల్ కే. మెహతాగారు



శివపురము జమీందారు పి. వి. మానిక్క్యంనాయకరు
బి. ఏ. గారి పుత్రికామణులు



పి. గోపాలస్వామినాయుడుగారు



ఆంధ్రవిశారద తాపీ ధర్మారావుగారు బి. ఏ.



శ్రీ పానగల్లు రాజా పార్థసారథిరాయణింగారు



వేణునాథ జోన్ గారు, ఎఫ్.సి.ఇ., ఎం.ఆర్.ఏ.ఎస్.



ఎస్. ఎన్. మాడియప్పగారు



దీ॥ శే॥ పాలేటి మునుస్వామినాయుడుగారు

# భాగస్వాములు

చిఱుమామిళ్ల విజయపార్థసారథి గారు

క్రొత్త పాలెము అన్నివిధముల
ఉత్తమంబగు గ్రామ మందురు ;
భూమి నమ్మక బ్రదుకువా రా
ప్రోలి సంసారుల్.

కల్లకాదులు లేని నడవడి
కాయకష్టపు జీవితములన్
పాడిపంటలకల్మి ఎప్పుడు
పరగు న వ్వీటన్.

ఋజమార్గవర్తన కల్గియుండియు
ఋణపణంబులు లేకయుండియు
గుట్టుమట్టు కుటుంబపోషణ
క్రొత్తపాలెపు సొమ్మెగా.

ఆయూర కల్యాణంపువా
రాయూరిపెద్దలు. మంచికులజులు
కడువకట్టను నాడు నేడును
కొదువలే దెందున్.

పెద్దవారల మన్ననలతో
పిన్నవారల మెచ్చుకోలుతో
ఆ యింటిబిడ్డడు రాముడను ప్రా
యంపువా డుండెన్.

కండతేరిన కాయపుష్టియు
కరుణాలవాలము భావసంపద
కల్గియొప్పెడి రామువోలెడి
కమ్మబిడ్డడు లేడుగా.

గుణముమంచిది కులముమంచిది
కోడెవారుల చిన్నపడుచే
ఈడుజోడుగ నుండు రాముని
కెల్ల విషయములన్.

సుషమాకపేశల సన్నిభాంగము
సుమనోజ్ఞ సురుచిరవర్తనము
సుచరిత్ర సీతకు సాటివచ్చెడి
సుదతి లే దెందున్.

అతని నమ్రత కుశలతలకును
ఆమెరూపసుశీలములకును
లేరు పాలెములోను మెచ్చని
వారు ఒక్కరైనన్.

బీటనెద్దుల మేపరాగనె
పిట్టకావలి చేయవచ్చెడి
సీతమ్మ రాముఋ తోడునీడగ
చెలగు చుండెదరు.

చిత్రచిత్రపు కథలనెన్నో
చెప్పుచుండగ కమ్మబిడ్డడు
ఊఁ కొట్టుచును చెలి వినుచునుండును
ఊట లూరుచును.

మంచిపాటను పాడుమన్నా
మనసురంజిల ననెడిరాముని
మాటద్రోయక చెలియ పాడును
మంజుగాత్రమునన్.

రాళ్లు కరగెడి శ్రావ్యగానము
రసముచిప్పిలు మధురభావము
వినుచునుండెడి ప్రకృతియంతయు
వెల్లపోవునుగా.

దినములెన్నో గడచె నిట్లుగ
తెలియకయె—కోమలి కోడెకాడును
కలసిమెలసి మెలంగ ననురా
గంబు ధృడపడియెన్.

కాడిగట్టు పొలాలచెల్మియె
కారణంబుగ, రామన్న సీతకు
ఉద్వాహమెసగెను నిండువేడుక
ఊరు మెచ్చంగన్.

కాడిగిత్తలు పాడిఆవును
కోడె వెంకయ అరణమొసగెను
అత్తవారింటికిని కూతును
అంపకపు వేళన్.

రచ్చబండల ఇచ్చకంబుల
బుచ్చపోవడు రాముడెన్నడు
పొరుగింట్లసీతకు జాడనరయదు
ప్రొద్దుపుచ్చంగన్.

కోడికూయగ లేచి ఎద్దుల
కొట్టమందలి మేతచూచియు
గాబులన్నిట నీళ్ళనింపియు-చద్దితిను
కడుపారగన్.

నీరుకావి మడుంగుకట్టియు
నెత్తిపై తలపాగ జుట్టియు
చేలపగ్గము, చుట్ట రాఁడిన కిల్లు,
చెప్పుతో వెడలుగా.

తూర్పురేఖలు తోచ ముందే
తోడివారితో కాడిగట్టియు
తోటకును నీర్వాట్టరాముడు
మోట తోలుచును.

పాచి చిమ్మియు, చిలికి మజ్జిగ
పాడిపశువుల పాలుపిదుకగ
వంటచేసియు ముసలివారికి
వడ్డించి తాను తినున్.

అత్తమామల నాదరించుచు
బీదసాదకు పెట్టిపోయుచు
అమ్మలక్కల యిష్టమును
ఆర్జించె సీతమ్మ.

‘చిట్టిబాబు’ ను తోట్టెనుండగ
చిచ్చికొట్టుచు జోలపాటల
అత్తమామకు జెప్పివెళ్లును
అబ్బాయి భద్రమని.

కాళ్లకడియాల్ గజ్జె లందెలు
ఘల్లుఘల్లని మ్రోయుచుండగ
బొద్దు కొదవలిపెట్టి వడిసెల
బుజాన్నవ్రేలాడన్.

చేనిలోపలి పిట్టకావలి
చేయుటకు సీతమ్మ వెళ్లుచు
పెరుగుముంతను బువ్వదుత్తను
ప్రియునకై దెచ్చున్.

మధ్యాహ్న వేళల వేపనీడల
మగువ ముచ్చట చెప్పుచుండగ
పూరి యెద్దులు మేటమేయగ భర్త
భుజియించున్.

మబ్బుపడకల, గువ్వకూతల
మర్మముల నొకరొకరు దెల్పుచు
వానరాకకు నెదురుచూతురు, స
కినమయ్యేనని.

చుట్టు జుంజురుపాగల మబ్బుల
నుదతి శీతలవారివాక్కుల
నేదదీరి, స్వధర్మమాతడు
చేయమొదలిడు క్రమ్మరన్.

పోరు రెడ్డి పాలే లటంచును
పాలతిపాటలు పాడుచుండగ
తూర్పారపట్టును కల్లమం
దుత్సాహ భరితుండై.

సెనగకాయలు, ఊచబియ్యము, మొక్క
జొన్న కండెలను కల్లములందు
చిలుతిండ్లొసగి ప్రియునకు
సీత తినుచుండున్.

కోటుపోయిన చేలలోపల
పాటుచేయుచు ఎరువు తోలుచు
భార్యయే పాలేరుకాగను
పాటు పడుచుండున్.

చెమటచిత్తడి చీదరింపగ
చేడియను బడలికలు వాపగ
చెక్కుళుల చేలములో తుడిచియు
చెలిని ముద్దాడున్.

అదనులోపల నాటుపెట్టును
అదనులోనే అమ్మ చూపును
శిస్తుదస్తును అదనులోనే
చెల్లువేయుచు నుండుగా.

ప్రొద్దుగ్రుంకిన గడియలోపల
పొలములో పనిపాట తీర్చుక
జామమోపులో నింటికేగును
జాయ వెంటాడన్.

గువ్వపిట్టలు చేరుచున్నవి
గూటి కని తమ పరుస లాడగ
పీతసిగ్గుతో తలనువంచియు
చేరు నాథుని చాటున్.

గడపముంగిట నాడుకొను
గారాల కూచిని ఎత్తి జబ్బన
చూరముద్దులు గొండ్రు ఇలం
చేరంగ తత్షణమే.

తల్లికౌగిటనున్న పట్టిడు
తట్టిపిల్వగ చిట్టిచేతులు
తోసినవ్వుల వెళ్లబోసెడి
పుత్త్ర నందుకొనున్.

పుత్రోపగూహన సమయమున ఉ
ప్పొంగు సంతోషంపు మైకము
పులకాంకితులుగను చేసి నిల్పె ఆ
పుణ్య దంపతులన్.

వెచ్చనీటిని జలకమాడగ
వేడిబువ్వల నారగించియు
విశ్రమింతురు చలువవెన్నెల, న
విచార మానసులై.

అయ్యతెల్పెడి పూర్వకథలను
అమ్మ వేసెడి పొడుపుకతలను
వినుచు విప్పుచు కొడుకు కోడలు
వింత పడుదురుగా.

మధ్యనుండిన పొన్నుపై ప్రే
మాయాసము ముచ్చటల వినెదరు
అత్తతా తను ముద్దుమాట
లవ్యక్త మార్గమునన్.

చెల్మికల్మియు కల్గుజీవాల్
చింతచీకులు లేని ప్రాణాల్
గుఱ్ఱుకొట్టుచు నిద్రపోదురు
గొఱ్ఱుకొయ్యల వేళకున్.

చిరుగంట మువ్వలు సందడింపగ
చెంగనాల్ యిల త్రొక్కుచుండెడి
వెన్నముద్దలబోలు కోడెల
పిండు రాముని భాగ్యముల్.

వెంట్రుకల త్రాడులను గట్టుచు
పేరుపేరులో బిల్చి దూడల - సీత
ముచ్చటతోడ దువ్వుచు
మురువు పీర్చుకొనున్.

కొక్కులూరుచు కూర్మినింపును
కుదురు నదరును కల్గియుండిన
గుల్లపాదుగుల కుచ్చుతోకల
గోవుమాణిక్యములపై.

రాజు ఎవడో రెడ్డి ఎవడో
రామునకు సుంతైన పట్టదు
సీతతోడుత పొలపుపనులన్
చేయుటే తప్పన్.

ఈను ఏకోశమున ఉండదు
ఎదటిక్షేమమె కోరు రాముడు
ఉన్నదానిలో పెట్టుపోతను
నున్నచుట్టుట లేదుగా.

పల్లెయే సర్వప్రపంచము
పంటపొలమే పసిమిమూటగ
ప్రియురాలె రతనాల్బొమ్మగా
పెంపెసగు రామన్న.

ఒకరిమెప్పును నొకరుబడయుచు
ఒకరిసౌఖ్యము నొకరుగోరుచు
ఇద్దరొక్కటై ఏకమొందెడి
జోటి కీడెవరు.

చిన్నతనమున తల్లిదండ్రులు
పేరులుంచెడి వేళలందున
భావి సీతారామసౌఖ్యపు
జీవిలెమ్మెటు లరసిరో.



# గానము

కాశీభట్ట కృష్ణరాయ శాస్త్రి గారు

"గానమువంటి విద్య మఱి గానము గానము గాన మెందునున్"

శ్రీమదఖండప్రపంచసంచితవిద్యాపతిఁ బ్రశంసింపఁగఁదగుటయు నొక పుణ్యఫలంబె యని తలంచుచు నాంధ్రవాణీముఖంబున నీ వ్యాసము వ్రాసి మదభిప్రాయమును బ్రకటింపఁదలఁచితిని. చిరకాలంబునుండి "వ్రతానాముత్తమం వ్రతం" అను నుత్తమవాదిసాంప్రదాయ మాసేతుహిమాలయపర్యంతము వ్యాప్తమైయుండఁ దత్పరిస్థితివశమున నేనును భారతీయుఁడనగుట నట్లె యుత్తమత్వమును స్థాపింపుననుటలో సంశయము లేకున్నను విమర్శకవ్యాసమగుట ననేక కారణసముద్ధృతం బగునని చెప్పఁ దగును.

సంగీతమును జర్చింతునన్న దుస్సాధ విషయమే. మఱియు నాదప్రధాన విద్య యగుటచేఁ గష్టమనుటను సంశయ ముండదు. ఇఁక నట్టి కష్టవిషయమును విమర్శింపఁగఁదగునన్ను నతింతురని యెంచితినా? కాక యుపక్రమపథకనిర్వహణమా? కాదు. మానవత్వము నొంది వివేకము కొంచెముగనో గొప్పగనో కలుగ నూరక యుండుట కష్టమని తోఁచుటచేఁ జేతనైనంతదనుక విషయవిమర్శము చేయుదును. ఈ వ్యాసమున నాదము తత్సుఖగతి తన్నామము మున్నగువిషయములు మాత్రమే చర్చింతును. కాని రాగములు, తాళములు, మొదలగు విషయములు విమర్శింపను. అవి యనావశ్యకము లగును.

## నాదము

నాదము విషయమున భౌతికశాస్త్ర (Physics) చర్చ గావించి యనువాద కుఁడనుగాను. అయినను సమగ్రతకొఱకుఁ గొంత వ్రాసెదను. ప్రతివిషయత్తుమాపణము కాలహరణము. నాదము "ఆకాశ" జనితము. ఎద్దాని సంయోగము లేక యాకాశమున స్వభావసిద్ధమై నాదము గుణి గుణ భావమున నున్నది. మహాభూతములలో నీ యాకాశభూతము మన యాధ్యాత్మికులకు ముఖ్యము. వాయ్వాది భూతములవలె సంకరగుణము గలుగనిది యాకాశము. భూతసంఖ్యాసంశయమున్న నుండుఁగాక మాకదియ ప్రకృతము. అయినను మూఁడు భూతములే యనువారును, రెండే యనువారును, ఒక్కఁడే భూత మనువారును గలరనియుఁ దెల్పవారైన నాకాశభూతమున కంతరాయము గల్పింపలేరని యందును. ఆకాశాభావమున వృద్ధిక్షయములు లేవు. ప్రత్యక్షవిరుద్ధముగఁ జెప్ప నమ్మట సంభవింపదు. భూతసంఖ్యావాదము నావంటివానిదనుక వచ్చునపుడు చూతునుగాక. ఆకాశభూతమున నేరికిని సంశయ ముంచుకొనఁ దగదు. అట్టి యాకాశభూత మాదిత్వమునం దదితరభూతోత్తమమును, దదితరభూతలయకారకమును నగునని చెప్పవచ్చును. ఆకసమునుండియె యన్నియుఁ బుట్టుచు గిట్టుచు నున్నవి యనవచ్చును. ఇఁక నాకాశగుణము నాద మని యెఱిఁగియే యున్నాము. దానిగుణము నాద మగునా కాదా? యని చిక్కుఁ బడఁ దగదు. పూర్వసూరి సమ్యగుపదిష్ట మైనది. ఏగుణ మెందు లయించునో యది యాగుణమునకు మాతృక యని శాస్త్రము. జన్మస్థితిలయములలో నేదియైనఁ బరీక్ష చేయ నిస్సంశయ మగును. ఒకచో విద్యుత్సహాయఘంటానాదమును బుట్టించి యేదినైన మూఁత యుంపుఁడు. ధ్వని వినఁబడును. ఆ మూఁతసఁ గొలఁది ప్రమాణమున నింకొక మూఁత యుంపుఁడు. నాదము నిర్గమించు చుండును. రెండు మూఁతలకు మధ్యమున నుండుతావును శూన్యాకాశము సేయుఁడు, ధ్వనివినఁబడదు. కారణ మేమి? కేవలాకాశమున నాధ్వని లయించెను. కావున నాకాశము నాదవంతమే యగును. అట్టినాదము తత్తదాశ్రయసంగతిని మాఱును. తత్తద్భూతముల ననుసరించి యుదకము రసభేదము నొందదా? అట్లె యాశ్రయసంసర్గమున నాదము గతిభేదము నొందును. ఈయాశ్రితనాదమునకే గానము, సంగీతము, భాష, మున్నగు నామముల నుంచితిమి. త్రివృత్కరణ కల్పితులమైన మనము కేవల భూతగుణదృష్టి బిలుక ననమర్థులము. కాన నానాశ్రయనాదమును జర్చింపఁదగును. అట్లైనను శాస్త్రవాదమును విడుతుమా? కూడదు. ఆకాశనిర్గతనాదనిర్గమనరీతియే శ్రుతికిఁ జేయాపేయమై యొప్పును. నాదగమనరీతిసంభూతియే గానము. ఇదియే మన కిప్పుడు విచార్యవిషయము. విషయప్రవేశమునకు మున్న విషయపరిచితి యావశ్యకము కదా? నాదగతికిఁ బదార్థము (భౌతికము) ముఖ్యము. అట్టి పదార్థములు మూఁడు విధములు. వాయువుకంటె ద్రవపదార్థము ధ్వనిహరణము నెక్కువగఁ జేయును. వాయువునం దాకాశాంశ మెక్కుడుదక్క మఱేమియు లేదు. కాన వాయ్వితర భూతములకంటె వాయు వసమర్థ మగును. ద్రవముకంటె ఘనము సమర్థమైనది. ఎందు భూతబాహుళ్యముండునో యది ధ్వనివహనమున సమర్థమైయుండును. అదియు దర్కనిర్ధారితం బయ్యెను. నాదగమనరీతి యెట్లుండును? కంపన మని విద్వాంసులు నిర్వచించిరి. ఆ కంపనమునకు వైబ్రేషన్ (Vibration) అని యాంగ్లు లనిరి. వాయు ప్రేషణగతి యని నేను నాడుదును. వాయూల్బణతఁ దరంగజన్మము గల్గును. ఆ తరంగాయితకంపనమునకు వాయుప్రేషణగతి యనుట బాగేమో? "మారుత స్తారసి చరన్మంద్రం జనయతి స్వరం" అను శిక్షోక్తి ననయ వాయుప్రేషణశబ్దము యుక్త మని భావించితిని. వాయుప్రేషణగత్యుపయోగము కారణబద్ధమైయున్నది. దీని గతిభేదముల స్వనమితి యను యంత్రసహాయమునఁ గనుఁగొనవచ్చును. ఇట ననావశ్యకము.

"జాతః ప్రాణాగ్నిసంయోగా త్తేన నాదోఽభిధీయతే"

అను నీ నాదజన్మకథన మాంగ్లాద్యవిరుద్ధ మగును. ప్రాణాగ్నులను జెప్పుటయే యాంగ్లులకంటె సంగ్రహముగ నున్నది. ప్రాణ (వాయువు) మగ్ని (రూపసంబంధము) అగును. కావున (Sound requires medium) అను నాంగ్లనిర్వచనముకంటె నాద్యులనినదియే బాగున్నది. "ఈథరు" అనునది శూన్యాకాశమున నుండవచ్చును గాని యా "యీథరు" మూలమున ధ్వని శ్రుతిగోచరము కాదు. కావున మన సంస్కృత నిర్వచనము బాగున్నది. "నాదాధీనమతో జగత్" అని సతివాక్యము విధిగ నన్వయించుకొనవచ్చును. ఈ నాదమును మన యార్యులు బ్రహ్మమే యనిరి. నాదబ్రహ్మ మని యనుట కలదు. కాని యది యోంకారమునకే యన్వయ మని యూహము. ఓంకారప్రభవమే సమస్తనాదము. బహునాదము లీ యోంకారమున నవీనంబగును. అట్టి నాదము రెండువిధము లయియున్నది.

"ఆహతో నాహతశ్చేతి ద్వేధా నాదో నిగద్యతే
తత్రచానాహతం నాద మేకాగ్రన్యస్తమానసాః"

ఆహతనాద మనియు ననాహతనాద మనియుఁ దెలిసితిమి, ఇఁక ననాహత నాదము వాచంయమోపాస్యము కావున విమర్శింప నక్కఱలేదు. ఆహతనాదమే మనకు విమర్శ్య మగును. ఈవ్యాసమున నిఁక వచ్చు నాదశబ్ద మాహతనాదపర్యాయముగ నర్థముచేసికొనుఁడు, ఈ నాదగతి కాలవ్యవస్థల ప్రకృతములు. నా "యాక్షరికోపన్యాస" గ్రంథమున నాదచర్చ కొంచెము గావించితిని. దాని నరయుఁడు. క్రమధ్వని యనునదియే శ్రుతి అని కలదు.

"ప్రథమశ్రవణాచ్ఛబ్దః శ్రూయతే హ్రస్వమాత్రకః
సాశ్రుతిస్సంపరిజ్ఞేయా స్వరావయవలక్షణా"

శ్రవణేంద్రియ ప్రథమగృహీతధ్వని శ్రుతి యనియు నున్నది. ఈ శ్రుతియే నాదమా? నాదమన్నను శ్రుతియన్నను సమానమా? అను ప్రశ్నముల వైతము. పరిభాష కుదురవలయును. ఏ నాదమునుండి స్వరోదయము కలుగునో యా నాదము శ్రుతి. దూదిసంచుల మోదిన ధ్వనించును. నాదమగును గాని శ్రుతి కానేరదు. ఇట్లే మిగిలినవి. నాదగతి యథాప్రకారమున నున్నధ్వనియే యగును. ఆద్యణువుదగ్గఱ నుండి యంతాణువుదనుక యడ్డంకిలేకయుండిన ధ్వనియే యగును. ప్రకృతి సిద్ధము

లయిన ధ్వనులు గొన్ని శ్రుతిపేయములుగ లేవా? ఇఁకఁ గర్కశనాద మేది యని విచారించి పిమ్మట శ్రావ్యనాదమును గనుగొందము. ఆంగ్లేయులు "గాలిలోఁ బుట్టి యకస్మాత్తుగఁ గ్రమహీనముగ నుండు కంపనములధ్వని, కర్కశధ్వని యని" యనిరి. "అకస్మాత్తుగ" అనుట యేమియో యెఱుంగవలయును. తెలిసి పుట్టిన యెట్టి ధ్వనియుఁ గర్కశము కాదనియా కాక యకస్మాత్తుగ నన నర్థమేమి? నాదగమన కాలక్షేపమా? వీని నాంగ్లులే నిర్ణయింపఁదగును. నా వాద మదియుఁడు.

## కర్కశనాదము

ఈ కర్కశతకుఁ జిన్న సూత్రము చెప్పఁదగును. ఏధ్వని శ్రుతిసహముకాదో యది కర్కశత కాని ఈమాత్రమునఁ బరితుష్టి లేదు. శ్రవణేంద్రియసామగ్రీనిర్భేదక ధ్వని యనియా? అట్లగుచోఁ బిడుగులు శ్రుతివిసహ్యములు. అవియుఁ దెలియఁబడి ధ్వనితములగుచో సహ్యములు కావచ్చును. ఉఱుమనియు పిడుగనియు నందుము కదా? కర్ణసామగ్రీభావమున నేవి విసహ్యములో యవి కర్కశనాదములు. సామగ్రీస్థిత్యవినాశకధ్వని విసహ్య మెట్లగును? అని తర్కింపవలసివచ్చును. విసహ్యబోధము శ్రవణసామగ్ర్యభావమున లేదు కావునఁ గర్ణదుంధుభినిర్భేదకనాదమే కాక సామగ్రీభావధ్వనితధ్వానమును గర్కశము గావచ్చు నని తేలును. అట్లైన నెట్టివి కర్కశములు? క్రమహీనములు కర్కశములు. ఒక్కసారి "సంగీతము, రోదనము, హేష, గర్జనము, కేక మున్నగు ధ్వనులు వినఁబడినచోఁ గర్కశము లందమా? అట్లే పెక్కుసారులు వినఁబడుచువచ్చినఁ గర్కశత పోవునా? కాకులు కావుకావు మని కూయఁగఁ బ్రథమక్షణమునఁ గర్కశముగ నున్నను ద్వితీయ తృతీయాద్యుత్తరక్షణముల నాధ్వనియే విన నింపగును. తిరుగలి విసరునప్పుడు ప్రారంభమునఁ గర్కశముగ నుండి కాలక్రమమునఁ గమనీయ మగును. తిరుగలిధ్వని వినుచు హాయిగ నిదురించువా రెందఱో గలరు. నిద్రకుఁ గారణమైన యా తిరుగలి చప్పుడు నిద్రాపూర్వమునఁ గాక నిద్రామధ్యమునఁ గలిగిన సుఖభంగ మగును. ఇట్లే పొగబండిలో నుండువారును సహింతురు. ఇఁకఁ గర్కశత శ్రవణేంద్రియ ప్రథనుగృహీతధ్వని యని యందు మేని శ్రుతినిర్వచనమున కపవాదము సంభవించును. నిరుద్ధవేగవిరతధ్వనియుఁ దత్తుల్యమును గర్కశనాద మని యాంగ్లసూత్రమున కుప సంఖ్యాతము గావలయును. మనోహరవాదనవస్తువులగు వీణ, తంబుర, హార్మనీ మున్నగునవియు నొక్కక్షణములోధ్వనించి విరతమైనచోఁ గర్కశత యగును. సక్రమవాయుప్రేషణములు గలనాదము శ్రావ్యముగ నుండు ననుటకు సంశయము లేదు. కాని యిట శ్రోత్రనిర్మాణమును విమర్శించినచోఁ గర్కశత విస్పష్టమగు నేమోకాని విస్తరశంక విరమింతును. అయినను గర్కశతలోఁ గొందఱు భ్రాంతి పొందుదురు. ఖరస్వరమునఁ గటుత యున్నది యని యందురు. క్షణిక మగుడు ఖరతయేకాని సాతత్యమగుచో మృదుతఁ జెందును. "వ్రాయ వ్రాయఁ గరణము, (ఊఁ ధ్వని ఇత్యాదులు) తీయఁ దీయఁ (కూయఁ గూయఁ గేదము) రాగము" అను నానుడియు నాదకర్కశతానిర్వచనప్రయుక్తమె. క్షణికములగు కోకిల రుతములు, కేకలు, శ్రావ్యములుగా లేవా? అని ప్రశ్నింతమన్నను క్షణికత్వ మందు నన్వయింప దని ప్రత్యుత్తర మిత్తును. స్వనమితి నది స్పష్టమగును. అయినను, పంచమస్వర, షడ్జమ స్వర, సామ్య మెట్లు గల్గునో యోజింపఁ దెల్లమగును. అంతియకాక యందంతరము భగవన్నిర్మితమై తత్తత్ స్వరములఁ బుట్టించును. అనిరుద్ధవేగమున నా యణుకంపనము గొనసాగును. కావున శ్రావ్యమగును. శ్రావ్యమునకుఁ గొన్ని నియమములు గలవు. వానిఁ బ్రత్యేకముగ వ్రాయుదును. కర్కశనాద మిదమిత్థమని నిర్ణయించుట సులభ కార్యము గాదు. యథాప్రకృతిధ్వనితధ్వానములఁ గర్కశత లేదనియే చెప్పవలయునా? ప్రకృతి నిత్యము లలితనాద స్వరూపిణియై గానలోలునిపార్శ్వమున గానము సేయదా? ఆ గానమునకు భగవంతుఁడు సంతసించు చుండెను గదా? కానిచోఁ ప్రకృతిచక్రప్రవృత్తికి భంగమే యగును. ఇఁకఁ గాళరాత్రియే కల్పాంతమే. తా నొక్కండె యోగనిద్రాముద్రనుండి యనాహతనాదలోలతఁ జొక్కవలసినదే యగును. భారతికి వైధవ్యమే రూపనాశమే సర్వనాశమే యగును. యథాప్రకృతి ధ్వనితధ్వానము శ్రావ్యము. నవ్యము కర్కశము నని యందు మేని నిర్ఘాతపాతధ్వని శ్రావ్య మనవలసివచ్చునేమో? రాదు. ఆధ్వని ప్రకృతిసహమై యుండునా? ఉండినచో నిత్యగానమునఁ జేర్చునా? లేదే మఱిదేమి? వీణాతంత్రీభంగధ్వని వైణికున కెట్లు విసహ్యమో? ప్రకృతిహస్తగతవీణాతంత్రీపాటితధ్వని అట్టి ప్రకృతికి విసహ్యము. ప్రకృతినిత్యగీతములలోఁ గర్కశత లేదు. గీతాభంగము సాతత్యముగామిఁ దాత్కాలిక మగుటను గర్కశత యుండవచ్చును. ప్రకృతివిరుద్ధకల్పిత ధ్వనులు శ్రావ్యములు గావని సూత్రింపవలసివచ్చునేని సంగీతము శ్రావ్యము గాదని యనవలసివచ్చును. అట్లన నక్కఱలేదు. ప్రకృతి గుణాంతరాధాయక మనునది యొక కర్ణమును గౌశలమును నైయున్నది. కావున బంగారమునుండి గావించిన కుండలాదులు కౌశలము లగుచున్నవి. మఱియుఁ బ్రకృతిసిద్ధ మగుదానియందు దైవ భావము సంపూర్ణసామర్థ్యము విశదమై కౌశలము విస్మయజనకము గాదు. స్వభావము, విధికృత్యము, ప్రకృతివిరుద్ధము లని యనరాదు. ప్రకృతిసహాయాభివృద్ధి యనవలయును. ప్రకృతిరహస్యములను రహస్యస్థితిన బహిరంగపఱచుటయు, కౌశలము. నీ రహస్యనిఖిలప్రకృతిఁ బ్రకృతిముఖమునఁ బ్రదర్శించుచుఁ బ్రకృతి హాసద్యుతులలోఁ దేలియాడుటయే కళాకళానందములు. ప్రకృతి యెప్పుడును స్వబుద్ధిలోఁ బ్రత్యక్షము గాదు. అట్లు ప్రత్యక్షము గాకపోవుటయే భౌతికశాస్త్రమునఁ గళలను మన మానందింపఁగలిగి పేరొందుట యగుచున్నది. కావున నాద కార్కశ్యము కృతకధ్వనులలోఁ గలభేదమునుఁబట్టి యుండునని చెప్పిన బాగుండును. అయినను శ్రావ్యనాద మిదియని గ్రహింతు మేని దానియంతట నదియే కార్కశ్యము తెలియఁబడును. శ్రావ్యతయు విమర్శింతము.

## శ్రావ్యనాదము

నాదము శ్రావ్యముగ నున్నదనియుఁ జెప్పుటకుఁ దగినదియుఁ గర్ణమే. అయినను గర్ణము మనస్సును వదలి తనపని తాఁ జేసికొనుచు నహైకమత్యస్థితి నుండలేదు. కావున విమర్శింపఁ దగునవకాశము గల్గెను. యథాప్రకృతి ధ్వనితధ్వానమునఁ గమనీయత యున్నదని మున్ను విశదపడియున్నను దలఁచి తీయఁదగు నంశము లున్నవి. నాదముఖమున రసఝరి ప్రవహించును. ఆ రసమునుబట్టియు శ్రావ్యత యుండును. అదియుఁ బిపాసువు నభిప్రాయము ననుసరించియునుండును. కాముకుఁ డొక కాంతఁ దలఁచి యాపెయెడల ననన్యానురాగబద్ధుఁడై యుండునప్పు డామె క్రోధారుణిత లోచనయై కసరి యదిమి కారులుగూసినను జారుతరావ్యక్తమధురనిస్వనగుళికలనుగా భావించి చొక్కును గాని సూత్రకారులు దానికి శ్రావ్యత నీయరు. రోగికిఁ గలకండ చేఁదుగనుండుట నరసి గుణపాతములో భేదము గల్పింపఁడు. సుహైకానందితానందము గుణానుకూలప్రతికూలలక్షణముగాని యానందము కాదు. సామాన్యమున నన్వయమగునట్లు సూత్రింపవలయును. స్వభావమని బోధించు ధ్వని యెట్టిదియైనను శ్రావ్యముగ నుండును. అరణ్యారావమున శ్రావ్యత గలదా? అను విషయమును విమర్శింతము. అనేకనాదసన్నిపాతమోంకారభూతము కాన శ్రావ్య మనఁదగును. సింహగర్జనము, శార్దూలఘుర్ఘురధ్వానములు, కరిఘటల ఘీంకారములు నింకను క్రూరజంతువుల యారావములు శ్రావ్యములా? సాతత్యమున్న విషయ సంసర్గకాలబలమున నభ్యస్తమై శ్రావ్య మగునేమో కాని ప్రాణరక్షణార్థకృతధ్వనులగుడు నుపద్రవనివారకోపాయాయితనినాదము లగుడుఁ గఠినత వహింపవలయును. కాకున్న రక్షితములు గావు. క్రోధరసము పరిప్లుతమైయుండఁ గర్కశ నాదమే యగును. రసానుస్యూతమై యొసంగుననియుఁ జెప్పవలయును. క్రోధభావ ద్యోతకము గాకున్న భావసుందరుసు భవ్యమయి పొడఁగట్టును. శిలబాధ నొర్వమి నవీపరిసరముల నాహారార్థమై యరుగుదెంచి యతిదీనముగ నక్కలు గూయ నాకూఁతల రోఁత యగపడునందుమా? కన్పట్టదని యందును. కరుణరసమునఁ గటుత యెట్లు? రసప్రసంగమున నించుక వాక్రుత్తును. రస మతివేలమై యనుభావ్యమై యొప్పినతఱి జనితములగు నింద్రియవికారము లెట్టివియైనను శుభావహములే. క్రోధ ముత్కటమై బుద్ధి శమించి ధ్వనితమైన ధ్వానమున మన స్త్రపేక్షఁ దలికరుణరసమును గ్రహించును. బుద్ధి లోపసంభవస్వభావని వేదనమునఁ గరుణించి శ్రావ్యతఁ గొనును. కావునసే "కరుణ ఏవ రసః" అని భావభూతమై యున్నది. శుభారావమే, శృంగారరసమైన నత్యుత్కటమగుడుఁ గరుణరసంబె యగును. "అతివా నీ వదనారవింద మొకమా టాలోకించినం జాలుఁ బురుషాయుష జీవినై మనుదును." శృంగారమే కాని కరుణ పోషితమయ్యెను. ఇట్లే యూహింప దగినవి. నవరసములును మితములైనఁ బార్థక్యమొందును. అమితములైన నైక్యమై కరుణకుఁ జేరును. కరుణరసమైనను బ్రభూతమగుచుఁ బూర్వసూత్రతకరుణ విలక్షణకరుణరసంబై యుండును. రసదర్శియే రసవిభజనము చేయును. కాని రసానందుఁడు చేయఁడు. రసజ్ఞరసానందస్థానముల రసమీమాంసఁ గావింపఁ గష్టతమము. శృంగారరసమును బ్రవహించువ్యక్తి రసానందుఁడు. వానిస్థానమునుండి యా రసమునకు "రస" మనియే పేరిడవలయును. నామకరణమే యసంభవమగును గాని వ్యవహారమునకై దాని "రస" మనియే పిలువవలయును. ఇతరస్థానమున విభాగింపవచ్చును. ఇట నంతమాత్రము చాలు. రసేతరస్థితి యథాప్రకృతిధ్వనితధ్వానముల శ్రావ్యత యున్నదని యెంచవలయును. కాని యా శ్రావ్యత సంగ్రహించుకొని యథేచ్ఛముగ ననుభవింపఁదలఁచుచోఁ గృతకధ్వనుల నిర్మింపవలయును. అనుకరింపవలయును. కటుతామృదుతలు విషయపరిచితి ననుసరించి యుండు

ననియుం దెలిసితిమి. శ్రావ్యధ్వని సంగ్రహమునకుం బూర్వము విషయపరిచయము నావశ్యకము. ఇది శ్రావ్యమని తెలిసినపిమ్మట సంగ్రహింపవచ్చును.

## విషయపరిచితి

ఏమండీ, ఏమ్రే, క్యారే అను శబ్దములం దీసికొందము. ఆంధ్రుల శ్రుతికి "ఏమ్రే, క్యారే" ధ్వనులు గౌరవహీనములు. ఏల? ఆంధ్రు లగౌరవమున "రే" యుపయోగింతురు. కర్ణాటకులకు "క్యారే" గౌరవధ్వనిగ నుండును. హిందీ వారికి "ఏమ్రే" నీచముగ నుండును. రండి, రండా, బర్రే, ఆయిరే లు నిట్లే. దీనివలన మనకుం దెలియునది యేమి? విషయపరిచితియు శ్రావ్యమునకుంగాని కర్కశమునకుంగాని కారణమై యుండవచ్చును. ఇంతవఱకుం జేసిన చర్చవలన నాదకార్కశ్య శ్రావ్యతలు దెలిసితిమి. ఇంక శ్రావ్యనాదమునకుం జూపు కౌశలము (సంగీతము) విమర్శింతము.

## సంగీతము

"గీతవాద్యనృత్యములు సంగీత మనిరి" మఱియు రాగస్వరములు తాళములను గలిసి సంగీత మనిరి. సమ్యగ్గీతమగుట సంగీత మయ్యెను. స్వరక్రీడయగు గీత వాద్యములను సంగీతముగం దీసికొందము. అట్లగుటచే గాన మను నామ మిడితిని. గానము ధ్వనినియమశాసక మని చెప్పవచ్చును. ఇది గాత్రమూలముగను, యంత్రమూలముగను బ్రదర్శిత మగుచుండును. తొలి గాత్రమూలమై పిమ్మట యంత్రమూల మయ్యెను. గానము స్మరింపంగనే నృత్యము స్మృతికి వచ్చును. ఏ కళ లైనను లేకపోవచ్చును. కాని గాన నృత్యములు లేనిదేశము లేదు. ఎంత మూఢదేశ మైనను గాన నృత్యము లెఱిఁగియుండును. నాగరకదేశములమాట చెప్పనేల? మానవులకు మాత్రమే కాక మానవేతర ప్రాణులకును గలానామమునం గాక స్వభావముగ గాన నృత్యములు గల్గును. గానమున కధిదేవత సుఖకాలము. దేనికైనను సుఖము లేకున్న గాన నృత్యములు లేవు. ప్రపంచమంతయు దుఃఖమయ మను విరాగిగీతములకంటె సుఖమయ మను శిల్పిగానమే సత్యమేమో? సుఖప్రభవ మైనగానము సుఖప్రవృత్తమేయగును. అట్టి గానము సర్వోన్నతమే కదా. గాత్రమూలమైనది వివరింతము. కూనరాగము తెలుంగని కూనయైన లేదు.

## గాత్రమూలగానము

మనుష్యప్రకృతి నొప్పు ననుసరించి గానము మాధుర్యము నొందును. కావునం గొంచె మా గాత్రవిషయమునం బరిచయము గలుగంజేసికొందము. పాణినీయ శిక్షాప్రకారము ధ్వని యుచ్ఛ్వాసనిశ్వాసపవనజన్య మని చెప్పం దగును. ప్రధానము నిశ్వాసమనుట మంచిది. ఇచ్ఛాపూర్వకమనఃప్రేరితజాఠరాగ్నివలన నిశ్వాస మురఃకంఠశిరః ప్రదేశములను నేగి మంద్రమధ్యమతారస్వరములం బుట్టించును. నిశ్వాసము వేగవంతమై యూర్ధ్వము పోయి నిర్గమించి గళవివరద్వారమున నాస్యమునుబొంది యాస్యవ్యాప్తి ధ్వనించును. ఈ గళవివరమును సంకోచవికాసమధ్యమావస్థలనుండి ధ్వనించును. సంకోచస్థితినాద మజాదిమతాలక మగుట గానప్రసంగమున నింతమాత్రము తీసికొన్నం జాలును. స్వరపేటిక (Larynx) లో నిశ్వాసము ప్రవేశించి యర్ధచంద్రాకారమున నుండు స్వరతంత్రుల (Vocal cords) నభిఘాతించి ధ్వనించునని యాంగ్లు లనిరి. వారికిని మనకును భేదము లేదు. మంద్రాదిస్వరముల నియమించుచువచ్చిన గాన మగును. ఉదాత్తానుదాత్తస్వరితభేదములును వీని ననుసరించినవే యున్నవి. ఇంక నీ మూఁడింటిని మనము గుణించికొని యొకవిధమైన స్వరక్రీడం గల్పింపవచ్చును. స్థూలభేదముల నా మూఁడింటిని సప్తస్వరముల లెక్కకుం దీసికొనిరావచ్చును. మిగిలిన సూక్ష్మభేదము లనాహతనాదవాదిగమ్యములు. అచ్చులు నేకమయ్యెనను సంప్రదాయ మట్టిదే.

1 2 3 4 5 6 7

అ, ఇ, ఉ, (అ+ఇ), {అ+(అ+ఇ),} (అ+ఉ), {అ+(అ+ఉ)}

ఇట్లే సప్తస్వరము లుద్భవించినవి.

మంద్ర, మధ్యమ, తారస్వరముల స్థితి నుదాత్తానుదాత్తస్వరితభేదముల సప్తస్వరముల జనింపంజేయవచ్చును. 1 ఉదాత్తమంద్రము, 2 అనుదాత్తమంద్రము, 3 స్వరితమంద్రము, 4 ఉదాత్తానుదాత్తమంద్రము, 5 అనుదాత్తస్వరితమంద్రము, 6 స్వరితానుదాత్తమంద్రము, 7 అనుదాత్తోదాత్తమంద్రము. ఇట్లే మిగిలినవియుం దెలియందగును. కంపనభేదములును స్వరభేదములును సమానములే. స రి గ మ ప ధ ని స్వరముల గ్రహించిరి. ఈ సప్తస్వరము లన్యోన్యసంబంధలేశమైనను లేక యుండరాదా? అని ప్రశ్నింతుమేని సంగీతస్వభావ మెఱుకపడును. సంగీతమున సమానధ్వనిభేదసముదాయావృత్తి యుండవలయును. నృత్యము ననుగూడ నించుక భేదమున నట్లే యుండవలయును. కవిత నట్లుగాదు నానాభావపరంపరాప్రవాహ మనేకరీతిశబ్దములం బ్రదర్శితము గావలయును. ఇందు దోషముగం బరిగణింపంబడిన పునరుక్తి సంగీతమునం బ్రధానాంగము. ఏకప్రకారపౌనఃపున్యమే గానప్రభావము. నాదముయొక్క గమనము నట్టిదే. గతికి ననుకూలించిన రీతి సంస్కరించుటయే మన కౌశలము. ఉదాహరణము నీ దిగువం జూపుదును.

| ఆరోహణము | అవరోహణము |
|---|---|
| స రి గ మ ప ధ ని స | స ని ధ ప మ గ రి స |

ఇట్లనేకభేదములం గూర్పవచ్చును. కాని యిందలి రహస్య మొకం డున్నది. బహుధా భిన్ననాదము లొక చక్రముగ, నట్టి చక్రములం గొన్నింటిం గూర్ప నొక క్రీడయగును. గానము సక్రమభిన్నధ్వని చక్రవివిధ సమీకరణక్రీడ యనందగును. చక్ర మెందుల నుపయోగింతుమన్న నొకరీతి ధ్వనిం బెక్కుసారు లుపయోగించుటకు. ఈ చక్రపరివర్తనములో గానధారణము గలదు. అంతటితో ముగియదు. ఇందును మధ్యమధ్యములం బద్యములోని యతులయట్లు ధ్వని యతులం జేర్చి యా ధ్వనియతులకు నానాపర్యాయప్రవేశము గలిగించిన నింకొకక్రీడ యగును. అదియే తాళము. కాని ఈ తాళము నృత్యవశము. ధ్వని సాంతత్యముకొఱకు. తాళమునకు మాఱు విరతిం జేర్చినం బూర్తి యగును. స్వరము శ్రుతి యను నీ రెండింటికిం గల సంబంధమును దెలియుదము. ఒక్కొక్క స్వరమునకుం గొన్ని శ్రుతు లుండితీరవలయును. ఒకస్వరమునకుం గల యంతరమును వాయుప్రేషణములనుబట్టి తదనుకూలశ్రుతులు గొన్నియు, నియతశ్రుతియు నుండును. అవి మొత్తమున నిరువదిరెండుగ నున్నవి. మొదటి మూఁడు స్వరములకు సమత్రయశ్రుతులును (4, 3, 2). మధ్యస్వరములకు రెండింటికిని సమశ్రుతులును, మిగిలినవానికి సమక్షీణశ్రుతులును (3,2) గల్గును. వాయుప్రేషణము మధ్యమున బాహుళ్యముగనుండును. ఈ సాంఖ్యమంతయు యంత్రమూలమున స్పష్టపడును. గాత్రమూలగానమున నివి నిర్ణయింపగ రీతిం జూపెదను. శ్రుతులంబట్టి స్వరమునకు శుద్ధవికృతభేదము లుండునని నిశ్చయము కదా? గ్రామమూర్ఛనలు క్రీడావశములు. షడ్జగ్రామము, గాంధారగ్రామము, మధ్యగ్రామము అని మూఁడువిధములు. ఈ గ్రామములకు సప్తమూర్ఛనలుండును. గాంధారము దేవైకాభిగమ్య మయ్యెను. మండలవిభాగము చేయునప్పుడది తెలియంగలదు. ఇంక స్థాయి నెఱుంగుదము. ఒకదానినుండి యింకొకదానికిం బోయి యథాపూర్వస్థలమునకుం దెచ్చిన ధ్వనిగతి స్థాయి యని యందురు. ఇట్టి స్థాయులం బండ్రెండుభాగముల విభజించి యందలి విభాగముల యోజనమున రాగములం బుట్టింతుము. ఛందస్సున నెట్లు ప్రస్తరించి జాతులు, ఉపజాతులు, వృత్తములు, మున్నగువానిం గల్పింతుమో యట్లె రాగములను గల్పించుకొని క్రీడింపవచ్చును. స్వర, శ్రుతి, స్థాయుల శుద్ధాశుద్ధ మంద్రమధ్యాదిభేదముల గమనించి యావృత్తికి నవకాశ మిచ్చియున్నం జాలు మనోహరశబ్దమగును. గానమగును. ఇంతదనుక నుడివినది శాస్త్రవిషయమైయుండును. కళావిషయమునం గొంచెము భేదముగలదు. శాసనము నతిక్రమించక యొకానొక నిరంతరధ్వని పూర్వోక్త రాగములం గలిసి యనిర్వచనీయానందమును బుట్టించును. ఆ యానందధ్వనియే గానకళ. గాత్రమూలముననే యది ప్రదర్శితమగును గాని యంత్రమూలమునం గాదు. గానకళ గాత్రమూలంబై. గాత్రమూలమాత్రమగుట ననుకరణమునకుం దగి రసలహరిం దేల్చును. ఈ రసలహరి వేదములలోంబుట్టి సామమునం గ్రీడించి నారదత్తిలాది పురుషులచేం బ్రబుద్ధమై సకలప్రపంచముచే నాదృతమై యానందిని యయ్యెను. ఈ గానమును దైవత్వానుసంధానమునకే వినియోగింపవలయును. రాగములు తాళములు మున్నగువాని సమగ్రచర్చ గావింపనని యనుటచే విరమింతును. గానము నుపయోగించువారి పరిస్థితులంబట్టి సాంప్రదాయ మనియు నుండునా? రుచిభేదము స్వభావము గావున సాంప్రదాయముండును. భారతీయసాంప్రదాయ మెట్టులుండును? ఆనందప్రవేశమునకు నవకాశ మెక్కుడుండును. ఆ యానందము విశృంఖలమగును. బంధమున్న నానంద మెక్కడిది. పాశ్చాత్యుల కట్లుండదు. వారు కేవలభూతతృప్తికొఱకుం బ్రయత్నింతురు? అట్లే యాంధ్రులకు నొక సాంప్రదాయము గలదు. దాని నాంధ్రసంగీతశిక్షమున వ్రాయుదును. ఇంతమట్టుకు వ్రాసినది చాలును. అయినను కేవల స్వరమాత్రము విమర్శించితిమి. కాని స్వరము లాధారముగం బదజాలమును చేర్చి పాడవచ్చును.

ఈ వ్యాసము విమర్శకవ్యాసము కాని శాసకవ్యాసము గాదు. కావునం గొంచెము వ్రాయవలసివచ్చును. స్వరములం జూపి సాహిత్యమును జూపుదును. రాగము తాళములే కాక మిగిలినవియుం గలవు. అరయుఁడు.

## మలహరిరాగము—రూపకతాళము

మ ప ధ స స రి రి స ధ ప మ ప రి మ ప ధ మ ప ధ ప మ గ రి స
శ్రీ ఇ గ ణ న థ సింధు ఉ ర వ ర్ణ క రు ణ స గ ర క రి వ ద అ న

ఇత్యాదిప్రకారముగ సంగీతసాహిత్యములఁ జేర్తురు. ఉభయకళలఁ గూలంకష ప్రజ్ఞయున్న నట్టి లోపము రాదు. దీనివలనఁ దెలియున దేమనఁగా? కేవలస్వరమున భావ మస్ఫుటమైయుండును. పదజాలమును జేర్చిన మఱికొంత వన్నెవచ్చును. దీని నుండి కవిత వచ్చెను. పదక్రీడమాత్రమే. శబ్దాలంకారములు దీనిసంబంధమే. మఱియు గణవిభజనము గానార్థమే. భావనార్థము పదములఁ బద్యములఁ జేయుదురు. (Music married to immortal verse) అను నాంగ్లగదితము నెఱుంగుఁడు. ఆవృత్తశబ్దమున నట్టిమధురత గలదు. "భారతి నరయుఁడు." అను నీచిన్నివాక్యమును హృదయమున నాటునట్లు చేయఁదలంచినచో నాదసాహాయ్య మావశ్యకము. అనియు సక్రమ నాదావృత్తియై యుండవలయును. ఎట్లన,

భారతి నరయుఁడు, భారతి నరయుఁడు, మృదు
భాషితవతియయి వచ్చెఁ దనివి నిడ శ్రీభా..

ఇట్లే సమధ్వన్యావృత్తిప్రభావము నెఱుంగఁదగును. దీనివలనఁ గలుగు లాభముల వేఱ వర్ణింతును. గానమున కంటియున్నదియే మంత్రశక్తి. అనియు నావృత్తితత్త్వమే. బహువారశ్రుతధ్వనియే యింతటిదయ్యెఁ గదా!

"ఓం, త్రీం, త్రీం, త్రీం, త్రీం, త్రీం, ఫట్ స్వాహా" అను నొక మంత్రమును విమర్శింతము. ఈమంత్రము శీతపైత్త్యజ్వరనివారక మని మంత్రశాస్త్రమునఁ గలదు. ఈ మంత్రమును బ్రయోగించి చూచితిని. మంచిఫలితము సంభవించెను. వెన్నెముక క్రిందిభాగమున "జరజర" ధ్వనివంటి యనుభూతి సంభవించివచ్చిన దుష్టమును నైమంత్రముచే నుపశమింపఁజేసితిని. ఇట్టి మంత్రములను గనుఁగొన వచ్చును. ధ్వనికి నాకారము వర్ణము నున్నదని దేవీభాగవతాదిగ్రంథములలోఁ గన్పట్టుచున్నది. ఇంతియకాక యొక యాంగ్లవనితయు నాకారవర్ణము లున్నట్లు ఋజువుపఱచెనని మనము పత్రికాముఖమునఁ దెలిసికొని యున్నారము. ఇకఁ నర్థమయ్యెను. అయినను దర్శించిన నదియే సిద్ధమగును. ధ్వని స్పర్శగుణమై రూపమై రసమై గంధము నగును. కావచ్చును. ఆఘ్రాణించి వర్ణము తెలిసికొనఁదగినప్పుడు విని వర్ణమరయుట సంభవింపదా? Professor H. L. Hollingsworth and Dr. A. T. Poffenberger అను నిరువురు కర్ణమూలమున రుచి గ్రహింపవచ్చునని ఋజువుపఱచిరి. కావున మనపూర్వులమాటలఁ గుతర్కములఁ బోనాడి వీటిపితన మొందుట శ్రేయముకాదు. నాదమున కట్టిమహిమ గలదు. మనుష్యునికిఁ గల కొన్ని రోగముల నీనాదప్రయోగమున బాగుచేయవచ్చును. గాత్రమూలగానమునకు గాత్రమునకు నత్యంతసంబధము గలదు. ఒక్కగళమేకాక మిగిలినయంగములు నుపాంగములు బలము కలవియై యుండవలయును. వీనిలోని లోపము నాదమునకును సంభవించును. అట్టి పరస్పరాశ్రయము గలదు. నాదసమత్వమున నిరసించిన యుండదు. ఈవిషయము యంత్రమూలగాన మయినపిమ్మటఁ దెల్పెదను. ఎన్నిమహిమలైన నాదమున కావృత్తిలోఁ గలదనిమాత్ర మెఱుఁగుఁడు. నాదమే యననేల? అన్నియు నట్లే. అయినను నాదము దగ్రస్థానము వహించినది. భ్రమరకీటన్యాయ మిట్టిదియే. ఏకాగ్రతను నాద ముపకరించును. కావుననే మంత్రమనియు జపమనియు నార్యులు నియమించిరి. పెక్కుసారు లడుగ లోభియు దాత యగును.

ఛందస్సన గాన మనియే యర్థము. ఛందోగాన మర్థవద్ధ్వనిక్రీడ యగును. సంగీతము భావవద్ధ్వనిక్రీడ యగును. అర్థములేక భావముండునా యని సంశయింప బనిలేదు. ప్రేమాతిశయమునఁ దమపుత్రుల "చీచి" యని పిలుతురు. అర్థమున్నదియా? భావమున్నది. గురు లఘు మాత్రము ఛందము. సప్తస్వరనానాక్రీడ గానము. ఇట్టి సూక్ష్మభేదములఁ దెలియుదుము. ఇంతకుముందే నృత్యము గానముతోడిది యని చెప్పఁబడెను. పాడుచు నాడుటలో మఱి కొంతభావబాహుళ్యము గలదు. దీని నిర్వచించుటకు వీటఁ దావులేదు. అయినను గొన్ని సూచింతును. తోడి, ముఖారి మున్నగు రాగములకు దో డభినయమును జేసిన రాగనిర్గతభావము శీఘ్రముగ గ్రహింపఁబడును. ఒక పదిమంది యేకకాలమున "స్సూ" అను ధ్వనిఁజేసి యర్ధచంద్రాకృతిహస్తముతోఁ బ్రదర్శించి "టప్" అని యాపిన "ఆకాశపాత"మను క్రీడఁ బ్రదర్శిత మగును. మనోహరముగ రాగము తీయుచు నొక్కొక్కక్షణమున నాగి యుత్తరక్షణమున యథాపూర్వముగ నాలపించిన నా రాగ మవ్యక్తమధురత నందును. ఇట్లే ప్రపంచమునఁ గల యన్నివస్తువుల ధ్వన్యభినయముల ననుకరించి ప్రదర్శింపవచ్చును. యంత్రమూలగానమును గాత్రమూలమునఁ బ్రదర్శింపవచ్చును. కాని శ్రమ యగును. అతిక్రమధ్వనులనైనఁ గొందఱు సంపూర్ణానంద మనుభవింతురు.

"యో విద్వల్పరిషత్ ప్రపంచకరణే హేతు ర్జగత్పోషణే
కుంఠ స్త్వం త్వహమేవ పండిత ఇతి స్వోత్కర్షవాగాత్మభూః
ఆచార్యో హ మసౌచనద్విజ ఇతి వ్యాహారమాలోవిదాం
ఆద్యః పాతు నిరంతరం ప్రణవవత్కోలాహలోమాంబలీ"

అను శ్లోక మరయుఁడు. బ్రహ్మచర్యాశ్రమమున నున్నయప్పటి గర్గోలు నొక విద్వాంసుఁడు నుతించెను. గర్గోలైన నుగ్గడింపఁదగినది యయ్యెను. ఇక గానము మాటఁ జెప్పనేల? గాత్రమూల గానమున గాయకుఁ డెన్నియోసౌఖ్యముల నొందును. అశాస్త్రీయముగనైన నెన్నియోకష్టములకు లోనగును.

"చెప్పవలెఁ గప్పుగంబును
గుప్పలుగాఁ బోసినట్లు కుంకుమ పైపై
గుప్పినక్రియ విరిపాట్లము
విప్పినగతి ఘుమ్మనం గవిత్వము సభలోన్"

అని యొకరసికుఁ డనినట్లు గానము వినఁజేసినఁ గమ్మనితావుల నెల్లెడ నింపవలయును. కవితాగానములు నిజముగ నక్కసెల్లెంద్రవంటివారు. భావరహితమై చప్పగ నుండు నొకపద్యమును మంచిరాగమున నాలపింపఁ జిత్రితమగును. మనోహరమైనది గాకున్నను భావసౌందర్యమున నొకగీతిక రాగమూలమునఁ బ్రకటింప రంజిత మగును. ఇట్లే గాత్రమూలగానచర్చ గావింపవచ్చును. యంత్రమూలగానము విమర్శించి పిమ్మట నున్నవానిఁ దెలిసికొందుముగాక.

## యంత్రమూలగానము

యంత్రమూలగానవిమర్శనమున యంత్రములఁ జేర్కొనను. కాని యందలి కాలము భాగము మున్నగువానిఁ జర్చించి సందర్భోచితముగఁ గావలయు విషయముల వివరింతును. ఆదియంత్రము వేణు వని మాత్రము తెలియఁదగును. గాత్రగానము కళాబంధము కాని యంత్రగానము శాస్త్రమూలము. యంత్రము గాత్రములాగు భావప్రకటనను సేయదు. లలితకళలలో దీనికి (గానమునకు) మాత్రము యంత్రమూలమునకైనఁ గళామాధుర్యమును వృద్ధిభేదముగఁ ప్రదర్శించు శక్తి కలదు. సక్రమధ్వనిక్రీడను నావృత్తియే ప్రధాన మనునంశము ప్రత్యక్షముగ నీ యంత్రములు బోధించును. యంత్రనిర్మితిలోఁ బాశ్చాత్యులకును, ప్రాచ్యులకు నత్యంత భేదము గలదు. కారణ మేమి? గణితశాస్త్రముతో సంబంధముగ విభాగింపఁబడిన యంత్రనిర్మాణము ప్రపంచమంతట నొక్కతెఱంగునఁ బోసంగి యుండవలయుఁ గదా? సత్యమే; కాని ఫలితములో భేదము లేకున్నను భాగములో భేద ముండవచ్చును. ఎట్లందురేని, పంచవింశతి యనుదానికిఁ బర్యాయముగ నిరువది యైదనలేదా? భాగభేద మున్నది కదా? $5+20=25$, అనిగీర్వాణు లన నితరులు $20+5\times 25$ అని యనలేదా? ఇట్లే భాగభేదము గలుగవచ్చును. షడ్జమునఁగాక ఋషభగాంధారముల శుద్ధవికృతులు గలవని మనశాస్త్రము చెప్పుచుండలేదా? శుద్ధ మొకభాగమునను వికృతి యింకొకభాగమునను గలిసి వానికి సమముగా వచ్చును. అయినను వాయుప్రేషణ సంఖ్య నరయుదము.

| Notes | C | D | E | F | G | A | B | C |
|---|---|---|---|---|---|---|---|---|
| Vibrations | 256 | 288 | 320 | 341.3 | 384 | 426.6 | 480 | 512 |
| Relative frequency | 24 | 27 | 30 | 32 | 36 | 40 | 45 | 48 |

ఇట్లే గణిత మాంగ్లులు నిర్వచించిరి. మొదటి మూఁడును సమవృద్ధిభేదము నొందినవి. తరువాతి మూఁడును విషమవృద్ధిభేదమున నున్నవి. ఇఁక మనవానిని విమర్శింతము.

| స | రి | గ | మ | ప | ధ | ని | స |
|---|---|---|---|---|---|---|---|
| 240 | 270 | 300 | 320 | 360 | 400 | 450 | 480 |

—As given by Ganot

పైదాని నరయఁ బూర్వకీతి "స రి గ" లకు సమవృద్ధియును "మ ప ధ" లకుఁ బూర్వస్వరత్రయవృద్ధిసంఖ్యావిషమముగను భిన్నముగను నున్నది. "ని" స్వరమునకుఁ బూర్వనియమము లేదు. సమత యుండునా. మన యార్యు లీ విషయమునఁ జర్చించిరా. సంగీతరత్నాకరము (వ్యాఖ్యాత కల్లినాథుఁడు?) సంగీతపారిజాతము, మున్నగు గ్రంథములు ఛాయామాత్రముగఁ జర్చించినవి. కాని యింత విమర్శించినచో స్పష్టపడఁగలదు. సంగీతమునఁగల స్వరప్రపంచమునకు నొక్కవంశవృక్షమట్లు వ్రాసి పిమ్మట భాగములు వాయుప్రేషణగతి సంఖ్యను నిర్ణయింతును.




గాంధార గ్రామము దేవగేయ మగుట నిట విరమించితిని. మఱియు నాద వంశవృక్షమునుగూడ వివరించి చూపుదును.




ఇట్టి విభాగమునొంది స్వరములు ప్రకృతి వికృతి భేదంబులఁ బదునాలుగ విభజింపఁ బడినవి. అయినను గొందఱు పండ్రెండువిధములనియే చెప్పుచున్నారు. రెండు మూఁడు వాయుప్రేషణగతుల తారతమ్యమును శ్రుతి వివక్షింపదు. కాని గణితజ్ఞులు విమర్శింతురు.

సప్తస్వరములను బండ్రెండుభాగములుగఁ జేసి యిరువదిరెండు శ్రుతుల నిర్వచించియున్నను గొందఱు ఇరువదియొక్కటి యనియే యన్నారు.

" చతుశ్చతుశ్చతుశ్చైవ షడ్జ మధ్యమ పంచమాః
ద్వే ద్వే నిషాద గాంధారౌ త్రిత్రీవృషభధైవతౌ "

స, మ, ప లకు $4 \times 3 = 12$ శ్రుతులు, ని, గ లకు $2 \times 2 = 4$, శ్రుతులు, రి ధ లకు $3 \times 2 = 6$ శ్రుతులును గలవు. కావున లెక్కకు $12 + 4 + 6 = 22$ శ్రుతులు వచ్చినవి. ఇట్టి శ్రుతుల జనింపఁజేయు స్వరములను వాని స్థానములఁ దెలియఁదగును. దానికిఁ బూర్వ మొక తంత్రీ ప్రమాణ ప్రతిమఁ జూపుదును. వాయుప్రేషణ గతులకు నొకవిధముగ గణితము గలదు. వాయుప్రేషణగతికి " వా " అను సంజ్ఞ యనియుఁ, దీఁగపొడవునకు " పొ " అనియు, తంత్రీ భారమునకు " భా " యనియు, స్ఫుటీకరణమునకు " ఫ " యనియు సంజ్ఞలఁ దెలియుఁడు. " వా " సంఖ్యఁ దెలియవలయునన నిట్లు చేయవలయును.

వా=1/2 పొ √ ఫ/భా లేక N=1/2 l √ f/m

N = Rate of Vibration.

స్థూలముగ నీ క్రిందిరీతిగను విభాగించుకొనవచ్చును.

వా=$1/2 \times 36 \times 34560 = 480$ కావున " 480 " వాయుప్రేషణములు గలదని చెప్ప నొప్పగును. సంగీతపారిజాతము ప్రకారము విమర్శించితిమి. ఇది యొక్కటియె మనకు ననువగు గ్రంథము.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| అవికృతములు | | స | | | ప | | 12 భేదములు. |
| శుద్ధములు | రి | గ | మ | | ధ | ని | |
| వికృతములు — కోమల | | రి | | | ధ | | |
| వికృతములు — తీవ్ర | | | గ | మ | ని | | |

ఇట్టి భేదములఁబట్టి తంత్రీపటమును జూపుదును.

## తంత్రీ ప్రమాణపటము

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | స | 36 | అంగుళములు | 240 | వాయుప్రేషణములు. | |
| 2 | రి | 33 1/3 | ... | 259.2 | ... | |
| 3 | రి | 32 | ... | 270 | ... | |
| 4 | గ | 30 | ... | 288 | ... | |
| 5 | గ | 28 4/5 | ... | 300 | ... | |
| 6 | మ | 27 | ... | 320 | ... | |
| 7 | మ | 25 | ... | 345.6 | ... | |
| 8 | ప | 24 | ... | 360 | ... | |
| 9 | ధ | 22 1/2 | ... | 364 | ... | |
| 10 | ధ | 21 3/5 | ... | 400 | ... | |
| 11 | ని | 20 | ... | 432 | ... | |
| 12 | ని | 19 1/5 | ... | 450 | ... | పొడవు 36 |
| | స | 18 | ... | 480 | ... | అంగుళములు |

ఈరీతి నేర్పడుదానినిగూర్చి వాదోపవాదములు జరిగెను. మొత్తమునకు నిదియే యుచితముగ నున్నది. ఇందుగుఱించి మహారాష్ట్రపండితులు పెక్కురు వివరించిరి. అందులో ముఖ్యులఁ జేర్కొనుదును. Mr V. N. Bhatkande, Mr. Ganesh Gopal Barve, Rao Saheb N B. Divatia B. A. గార్లును, Mr. Clements, అనువారును గలరు. వీరు పెక్కురీతులఁ జర్చించిరి. వారి వాదములఁ దీసికొని విమర్శింపగడంగుచో గ్రంథ మింకను బెరుగును గాన విరమింతును. సిద్ధాంతభాగ మదియని చూపి యాపుట లెస్స యని తలంతును. శాస్త్రవిషయమును విడిచి విమర్శన విషయమును దీసికొందము. పూర్వోక్తస్వరక్రీడ యంత్రమూలమునఁ గావింప లాభమేమి? వినుఁడు మనోహరధ్వని యెంతపనినైనఁ జేయును. మధురధ్వని శిశువుఁ బశువును విని యానందించు నన నరవిషయమునఁ జెప్పవలయునా? నాదమునకు లొంగని భూతము లేదు. తలంపుగూడ వస్తువగుటచేత నదియు నాదవశమై యుండవచ్చును. కాణాద మత ప్రకారము " అణులతి సంచలన మూలమున నణుసంయోగస్థితి విలక్షణశక్తి జనింపఁజేయు " నని చెప్పవచ్చును. ఆంజనేయుఁడు గాన ప్రభావమున గండశిలఁ గరిగించెనని పురాణస్థమైయుండెను. Miss Anderton అనునామె గానమూలమున చెవుడు బాగుచేసెనని యొకవార్త గలదు. అంధునిఁ జక్కపఱచినది. ఈ వార్త వినుఁడు.

Miss Anderton played for a young captain suffering Aphasia. And on one day the spell was broken and his memory came back like a flash. In another hospital there was a young Welshman a soldier blacksmith. He had been shot through the lungs. Miss Anderton taught him to sing. His lungs have healed and he is a wellknown man today. ఇట్లామె యెన్నియో రోగములను గానమూలమునను బాగుచేసెను. మనోహర రాగమున ' 16 ' వాయుప్రేషణగతులును గలవు. ఎక్కువ సంఖ్య ' 41000 ' అనియు Prof. R. O. Doremus గారు నిర్ణయించిరి. ధ్వనినియమక్రీడవలన నెన్నియో కార్యములఁ జేయఁగలము. మన శ్రోత్రేంద్రియమునను ధ్వనిని సమానపఱచు శక్తి కలదు. ఇన్నిలాభముల నొసంగు గానమును విడుచుట యొక దురదృష్టమని చెప్పవలయును. యంత్రమూలగానమున వీణాదుల మాత్రముగాక, మృదంగము మొదలగునవియుఁ గలవు. వానిగుఱించి విమర్శనములు లెక్కవగనున్నవి. దాని యభ్యాసము కూడ మంత్రాభ్యాసముంబోలి యున్నది. రాగ శ్రుతి తాళ లయాదులతో నను కూలించియుండును. తకిట తతకిట, తధగిణతోం, తోంధ, ధిం ధిం తధిగిణతోం ఇత్యాదిధ్వనులఁ దెలిసికొని యభ్యాసము చేయుచున్నారు. కాని యద్భుత మధుర ప్రవాహమును నిరంతరమును గురియించు మార్దంగికులు గలరు. మృదంగధ్వని క్రీడానియమనమున నింకె న్నెక్కుడు శ్రమచేసి గ్రంథములు బయలు వెడలవలసియుండును. ఇంతదనుకఁ జేసిన విమర్శము చాలుననియెంచి విరమింతును. ఎప్పుడేని " ఆంధ్ర గానమును " గూర్చి విమర్శింతును.

# నైయాయికుడు

తల్లావజ్ఝల శివశంకర శాస్త్రి గారు

దీక్ష పూని న్యాయాబ్ధి మథించి యందు
నమృతము లభింప నద్దాని నాస్వదించి
రామనాథభట్టాచార్యు రమ్యకీర్తి
కాయ మజరామయం బయ్యె గాఢభూమి.

అతనిసహధర్మచారిణి యధిక భక్తి
యుక్తి నుపచారముల్ సేయుచుండ నెపుడు
దుస్తరం బైన న్యాయాబ్ధి నిస్తరింప
జేయు శిష్యుల భూసురశ్రేష్ఠు డెలమి.

జగతి కాత్యంతికభ్రమజనక మైన
నిగ్రహచ్ఛల జాత్యాది నిగళపటలి
దత్కరుణ శిష్యమండలి దాటుకతన
ప్రమ జనించి నిశ్శ్రేయసప్రాప్తియయ్యె.

అతికృపాయత్తచిత్త యైనట్టి వాణి
యతని పూతజిహ్వాగ్రంబు నాశ్రయింప
వేడ్కకైన బ్రసారింప వెరచు లక్ష్మి
నిజకటాక్షంబు దత్కుటీనికటసీమ.

మార్పు లేదాయె కాలక్రమమ్ముమీద
నైన నేతద్విరోధవృత్తాంతమందు !
శ్రవణగత మయ్యె శ్రీకృష్ణచంద్ర ధరణి
నాథునకు నెట్టులో రామనాథుని దశ.

తత్సభాస్థలిలో కవితాలతాంగి
చేయు లాస్యంబు పండితశ్రేణిమ్రోల ;
ఆనృపాలోత్తముని యపాంగావలోక
పథగతం బయి లేవడి పరుగువారు.

జ్ఞాతవిద్వన్మహాపరిశ్రముడు కృష్ణ
చంద్రనృపతి యరిక్తహస్తములతోడ
ఆర్ద్రహృదయమ్ముతోడ గ్రామాంతరస్థ
పండితుని దర్శనోత్కంఠ బయలువెడలె.

అశ్వశకటమునందుండి యవతరించి
ప్రభువు విద్వద్వరేణ్యుని ప్రాతయింటి
సవిధభాగమునం బాదచారి యగుచు
ననుచరునితోడ జొచ్చె దదంగణంబు.

ప్రాంశుమేదురతింత్రిణీపాదపంబు–
నిమ్నభాగోపవిష్టుడై నిష్ఠతోడ
పుస్తక విలోకనాయత్తబుద్ధి యైన
పండితోత్తము గన్గొనె ప్రభువరుండు.

అంతికముజేరి బ్రాహ్మణు నంఘ్రిరజము
నిజశిరమ్మున దాలిచి నిలిచె నెదుర
కరసరోరుహముల్ మోడ్చి గాఢభక్తి
సరసశేఖరశ్రీకృష్ణచంద్రనృపతి.

ప్రభువు నాశీర్వదించి యా బ్రాహ్మణుండు
శీర్యమానకటాసనాసీను జేసి
ఆదరమున ననామయం బడిగినంత
కొంతతడ వుత్సుకతతోడ గోష్ఠి సాగె.

పిదప నరపతి విప్రుని పేదరికము
నపనయింపగ నెంచి వాచ్యంబుగాక
వ్యంగ్యమర్యాదతో నిట్టు లనియె: " మీకు
ఆర్య, ఉండునె యేమైన ననుపపత్తి ? "

చిరునగవుతోడ భూసురశ్రేష్ఠు డధిపు
నాననాబ్జ విలోకన మాచరించి
" అనుపపత్తి సహింతుమే యధిప ? మాకు
సకల ముపపన్నమై యుండు శాస్త్రదృష్టి. "

అనుటయును కృష్ణభూపతి యతనితోడ
ననె : " అసంగతి యుండునే యార్య, మీకు ? "
" మా కసంగతి యుండ దేమాత్రమైన,
సకలము సుసంగతం బగు జనవరేణ్య. "

ఇట్లు నైయాయికుండు వచించినంత
స్పష్టముగ దెల్పినంగాని ఫలము లేమి
అధిపతి గ్రహించి " ధనలోప మార్య మీకు
శ్రమ మొసంగునె ? " యనుచు ప్రశ్నమ్ము చేసె.

" భుక్తిధాన్యమ్ము పండెడు భూమి కలదు,
వండు నిల్లాలు, చింతాకు వ్యంజనంబు,
గడచు శాస్త్రసమీక్షలో కాల మెల్ల,
ధనముతో మాకు పని యేమి ధారుణీశ ? "

అనెడి నిరుపేద విప్రుని యాననమున
శాంతరసధౌతదివ్యవర్చస్సు తోచె
కాంచె నత్యంతవిస్మయాక్రాంతి కృష్ణ
చంద్రభూపతి పండితసార్వభౌము.

# మంగయ్యగారి పునర్వివాహయోగము

నాయని శేషాచలరావు గారు

ఎంతటివాళ్లకన్నా చావంటే భయమే. ఆలూరి మంగయ్య పంతులు కిప్పుడు ఎనభైయో పడి. దగ్గుచే సగం క్షీణించాడు, మందులతో సగం క్షీణిస్తున్నాడు. దవడలు పూడ్చిపెట్టుకపోయినవి. కండ్లు లోతుక పోయినవి. దేహమెండి యెండుకట్టె అయింది. యీస్థితిగతు లంతాచూస్తే, అతని జీవయాత్ర కొన్ని దినాలలోనే అంతమయ్యేలాగ కనిపిస్తుంది. అయితే నేమి, మంగయ్యగారికి చావాలని యిష్టము లేదు. ఎల్లకాలం పుట్టిగట్టుకొని వూగులాడాలని వుంది. "ఇంకో పదేళ్లన్నా యిట్లా బ్రతికుండకూడదూ?" అని అనుకుంటూ వుంటాడు మంగయ్య దగ్గి దగ్గి ఆయాస పడినపుడల్లా. బ్రతకడానికి చావడానికి అతని యిష్టమూ యేమిటి? అద్దెచీటి యెప్పుడు చెల్లిపోతుందో, జీవి అప్పుడే లేచిపోవాలె.

బ్రతికే వుపాయా లేమన్నా వున్నాయా అని అతడు రాత్రింపగళ్లు ఆలోచించడం మొదలు పెట్టాడు. మందు లాశ వదలిపోయింది; మంత్రాలాశ తీరిపోయింది. దానా లిచ్చాడు, గ్రహ శాంతులు చేయించు కున్నాడు కాని రోగశాంతి కలగలేదు. ఇక అన్నిఆశలు వదలిపోయాయి. ఒక్కటేఆశ మిగిలిపోయింది. ఎప్పుడు తాను చచ్చిపోతాడో తెలుసుకోవడమే అది. రాజమండ్రీలో రామలింగశాస్త్రిళ్లవా రను గొప్ప జోతిష్కులవా రున్నారు. ఆయనకోసం కబు రంపించాడు మంగయ్య.

మధ్యాహ్నము దాటిపోయింది. సుమారు మూడు నాలు గవుతుంది. మంచము మీద దగ్గుతూ కూర్చున్నాడు మంగయ్య పంతులు. దగ్గర కుర్చీలో రామలింగశాస్త్రుల్లు కూర్చుని వేళ్లుమడచి లెక్కపెడుతున్నారు. "ఏమండీ! యీ జాతకం



బట్టిచూస్తే, యింతట్లో మీకు చావులేదండీ" అని అన్నారు రామలింగం శాస్త్రిళ్లు. మంగయ్య గారి మొగము మంగళమయి పోయింది. కళాకాంతులు మొగాన్ని తాండవ మాడ మొదలుపెట్టాయి. ఒక్క దగ్గు దగ్గి, "ఆ! ఆ! అట్టాగా" అన్నాడు మంగయ్య. "సరిగా జరిగితే ఈ నెలలో మీకు రెండో వివాహంకూడ జరగాలె" అని అన్నారు శాస్త్రిళ్లవారు. ఇక పంతులుగారి ఆనందానికి అంతేలేదు. పొట్ట నిమురుకుంటూ "ఏం. ఏం. నాకే!" అని అన్నారు దగ్గుతూ మంగయ్యగారు. "పురుషులకు భాగ్యంఅంతా స్త్రీలకు బట్టేవుంటుంది. సతిరాశి మంచిదైతే పతికి విఘ్నాలుండవు. చూశారూ! సత్యవంతుడు బ్రతుకటకు సావిత్రే ఆధారం. మీ కింతట్లో చావులేదు. రెండవపెండ్లికి ప్రయత్నాలు తలపెట్టండి. మీకు శుభమవుతుం" దని శాస్త్రీగారు సెలవిచ్చారు.

ఆనాటినుంచి మంగయ్యగారి ధోరణి మారిపోయింది. చావ నను కులాసా కలిగిం దతనికి. సంతోషానికి తగ్గట్టుగా దగ్గుపీడకూడ తగ్గి పోతావుంది. మీసాలకు రంగువేసే వుపాయాలు, తలకు వాసన నూనెలు తెప్పించే ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఎనుబదిసంవత్సరాలనాటికి మళ్లీ పెండ్లంటే ఎవరికి సంతోషంకాదు?

అయితే బోసినోటి మంగయ్యకు పిల్ల నెవరిస్తారో తెలియదు.

౨

డబ్బుంటే కొండమీది కోతికూడ దిగుతుంది. మంగయ్యగారి కేమి ఏభైవేలు కిమ్మతుచేసే భూములు రంగపురం దగ్గరున్నాయి. ఎంతలేదన్నా సంవత్సరానికి రెండు మూడువేలు భూములమీద వస్తుంది. పిల్లా మేకా ఎవరూలేరు. పుట్టింది వొక కూతురు. ఆకూతురన్నా రెండు కాయలు కాయకుండానే పెండ్లయిన ఏడాదిలోనే మాయమయింది. ఇతని కష్టసుఖాలకంతా దేవుళ్లాడేది, యితని తమ్ముడి కుమారు డొక్కడే. అతనిపేరు సూర్యనారాయణ. సూర్యనారాయణ మంగయ్య దత్తత పుత్రుని క్రింద లెక్క. అయితే నేమి, డబ్బంతా సూర్యనారాయణకే వస్తుందని యేమి లెక్క?

మంగయ్యకు మనువుల మీద మనువు లొస్తున్నాయి. ముసలితనం పండ్లకూ మీసాలకే గాని డబ్బుకుంటుందా? మనిషి కాయుర్దాయం నూరేళ్లయేటప్పుడు, మంగయ్య యింకా యిరవైయేండ్లు బ్రతుకుండొచ్చు—ఎందుకయ్యా! ముక్తసరిగా కాపురం చెయ్యడానికి మూడేండ్లు చాలవా?

గౌరమ్మగా రనే ఒక పూర్వసువాసిని వుండేది. ఆమె కొక మనుమరా లుంది. ఆ పిల్లపేరు సూర్యకాంతము. సూర్యకాంతం గౌరమ్మ పెనిమిటికి, తమ్ముని కూతురి కూతురవుతుంది. గౌరమ్మ మరది జీవయాత్ర చాలించుకొని వొక పుష్కరమయింది. ఇదికాక, పిల్లతల్లి పోవడంచేత, తండ్రి దేశాంతరాలు పట్టడం చేత పిల్ల బాధ్యతంతా గౌరమ్మపెనిమిటి మీద పడింది. ఆయన, దివి కేగేటప్పుడు, గౌరమ్మకు చెప్పి చెప్పి వొప్పగించా డాపిల్లను. అయితేనేమి, కడుపులో లేనిప్రేమ కౌగలించుకుంటె వస్తుందా? సవతి తల్లి ప్రేమతో పిల్లనుచూడడం మొదలుపెట్టింది గౌరమ్మ గారు.

పెనిమిటి పోయిన తరవాత గౌరమ్మ, గౌరమ్మ మనుమరాలు, గౌరమ్మ కూతురింట్లో చేరు కున్నారు. గౌరమ్మ కూతురుపేరు కనకమ్మ. ఎఱ్ఱగా బుఱ్ఱగా కనకమ్మ బాగానే వుంటుంది. కాని కనకమ్మ చెడ్డగడుసుబుర్ర. ఏమన్నా ఆవిడ తలచు కుంటే, అది అయితీరాలె. కనకమ్మ మగని పేరు ప్రసన్నరాఘవరావు. రాఘవరావు ఇంటరు చదివి, చదువు చాలించుకున్న రకము. ఇతడు జిల్లాబోర్డు ఆఫీసులో మధ్య రకం గుమస్తా.

రాఘవరా వింటిపెత్తనదారు గౌరమ్మగారే. ఆవిడ మాట చెల్లితీరాలె. యింట్లో "కాంతి ముండను మంగయ్య కిస్తే బాగుంటుంద"ని కూతుర్ని హెచ్చరించింది గౌరమ్మ. సరే అంటే సరే అనుకున్నారు తల్లీ బిడ్డాను. ఇంతకన్నా కావలసిందేమిటి చాంద్రకు, మంగయ్యగారి ఆస్తి రాఘవరావింట్లో చేరడానికి భగవంతుడు సూర్యకాంతాన్ని పుట్టించాడు. అనుభవించేది సూర్యకాంతమే గాని గౌరమ్మ కాదు గదా. ఎప్పుడుండు కాకికి ముద్దా? తల్లి తండ్రులులేని బిడ్డలగతి యిట్లాగే వుంటుంది.

గౌరమ్మగారు మంగయ్యతో బేరాలు పెట్టారు. ఏలాంపాటలో నాలుగు వేలకు ఖాయపడింది బేరం. పెండ్లి ఖర్చులు ముసలాయనే పెట్టుకోవాలె. పెండ్లి యీ నెలలో అయిపోవాలె.

అయితే, యిదంతా వాళ్లరాఘవరావుకి తెలియదు. తెలిస్తేమట్టుకు ఏమిలే! ఇంట్లో మారాడి అతడు ఏ చెఱువు నీళ్లు త్రాగ గలడు?

3

ప్రసన్నరాఘవరావు మంచి సోషల్ రిఫార్మరు. వృద్ధ వివాహాలు మాన్పడానికి, అతి బాల్యవివాహాల హాలమార్పడానికి తాను అవతారమెత్తినట్లు భావిస్తాడతడు. సభలలో ఏమిటి, పేపర్లలో ఏమిటి, యిట్టి వివాహాలు ఖండించితీరాలని, చెక్కి-చెక్కి పారేస్తున్నాడు రాఘవరావు. అందుచేత యితనంటే ప్రజలకంతా వొక విన్నమైన అభిప్రాయము. ఫ్రెంచికట్టు మీసాల తదువుకుంటూ చేతికఱ్ఱ త్రిప్పుకుంటూ, క్లబ్బులోకి రాఘవరావు వెళ్లాడంటే యితన్ని ఆహ్వానించని వాళ్లెవరూ

లేదు. "ట్రాన్సిఫార్మర్" అని "ఐడియల్ పెర్సన్" అని, క్లబ్బువాళ్లు యితన్ని గొప్పచేసుకొని చెప్పుకుంటారు.

అయితేనేమి, క్లబ్బులలో పులి లాగుండే రాఘవరావు, యింటిలో పిల్లి కన్నా అన్యాయం. మంగయ్యగారితో గౌరమ్మ చేస్తూవున్న బేరాలు మన రాఘవ రావుకు తెలియక పోలేదు. "ఏమండోయి! ట్రాన్సిఫార్ మరుగారు మీ అమ్మాయిని పండ్రెండేళ్ల బాలసమాజకు మంగయ్యగారి కిస్తారట కదా?" అని ఎవడో వొకడు సూచాయగా పెత్తడం, "నాటిండి లీస్టు" అని యీయన జవాబివ్వడం యిట్లా నాలుగు రోజులనుంచి జరుగుతూవుంది. ఇంట్లో ఎప్పటి కప్పుడే యీ సంగతి యెత్తాలని రాఘవరావనుకుంటాడు. కాని, గౌరమ్మ నోటికి జడిసి, కనకం గారి గయ్యాళితనాన్ని తలచి, రాఘవరావుకి నోరెత్తడానికి యెప్పటి కప్పుడే వణుకు పుట్టూవుంది.

అయినా వొక్క-ధైర్యం రాఘవరావు కుంది. అత్తకు, భార్యకు వృద్ధ వివాహాలమీద వొక్క-లెక్చరిస్తే వాళ్లు యీ వివాహాన్ని మానేస్తా రనుకుంటున్నాడితడు.

ఒకనాటి మధ్యాహ్నం గదిలో భార్య తమలపాకులకు సున్నము రాస్తూ వుంటే గది అవతలి వసారాలో అత్తగారు తిరగలి చప్పుడు చేస్తూవుంటే, రాఘవ రావు వీళ్లకు పెద్ద లెక్చరివ్వడానికి గొంతుక సవరించు కోవడం మొదలు పెట్టాడు. ఏకో వుండనుకొని గౌరమ్మగారు తిరగలి విసరడం మానేసారు. రాఘవరావు సమయం బాగున్న దనుకున్నాడు తన లెక్చరుకు.

రాఘ :—ఇదుగో మన మేమన్నా కార్యం తలపెట్టామంటే అది యిహ పరాలకు అనుకూలమై యుండాలె. మనము పెండ్లి తలపెట్టామనుకో, మనము ముందేమి చూడాలంటే దాంపత్యము అనుకూలమైందా లేదా అని ఆలోచించాలె. వరుడు ద్వాపరయుగములోనివాడున్ను, కన్య కలియుగములోనిది అయి యుండ కూడదు. ఇప్పుడు చాలామంది యీ విషయాన్ని పాటించకనే వున్నారు. డెబ్బయి రేండ్ల ముసలిపీనుగుకి, మూడేండ్ల గుంట నివ్వడము కలియుగాచార మైపోయింది. చూశావు ముసలి మంగయ్య వున్నాడు.........

కనకం :—ఆగండి! ఆగండి! బాగా సమయానికే యెత్తారు. మంగయ్య గారి సంగతి యీవేళ చెప్పాలని అనుకుంటూ వున్నాను. మంగయ్యగారికి కాంతాన్ని యివ్వడానికి మా అమ్మ వొప్పుకొని వచ్చింది.

రాఘ :—(ఆశ్చర్యముతో) ముసలి మంగయ్యకే?

కనకం :—ముసలాయనా మంగయ్య?......మీకన్న వుటాకీ సుంద్రాయి లాటి మనిషి. ఎంత ఆస్తి, యేమి కళా! కాంతంగారికి చేసా ఏమిటి? మీనోటేనా యీగొడవంతా ఎత్తడం.

రాఘ :—నేను వృద్ధ వివాహాలకు వొప్పుకునేవాణ్ణి కాను. ఇటువంటివి నా యింట్లో పనికి రావు......

కనకం :—(ఎక్కడలేని కోపము వచ్చింది.) మీయిల్లేమిటి మీయిల్లు? ఇది మావారి ఆస్తి గాబట్టి పలుక్కూవున్నారు. మీరు తెచ్చే నలభయి రైళ్ళకు రూపా యిలలో గడుస్తావుండా సంసారమంతాను? ఏదో మూడుకట్లు కట్టుకొని మూడు తీగలు తిరగ్గానే మొనగాళ్లయిపోయారా?

రాఘ :—కాదూ......

కనకం :—కాదూ లేదు, గీదూ లేదు. సంబంధాల విషయాల్లో మీకేమి తెలుసునని? మీకు పస్తా ఎందుకు మధ్య. మా అమ్మ తీరా మాట యిచ్చేసింది... మంగయ్యగారి కేమి లోటమ్మా?

ఇంతట్లో గౌరమ్మగారు రంగుకున్నారు.

గౌరమ్మ :—తీరూ తెంపూలేని కాపుర మయిపోయింది. అతగాడ్ని యివ్వొద్దోయి యీ మనువంటే యిచ్చి చచ్చాడు. కత్తెర బోనులో పడ్డట్టు నలిగి పోతా వుంది పిల్ల. అత్తముండ ఆడబిడ్డముండా దూరానికి పోయినా నాటిపోరు తప్పింది కాదు. ఇంట్లో రోజూ కేదో దొమ్మరమేళా మవుతానే వుండాలె...ఇతగాడికి యేమి వచ్చిందో నాలుగు రూపాయిలు వచ్చే మనువు చూసిపెడ్తే? ఎందుకు జొర బడ్డానో యీపాడు మనువుల్లో. పుణ్యానికిపోతే పాప మెదురై వస్తుంది.

అంటూ గౌరమ్మగారు, తన్ను తాను తిట్టుకుంటూ, కాలాన్ని తిట్టుతూ, మన రాఘవరావు కామె పిశాచమై కనుపించింది. రాఘవరావు లెక్చరు గౌరమ్మ రాగాలలో అంతమొందినది. లోపలి వూహాలన్నీ అతని గొంతుకలోనుంచే తిరిగి పోతున్నాయి. అతనికి యేమనడానికీ తోచలేదు, మినకరిస్తూ మనసుసక్చ్భలో కూల



బడ్డాడు. గౌరమ్మ ముక్కు మూతి విరుచుకొని, తలుపు రెక్కలు పడేలని కొట్టి గది లోనుండి అవతలకు పోయింది.

మంగయ్యగారి పునర్వివాహము మరియిద్దరకు కంటకముగా వుంది. ముఖ్యముగా కంటకమైంది సూర్యకాంతానికి. అయితేనేమి, వొకచెంపనీరు, వొకచెంప పాలు కారేపిల్ల సూర్యకాంతం. ఏడేండ్ల ప్రాయంలో పెండ్లంటే యేమి తెలుసు, పెడాకులంటే యేమి తెలుసు? అందుచేత, ఆపిల్ల గోల కనుపించ లేదు.

కాని, మిక్కిలి దుఃఖిస్తూవుంది సూర్యానారాయణే. ముసలాయన పెండ్లిచేసు కుంటే మాటనడుస్తుందిరా అని అతనికి గుండెలలో రాయి పడింది. ఇన్నాళ్లు తండ్రి లాగ ప్రేమిస్తూ వున్నందుకు ఫలించక్కడు కదా అని అనుకుంటాడు సూర్యనారాయణ. ఇంతముసలికాలంలో పెండ్లిచేసుకునేబుద్ధి యెందుకుపుట్టిందయా ముసలాయన కని సూర్యనారాయణ లోలోపలే కుమిలి పోతున్నాడు. అదరించి బెదరించి చెప్ప డానికి అడ్డాలలో బిడ్డా మంగయ్య? సూర్యనారాయణకు యేమి చేయడానికి తోచ కుండా వుంది.

"స్త్రీలు దేనికన్నా సాహసులు. ఏదన్నా కార్యం నెరవేరాలంటే, అది స్త్రీల వల్లే కావాలె; వాళ్ల మాటలు వుంగరాలకు వజ్రాలుపొదిగినట్లుగా వుంటాయి. నమ్మించి చెప్పడానికో బొంకించి చెప్పడానికో వాళ్లే సరి?" అంటూ ఆలోచిస్తూ కూర్చున్నాడు సూర్యనారాయణ. అతని వుద్దేశ మేమిటంటే, అతని భార్యయిన కమలచేత ముసలాయనకు నచ్చ చెప్పించి పెండ్లి మాన్పించాలని.

కమల స్వతాగా తెలివైన పిల్ల. కొంతవిద్యావతి కూడాను. ఇంగ్లీషుబడిలో మూడు నాలుగు ఫారాల వరకు చదువుకుంది. ఆవిడ యేదన్నా కార్యం తలపెట్టిందా అది కొనసాగేవరకు సాధించినదన్నమాటే. అందుకనే సూర్యనారాయణ దేవుళ్లాట.

సమయానికే కమల కాఫీ తీసుకొని వచ్చింది.

కమల :—ఇవాళేం దీర్ఘాలోచనలో మున్గారు. కాఫీ అవసరంలేదా యేమిటి?

సూర్య :—సమయానికే వచ్చావు కూర్చో. నీతో వొక సంగతి మాట్లాడాలె.

కమల :—బల్లమీద (కూర్చుంటూ) సరె కూర్చున్నాను.

సూర్యా :—విన్నావా! మీ మామగారు మళ్లీ పెండ్లిచేసుకుంటా రట.

కమల :—ముందే తెలుసును నాకు (దీర్ఘంతీస్తూ) బుల్లి అత్తగారిని తెచ్చు కుంటాను. పెండ్లిపెత్తన మంతా నాదేను.

సూర్య :—ఏడ్చినట్టేవుంది దీర్ఘాలు. ఇందువల్ల నష్టం మనకెంత వుందో తెలుసా?

కమల :—నష్టంలేదు గిష్టంలేదు. మీకు వచ్చే ఆదాయం చాలదా, ఆయన ఆదాయానికి ఆసించ డానికి.

సూర్య :—డబ్బంటె చేదా యేమిటి?

కమల :—పెండ్లామంటే కష్టమా యేమిటి?

సూర్య :—అబ్బా కొంత నచ్చచెప్పి ముసలాయన పెండ్లి మాన్పిస్తూ. నీ మాటలలో ఆయనకు గురివుంది.

కమల :—ఉహూ! మగవాళ్లా పిల్లనిస్తా నంటే పెండ్లి మానేవాళ్లు?

సూర్య :—కమలా! ఇప్పుడు హాస్యాలు చెయ్యకు తలనొప్పిగావుంది.

కమల :—ఎందుకూ మీ కంత విసుగు?

సూర్య :—వినుగుమాట కేమిలే. నా మాట వింటావా వినవా ?

కమల :—మీ కిప్పుడేమి కావాలె ?

సూర్య :—పెండ్లి మాన్పించాలె.

కమల :—ఎట్లాగ ?

సూర్య :—ఏదోవుపాయంగా ముసలాయనకు నచ్చజెప్పి.

కమల :—ఉపాయం చెప్పాలా ? అయితే వింటారూ ?

సూర్య :—వినకేమి.

కమల :—మీకు కాబోయే అమ్మగా రెవరో తెలుసునా ?

సూర్య :—ప్రసన్నరాఘవరావు గారి అమ్మాయి కదూ ?

కమల :—దానికేమి ? ఆయన యెటువంటివారో తెలుసునా ?

సూర్య :—అతనంటే తెలియనివా ళ్లెవరు రిఫార్మరు గారని వూరంతా అనితే.

కమల :—ఆయన యీ పెండ్లికి యెలా వొప్పుకుంటారు?

సూర్య :—(సూర్యనారాయణ మొఖం తేటబడ్డది.) మాబాగాజ్ఞాపకం చేశావు కమా కమల !...అవును. అతని యింటికి పోయి, "ఓయీ ! ఐడియల్ రిఫార్మర్ యీ ముసలిపెండ్లికి యెట్లా వొప్పుకున్నావోయి" అని అడావిడి చేస్తా. పబ్లిక్కులో పెడ్తానని బెదరిస్తా. వేరే మందూ గిందూ అవసరం లేదు. మా బాగా జ్ఞాపకమూ అందుకనే ఆడదానిబుద్ధి సూక్ష్మమని ప్రబంధాలు చెప్పిపారేశాయి.

అంటూ వున్నట్టుగా లేచి కమల భుజాన్ని సంతోషాన్ని చరచి, గబగబ డ్రెస్సు వేసుకొని, చేతికఱ్ఱను గిఱ్ఱని త్రిప్పుకుంటూ బయలు దేరాడు సూర్యనారాయణరావు......ప్రసన్నరాఘవరావుతో నోటియుద్ధం చెయ్యడానికి. ఈ అడావిడంతా చూసి కమలకు నవ్వొచ్చింది. బంగారు మొగముతో నవ్వుతూ, సూర్యనారాయణ దృష్టిపథం నుంచి జారిపోయేవరకు చూసింది కమల.

ఇంత ముసలికాలంలో మామగారు పెండ్లి చేసుకోవడం కమలకు యేమాత్రం యిష్టంలేదు. ఇట్టి వృద్ధ వివాహాలు మానిపించాలని ఆమెకు గట్టి పట్టుంది. అందుకని, ఆమె పెండ్లి విఘ్నానికి వుపాయాల నాలోచించకుండా వుండలేదు. అయితే ఆమె ప్రయత్నాలు నిగూఢంగా వున్నాయి. కాని, మామగారితో మాత్రం పెండ్లి మానమని చెప్పడానికి ఆమెకు మనస్కరించలేదు. ఇందువల్ల మామగారికి మనోక్లేశము కల్గుటేకాక, ఆయన దబ్బుకు తాను ఆశపడునట్టు తోస్తుందని యీవిషయం గురించి మాట్లాడ దలచుకోనలేదు కమల.

ॐ

పెనడ్లామంటే బెల్లమనిచెప్తారు పెద్దలు. నల్లగావున్న తెల్లగావున్న బెల్లము బెల్లమే. భార్యకన్నా మించిన వస్తువు పతికి ప్రపంచకములో లేదు. సతి లేని యిల్లు "హరికేను" లైటు లేని కొంపలా గుంటుంది. అటువంటి యిండ్లు వెన్నెల లేని రాత్రుళ్లక్రింద లెక్కే. అందులో పెండ్లాన్ని పంచప్రాణాలుగా భావించేవాడికి మరీ వుంటుంది భార్యపైన తీపి. భార్య మాట్లాడకపోతే అటువంటి వాడు తామరాకులోని నీళ్లులాగ తల్లడిల్లి పోతాడు.

మన ప్రసన్న రాఘవరావు ఆ తెంతులోనివాడె. పెండ్లామంటే అతని కెంతో ప్రీతి. అతని కెంత ఆపదయినా రానీ, భార్యమాత్రం ఆనందములో నూగులాడాలి.

కనకమ్మ అతనితో మూడురోజులు మాట్లాడకుండేటప్పటికి రాఘవరావు తహతహ లాడిపోయాడు. ఇంటికి వెలుగే యిల్లాలు, వంశానికి వన్నె యిల్లాలు, జీవయాత్రకు రథమే యిల్లాలు, అందులో చక్కని యిల్లాలు, యవ్వనంలో వున్న యిల్లాలు, యిటువంటి యిల్లాలు, అతనిపై కోపగించు కున్నప్పుడు అతనికి క్లేశ్చెం దుకు, ప్రపంచక మెందుకు, ఏవైభవమున్నా అతని కెందుకు?

ఆ మూడు రోజులు రాఘవరావుకు మూడు అమావశ్యలక్రింద గడిచాయి. ఆ మూడురోజులు మూడు యుగాలు గడిచినట్లుగా వున్నాయి అతనికి. మనిషి డీలా పడి పోయాడు. కంటికి నిదురలేదు. మనస్సుకు శాంతి లేదు. ఇక రిఫారంల వుద్దేశాల కొరక సలా మనుకున్నాడు. ఇక భార్యతో సంధిచేసుకోవడమే వుత్తమమయిందనుకున్నాడు రాఘవరావు. గబగబ ఆవిడున్న గదికి పరుగెత్తాడు. కనకమ్మ రెండు చేతులు పట్టుకొని "ఇదుగో మాట్లాడవూ, ఇదుగో మాట్లాడవూ" అంటూ ఆవిడను బతిమాలడం మొదలు పెట్టాడు. కనకంగారు తలను తూర్పునుంచి పడమటకి పడమరనుంచి తూర్పుకి త్రిప్పుకోవడం మొదలు పెట్టింది. రాఘవరావు కనకం చేతులను పట్టుకొని అతి దీనంగా అడగడం మొదలు పెట్టాడు మాట్లాడమని. చివరకు కనకమ్మకు చిరునవ్వొచ్చింది. అప్పుడు చంద్రుడు వికసించినట్లుగా వుంది




రాఘవరావుకు. "నాతో మాట్లాడవూ" అని యింకొక సారి నోటితో కాకుండా కండ్లతోటి రాఘవరావు అడిగాడు.

కనకం :—నా మాటకు వొప్పుకున్నట్టేనా ? (అని చిరునవ్వు నవ్వింది.)

రాఘ :—ఆహా !

కనకం :—అహా ! అంటేకాదు. చేతులో చెయ్యివేసి చెప్పండి.

రాఘ :—(ఒట్టువేయుచు) మంగయ్య వివాహానికి వొప్పుకున్నాను.

కనకం :—మంగయ్య వివాహానికి వొప్పుకోవడం కాదు. సూర్యకాంతాన్ని మంగయ్య కివ్వడానికి వొప్పుకున్నానని వొట్టు వెయ్యండి.

రాఘ :—ఆలాగే ఇదుగో, సూర్యకాంతాన్ని మంగయ్య కివ్వడానికి వొప్పుకున్నాను. (ఒట్టు వేయును.)

కనకం :—తిరిగి పోతేనో ?

రాఘ :—తిరిగి పోవడమే ?......అయితే.

కనకం :—అదుగో వచ్చింది......అయితే యేమిటి ? గియితే ?

రాఘ :—మనము కాళ్లు కడుగవలసిన దేనా ?

కనకం :—ఆహా ! దక్కనిస్తూ.

రాఘ :—ఇంత వూరిలో పేరెక్కిన ట్రూ రిఫార్మరని ప్రజ లందరిచేత అనిపించుకుంటూ యిప్పుడు ఎనభైయేండ్ల ముదుసలికి సూర్యకాంతానిచ్చి కాళ్లు కడుగవలసిందేనా ?

కనకం :—మొదలు కొచ్చింది వ్యాపారం !

రాఘ :—ఈ బస్తీలో యిటువంటి వివాహాలు చేస్తే ప్రజలు నలుగురు నవ్వి మనకు తాటాకులు కట్టరూ ?

కనకం :—(కోపముతో) అయితే యేమంటారు ?

రాఘ :—నీవు చెప్పినట్టే వివాహానికి వొప్పుకుంటాను. నీవుచెప్పినట్టే కాళ్లు కడుగుతాను కాని, యీ వూరిలో వివాహం చెయ్యవద్దు. చుట్టుపట్ల గ్రామములలో యెక్కడన్నా చేస్తాము. ఇక్కడుంటే గందరగోళ మయిపోతుంది. మా సంఘం వాళ్లు మహా చెడ్డవాళ్లు. మనకు తాటాకులు కట్టడమే కాకుండా పెండ్లికి విఘ్నాలుకూడ తలపెట్తారు.

కనకం :—విఘ్నాలు తలపెట్తారూ ? ఏసీ తలపెట్టమను ఎవరు తలపెట్తారో చూస్తాను.

రాఘ :—కోపము తెచ్చుకోక ఏదో నేను ప్రతిష్టలు కొంచెమన్నా నిలపెట్టు మని.

కనకం :—(వినుగుతో) ఎందుకు మీ కంత జంకు ? అయినా వాళ్లు యీ వూరిలో చెయ్యరటలే. రంగపురం వాళ్ల వూరికి దగ్గిరట, గుళ్లో పెండ్లి చేస్తామని అంటున్నారు.

రాఘ :—అట్లాగా బ్రతికాను. అయితే పెండ్లి గప్‌చుప్‌గా జరిగిపోతుంది.

రాఘవరావు మనస్సు యిప్పుడు స్తిమిత పడ్డది. అతనికి అతని భార్యకు వున్న వైరం మబ్బువిడిపోయినట్లు విడిపోయింది. పిల్లపెండ్లి మాటా ? పిల్లబాధ్యత గారమ్మది కాని తనదికాదు గదా. ఆవిడ ముసలివాడి కిచ్చుకుంటేనేమి ? యెవరి కిచ్చు

కుంటేనేమి ? ఈసంబంధమువల్ల **అతనికి** ముందుముందు లాభాలుకూడా వున్నాయి. అయితే, ట్రూరిఫార్మరని ప్రజలంటున్నారే. ఆపేరు యీ పెండ్లిచేస్తే పోతుందన్న వొక్కవిచారమే అతనికి పట్టుకుంది. దానికికూడా నష్టంలేకుండా సూర్యకాంతం పెండ్లి జరిగిపోతుంది. ఎక్కడో రంగపురంలో పెండ్లి చేస్తే తనక్లబ్బువాళ్లకేమితెలుస్తుంది. తాను కన్యాదానం చెయ్యడం వాళ్లు చూడొస్తారా ? అంతగా శ్రుతి మించి రాగంలో పడుతుందా ? దేవోవకటిచెప్పి బూకాయించలేడు మన ప్రసన్నరాఘవరావు.

౬

నాడు సూర్యనారాయణ ఇంత ఆదాయినిగా రాఘవరావింటికి పోయావన్న మాటే కాని, యింట్లోవుండి లేదనిపించాడు రాఘవరావు. ఆ మరునాడు అంతపనే అయింది. క్లబ్బులో వొకసాయంత్రం మనిన్ని పట్టుకొని జాడించడానికి వుద్యుక్తుడయాడు సూర్యనారాయణ. రాఘవరావతన్ని చాటుకు తీసుకొని పోయాడు. వాళ్లకిట్లాంటి సంభాషణ జరిగింది.

సూర్య :—మూడు రోజాలనుండి మీకోసరం తిరుగుతున్నాను. మీ దర్శనం దొక్కడాలేదు ?

రాఘ :—అవును పెండ్లిప్రయత్నాలు కదూ మరి.

సూర్య :—(సూర్యనారాయణ గుండెలు గుభీలు మన్నాయి.) అయితే పెండ్లి చెయ్యడానికి మీరు నిశ్చయించారన్నమాటేనా ?

రాఘ :—ఏం అలా అంటారు?

సూర్య :—మీరు ట్రూరిఫార్మరులని, యిటువంటి వివాహాల మాన్పడానికి వుద్దేశించారని ప్రజలందరూ అనుకుంటూ వుంటే, మీరే యిట్టి వివాహాల కొడబడితే......

రాఘ :—ఏమి చెయ్యమంటారు? ఇంట్లోవాళ్లకి మీ సంబంధంమీదనే వుంది. మీతో సంబంధం మాకెప్పుడు దొరుకుతుంది?

సూర్య :—అంతమాత్రానికి రిఫార్మరులని అనిపించుకోవడ మెందుకు? ప్లాటుఫారా లెక్కడ మెందుకు ? పెద్ద పెద్ద లెక్చర్లివ్వడ మెందుకు ? గొంతుకలు చించుకోవడ మెందుకు ?

రాఘ :—అయితే మాతో సంబంధం చేయడానికి మీకిష్టంలేదా యేమిటి ?

సూర్య :—ఎవరన్నారు ?

రాఘ :—మీ ధోరణి అట్లావుంది.

సూర్య :—నాధోరణి కేమిలెండి. మీలాంటి రిఫార్మర్లు మా నాన్నగారికి పిల్లనివ్వడం కన్నా సంతోషం నాకేముంది.

రాఘ :—(తనలో) ఇతనికి వాళ్ల పెదనాన్న వివాహ మిష్ట ముంటుంది. ఇతను చెలరేగా దంటే మనపని వసలే వుండదు. ఒక్కడాబు డాబాలె. (ప్రకాశంగా) సూర్యనారాయణరావు నిన్నొకక్క సంగ తడుగుతాను, ము స్సంలేకుండా చెప్పగలవా ?

సూర్య :—ఆహా ! అడగండి అట్లా మనసుంచుకునే రకము నాది కాదు.

రాఘ :—మీనాన్నగారు యింత వయస్సులో వివాహం చేసుకోవడం మీ కిష్టమేనా ?

సూర్య :—నా కెంతమాత్రం యిష్టంలేదు. ఆయనకు వయస్సుచెల్లింది. ఆయనకు యిప్పుడు పెండ్లేమిటి ?

రాఘ :—అంతే నావుద్దేశం. అయితే వినండి; ఈవివాహాన్ని తప్పించడానికి ప్రయత్నాలు చేస్తున్నాను.

సూర్య :—నిజమేనా ?

రాఘ :—నేనంటే మీకు నమ్మకం లేనట్లు కనిపిస్తుంది.

సూర్య :—నమ్మకం లేకేమి? అయినా, ప్రయత్నాలెందుకు "మాకు యీ మనువు యిష్టంలేదు" అంటే తీరిపోదూ ?

రాఘ :—అట్లాకాదు. మావాళ్లు మీతోసంబంధం చెయ్యాలని చాలా అభిప్రాయంతో వున్నారు. అందుచేత 'ఊ' అనడం తప్పేదికాదు. వాళ్లను సంతోషపెట్టేవుపాయం చూడాలె; పెండ్లి తప్పే సాధనం కనిపెట్టాలె; లగ్నాని కంతా సిద్ధమయ్యే టైములో పెండ్లి 'టక్' అని ఆగే ప్లాను వేస్తూవున్నాను.

సూర్య :—అవును మీకెంతమాట! అపఖ్యాతి యిటువంటి పెళ్లిళ్లుచేస్తే.

రాఘ :—నామాటమీద వుండండి. మీకేమి భయములేదు. అయితే యీ సంగతి మాత్రం పైకి పొక్కనీయకం డేమి ?

సూర్య :—ఆలాగే.

రాఘ :—వివాహం రంగపురంలో తలపెట్టండి. అదీ రాత్రిలగ్నమే చూడండి. గుడిలో లగ్నమే కదూ ?

సూర్య :—అవును.

రాఘ :—(టైముచూచి) అబ్బో ! అప్పుడే ఎనిమిది కావచ్చింది. పదండి యింటికి పోదాము.

అని రాఘవరావు సూర్యనారాయణరావుని బుజ్జగించి పంపించాడన్న మాటేగాని రాఘవరావుకు పెండ్లి తప్పించే ప్రయత్నాలేమీ లేవు. ఇట్లా నాలుగైదు రోజులు గోస్తేనేగాని సూర్యనారాయణ యీ నాలుగు దినాలన్నా తన పరువును పుంచడని అతనికి తెలుసును. ఇక పెండ్లి అయినతరువాత అపనింద అదెట్లాగా వస్తుంది. ఉన్న కొందునాళ్లన్నా కొంత గౌరవంగా వుండొచ్చు కదూ.

సూర్యనారాయణ యింటికివచ్చేటప్పటికి కమల యెదురైంది. అతని ముఖాన్ని చూసి యేవో సంగతు లున్నా యని కమల గ్రహించింది.

కమల :—ఏదోవుంది, ఇవా ళింత కులాసాగా వున్నా రేమి ? సంగతు లేమి ?

సూర్య :—నీకెందుకు పెండ్లి ప్రయత్నాలంతా తలపెట్టు చెప్తాను. పెండ్లి ఆగే ప్రయత్నాలు ఆలోచించి వచ్చానుకదూ. లగ్నాని కంతా సిద్ధమయేటప్పటికి పెండ్లి 'టక్' అని ఆగిపోతుంది.

కమల :—ఏమిటి ఆవుపాయం ?

సూర్య :—అదేమో నాకూ తెలియదు.

కమల :—ఎవరు చెప్పా రేమిటి ?

సూర్య :—ప్రసన్నరాఘవరావు చెప్పాడు. ఆయన ప్లానులు వేస్తూ వున్నాడు అట్లా చెయ్యడానికి.

కమల :—ఏదో అంత నమ్మతగ్గది కాదు. పిల్లనిచ్చేది అతను ఇవ్వనంటే తీరిపోయేదానికి యెందు కింత గందరగోళం ? గోటితోటి పోయేదాన్ని గొడ్డలికి పెరిగే దాకా పెట్టుకుంటారూ ?

సూర్య :—పోదూ, ఆడవాళ్లకేమి తెలుసు. పద వడ్డించు.

కమలానికి సూర్యనారాయణ పలుకు లేమి రుచించాయి కావు. రాఘవరావుమీద నమ్మకము అసలేలేదు ఆవిడకు. ట్రూరిఫార్మరని కవుర్లుచెప్పే అతను యీ పెండ్లి కెట్లావొప్పుకున్నాడో తెలియదు. ముందెప్పుడో ఆపుతాడా? అదిమట్టుకు నమ్మక మేమిటి? రాఘవరావు చెప్పిన కవుర్లు వట్టి ముఖప్రీతి కవుర్లని కమల గ్రహించింది. పెండ్లి నాపడానికి ప్రయత్నాలు తానే చేయ సంకల్పించు కుంది కమల.

౭

కమల కొక్కడే అన్న. అతని పేరు నరసింహారావు. నరసింహారావు విశాఖపట్నంవైపు వొక వుపాధ్యాయుడు. ఇప్పుడిప్పుడు సినిమాలు వచ్చిన తరువాత నరసింహారావును అందరూ మర్చిపోతున్నారు కాని, అంతకు ముందు నరసింహారా వెప్పుడు నటుడు వెస్తాడ్రా అని అందరు కనిపెట్టుకొని కూర్చున్నవాళ్లే. ఒక్క నలుని పాత్రే యేమిటి, బాహుకుడు, యముడు మొదలుగాగల పాత్రల నెన్నో వేసి సెబాషనిపించుకున్నాడు నరసింహారావు.

మంగయ్య వివాహం గురించి వుత్తరం వ్రాసింది కమల నరసింహారావుకు. వృద్ధవివాహాలను మాతమార్చాలనే వుద్దేశం గల కమల, మామగారి వివాహాన్ని యుక్తిగా మాన్పే తంత్రాలకై అన్నకు వ్రాసింది. ఒకనాడు కమలకు జాబొచ్చింది. అందు నరసింహారా వీవిధంగా వ్రాశాడు.

విజయనగరం.

ప్రియసహోదరి, 28-10-30

ఆలోచించగా ఆలోచించగా నేటికొక యుక్తితోచింది. అది నిశ్చయముగా నెరవేరగలదు. వివాహ ప్రయత్నములను యథావిధిగ జరుగనిమ్ము. పెండ్లి రంగపురమున, గుడిలో నిశ్చయించుటచే మన ప్రయత్నములు సఫలీకృతమగుటకు నెక్కువ యవకాశములు గలవు. రాత్రి వివాహమగుటవల్ల వేషనైపుణ్యము మిక్కిలి శోభింపగలదు. తెరవైచి యొక్కనాటక మాడించి చూచెదను. పెండ్లినాటి సాయంత్రమునకు రంగపురమును చేరుకొందును. నారాక సంగతి వెల్లడి పుచ్చకుము.

గ్రహించుము.

V. Narasimha Rao

౫

రంగపురములో పెండ్లిగోలవచ్చినది. పెండ్లివారు గుడిసత్రములో దిగిరి. రాత్రిలగ్నం గాబట్టి పగలు పెండ్లి కుమారుణ్ణి చెయ్యడం, పెండ్లి కుమార్తెను చెయ్యడం మొదలగు వేడుకలంతా జరిగినవి. కమల చెడ్డ అడావిడిగా వుంది ఆరోజు. రాత్రి రెండు గంటలకు రంగనాథస్వామి గుడిలో పెండ్లి.

రంగనాథస్వామి గుడి వూరిలోవున్న నాలుగు కొంపలకు కొంచెము దూరము లోనే వుంది. గుడి పెద్దదే. దేవతలు కట్టిన గుడి అని పెద్ద లంటూవుంటారు. స్వామి మాహాత్మ్యం చాలావుందని అందరి అభిప్రాయము. అప్పుడప్పుడు స్వామి ప్రత్యక్షమవడం, పూజారి గంతు లెయ్యడం జరుగుతూవుంటుంది అక్కడ.

రాత్రి రెండుగంటల యిరువది నిమిషాలకు లగ్నం. అయితే రాత్రంతా యెవరికి నిద్ర లేదు. పదిగంటలదగ్గరనుంచీ బజంత్రీలు బాజాలలంకించు కున్నారు. పురోహితులవారు లగ్నానికి కావలసిన సామానులను అడలేసి తెప్పిస్తున్నారు. గౌరమ్మ, కనకమ్మ వాళ్లకే పెండ్లిలాగ మాచెడ్డ అట్టాసంతో వున్నారు. కాని, పగ లంతా అడావిడిగా తిరిగిన కమల, కాలికి దెబ్బతగులుటచేత వొళ్లు పులకరిస్తూవుందని దుప్పటి కప్పుకొని సత్రం గదిలో పడుకుంది.

రెండుగంట లయేటప్పటికి లగ్నంచోటు మహా అడావిడిగావుంది. ఇటు రెండు గ్యాసులైట్లు అటురెండు గ్యాసులైట్లు మంచి అట్టాసముతో వెల్గుతున్నాయి. బజంత్రీలు యెడతెరపిలేకుండా వాయిద్యాలు వాయించేస్తున్నారు. చాకళ్లు తాటి స్తంభాల నానుకొని కునికిపాట్లు పడుతున్నారు. లగ్నం పీటకు నలువైపుల పెండ్లి పెద్దలు కూర్చుని ముసలిపెండ్లికొడుకు వణికేవిధం చూస్తున్నారు. పూజారివారు గర్భగుడి యివతలి గుమ్మము నానుకొని పెండ్లి తంతును పట్టెనామాలతో అవలోకిస్తున్నారు. నడ్డివిగించుకొని కూర్చుని, ముక్కుకు పొడుముదటిస్తూ, వున్నమంత్రాలు కొన్ని లేనిమంత్రాలు కొన్ని కలేసి దేకరుపెట్టున్నారు పురోహితులవారు. సంభావన బ్రాహ్మణులు చతికిలబడి కూర్చుండి, జందెముల సవరించుకుంటూ పురోహితులవారి మంత్రాలలో యిక్కడొకముక్క అక్కడొకముక్క నందుకుంటూ పిలకలతో జెక జెక లాడుతున్నారు. గాలికి కల్లుకదలేవిధాన జీవపటుత్వంతప్పిన దేహము వూగులాడగా, పండుపిలక తలను వూపుకుంటూ, బోసినోటిని నములుకుంటూ, లోతుకండ్లేసుకొని, పటుత్వం తప్పిన చేతులతో తాంబూలాదుల పురోహితులవారికి సమర్పిస్తూ, వృద్ధవరుడగు ముసలి మంగయ్యగారు తన డెబ్బదియైదవ యేట నేడేండ్ల బాలికను పుస్తెకుగట్ట వివాహమంత్రాలను జరిపించుకొనుచున్నారు. శివశక్తి వుడగడంచేత పెదనాన్నగా రెక్కడ తూల్తారో అని మంగయ్యగారికి ఆసగా యిచ్చుచు, సూర్యనారాయణరావు పెండ్లికొడుకు చెంతకూర్చున్నాడు. కాని, అతని దృష్టి రాఘవరావుమీదనే వుంది.

మెలిచికట్టు మీసముల సర్దుకుంటూ, చేతికర్ర త్రిప్పుకుంటూ, వృద్ధవివాహాలు యెవ్వరు చేస్తారో చూస్తామని, క్రాపింగుతల వూగేలాగ ప్రగల్భాలుపలికే ప్రసన్నరాఘవరావు అత్తగారి నోటికి, భార్యగారి తీరుకు భయపడి ముసలిమంగయ్యగారికి సూర్యకాంతాన్ని కన్యాదానము చెయ్యడానికి పట్టువస్త్రాల ధరించి సిద్ధపడ్డాడు. దీనితో సూర్యనారాయణరావు వాసలన్నీ అంతరించాయి. రాఘవరావు యేదో వుద్ధరించేస్తా డనుకున్నాడు సూర్యనారాయణ. లగ్నసమయానికి పెండ్లి టక్ అని మాన్పిస్తాడంటే, నిజమే అనుకున్నాడు సూర్యం. కట్లెంపద్ద గుట్టములాగ భార్యకు లొంగిపోయి కన్యాదానమునకు రాఘవరావు సిద్ధపడేటప్పటికి సూర్యనారాయణకు ఆశ్చర్యము, దుఃఖము వొక్కసారి అంకురించాయి. రాఘవరావొట్టి మాటకారని సూర్యనారాయణ కెంతో కోపమొచ్చింది. ఏమొస్తేనేమి పెండ్లి ఆగే వుపాయ మేమీ లేదు. కన్యాదాన మవబోతుంది, యిక మంగళసూత్రధారణ మవుతుంది. తా నిప్పు డడ్డుపడి చేసే దేమిలేదు. ప్రస్తుతం చేయవలసింది అతడు మొగం చిన్నబుచ్చుకొని పక్కినాపేనులాగ వొకచోట పడుండడమే.

ఏమన్నా చేస్తే దైవమే చెయ్యాలె. మనవాళ్లంతా పెండ్లిగొడవలో వుండేటప్పటికి 'ఢాం' అని ఫిరంగిశబ్దంలాగ వినిపించింది ఏదో. పెళ పెళ మని భీకర శబ్దాలు దాన్ని అనుసరించాయి. అందరూ నిర్ఘాంతపడిపోయారు. గ్యాసులైట్లు ఏమయాయో తెలియదు. శుక్లపంచ మవుటచేత చంద్రు డస్తమించి చాలాసేపయిపోయింది. గాఢాంధకారము గుడంతా క్రమ్ముకుంది. అదలి, పూజారి గర్భగుడి కడ్డముగా పడిపోయాడు. అంతా గందరగోళ మైపోయింది. పెండ్లివారు పెల పెలమని లేచారు. సంభావనబ్రాహ్మణులు గోచీల సర్దుకోవడం మొదలుపెట్టారు. పురోహితులవారు లేస్తూలేస్తూ సందడిలో జారిపోయిన పొడుంకాయను దడదడ లాడ్తు దేవులాడడం మొదలుపెట్టాడు. "ఎక్కడి దాష్టని యెక్కడి దాష్టని" అని రాఘవరావు మగవాడిలాగ పీటలదగ్గరనుంచి లేచాడు. కనకమ్మగారు ముందే సర్దుకున్నారు. ఇక లేవలేనివంతా లేవనుద్దేశించియు, లేవలేక చతికిల బడుచున్న ముసలిపెండ్లికొమారుడు; యిరన్ని లేవనెత్త తంటాలుపడుచున్న సూర్యనారాయణ రెండవవాడు; మూడవది, వంచినతలను నగమెత్తుచు "ఎవ్వరు లేవనెత్తకున్నా రేమి" అని యాలోచించుచున్న సూర్యకాంతం.

ధ్వనులు మరీ యెక్కువయిపోయాయి. అందరిగుండెలు జారిపోతున్నాయి. ఏ నిమిషాని కే ముప్పద్రవ మొస్తుందో అని అందరు తహతహలాడిపోతున్నారు. ఇంతలో వింతవెలుగు గర్భగుడినుంచి బయలుదేరింది. అందరి దృష్టులు ఆవైపే వున్నాయి. శంఖు చక్రముల ధరించి మహావిష్ణువు ప్రత్యక్షమయారు. ఆయన



మహాకోపముగ నున్నారు. గద త్రిప్పుచు రౌద్రాకారమున తాండవమాడుచున్నారు. లక్ష్మీదేవి ఆయన్ని పట్టుకొని ఆపజూచుచున్నది. "అపరాధం అపరాధం" అని గుడి మారుమ్రోగేటట్టు పెండ్లివారు, సంభావనలవారు బొబ్బరిల్లారు. స్వామివారి కెక్కడలేని ఆగ్రహ మొస్తూవుంది. భీకరముగ గర్జించుచు గదనెత్తి పెండ్లివారిపై నులుక గానున్నారు. లక్ష్మివా రడ్డుపడజూచుచున్నారు కాని, కార్యములేదు. స్వామిలవారికి ఆవేశ మెక్కువైపోయింది. లక్ష్మిని విదలించుకొనుచు, విష్ణువు గర్భగుడిగుమ్మమువరకు వచ్చేశారు. అంతె యెవరికీ ప్రాణాలమీద ఆసలేదు. గదొచ్చి యెక్కడ తలమీద పడుతుందో అని యెవరుమట్టుకు వాళ్లే చేతుల్ని తలల కడ్డు పెట్టుకోవడమే. సంభావనబ్రాహ్మణులు కొంత ధైర్యముతెచ్చుకొని పరుగు లంకించుకున్నారు. బజంత్రీ లప్పుడే పారిపోయారు. చాకళ్లు తాటిస్తంభాల కవతల నక్కి నక్కి వణకి చమటల గ్రక్కుచున్నారు. మనరాఘవరా వప్పుడే సత్రములోకి దౌడు తీసాడు. కనకమ్మ, గౌరమ్మ, తదితర ఆడపటాలం వెనుక్కు తగ్గితగ్గి గుడిగోడమూలకు జేరి వొకరిమీద వొకరు పడి నానా కంగారుపడ్డారు. సూర్యకాంతం బావురమని గౌరమ్మకోసగం పరుగెత్తింది. ఇక పెండ్లిపీటలదగ్గరవున్నవారు, ఆదలిపడిపోయిన ముసలి పెండ్లికొడుకుగారు, లోపల దడపుట్టి అతన్ని లేవనెత్తుతూవున్న సూర్యనారాయణ, గబగబ మాటల సర్దుకుంటూవున్న పురోహితులవారు— మహావిష్ణువు కోపములోవచ్చి పురోహితులవారి గొంతుకను పట్టుకున్నారు. "ఛె ఛె ఛె" అని సిద్ధాంతివారు మాటలమధ్య చతికిలబడ్డారు. లేవ తంటాలుపడుచున్న మంగయ్యను చూడడానికి లక్ష్మీదేవి మంగయ్యదగ్గరకు వచ్చింది. సూర్యనారాయణ కూర్చునే వెనుక్కు నాలుగడుగులు తగ్గి, లక్ష్మీదేవిని వెర్రిమొగం వేసుకొని చూడడం మొదలు పెట్టాడు. లక్ష్మి అతన్నికూడా చూచింది. అయితే లక్ష్మికి చిరునవ్వొచ్చి దృష్టి మరలించుకుంది. మహావిష్ణువు అడావిడిచేసి, హోమాన్ని ఆర్పి, పెండ్లికూటాన్ని చిందరవందర చేశారు. చివర కిద్దరు మాయ మయారు.

౬

తెల్లవారేటప్పటికి రంగపురంలోని ఆబాలగోపాలం గుడిలోకి ప్రవేశించారు. వాళ్లంతా ధ్వజస్తంభమువద్ద దడికట్టేశారు. పెండ్లివారి ఆడావిడేమిలేదు. పూజారి వారు గర్భగుడిముందు శివమాని ఆడుతున్నారు. "రంగ రంగ రంగ...కస్తూరి రంగ కావేటి రంగ..." అని రంగ శబ్దాలతో గుడంతా మారుమ్రోగేలాగ కేకలువేస్తున్నారు". "అడుగో కస్తూరి రంగడు; ఇడుగో కైలాస రంగడు; అడుగో కళ్యాణ రంగడు" అని చిందులు త్రొక్కుచు నెక్కడలేని అడావిడి



చేస్తున్నారు పూజారివారు. అందరు గర్భగుడి వైపు చూసేటప్పటికి అక్కడ విగ్రహాలు లేవు. ఒకరిద్దరు చొరవచేసుకొని గర్భగుడివద్దకు పోయేటప్పటికి, విగ్రహాల ముందు వొక తెరవ్రాలివుంది. అది నాటకములలో వుపయోగించే తెర. లోపలికి పోయి వారు చూస్తే వేషాలు వేసుకున్న చిహ్నాలు కనుపించాయి. "ఔరా! ఎంతపనయిందంటే ఎంత పనయిం" దనుకునేవాళ్లే అంతాను. లోపలకు పోయిన వాళ్లు చివర కొక కాళీ పౌడరుడబ్బా, ఒక విడిన బ్లూరంగు పాట్లము, ఒక జేబు రుమాలు బయటకు తీసుకొని వచ్చారు. ఆ॥ క॥ అను పొడి అక్షరాలు జేబురుమాలు మీద వున్నాయి. "ఆ॥ క॥" అంటే ఆలూరి కమలమ్మ కదూ?" అని అంటూ మన ప్రసన్నరాఘవరావు గుంపులోనుండి బయటకు వద్దాడు.

ఇక ఆనాటి సత్రములో, "ఇదంతా యీవిడే చేసిం" దని గౌరమ్మగారు రెండుచేతులు కమలవైపుచూపి విరగబడటం మొదలుపెట్టింది. "అందుకనేనా ఆవిడ అంత అడావిడిగా తిరిగిం"దని కనకమ్మగారు అందుకున్నారు. "అవును, రంగనాథస్వామి సన్నిధిలో విష్ణువు ప్రత్యక్ష మవడమేమిటి?" అని రాఘవరావు ప్రతాపం వెళ్లబోసుకున్నారు. "ఈ తెలివి రాత్రేమయిం"దని ముసలి మంగయ్యగారు యెత్తిపొడిచారు. "అయ్యో! నా పెంకెలునును, అంతా నన్ను పట్టు పంటూ రే" మని కమల చిన్నముఖం చేసుకొని చెప్పడం మొదలుపెట్టింది. "అవును నువ్వే. లక్ష్మీ వేషం వేసుకున్నది నువ్వే. నన్నుచూసి నవ్వలేదూ" అంటూ కల్పుకుంటూ సూర్యనారాయణ సాక్షి క్రింద చెప్పడం మొదలుపెట్టాడు. "చూసారా, చెవుల ప్రక్క రంగు యింకావదలలేదు. చూడండి" అని కనకమ్మగారు కమలను పరిశీలించి ఆడావిడి చెయ్యడం మొదలుపెట్టింది. చెవుల ప్రక్క తడువుకొని చెయ్యి చూసుకొని సిగ్గుతో కమల పరుగెత్తుకొని పోబోయింది. "శభాష్ అందరను బుద్ధొచ్చేలాగ చేశా" వని కమలను సూర్యనారాయణ పట్టి ఆపబోయాడు. "అబ్బా ఉండండి బాగా కడుక్కొని వస్తా" నని కమల తప్పించుకొని పారిపోయింది.

"ఇదుగో మీ విష్ణువు లేచివస్తున్నా"డని లోపలనుంచి వొక కేక వినబడ్డది. పంచి చొక్కాలతో వొక వ్యక్తి గద చేతపుచ్చుకొని పెండ్లివా రున్నచోటుకు వచ్చెను. ప్రసన్నరాఘవరావు తెల్లబోయి ఆవ్యక్తిని చూడటం మొదలుపెట్టాడు. "ఏమోయి! రిఫార్మర్ అలా తెల్లబోయి చూస్తావెందుకు? నేను నరసింహారావునోయి" అని వ్యక్తి రాఘవరావుతో చెప్పాడు. "బావా! నువ్వా! నమ్మల్నంతా అదలగొట్టింది" అని సూర్యనారాయణ నరసింహారావును ఆహ్వానించాడు. "ఏకీ మా మామగా" రని మంగయ్యగారిని సమీపించి "మామగారూ! పెద్దలతో హాస్యాలు చెయ్యకూడదని తెలిసిన్ని, మీ పెండ్లి లోకవిరుద్ధ మగుటచే యిట్టి విఘ్నం కల్పించాను.: క్షమించం, డని నరసింహారావు మంగయ్యకు ప్రణమిల్లాడు. ఆనంద బాష్పాలు రాలిస్తూ మంగయ్య "నాయనా! మంచిపని చేశావోయి, రాత్రి గానీ నీవు అడ్డుపడకపోతే నేను కష్టములలోపడి అల్లాడుటే గాక, అభము శుభము తెలియంగని ఆబాలికను అధోగతిపాలు చేసివుండేవాణ్ణి. బుద్ధి గడ్డితిని యిట్టి వివాహానికి వొప్పుకున్నానోయి" అని నరసింహారావును లేవనెత్తాడు. వీళ్ల సల్లాపమంతా కనకమ్మకు గౌరమ్మకు కంటకంగా వుంది. కనకమ్మ వ్రేళ్లు విరుచుకొని అక్కడనుంచి పోయింది. గౌరమ్మ గొణుక్కుంటూ బయటకు జరిగిపోయింది.

కొన్నిదినాలు పోయినతరువాత గౌరమ్మగారు మంగయ్యయింటికి వచ్చి, కష్టసుఖం చెబుతూ "పెళ్ళామి పోయినతరువాత మంచిలగ్నా లున్నా" యని మంగయ్యతో యెత్తింది. "బాబోయి! నాకు పెండ్లీవద్దు, గిండ్లీవద్దు. మహాలక్ష్మిగారు చెప్పిన హరినామస్మరణ బాగుంది. ఆనాడు కమల అడ్డంపడకపోతే మీ పిల్ల అధోగతిపాలయ్యేది...ఇంత పెద్దదాన వయావు నీకింకా జ్ఞానం రాలేదే" మని గౌరమ్మగారిని సాగనంపాడు మంగయ్య. కమల యిదంతా వింటూవుంది. "అనొక చీడపురుగుతో సమాన" మని కమల లోలోప లనుకొంది.

మంగయ్యగారి పునర్వివాహయోగం మంగళప్రదముగానే జరిగిపోయింది. గౌరమ్మలాంటి చీడపురుగులు దేశాన్ని యెంతమందో గలరు కాని, కమలలాంటి స్త్రీలు, నరసింహారావులాంటి యుక్తిపరులు దేశాన్ని ప్రబలి చీడపురుగుల యభిప్రాయాలను హతమారుస్తూ వుండాలె.

---

# ప్రేయసికి

(గరిగిపాటి రామమూర్తి గారు బి. ఏ.)

ప్రతిసుందర ప్రభాన్వితము నీయాన
నంబని కాబోలు నవ్వుకొన్నావు;
హాసమ్ములోనున్న యమృతమ్ము గ్రోలి
వెలిగ్రక్కుచున్నాడు తెలిచందమామ;
భవదీయసౌందర్య వైభవోచ్చయము
గాంచు కౌతుకమున గగనమ్ము వేయి
కండ్లతో జూచియు కనలేదు తృప్తి;

గంధవాహుడు కూడ కదల కున్నాడు
చెట్లచాటున దాగి; సిగ్గొంది నీవు
వెడలిపోవుదు వన్న భీతి కావలయు.
నవకవిత్వ ప్రభాభవధైర్యమునను
కవికుమారుడుమాత్ర మవిరళగీత
హారసంచయముల నల్లుచున్నాడు:
నీకంఠమున వేయు నిశ్చితమ్మునను.

# ఇంద్రజిత్తుని తొలికయ్యము

(సీతారామాయణమునుండి)

పాలేటి జయగోపాలు నాయుడుగారు

రణభేరిన్ మొరయించి వారలును శౌర్య స్థైర్య విస్ఫారులై
ఘన లంకాపురకోటపై నెడలనేగన్ జూచి లంకేశు పం
పున వైమానికసైన్యనాయకు డనల్పుం డింద్రజిత్తుండు త
ద్ఘనయంత్రంబటనెక్కి శత్రువులు దిగ్భ్రాంతింప నుగ్రాకృతిన్.
వెలువడనుండ తండ్రి పిలిపించి కుమారుని మందలించుచున్
చలమున రామలక్ష్మణుల జంపను మన్న విరోధమూని యిం
తలపను మూలమైన పినతండ్రి విభీషణు నుత్తమాంగమున్
గెలిచిన జాలు నెల్లరను గెల్చినయట్లె సుమా కుమారకా.
గుణహీనం బెరిగించి నీతివిహితోక్తుల్ దెల్పి యెల్లైన ని
వ్వనితన్ బంపుడు గాన వారల వధింపంబోక, మల్పుండు దు
ర్జను డా పాపి విభీషణుం డమితరాజద్రోహి, యట్లౌట నీ
వను మానింపక పిన్నతండ్రియని పుత్రా చంపి రమ్మా వెసన్.

అని మంగళాశీర్వచనంబు లొనరించి పంప మేఘనాథుం డఖండప్రచండస్ఫూర్తివి
మానారూఢుండై విజృంభించి,

తిరుగన్ దిక్కిర నవ్విమానమున నుద్దీప్తాగ్రహోయస్తుడై
చెలరేగెన్ శత్రుచమూబలంబులను కిష్కింధాధ్వజస్తంభమున్
విరచెన్ చించెను పెక్కుమున్ గురుబలాభీలాస్త్రధారాహతిన్.
హరుడై కింకరుడై భయంకరరణాధ్వర్యప్రచండాస్త్రుడై.
కాలాంతకోత్పాత గంభీర ఢమరుక-రవ మట్లు ' త్ప్రన్ వ్వ' ని దివి కలంగ
ఝంఝూనిలోద్ధూతజాతజీమూతంబు-చందాన చక్రంబు ' ప్గర్రు ' మనగ
అంత్యశంఖారావమ ట్లోరుమని ధ్వని-దిఙ్మండలమున ప్రతిధ్వనింప
మేఘజాలమునందు మెరుపుతీగ యటుల్ వి-మానంబు తలపైన మసలుచుండ

బాణవర్షమ్ము గురిపించువాని జూచి
యతియు ద్రావిడమాయగా మదిదలంచి
డాలు తలకెత్తి డాగి సవాలుచేయు
వనచరులజూచి యువరాజు వైరమూని.

కినుకన్ వైచెను వైరివీరబలనిక్షేప ప్రఘాతాస్త్రమున్
ఘనదోర్దండ ప్రచండమండిత లసద్గంభీర దివ్యాస్త్రమున్
జన జీవాంతక కాలకూటనిభ పాషాణప్రచారాస్త్రము
న్ననతానంత మహాద్రురాంతక సముద్యద్భుజగోగ్రాస్త్రమున్.
హాటకవల్లిభంగి ధవళాంబరవీధి జ్వలించి తీవ్ర క
ర్కోటకలీల నేలకుదిగున్ శరముక్త విప్రకాండమ
య్యాటవికుల్ భ్రమంబడగ నల్లన మింట నదృశ్యమై నిరా
ఘాటముగా వనాటులముఖంబున ఘాటుగదాయ నొక్కటన్.
చిటచిట కాలవాతహతిచే చలువల్ దమ గ్రస్త దంతముల్
గటచుకొనంగ చూపుకెలిగన్నులమూగ నరంబులన్నియున్
బిగియుచుకొనంగ రామపృథివీశుడు స్వచ్ఛమూయుతంబుగన్
ధరణికివ్రాలె నాత్మసృహతప్పి క్షణంబున మూర్ఛితాంగుడై.
గడియసముందు చండతరకాంతముగా చలియించినట్టి య
ప్పుడమి తలమ్ము జీవచయపూజ్యమటుల్ కనుపింప మేఘనా
థుడు ముదమొంది, చూచి తనపుర్భనితో రిపుసేనకోటి య
క్కడబడియుంట, దిగ్విజయగర్వనితాంతనిమత్తచిత్తుడై.
కోటకు వేగబోయి నరకుంజరుజూచి నమస్కరించి బా
హాటముగా మహీవర జయాంకమునిల్పి సభాంతరంబునన్
బాటవమొప్ప కూతలు సెభాసన దండ్రి కవుంగలింప నా
ర్భాటముతో వచించె సనుకంపు టుదంతము శాత్రవాంతమున్.

ఆమాటల నాలకించినంత

గుండెల్ ఝల్లుమనంగ రావణుడు దిక్కుంభీంద్రమ ట్లార్చి, నీ
కొండే జెప్పిన జేసి తీవొకటి నయ్యోపాపమా జానకిన్
ముండన్ జేసితి వెట్టిమూర్ఖుడవు, నీముం దెంతవా రల్పు లు
ద్దండప్రక్రియ నిట్లొనర్పదగునే ధర్మంబె నీకాత్మజా.
ద్రావిడవీరుడై పరమధర్మగుణాకరమూర్తియైన నీ
పీవిధ మాచరింతు వని యెన్నడు నే దలపోయనైతి, సు
గ్రీవధృశాదు లెందరు తరించిన నెక్కుర లేదుగాని యెం
తే వగమాలి నీను పరదేశిని రాముని జంపు టొప్పునే.
రాముని జంప నెంచిన నరణ్యమునం దలనాడు సీతకై
తామసమూని తాపసివిధంబున నే జన నేటికిన్, కుమా
రా ! మతిమాలి క్షుద్రుల విరాగుల నల్పుల జంపనౌనె సు
త్రామ దిగీశ మర్దన పరాక్రమవంతులకౌ భవాదృశుల్.
అని, పో పామ్మిక చాలు గొప్పపని చేయంజాలినా వింతకున్
మన కా రాము దజేయుడా పగతుడా క్ష్మాపాలుడా, క్షుద్రకా
ననవాసిన్ బరదేశి దిక్కుదినసన్న్యాసిన్ విదేశీయు ని
ట్లని దూలించెడి వీర లుండరుగదయ్యా యంచు వాపోవుచున్.

విభీషణపుత్రి యగు త్రిజటాకుమారిని రావించి యిట్టులనియె.

అన్నెము పున్నెమున్ గనక నమ్మణి, పాపి జరన్మృతుండు మీ
యన్న వృథాకృ చేసినదురాఘకృతమ్ము నికేమ నందు నా
పన్నుని రామచంద్రు నశుభప్రదతీవ్రవిషాశుగమ్మునన్
క్రన్నన జంపివచ్చెనట ఘాతుకవృత్తి చమూయుతంబుగన్.
అనినంతన్ దనగుండె ఝల్లుమన నయ్యయ్యో యటంచున్ విభీ
షణదుష్టాత్మజ రొమ్ము బాదుకొని వేష్టన్ జెంద లంకేశు డా
మెను వారించి, సరే, మరేల వగవన్, మించెన్ దురంతమ్ము కా
వున భూజాతకు దెల్పి తోడ్కొని శవంబున్ బోయి చూపింపుమా.
చెప్పుము సీత కీ ఖలుడు చేసినదోషము కాదటంచు, నే
నెప్పుడు రామచంద్రుని వధింపదలంపనటంచు, నన్యు డీ
దెప్పర మాచరించె నను దిట్టకుమమ్మ యటంచు నేనుగా
జెప్పినయట్లు జెప్పి నిరసింపక జేసి వచింపు మిట్టులన్.
అమ్మా ! నీ విభు డుత్తరాదిజనమాయాబోధవిభ్రాంతుడై
మమ్మున్ లక్ష్యముసేయకెల్లెడల దా మావారలన్ జంపు ద్వే
షమ్మున్ బాళిక చట్టసమ్మత ప్రశస్త ప్రక్రియన్ బూన నీ
కిమ్మాడ్కిన్ విధి యప్రయత్నముగ ప్రాపింపన్ తటస్థించెనే.
మద్దీతనంపురోషమున మందుడు బాలుడు మేఘనాథు డీ
యొద్దపనిన్ గణింప కొనరించెను భూతభవిష్యదర్థముల్
దొడ్డగొనాలతల్లి నిను తొయ్యలి వ్రాలి నమస్కరింతు నీ
బిడ్డలలోన వాని నొకబిడ్డగ నెంచి యనుగ్రహింపుమా.
వగవకుమమ్మ దిక్కరినపక్షివటంచును క్షత్రియాళికిన్
బగతుర జంపుటేల్లుట లవాటితముల్ రణసీమలందు, నీ
మగ డుదువిక్రముం డమరమండితలోక మలంకరించె నా
ఖగమున, గాన దానికయి ఘోరకుమారి విచార మేటికిన్.
నీ విభునిన్ మరందిని కలిన్ బెడబాసి జనాళి చెంతకున్
బోవుట గారవమ్మనదు బొచ్చెముకావున, తల్లి ! నీవు ని
ర్భావనితాకుమారి, వలభూవిభు దేవగుటన్. కుమారి, మా
తోవనియింపు మీపరమ ధూర్తునియింటికి నాడుబిడ్డనై.

# నాలుగు నాటకాంగములు

కళాభిమాని

నాటక కళను బునరుద్ధరింప ననేకములగు ప్రయత్నములు భారతవర్షమున, నందునను ముఖ్యముగ నాంధ్ర దేశమున, జరుగుచుండుట కళాభిమానుల కందఱికి నానందదాయకము. పురాతన శాస్త్రాదికములతో సమ్మేళన మొనర్చి నేఁటి నాటకరంగము నితోధికశోభతో నలరారునట్లు జేయ బుద్ధిమంతులనేకులు దలపెట్టుచున్నారు. కొందఱు కవులను బ్రబోధించుచుండ నింక కొందఱు నటకులను హెచ్చరించు చున్నారు. కాని నాటకకళ సర్వవిధముల నున్నతదశకు రావలయు ననిన నా నాటకకళ యందలి యన్నియంగములు నొక్కరీతిని వికాసము గాంచవలయును. అన్నియంగములయందును వికాస ముండిన యప్పుడే కళ సర్వతోముఖవికాసమును గాంచఁ గలదు.

నాటకకళ కట్టి యంగములు నాలు గని విభజింప సాహసించు చున్నాఁడను. ఇట్టి బుద్ధి నాకు బొడకట్టుటకు గారణము శ్రీహర్ష చక్రవర్తియే యని మనవి చేయు చున్నాఁడను. శ్రీహర్షుఁడు తననాటక ప్రస్తావనలయందు

"శ్రీహర్షో నిపుణః కవిః పరిష దప్యేషా గుణగ్రాహిణీ
లోకే హారిచ వత్సరాజచరితమ్ నాట్యేచ దక్షా వయమ్"

అని పల్కించియున్నాఁడు. ఈ శ్లోకభాగమునందే నాటకాంగములు నాలుగు నుద్ఘాటితము లయిన వని నేను దలంచుచున్నాఁడను. కవి, పరిషత్తు, వస్తువు, నటకులు నను నీనాలుగు నంగములగును.

నాటకకళను వికాసవంతముగఁ జేయ గవులు నాటకకళను బాగుగఁ దెలిసి వ్రాసినఁ జాలదు; నటకులు గవులకు నాయాపాత్రలకును గలభావముల నర్థమగు తెఱంగునఁ బ్రదర్శింప నుత్సహించినఁ జాలదు. కవిమంచివాఁడా; నటకులు నేర్పరులా యనియే మన వితర్కము. కథావస్తువుగూడ జనుల నాకర్షించు శక్తిగలది యని వేఱుగఁ జెప్ప నక్కఱ యుండదు. నాటకమున కర్థ మగు కథావస్తువు కొఱ కాంధ్రకవి కష్టించుచున్నాఁడు. నాటక రచనానిపుణుఁడగుకవి వ్రాసిన నాటకములకొఱకే నటకులు ప్రతీక్షించుచున్నారు. కావున నీమూఁడింటియందును సంస్కరణ మారంభ మయినదనియే తలఁపవచ్చును. కాని నాలుగవ యంగమగు పరిషత్తు (ఆడియన్సు) మాత్ర ముపేక్షిత మగుచున్నదని నుడువఁ జింతనందుచున్నాఁడను.

ఈపరిషత్తు—అనఁగా ప్రేక్షకబృందము—గుణగ్రాహిణిగ నుండకుండినఁ దక్కిన మూఁడంగములయందుఁగల గుణమంతయు నడవిఁగాయు వెన్నెలయే యగును. గుణమును గ్రహింపఁజాలని ప్రేక్షకవర్గము నాటకమును కేవలము బూటకముగఁ జేయఁ గలదు. చక్కని రసవంతము లగుఘట్టములయందుఁ బ్రేక్షకు లాయాయెడల గన్పఱుచు విరసభావములవలన నటశిఖామణులకు మనసు చివుక్కుమనుచుండును. అదిమొద లానాటకము విరసముగనే పరిణమించుచుండును. ఇట్టి ప్రేక్షకులయెదుట నాటకమాడ విధించిన యా విధిని నిందించు నాట్యదక్షు లనేకులు గలరు. భావావేగంబున నటకుఁడు రంగస్థలమున సొమ్మసిల్లిపోయినప్పుడు 'వన్సుమోర్' అని యఱచువారును, ఆకస్మిక జనితమగు భావవికాసమున రంగమునుండి పాత్ర హఠాత్తుగ నిష్క్రమించు సమయములఁ జప్పటులఁ గొట్టి పునరభినయవాంఛను దెల్పువారలును, దుఃఖమయమగు కథాభాగమునఁ గరుణరసము వెల్లివిఱియునట్టుల నటకులు ప్రదర్శించు పట్టుల నేదియో స్వల్పవిషయము నవలంబనముగఁ బట్టికొని నవ్వి నాలుగువిధములఁ బాడుచేయువారును, ప్రేక్షకబృందమున నున్నయంతకాలము నాంధ్రరంగ మభివృద్ధికి దూరముగ నుండవలసియే యుండును. చతుర్థాంగమగు పరిషత్తునకు దగినంత సంస్కారము లేకుండుటచేతనే నటకులుగాని కవులుగాని తమహృదయములనున్న యున్నతాశయములనెల్ల నాటకములందు జొన్పఁజాలకున్నారలు. నాలుగు పార్సీమట్టులతోడి పాటలును, మూఁడు త్యాగరాయకీర్తనలును, మంచిసంగీతజ్ఞానముతోడఁ బాడిన పది పద్యములు నుండకుండిన నది నాటకమా యని యనువారు సదస్యులయినంతప్రొద్దును నాటకవికాసమున కాంధ్రలోకము నోఁచికొనగలుగునా? వీరల నానందింపఁజేయుటకే కవి, యవసరానవసరములను లెక్కసేయక, కూర్చుండుటకొఱక సీసపద్యమును, నిలుచుటకొఱక శార్దూలమును గీయుచున్నాఁడు. ఈ పరిషదాభాసమునకు సంతృప్తినొసంగనే నటకుఁడు, కవివ్రాసిన పద్యకోటి చాలదను నట్టుల నుచ్చారణ సౌష్ఠవమున కూరంత దూరమగు పార్సీమట్టులతోడి పాటలను కథాభాగమున నిఱికించు చున్నాఁడు. ఈ ప్రేక్షకకోటి ముదంబునకే నటకులు కల్లుత్రాగు రంగములను నీచశృంగారఘట్టములను, ఔచితిని దూరముంచి, పెంచుచున్నారు. ఈ రీతి నీసభాసదులమూలముననే నాటకకళ యాంధ్రప్రతిభ కర్హమగునంత వికాసము నెఱుఁగజాలక విన్నఁదనమున నున్నయది. కవులును నటకులు నుచితభావప్రకటనమునే ప్రధానముగ నెంచిన నిరర్థకులగుచున్నారు. ఉచితానుచితచింత లేని యీ సంగీతాభిమానము వలననే నాట్యకౌశల మపారముగఁ గలవార లనేకులు రంగస్థలమును జేరఁజాల కున్నారు. ఈ దురభిమానమువలననే యించుక సంగీతజ్ఞానము గలిగిన ప్రతివ్యక్తియు, ప్రధాన పాత్రధారణ కర్హుఁడగుచున్నవాఁడు. ఈ పరిషద్గుణలోపముననే నారీమణులు రంగస్థలమునకు రా వెఱచుచున్నారు.

కావునఁ గళాభిమానులందఱు నీ ప్రధానాంగమగు ప్రేక్షకవర్గమునందలి యూహలను దొలుత సంస్కరింపఁ జూచుట కర్తవ్యము. ప్రేక్షకుల భావములను నాటకకళానుకూలములుగ శిక్షణమొనర్పవలయును. ప్రేక్షకులయం దెప్పటికప్పుడే అనుచితప్రవర్తనలను ననవసరవిడంబనములను ఖండించి వైచు చుండవలయును. అనర్థదాయకము లగు నకాలపు 'వన్సుమోర్లు' రూపుమాయునట్లు జేయవలయును. ఈ మహాకార్యమునకు గళాభిమానులును వార్తాపత్రికలును బూనుకొనిన ననతికాలమున నాంధ్రనాటకరంగము నూతనాశయసంభరితమయి వంగరంగస్థలమువలె నవనవోన్మేషమున నలరారఁ గలదు.

పరిషత్తున కుండఁదగిన గుణగ్రహణశక్తి యుండినచో నను చితవస్తువున కవకాశ ముండదు. చేతఁగాని రచయితలకు దావు దొరకదు. బూటకపు నటకులకును, పనికిమాలిన ప్రసాధనములకును చోటు గలుగదు.

# పల్లెటూళ్ల ఋణగ్రస్తత

యస్. వి. బి. శంకరం గారు, (బి.ఏ., విద్యార్థి)

ప్రతిదేశమందును మూలధనము లేకపోవుటచేత, రైతులు బాధపడుచుందురు. ఈ విషయము హిందూదేశపు రైతున కొక్కనికే కాదు. ఏదేశములయందు వ్యవసాయము ముఖ్యవృత్తిగ నున్నదో అచ్చట రైతుల కష్టములు తెచ్చుట స్వాభావికమైయున్నది. వ్యవసాయపు జీవనమున రైతు ఋణముల జేయవలసిన కారణములు కొన్ని కలవు.

### సాధారణములైన కారణములు

ఋతువులు సరిగ నుండుటలేదు. అతివృష్టియు ననావృష్టియు రెండును రైతునకు హానికరములె. ఈ రెండువేళలయందును రైతు ధనాన్వేషణము జేయవలసినదియె.

రైతులు మార్కెటులకు దూరమున నుండుట. దీని వలన గలుగు నష్ట మెట్టిదనిన, హెచ్చుధరలు ధాన్యములకు వచ్చిన తరి రైతు మార్కెటునకు దూరమున నుండుటచే, తరుణమున గలుగు లాభమును పొందజాలకున్నాడు.

హిందూకుటుంబములలో భూమి భాగములు పొందుటచే, ఆ విభాగపు భూములును పలుచోట్ల నుండుటచే, మిక్కుటమైన కృషికి మనదేశపు రైతుపొలము ఇబ్బందిని కలుగజేయుచున్నది.

### ఋణములు—దేశాభివృద్ధి

క్రిందటి ఏబదివత్సరములనుండి ఇండియాలో జరిగిన మార్గముల యభివృద్ధియు, పరిపాలనాభివృద్ధియు, వర్తకాభివృద్ధియు, ఆనకట్టలు, ప్రాజెక్టులు మొదలుగాగల నీటివసతుల యభివృద్ధియును, ఇచ్చటి రైతుఋణముల తగ్గించుట కెంతమాత్రమును సాయపడలే దేల యను ప్రశ్న రాక మానదు. ఆ ప్రశ్నమునకు ప్రత్యుత్తర మెట్టిదనిన, పైజెప్పిన యభివృద్ధియె ఋణములకు కారణభూతము. మన దేశమునందలి రివిన్యూ సెటిల్‌మెంటు పద్ధతి ప్రతివాని హక్కులను స్పష్టపఱచుచు, దొరతనమువారి యెడ వానికి గల బాధ్యతను వెల్లడి జేయుచున్నది. అట్టిభూస్వామి హక్కులు, భూమి విలువను తెలుపుచు భూమిని సులభముగ తనఖా పెట్టుటకు వీలుచేసినవి. అటులనే, మార్గసౌకర్యములు, నీటివసతులు, స్వదేశవిదేశవర్తకములు, భూమి ధరలను హెచ్చుపఱచి, వానిసెక్యూరిటి విలువనుగూడ పెచ్చుగ హెచ్చుజేసినవి. అందుచే రైతు నమ్మకము హెచ్చైచ్చ అప్పు పుట్టుట సులభమైనది. విద్యాశూన్యతచే రైతులు సులభముగ తనఖాలబెట్టి ఋణముల జేయుచున్నారు. ఈ విషయము యూరపుఖండమునందు ఇట్టిస్థితియందె ఋణములను జేసిన స్విడ్జెరులందు, నార్వే మొదలుగాగల దేశముల జూచిన నెక్కుడుగ ఋజువుగాగలదు.

ఆ పైనిజెప్పిన దేశములయందు మాన్యములపద్ధతి ఫ్యూడల్ పద్ధతి తొలగజేసి వారసత్వపు చట్టముల ప్రవేశపెట్టుటవలన అప్పు విశేషముగ దొరుక నారంభించినది. దీనిఫలము దేశమున ఋణములు పెచ్చుపెరిగినవి. కాని దేశాభివృద్ధియు గలిగినది. అందుచే, ఋణములుండిన, దేశాభివృద్ధి గలుగ దనుట సమంజసము గాదు !

### మనదేశమునందలి పల్లెటూళ్ల ఋణములకు హేతువులు

ఈ ఋణముల గూర్చి బొంబాయి రాజధానిలో ముప్పదియైదు సంవత్సరములకు పూర్వమే, గొప్ప యాందోళన గలుగుటచేత, దాని విచారణకై యొకసంఘము నేర్పరచిరి. ఆ కమీషనువారు విచారించిచూచిన విషయములు అన్నిచోటులకు సమన్వితములుగ దోచినవి. ఆ కమీషనువారు యీ క్రిందివిధముగ కారణముల నిరూపించిరి.

ఫలింపనిభూములవలన గలుగు బీదతనము, శీతోష్ణస్థితి, శాశ్వతముగనుండని ఆదాయము.

జనులలోని యజ్ఞానము— దీర్ఘాలోచన లేకపోవుట.

అధికముగ వ్యయపఱచుట.

పూర్వులు చేసిన ఋణబాధలు.

అప్పు బాగుగ దొరకుట.

జనాభివృద్ధితోపాటు ఆదాయము లేకపోవుట.

పండినను, పండకపోయినను చెల్లించవలసిన రెవిన్యూ డిమాండు.

పై నుడివిన ఋణహేతువులు, మనదేశమందలి ప్రతి రాజధానియందును కనబడుచున్నవి.

ఏబదిసంవత్సరములకు పూర్వము "ది డక్కన్ రైత్సు కమీషను" వారు రైతు స్థిరాస్తిని వదలి చరాస్తిని చక్కగ ఎస్టిమేటు చేసినారు. చిన్నరైతు చరాస్తి మొత్తముఖరీదు 228 రూపాయల మించజాలదు. వానికిగల పశువులఖరీదు సుమారు రు. 125 వ్యవసాయపు పనిముట్లు, యింటిలోని పాత్రలు రు 20. ఇంటిఖరీదు రు. 50 తక్కిన వివిధవస్తువులు 33. మొత్తము 228. కొంతమందిరైతు లీ కొలదిపరికరములనైన గలిగియుండలేదు.

తాతలనాటినుండి రైతు ఋణము గలిగినవా డగుటచే గొప్ప కష్టములకు లోనగుచున్నాడు. ఇంటిఖర్చుల గడపి, వడ్డీలను గవర్నమెంటుశిస్తులను కట్టుటకే రైతు తన యావచ్ఛక్తిని ధారపోయుచున్నాడు. శేషము మిగులుట లేనే లేదు. 1880 వ సంవత్సరమున కఱవుకమీషనువారు నూటికి 33 గురు భూస్వా



24

ములు ఇండియాలో ప్రతిభాగమందును అప్పులలో నున్నారని చెలిపిరి. అప్పటి స్థితిని ఇప్పటి స్థితిని బోల్చిజూచినచో, రైతు సంఘములలో సగమునకుపైగా నప్పులపాలుగ నున్నారని తేటయగును. రైతునకు, పంటలధర హెచ్చుగనుండిన, ఋణబాధ కొలదిగ తగ్గును. కాని నేటి తగ్గుధరలు రయితున కెట్టి యాందోళన గలిగించుచున్నవో మనము జూచుచునే యున్నాము.

నేటి ఇండియా రూరల్ ఋణముల యంచనా ఆరువందల కోట్ల రూపాయలకు మిగిలియున్నది. సంఖ్య పెద్దదిగ గానుపించినను జర్మనీదేశపు ఋణములకంటె నిది చాల తక్కువగనే యున్నది. మనదేశమునందలి రూరల్ ఋణములు భూమిమీది మక్తాల విలువకు ఇరువదిరెట్లు అధికముగ నున్నవి. జర్మనీ దేశములో నేబదిరెట్లధికముగ నున్నవి. కాని జర్మనీకిని మనకును గల భేద మేమన, జర్మనీదేశమునందలి ఋణములు లాభప్రదములైన పనులజేయుటకు తెచ్చినవివై యున్నవి. మనదేశములోనన్న, ప్రతిఫల మొసగజాలని కార్యములకై తెచ్చిన ఋణములే. వారసత్వపు చట్టము మూలమున సమిష్టికుటుంబభూములు విభాగములు కాబడి, ఆ విభాగమైన కొలదిభూమియు నొక్కచోట నుండక, పలుచోట్ల కొలదికొలదిగ నుండుటచే, సక్రమమైన వ్యవసాయమునకు భూములు వీలుగ నుండలేదు. తోటలు వేయు రైతులకు, ఒక ఎకరము భూమిగలిగిన, వారి కుటుంబఖర్చులకు చక్కగ సరిపోవుచుండును. కాని మనరాజధానిలోని మెట్ట భూములు 25 ఎకరము లుండినగాని రైతుకుటుంబమునకు సరిపోదు. బహుసంఖ్యాకములగు పొలములు రైతునకు సరిపోవు వ్యవసాయమునకు చాలుచుండుటలేదు. అందుచే మనదేశపురైతులు వ్యవసాయవృత్తితోపాటు మరొకవృత్తి నవలంబింపవలసివచ్చుచున్నది.

సాంఘికాచారములు గూడ చాలవరకు ఈ ఋణములకు కారణము లగుచున్నవి. మనదేశములోని కొన్ని సంఘములవారు పూర్వాచారములనుబట్టి కృషిచేయనొల్లక, ఎట్టి పనులందును పాల్గొనక, నిరుపయోగముగ గూర్చుండి, ధనవ్యయమును జేయుచున్నారు.

వివాహములయెడ నమితముగ ధనము వ్యయపఱచి రైతు సంఘము లనేకములు అప్పులపా లగుచున్నవి. వ్యాజ్యములన్నో దేశములో మిగుల ప్రేమ బడయుచున్నవి. ప్రతివిషయమునకును కోర్టులకు వెళ్లుచున్నారు. వేలకువేలు డబ్బును దుర్వినియోగపఱచుచున్నారు. కాని ప్రతిఫలప్రదము లగుపనులకు ఖర్చుచేయుట లేనే లేదు.

ఈఖర్చు లిట్లుండ, రైతు మరియొకవిధమైన ఖర్చులకు పాలగుచున్నాడు. మనదేశమునందు జంతుచికిత్సాలయములు చాల తక్కువగ నున్నవి. అందువలన చికిత్సలేక మనదేశమున పశువులు రోగములచే నమితముగ జచ్చుచున్నవి. అంతియగాక పశువులకు గడ్డికఱవులు సామాన్యము లగుచున్నవి. ఇట్టి సమయములలో రైతు పశునష్టమునకు పాలుగావలసినవాడై వేరుగ పశువుల గొనుటకొఱకు అప్పుతీయవలసివచ్చుచున్నది.

## వడ్డీ రేట్లు

ఇంతవఱకు ఋణములగూర్చి మాటలాడితిమి. ఇంక వానిపై వడ్డీరేట్లనుగూర్చి కొలదిగ విచారింతము. అప్పులు పెట్టు గ్రామ షావుకారి వడ్డీరేట్లు అప్పుతీసికొనువానినిబట్టియు, అప్పుతెచ్చు నవసరమునుబట్టియు, గ్రామగ్రామమునకును వేరగుచుండును. అందుచే మనదేశములోని వడ్డీరేటును స్థిరపరుచుట దుర్లభము. అంతియగాక మరియొక కష్టము గలదు. లిఖితరూపకమైన రేటు వేరుగ, తుదకు షావుకారు తీసుకొను వడ్డీరేటు వేరుగ నుండును. అటులగాకుండ రెండురేట్లును యేకమైనచో అప్పు తీసికొనునప్పుడెల్ల ప్రాతలెక్కకు కాంపౌండువడ్డీని కట్టుచుందురు. ఇది మిగుల నధికముగ నుండును.

సర్ ఫ్రెడరిక్ నికల్సన్‌గారి రిపోర్టునందు మద్రాసు రాజధానిలో తనఖాదస్తావేజులలోను, ప్రామిసరి నోటులలోను, ధాన్యముమీది యప్పులలోను, వడ్డీ నూటికి సంవత్సరమునకు రు 15 ల మొదలు రు 18 ల మధ్య నుండునని చెప్పియున్నారు. ఈ రేటు ఇతరరాజధానులరేట్లతో బోల్చిజూచిన నత్యధికముకాదని తోచకమానదు. బెంగాలులో కో-ఆపరేటివు క్రెడిటు సొసైటీల రిజిష్ట్రారువారు నూటికి సంవత్సరమునకు రు 25 ల వరకు వడ్డీరేట్లుగలవని 1904-5 సంవత్సరపు తమరిపోర్టునందు చెప్పియున్నారు. యునైటెడ్ ప్రావిన్సులోని రిజిష్ట్రారువారు రూపాయికి నెలకు అర్ధణా సామాన్యపు రేటనియు, లేక ఒకసంవత్సరమునకు నూరు రూపాయలు తీసికొనిన రు 37-8-0 యగుననియు జూపించిరి. బర్మాయందలి వడ్డీ నూటికి నెలకు రు 2-8-0 మొదలు రు 5 ల వఱకు గలదని అచ్చటి కో-ఆపరేటివు సొసైటీవారు 1906-7 సంవత్సరపు తమ రిపోర్టునందు తెలియజేయుచున్నారు. ఇట్టి వడ్డీలతో ఋణములదీర్చుటకు రయితు పడు బాధను చదువరు లూహింపగలరు.

షావుకారు వడ్డీని ఎక్కుడుగ గోరుటయెగాక మరియొక నష్టమున గూడ రయితులను పడద్రోయుచున్నాడు. షావుకారు ప్రతిగ్రామమునందును అప్పులు పెట్టుటయెగాక ధాన్యపు వర్తకమునుగూడ జేయుచుండును. అందుచే పంటసమయములలో బాకీలను త్వరపెట్టి తక్కువధరలకు ధాన్యముల నమ్మునటుల రయితుల బలవంతపఱచును. దీనివలనగూడ రయితు నష్టమునకు పాలగుచున్నాడు.

ఇంతియగాక రయితు తన ఋణమును కొలదికొలదిగ తీర్పనెంచిన, షావుకారు పూర్తిబాకీని తీసుకొనుట కొప్పుకొనునే గాని విడివిడిగ చిన్నిమొత్తముల చెల్లువేయుటకు నొప్పుకొనుట జూడజాలము. పొలము తనఖా యుండుటచే షావుకారు తనడబ్బుకై భయపడ నవసరములేదు. రయితు ఎప్పుడును పూర్తిపైకము నొక్కసారిగ చెల్లింపజాలడు. అందుచే రయితు అప్పులోనె పుట్టి అప్పులోనే పెరిగి అప్పులోనే జచ్చుచున్నాడు.

ఇట్టి ఋణబాధల దప్పించుమార్గములగూర్చి బుద్ధిమంతులందఱు నాలోచింపవలయును.

# సంస్కారి

## పరాత్పరరావు గారు

విజయా ! నీ పట్టుదల వదలవా ? నామాట వినవా !

తల్లీ ! ఏ మని చెప్పుదును ! ఒకరిని ప్రేమించి యింకొకరిని ఎట్లు పరిణయము గావించుకొందును.

విమల విధవరాలు గదా ! దానినే పెళ్లి చేసుకొందువా ? నీ మూర్ఖత్వము వదలవా ?

విమల నీయన్న కూతురుగాదా ?

ఐననేమి, నీవు ఒక్కడవే నాకు కొమారుడవు. అట్టి నిన్ను విధవరాలను పాణిగ్రహణ మొనరించుకొననివ్వను, విమలయన్న నాకును ప్రేమయే, కాని దాని నొసట విధవరాలు అని బ్రహ్మ వ్రాసినాడు.

విమల అమాయకురాలు. పసితనముననే విమలకు పెళ్లియైనది. విమలను పెళ్లి యాడనిచ్చిన మహోపకృతి గావించినదాన వగుదువు.

నీపట్టు వదలవా ? అని అన్నది యశోద.

అట్లైన బ్రహ్మచారిగనే యుందును.

నీ వింతవాడ వవుదువని కలనైన దలచలేదు. తల్లిమాటగూడ పాటించవా ? విధవరాలను నీవు పెళ్లియాడుట చూచి అవమానము నొందుటకంటె నాకు మరణించుటే శ్రేయస్కరముగ గాన్పించుచున్నది.

జవా బీయ తలచెనుగాని విజయుని నేత్రద్వయ మశ్రుజలపూరితమైనది. ఈదృశ్యమును దిలకించినంతనే యశోద కనులవెంబడి జలజల కన్నీ రొలికినది.

౨

విజయుని మిత్రుడు ఆనందరా వప్పు డరుదెంచి తల్లి కొడుకు కన్నీరుగార్చుటను చూచి ఆసంగతి అదివఱకే దెలిసినవా డగుటచే జిలునవ్వునవ్వి, ఏమమ్మా ! మీ రేల విజయున కడ్డు దగిలెదరు ? అనెను.

ఏమీ ! ఆనందా ! నీవు నీస్నేహితునితో గలసితివా ?

అవును. విమలను విజయుడు పరిణయమాడిన నేమి హాని గల్గును ?

హిందూమతాచారములకు మన మెట్లు విరుద్ధముగా నడుచుకొనగలము ?

అవన్ని అట్లుపెట్టుడు. మగవారు భార్యల గోల్పోయిన మరల వివాహము గావించుకొనవచ్చును. స్త్రీలు భర్తల గోల్పోయిన మరల పెళ్లిచేసుకొనగూడదా ? అందును పసితనముననే విధవరాండ్రైనవారు మరల సుద్వాహము గావించుకొనిన తప్పా ? పెళ్లియన నేమియో భర్తయన నేమియో యెఱుగని బాలికలకు చిన్ననాటనే పెళ్లి, వైధవ్యము కూడనా ? అట్లనే జీవితాంతము వఱకును గడపవలెనా ?

నీ యీవిషయములను నే నంగీకరించను, ఈ కాలపు యువకులు పూర్వాచారములు పాటించుటయే లేదు.

కొంచెము మీరు విచారించవలసియున్నది. విమలా విజయుల నొక యింటి వారినిగా జేసిన నెంతటి మహోపకృతి గావించిన ట్లుండునో గొంత విచారింపుడు.

ఆనందుని హితోక్తులు, విజయుని నేత్రములనుండి ప్రవహించుచున్న బాష్పజలము ఆమె హృదయమును గరగించి వైచెను.

అంత యశోద:—

ఆనందా ! నా కిష్టమైనది. కాని నాతమ్ముడు ఒప్పుకొన వలవా. విమలయనిన ఆతనికి మిక్కుటమగు ప్రేమయే కాని ఆతడు పూర్వాచారపరాయణుడు.

'ఐన గట్టిచిక్కే. విజయా ! ఎట్లా ?' అని అన్నాడు ఆనందరావు.

ఆనందా ! విమల నెవరైన దోడ్కొనివచ్చిన అన్ని చక్కబడును. అట్లాగే చేతునుగాని మరి కులస్థులు మనలను వెలివేసెదరేమో యని భయముగా ఉన్నది అని అన్నది యశోద.

మన మవన్ని లక్ష్యముచేయకూడదు. మనముచేయుకార్యము న్యాయమైనదని మనకు తట్టినప్పుడు మన మాపనిని స్తుతినిందలను లక్ష్యముసేయక గావించవలసిన విధి మనది అని అన్నాడు విజయుడు.

సరే బాగుగనే ఉన్నది. నీవు సంతోషముగా ఉండు. రేపు విజయవాడ వెళ్లి నీకిష్టమైన పెళ్లి కూతురిని తెచ్చెదను.

విజయా ! నీవిప్పుడు పెద్ద సంఘసంస్కారివి. సాయంత్రమైనది, షికారు వెళ్లి వత్తము పద.

3

విజయుడు మచిలీపట్టణములో ఒక ధనికుని కుమారుడు. తండ్రి వ్యాపారములో ధనము బాగుగా సముపార్జించి భార్యకు, కుమారునికి నప్పగించి మృతినొందెను. యశోద తమ్ముడు కేశవరావుకు కొద్దియో గొప్పయో ఆస్తి ఉన్నది. ఆతని పని తిని కూర్చొనుటయే. విమలకు పదేండ్లనాడే ఒక లక్షాధికారి కనబడిన యిచ్చి పెళ్లి చేసెను. "ఆ అరవై యేళ్ల వృద్ధుడు పెళ్లి అయిన రెండవరోజే పరలోకానికి వెళ్లిపోయాడు. అంతా బల్లగుద్ది ఉపన్యాసా లిచ్చేవాళ్లే అతి బాల్యవివాహము కూడదని, ఆమహానుభావులే తమ పిల్లల్ని నేడో రేపో చచ్చిపోయే శతవృద్ధుల కివ్వటం, ఆశతవృద్ధులదగ్గఱ ఉన్న డబ్బుసంచుల్ని చూచి."

విమల కిప్పుడు పదునారేండ్లు. లావణ్యరాశి. భ్రమరముల పరిహసించు ఆ కేశకలాపము, ఆ అధరోష్ఠము, కలువల నిరసించు కందోయి, పూర్ణచంద్రుని బోలు ఆ వదనము విమల సుందరియని చెప్పకయే చెప్పుచున్నవి. అప్పుడప్పుడు తల దువ్వుకొనుచుండును. ఎవరైన చూతురేమో యేమి చివాట్లు పెట్టుదురో అని భయము.

యశోద తమ్మునియింటి కేగినది, చాలకాలము క్రిందట చూచియుండుటచే గాబోలు అక్కను తమ్ముడు మిగుల గౌరవించెను, కొన్నినాళ్లయిన తదుపరి విమలను తీసుకువెళ్ళెదనని తమ్ముని నడుగ ఆత డంగీకరించెను. యశోద విమలను గృహమునకు దోడ్తెచ్చినది. విమలకు తల దువ్వుటయు, మంచివస్త్రములు కట్టబెట్టుటయు, నగలు ధరింపజేయుటతో యశోదకు కాలము గడచిపోయినది. విమలకు చిన్ననాటనుండి విజయునిమీదనే ఉన్నది. వచ్చిన క్రొత్తలో కొంచెము సిగ్గుపడెడిది. కాని, యిప్పు డా సిగ్గంతయు పోయినది. ఒకనాడు విమలకు మంచి విలువగల వస్త్రములు గట్టబెట్టినది. లలాటమున దిలకమును దిద్దుమనినది.

ఆ ! ఏమి ! తిలకమా నాకు విధవరాలకు. నాన్న చూచిన నన్ను బ్రతుకనిచ్చునా ? విజయుడు కోపపడడా.

ఎవరును కోపపడరు. నీచెలువుకొఱకు నేను చెప్పెదనా ? ఎట్లుందువో అని నేను పెట్టుకొనుమంటిని. విజయుడు చూచి సంతసించును.

అత్తా ! నీకు కోడలువచ్చిన నే నప్పు డెందుకు ? మీకు బరువునుకాదా ?

పిచ్చిదానా ! నిన్నట్లు గావింతు ననుకొంటివా ? నీవు మరల యెందుకు పెళ్లిచేసుకొనగూడదు ?

అయ్యో దేవుడా ! పెళ్లి !......ఎట్లాచెప్పావమ్మా ! నీ తమ్ముడీసంగతి తెలిసికుండీకూడాను. ఈ సంగతి వింటే నన్ను బ్రతుకనిస్తాడా. నన్ను పెళ్లిచేసుకొనేదెవరు .అని యేడ్వసాగెను ?

విమల కన్నీళ్లను దుడిచి యశోద తనకుమారుని వృత్తాంతము, తా నెందుకు దోడ్తెచ్చిన సంగతియు సవిస్తరముగా విమల కెఱిగించెను. విమల కెక్కడలేని సంతోషము, ఉత్సాహము ఉప్పతిల్లినవి. విమల మోమునందలి మార్పు విజయుడు గనిపెట్టకపోలేదు.

ఆనందుని పిలిచి యశోద (రహస్యముగా) ఆనందా ! విమలావిజయుల పాణిగ్రహణము రానున్న పౌర్ణమినాడు చేసివేయుదుము.

సరే. అట్లాగే కానిండు, విమల ఒప్పుకొన్నదా?

ఆ! విమల సమ్మతించినది, విమలకు మొదటినుండియు విజయుడన్న ప్రాణమే.

ఆ! అట్లాగా? సరే నేను మరల వచ్చెద నని నిష్క్రమించెను.

౪

(విమలతో) రహస్యముగా యశోద విమలా! నీవు విజయుడంటే యిష్టము లేనట్లుగా సూచించాలి. పెళ్లిచేసుకోనని నిర్మొగమాటంగా అనాలి.

ఆ. అట్లాగే చేస్తాలే, అత్తా!

ఆ సుదినము ఏతెంచినది. ఆనాటి సాయంత్రము విమల సకలాభరణభూషితయై, అమూల్యమగు దుకూలములవాల్చి అప్సరసవలె నందచందముల నొప్పారుచుండెను. విమలను గృహము వెనుకభాగమందలి యుద్యానవనములోనికి బంపినది యశోద. అచ్చట చూతఫలవృక్షము లప్పుడే చిగిర్చి నేత్రపర్వ మొనర్చుచున్నవి. కీరశారికాదులు కడుపార మెసవి కర్ణరసాయనముగా కూజితంబులు సల్పుచుండెను. ఏచక్కి వీక్షించినను జలజల రాలుచున్న పుష్పగుచ్ఛములే. అచ్చటనున్న తిన్నెపై విమల ఆసీన యైనది.

ఇంతలో విజయు డెచ్చటినుండియో విచ్చేసి విమలా! విమలా! నన్ను పెళ్లిచేసుకొనెదవా, తప్పకుండా, చెప్పు, చెప్పు అని విజయుడు అడిగెను. కూర్చుండిన విమల లేచి నిలువబడి లోలోన నుప్పొంగు సంతోషతరంగముల నాపుకొనినది. ప్రత్యుత్తర మీయలేదు. కాని కొంచెము సేపటికి లోన నుప్పొంగు సంతోషమును నాపుకొనజాలక తన సర్వస్వమును నగు, తన హృదయేశ్వరుడు నగు, నావిజయుని చరణములచెంత వ్రాలెను. విమలా! లెమ్ము, అని ఆపెను లేవనెత్తెను. ఇరువురు పరిష్వంగ మొనర్చుకొనిరి. యశోదచేసిన యుక్తియని యిరువురును నానందబాష్పజలముల రాల్చిరి. ఇంతలో యశోద సువాసన లీనుచున్న రెండుపుష్పమాలల గైకొని యచ్చోట ప్రత్యక్ష మయ్యెను.

ఆనందుడు రాలేదే యని యశోద విచారించుచున్నది. ఇంతలో కాలిచప్పుడైనది, అదిగో అందఱు విచ్చేసినారు.

కేశవరావు, ఆతనిభార్య, ఆనందుడు. వధూవరులును యశోదయు వారలనుజూచి దిగ్భ్రమ జెందిరి. అంత ఆనందుడు అమ్మా! మీ తమ్ముడుగారిని అందఱిని సంతృప్తులజేసిరే దోడ్కొనివచ్చితినని. అంతే అందఱును ఆనందసాగరమున నోలలాడిరి. వధూవరులు పుష్పమాలల నొండొరుల గ్రీవాలంకరణము గావించుకొనిరి. విమలా విజయు లొండొరుల గాంచి దరహాసచంద్రికల బరపుకొనిరి. పెద్దలందఱు వధూవరుల శిరస్సులపై సేసలు జల్లి దీవించిరి. అంతయు సంతోషము, అంతయు ఉత్సాహము. విజయు డిప్పుడు సంస్కారి, మార్గదర్శి, ఆదర్శనీయుడు.

---

## సాధ్వీ విధులు

వడ్డెపాటి నిరంజన శాస్త్రిగారు.

సుస్వభావుం డేని దుస్స్వభావుం డేని
వికలావయవుం డేని సుకలుం డేని
రోగగతుం డేని భోగరతుం డేని
మద్యలోలుం డేని మందుం డేని
క్రోధాచరణుం డేని బాధాకరణుం డేని
ధనయుతుం డేని నిర్ధనుడయేని
మూగవాం డగునేని ఱాగవాం డగునేని
గ్రుడ్డియ యగునేని కుంటియేని
లుబ్ధుం డేని దుర్వాంఛానులబ్ధుం డేని
కితవుం డేని మహాభీలపతితుం డేని
పతియ దైవంబుగం ద్రిశుద్ధిపరత నమ్మి
సతతమున్ సేవ చేయుటే సాధ్వికి విధి.

కినియక యహమహమిక ముం
దెనయక కామంబు క్రోధ మెదం దాల్పక యెం
దు ననన్యవృత్తి నాథుని
మనమున్ దనియింపం బూన మానవతి కగున్.

కాంచంబడి యన్య నెమ్మొయి గాంచకుండి
నవ్వంబడియును బరునితో నవ్వకుండి
పలుకరించిన నొరుతోడం బలుకని సతి
సాధులక్షణలక్షిత సాధ్వి మిన్న.

తనురుచి జవ్వనంబున నుదారతం గాంచియు గేహకార్య సా
ధనమున జాణయయ్యుం గడు దాంపున నన్యుం డనూనరూపతన్
బెనంగొనినన్ గురూపుం డగు ప్రేయసు మెచ్చు పతివ్రతామణిన్
గనుంగొని గీ రమా కుధరకన్యక లిచ్చ నుతింతు రెంతయున్.

దేవుండైనను నరుం డైన దివిజలోక
నాథుం డైనను గంధర్వనాథుం డైన
సతికిం బ్రేముడి గొలుపండు పతియ తక్క
కొండ అన నేల బ్రహ్మాదు లందఱైన.

అనుకూల్యము ధర్మకార్యముల నిలిపి
సమ్మతం బర్థపద్ధతి సంతరించి
కామములయందు మిగులం బ్రాగల్భ్య మూని
వఱలం దగు జాయ లోకైక వందనీయ.

తనపరిశుద్ధమూర్తికి నుదాహరణంబుగ గేహ మెల్లవే
ళను బరిశుభ్రమంగళకళానివహంబుగం జేయుచుండి పా
వనతరమైన భర్తృపదపంకజ మేమెడం గొల్చు మేల్సతీ
జనమునుబట్టి నిల్చు బురుషప్రకరంబులకీర్తి యెప్పుడున్.

ఒలసి పొలానకో వనికొ యూరునకో వరుం డేగుం డెంచి రా
నలఘుముదంబుతోడ నెదురై విమలార్ఘ్య మొసంగి యింపుమైం
బొలిచెడి మృష్టభక్ష్యయుతభోజనముం దనివోందంబెట్టు నా
కలితకులావతంస కులకాంత జగన్నుత; వింత యేమగున్.

ఇలుగడప నిచ్చు విత్తము
వలసగు నట్టులనె పట్టి వ్యయపెట్టుచు నె
ట్టులనైనం దుదకు నించుక
నిలిపెడి లలితాంగి ధర్మిణీమణియ యగున్.

అర్థులకొఱ కునిచిన ధన
మర్థింపక దాంచుకొనక యాచకమనుజ
ప్రార్థనమున భర్త్రాజ్ఞ
వర్థిల నిడు ముగుద లోకవర్ధనియ చుమా.

# వకుళమాల

సహదేవ సూర్యప్రకాశరావు గారు

ఏ నిగూహనశ్యామికాహృదయవాటి
నిలచి చదలేటిమెలుగెత్తి పిలచు చుంటి
నీ వనీద్వార మెవరు బంధించినారు
తరలి రా రేమి ద్వారమున్ తెరవ రేమి ?
ఇరులరాణి చీకటి విహారించుకొనుచు
వినిమె కాబోలు పిలచిన పిలుపు సన్న
గొనుగువోయిన యాకాశకుహరపదము
చుక్కల మినుకులోన కుంచుకొనిపోయె.
తెరచివేయుము వేకువ తీవకొనలు
సాగి రేకొత్తకుండ,
నిశా ప్రమీల
నయనకోణశోణాంకితనవనవ ప్ర
సన్నమధురమ్ము లొలికె నీచకితవీథి,
విరులు, నెరసందె చివురుకావిరుల తెరల
వెడలి నిట్టూర్చి మ్రాగన్ను వెట్టె.
సిగ్గు
వలపులివమె చీకటివెల్లువలు తరించి
తెరచివేయుము వేకువ తీవకొనలు
సాగి రేకొత్తకుండ,
నిశ్వాస మూర్చి
తెరలుతెరలువోవుచు తరితీపుతోడ
తేటికోలేక ఆశాప్రతీక్షలోన
ఎడద చుమ్మలువోవ ఊంపిల్లు బ్రదుకు.
తెరచివేయుము—
ప్రణయపులకితసోపానపథము వీడి
ప్రసవహృదయమ్ము గైసేయ వచ్చినాను.
చంచలచ్చంచరీకపక్షాంచలాల
బరువువారిన ప్రణయినీప్రణయగీతి
మిహికశిశిరాలసానిలోర్మికల తేలి
తేలి, ఎట్టని చిక్కని నీలిదారి
చెవికిసోకిన దీ మబ్బుచీరవాటి
లేతవలపుదొంతరల తృళ్లింతపొరల
తెరచివేయుము—
జాగరింపు లేలో దురాశామనస్వి
మొయిలుచీకట్ల రాయిడి మునిగి మునిగి
వ్రేలినవి నిశాక్లైశికజాలకములు
ఈకృశానుప్రతీక్ష వేగింపలేను.
తెరచి వేయుము—
ఇగిరిపోవునో యేమొ ఈ హృదయపాత్ర
మందు తొణి కెసలారు సుధాసవమ్ము
నాచెలియమోవి రేకు లంటకయె, జారి
నేలపాలౌనొ చలితకరాలనుండి.

*　　　　*

సకియ, చూపుల రంగవల్లిక రచించి
వేచియున్నది, పూర్వదిశాచలాంచ
లాల, హైమహిమానీకరాంగుళాల
చిలుకు మిన్నేటి పన్నీటి వలపుకొలకు.
ఎదలు మాటాడుకొన్నవి. బెదరి బెదరి
కలసికొన్న వీక్షాలతాంచలము విచ్చి
చివురుచాయరేకుల కళాసించి, తదియ
వెన్నెల నునువెలుంగులై మిన్నుబ్రాకె.
కరము కరము గీల్కొన్నది. కలికిసంజ
ఎఱ్ఱుపుతావుల చదలల్లి వెలుపుజూపి
సిగ్గుజూపు తలపు జూపి చిక్కువీడి
తొలగి, తొలిమంచు తీవలై మలసికొనును.
పెదవి పెదవి చుంబించుకొన్నది. కరంగి
సన్నగా జాలిగా చలన్నవాంబు
దాల రవళింపు మధురింపు లేలొ గళము
లోన పాటగా విరిసి కొర్కొనియె నాడు.
నాటి తొలిసారి కౌగిలింతల వాసించి
కనులు, తెలిదామరల తొలుకారు సొగసు
గుత్తకొన్నది. అట చివురొత్తు నచట
రాలిపడును నవోషఃపరాగపదము.
మోవిచివురాకు చలియింప తీవచెలియ
ఎన్నికుసుమాల హసియించె, ఎద మరంగి
గుబులుకొన్నది. తిమిరావకుంఠనాన
ఒక్కతారకయే ఒక్క ఉదితరాగ
గీతికామాలికే కోరకితవిభాత
హాసకేశాలవమె మెఱుగార బోదు.



# భీమకవి—"ప్రతిజ్ఞాచాణక్యము"

యీయాయాణ్ణి వేంకటవీరరాఘవాచార్యులు గారు

సంస్కృతసారస్వతసాగర మనర్ఘకావ్యరత్నాకరము. నేటివఱకు సూర్యాలోకముం బడసిన సంస్కృతకావ్యరత్నముల సంఖ్యకంటె నెన్నియో మడుఁగులు విలుప్తములు, విస్మృతములు నగు నమూల్యకావ్యమణులు గలవు. సారస్వతక్షేత్రమునఁ గఠోరవ్యవసాయము సల్పు శోధకులమూలమున లుప్తప్రాయములు, నామమాత్రజ్ఞాతములు నగు ననేకకావ్యములు కవికవితాజిజ్ఞాసువుల కవితానుధారసపిపాసఁ గ్రమక్రమముగాఁ దీర్పఁగల్గుచున్నవి.

*     *     *     *

మధురలో నమెరికన్ కాలేజీలో నాచార్యులగు శ్రీయుత ఆర్. రామమూర్తిగారు 'మద్రపుర ప్రాచ్యపరిశోధకపత్త్రిక' (మద్రాసు ఓరియంటల్ రిసెర్చ్ పత్త్రిక 3-వ సంచిక 1-వ భాగము 1929 జనవరి, మార్చి, పేజీ నెం. 80)లో నాంగ్లమునఁ బ్రచురించిన వ్యాసమే ప్రకృతము నా రచింపఁబోవు వ్యాసమునకుఁ బ్రధానముగా నుపజీవ్యము. సువిపులమగు సంస్కృతనాటకరత్నాకరములో భారతవర్షచరిత్రాత్మకములగు నాటకరత్నములు బహువిరళముగాఁ గానవచ్చెడిని. చరిత్రాత్మకరూపకములలో విశాఖదత్తుని 'ముద్రారాక్షసము' నృపాయమాణముగా నున్నదని చెప్పవచ్చును. రాజనీతినౌకకుఁ గర్ణధారభూతుఁడును, సర్వతోముఖప్రతిభాప్రకాశుఁడు నగు చాణక్యుని సాహాయ్యమునఁ జంద్రగుప్తుఁడు మగధరాజ్యసింహాపీఠిక నధిరోహించుట, నందోన్మూలనము, తత్సహాయభూతులగు నుత్తరాపథ్యుల సంహననము నిందలి యితివృత్తమని నాటకపాఠకులకు సువిదితమే. ఈ వస్తువే "ప్రతిజ్ఞాచాణక్యము" నఁ గూడ స్వీకరింపఁబడినట్లు తన్నామమే విశదీకరించుచున్నది.

అలంకారశాస్త్రమున కలంకారభూతు లగు నభినవగుప్తపాదాచార్యులు తమ "అభినవభారతి" లో నీనాటకమును రెండుసారు లుల్లేఖించికొనియున్నారు.

1. "భవతులేనయం లోకేజాతాపశబ్దపరంపరాపరిచయమయీ వార్త్తా కీర్త్తిం నిరుప్య నిక్రుత్తసీ" ఇతి 'ప్రతిజ్ఞాచాణక్యే' మహాకవినా భీమేన రాజాపి విస్మృతేకేతుః భూయసావ్యవహృతః, [ 2 సం. 343 పుట ]

2. "ప్రవేశకాబాహుళ్యేన తావ త్తాపసవత్సరాజ ప్రతిభాచాణక్యముద్రారాక్షసాదిషు" [ 2 సం. 459 పు. ]

ఈ యాకరములవలన నీనాటకమునకుఁ "బ్రతిజ్ఞాచాణక్యము," "ప్రతిభాచాణక్యము" నను రెండునామములు గలవనియుఁ దత్ప్రణేతృమహాకవి భీముఁ డనియుఁ దెలియుచున్నది.

ఒకనాటకమునకే రెండునామము లుండవని కొందఱ * యాశయము. ఇది సత్యేతరమని యీ క్రింద నుట్టంకింపఁబోవు నామద్వయాన్వితనాటకములవలనఁ దెలిసెడిని.

1. పుష్పదూషితకము : పుష్పభూషితకము
2. విక్రాన్తశూద్రకము : విశ్రాన్తశూద్రకము
3. అభిసారికావఞ్చితకము : అభిసారికాబన్ధితకము
4. కర్ణభారము : కవచాదానము ( కుణ్డలాహరణము )
5. ఊరుభంగము : గదాయుద్ధము
6. అభిషేకనాటకము : రామాభిషేకము
7. ప్రతిమానాటకము : ప్రతిమారామము : ( ప్రతిమాదశరథము )

రసికచక్రచూడామణియుఁ, గవికావ్యనిర్ణయకేసరియు, నలంకారాహవరంగమున మహారథుఁడు నగు నభినవగుప్తపాదాచార్య నంతటి మహనీయుఁడు 'ప్రతిభాచాణక్య'ప్రణేతయగు భీముని 'మహాకవి' పదభూషితునిగాఁ జేర్కొనియున్నాఁడు. భీముఁడు మహాకవిగాని కేవలకవిమాత్రుఁడుగాఁడు, "కేవల కవయస్తు కేవలం కపయః"అని కోమలగద్యకౌశలకలాభరణుం డగు భట్టబాణుఁడు నుడివియున్నాఁడు. అందువలన భీముని కొసఁగఁబడిన 'మహాకవి' బిరుదము తన్నిరుపమతమమగు కవితయొక్క మాధుర్యమును బ్రకటీకరించుచున్నది.

'సూక్తిముక్తావళి' 'సుభాషితావళి' మొదలగు సంధానగ్రంథములలో భీమకవినిబద్ధములు, సుధాకరసుధాఝురివలె రసికాళికామోదసంధాయకములు నగు ననేకశ్లోకములు గానవచ్చుచున్నవి. అందు.—

1. 'శ్రుత్వాకర్ణజ్వరమ్'
2. 'ఆశజ్క్యప్రణతిం' [ వల్లభదేవుని 'సుభాషితావళి' 1590 శ్లో. ]
3. 'కాని స్థానాని దగ్ధాని' [ అదే. 1717 శ్లో. ]
4. '* స్మేరాస్సన్తు సభాసదః'

ఇత్యాది శ్లోకము లీ నాటకోద్ధృతములుగాఁ గానవచ్చుచున్నవి.

## భీమమహాకవి కాలవిచారము.

అభినవగుప్తపాదులకంటెఁ బ్రాక్తనుఁడగు నేకవియు, నేయాలంకారికుఁడు నీకవినిగాని, తత్కృతింగాని స్మరించినట్లు కానము. అందువలనఁ గాలనిర్ణయసాధకములగు హేత్వంతరములు లభించువఱకు నీతఁ డభినవగుప్తపాదులకంటెఁ బ్రాచీనుఁ డని నిర్ణయింపఁ దగును. 'ప్రత్యభిజ్ఞావిమర్శిని' మీఁది యానందవర్ధనుని 'బృహతీవృత్తి'వలన నభినవగుప్తపాదులు, క్రీ. శ. 990—1020 లో సారస్వతసేవయొనరించినట్లు తెలియుచున్నది. కావున నభినవగుప్తపాదులచే స్మరింపఁబడిన 'ప్రతిజ్ఞాచాణక్యము' క్రీ. శ. 990 కంటె నర్వాచీనము గాదనుట నిర్వివాదము.

ముద్రారాక్షసకాలసూచన మిట నప్రస్తుతము గాఁజాలదు. విశాఖదత్తుని సారస్వతపరిశోధకు లెవ్వరును గ్రీ. శ. 800 కంటెఁ బ్రాక్తనునిగాఁ జెప్పియుండలేదు. చంద్రగుప్తుని యౌన్నత్యము నభివర్ణించు రూపకములలో 'ముద్రారాక్షసము' ప్రాచీనతమ మనదగును. 'ప్రతిజ్ఞాచాణక్యము' దీనికిఁ బ్రతినాటకముగాఁ గానవచ్చుటచే, 'ముద్రారాక్షసము' కంటె నిది యర్వాచీన మనుట సమంజసము. అందుచే 'బ్రతిజ్ఞాచాణక్యము' క్రీ. శ. 800—1015 మధ్యకాలమున రచింపఁబడెనని యూహింపఁదగును.

## ముద్రారాక్షసప్రతిజ్ఞాచాణక్యముల సామ్యము

ఈ యుభయనాటకములనామములే తత్సాదృశ్యద్యోతకములు. 'ముద్రారాక్షసము' న నమాత్యుఁడగు రాక్షసునకు నమజ్ఝళభూతమగు నాతనిముద్రకు నతిమాత్రప్రాధాన్య మొసఁగఁబడినది. 'ప్రతిజ్ఞా (భా)చాణక్యము' న సాహసికుఁడగు చాణక్యునకు, నారబ్ధకార్యప్రతిష్ఠాపయిత్రియగు నాతని భీష్మప్రతిజ్ఞకు (దివ్యజ్యోతి వంటి యాతని యప్రతిమప్రతిభాపాటవమునకు) విశేషప్రాముఖ్య మొసఁగఁబడినది. ఈసామ్యమువలన, 'ముద్రారాక్షసము' ను దలఁదన్నవలెనని భీమకవి 'ప్రతిజ్ఞాచాణక్యము' రచించియుండుననుట కవకాశము కలుగుచున్నది. ఈనాటక పాత్రనామసామ్యముఁగూడ నరయఁ దగును.

---

* "మద్రపుర ప్రాచ్య (సాహిత్య) పరిశోధకపత్త్రి" కాధిపతు లీ నాటకముయొక్క నామద్వయవిషయమున నిట్లు లఘోజ్ఞాపికలో వ్రాసియున్నారు. "ప్రతిజ్ఞాచాణక్యమునకు బ్రతిభాచాణక్య మను నామాంతరము గల దను నీ వ్యాసకారుని వాదమునకు ముఖ్యాధారము పూర్వోద్ధృత మగు 'నభినవభారతి' లోని రెండవయాకారమే. ఇది బహుశః లేఖకప్రమాదజనితమనియే తోఁచెడిని. అనేకలిపులలోని 'జ్ఞ' ను 'భ' అని భ్రమపడి పఠించుట సర్వసాధారణముగా నున్నది. ఇట్టి స్వల్ప విషయము నిట్టివాదమునకు నిదానముగాఁ జూపుట యసమంజసమేమో యని తోఁచుచున్నది." (మద్రాసు ఓరియంటల్ రిసెర్చ్ పత్త్రిక 3-వ సంచిక 1-వ భాగము)

* ఇది ప్రస్తావనాంతర్గతము గావచ్చును.

'ముద్రారాక్షసము' లో 'మలయకేతువు',
'ప్రతిజ్ఞాచాణక్యము' లో 'విన్ధ్యకేతువు',
ఈనామసామ్యము పైయభిప్రాయమును బ్రబలీకరించుచున్నది.

### కాలఞ్జర ప్రభువు—భీమకవి

కవికావ్యస్తవాత్మకములగు రాజశేఖరుని శ్లోకములలోఁ బ్రకృతప్రయోజకములగు కొన్నివిషయములు లభించుచున్నవి. ఒకానొకశ్లోకములో భీమటుఁడను కాలఞ్జరప్రభువు ప్రశంసింపఁబడియున్నాఁడు.

"కాలఞ్జరపతిశ్చక్రే భీమటః పఞ్చనాటకీమ్
తేషు ప్రబన్ధరాజత్వం ప్రాప స్వప్నదశాననః"
—'సూక్తిముక్తావళి' 43 శ్లో.

దీనివలన భీమటుఁ డైదునాటకముల రచించెననియు నందు "స్వప్నదశాననము" ప్రబన్ధరాజత్వము వహించుచున్న దనియుఁ దెలియుచున్నది.

కాలఞ్జర మనునది యొకానొకదుర్గము. ఛాండెలు లను దుర్గనిర్మాతల కిది రాజధానియైనది. వీరి చరితము నవమశతాబ్దారంభమునుండి ప్రారంభించినట్లు చారిత్రక విద్వాంసుఁడు విన్సెన్ట్ ఎ. స్మిత్ వ్రాసియున్నాఁడు. ఛాండెలు ప్రభువగు యశోవర్మ రాజ్యపాలనకాలములో (క్రీ. శ.916) కాలఞ్జరదుర్గము వారి వశమయ్యె ననియుఁ బైపండితుఁడు వ్రాసియున్నాఁడు. అందువలనఁ గాలఞ్జరదుర్గము ఛాండెలుల వశమగుటకుఁ బూర్వము భీమటునిచేఁ బాలింపఁబడుచుండెనని తెలియుచున్నది. రాజశేఖరుని శ్లోకముంబట్టియుఁ గాలఞ్జరదుర్గపతనముంబట్టియు నీతని రాజ్యపాలనము క్రీ. శ. 915 నకుఁ బ్రాక్తనమని చెప్పవచ్చును.

'భీమట' శబ్దములోని 'ట'కారము లోపించి, యీతనినామము 'భీమ' (కవి) యనియే ప్రసిద్ధినొందియుండును. ఇతఁడు నాటకపంచకప్రణేత యని రాజశేఖరుఁడు లిఖించియుంచియుండుటచే నీతఁ డుత్తమ గ్రంథనిర్మాణక్షమమగు నిశిత ధిషణాసంపన్నుఁడైయుండవలెను. అభినవగుప్తపాదులు స్మరించిన 'ప్రతిజ్ఞాచాణక్య' నాటకనిర్మాత యగు మహాకవి భీముఁడును బ్రకృతభీమకవియు నొకఁడే యనియుఁ, 'బ్రతిజ్ఞాచాణక్యము' భీమకవినిర్మితనాటకపంచకములో నొకటి యనియు నిర్ధారించుట సత్యదూరము గాఁజాలదు. కాలనిర్ణయముగూడ నీయభిప్రాయమునకు సాధకముగానే యున్నది. 'మహాకవి' యను విశేషణము రాజ్యమహత్త్వమునకు హీనత్వాపాదకము కానోపదు. కనౌజ్ ప్రభువు, రాజకవి, కవిరాజు నగు హర్షవర్ధనుఁడు తన నాటక ప్రస్తావనలలో "శ్రీహర్షోనిపుణఃకవిః" అని వ్రాసికొనియున్నాఁడు.

"ప్రతిజ్ఞాచాణక్య" ప్రణేత కాలఞ్జరప్రభువే యనియు, నీతఁ డైదు నాటకముల నిర్మించెననియు, నందు 'స్వప్నదశాననము' 'ప్రతిజ్ఞాచాణక్యము' 'మనోరమావత్సరాజము' నను మూఁడునాటకములు మాత్రమే నామమాత్రముచేనైన నవశిష్టములనియు, నీ నాటకనిర్మాత క్రీ. శ. 800—915 మధ్యకాలమున విలసిల్లియుండెననియు సింహావలోకనముం జేయనగును.

ప్రాచ్యవిద్యాప్రౌఢసరస్వతులు, మహామహోపాధ్యాయులు ననఁదగు శ్రీపణ్డిత మానవల్లిరామకృష్ణకవిగారు రాజమహేన్ద్రమునఁ బ్రచురింపఁబడు 'ఆంధ్ర దేశీయేతిహాసపరిశోధకమండలి' వారి త్రైమాసికపత్రిక (ఆంధ్ర హిస్టారికల్ రిసెర్చి సొసైటి పత్రికయొక్క 1-వ సంచిక 3-వ భాగము 159 వ పేజీ జనవరి 1927)లో 'తాపసవత్సరాజ' మను శీర్షికతో నొక యమూల్యవ్యాసముం బ్రచురించియుండిరి. అందలి ప్రకృతోపయోగములగు వాక్యముల నుట్టంకించెద.

"భీమట విరచితమగు 'మనోరమావత్సరాజ' మను నాటక మొకటి కలదు. ఈభీమటుఁ డయిదునాటకములను రచించెననియు నందొకఁడగు 'స్వప్నదశానన' మను దానిని భోజుఁడు పేర్కొనెననియు రాజశేఖరునివలనఁ దెలియుచున్నది. ప్రియదర్శికానాటకగర్భాంతర్నాటికయందు ప్రియదర్శికాసఖి యగు మనోరమ యుదయనభూమిక ధరింప నియమిత యగుట విదితము. ద్వితీయ చంద్రగుప్తుని కాలమునందుండిన ట్లెంచుచున్న విశాఖదేవుఁడు 'ముద్రారాక్షస' 'దేవీచంద్రగుప్త' 'అభిసారికావంచితకా' యను మూఁడునాటకములను రచించెను. మూఁడవరూపకమున పద్మావతి యుదయనునిపుత్రుని జంపినట్లు నిరూపితయయ్యెను. పద్మావతిచే నిట్టి ఘోరకృత్యమొనరించుటకుఁ గారణము బౌద్ధజాతకకథల సంపర్కమేమో! జాతకకథలయందసూయాపూరితయగు మాకందిక యుదయనని మోసపుచ్చినట్లు వర్ణింపఁబడెను.

పద్మావతీపరిణయ మను మతి యొండు నాటకంబు గలదు. ఆనాటకమున గా నుపఁడు బ్రాహ్మణుఁడగుటంజేసి యాపద్మావతికి నా పద్మావతికిని సంబంధ ముండనేరదు.

పద్మావతీపాత్ర వచ్చు నీ నాటకములలో తాపవత్సరాజనాటకమునకన్న భాసనుబంధుల నాటకములు పూర్వమునను, భీమటుని మనోరమావత్సరాజనాటకము తరువాతను రచితము లయ్యె ననఁదగును. ఏలయనిన, భీమటుని రుమణ్వానుఁడు తాపసవత్సరాజమునందలి పాత్రకన్న దిద్దితీర్చినవాఁడుగాఁ గానఁబడును. బృహత్కథామాల్యకానుసారము తాపసవత్సరాజమునందు యౌగంధరాయణుఁడే యుదయన భవనమునకు నిప్పు నంటించును. కాని భీమటునినాటకమునందు పాంచాలురు కౌశాంబి నెదిరించునప్పుడు రుమణ్వానుఁడు ద్రోహియయి పాంచాలురపక్షము నవలంబించి యుదయనుని మందిరము నగ్నికి నాహుతిగ నొనర్చును."

—•—

## ఊర్మిళా

పా. విజయరాఘవరావు గారు

ఏ పవిత్రక్షణాల నే నాపలేనో వేడినీకలభావాలజాడ
అపుడు
నోరులేనికన్నుల రాయబారములు
వినిపొదు పెదవుల విప్పు కనీనికలతో—
నీదు అరవిచ్చిచూచు కనీనికల జనించు ఊహల
వ్యక్తీకరించుకొను మనియహృదయము
ఆశాభయనీప్తమగుచు.
*   *   *
చేరిచేరి చిక్కనయి గంభీరమగునిశను
ప్రభాతరేఖలవోలె
ఒకటిగా జనించి, సర్వతోముఖియై ఘనీభవించు అంబుదముపాలి
ఝంఝానిలంబువోలె
కొనలు తేరని కోర్కుల మనసు
మండు వీక్షణాల బిగింపు అర్పించివైచె;
దరియదు, నిదురలేమి మందాగ్నికతన
కలలకలలో సుఖించు ఆకలియు కూడ.
*   *   *
ఓరకన్నుల నాల్కొన్న కూరి మింకిపోయెను
జల పడదిక—
నా మొండివీక్షణాల మునురుకొనె తమము
వ్రాలలేని క్రొత్తవలపు కన్నీటిసంకోచమునను.

తలబు వాల్చని రెప్పల బలువు
అనుభవంబె నీకు 'ఊర్మిళా'—
అట్టె లేదు—
ఎంత మధుసాయంతనంబొ
ఎంత వెన్నెల ప్రాపు నిశయొ
ఎంత తీయని ఆశయంబో
ఇంతి నీ బ్రదుకు.
*   *   *
ఊర్మిళా!
నేనుజ్ఞాపకమున్న
అందుకొనవె నా వేడియూర్పులకొనను నీవు?
తెలియనే తెలిసె నీవలిప్రేమలనీడ,
గాలనే రాలె నీవేడి వ్రీడజాడ
ఆవీక్షణాలలో అయ్యయో ఊర్మిళా!
*   *   *
ఎపుడొకన్నులు నిమీలించునపుడు
తిమిరవీథిని వెలిగించు నట్లె బధిరహృది
గడియలను దుల్చి వినెదు—
చెక్కిళులగులాబి పరిమళించెడు నీ తేనెపలుకులగమి—
అపుడు
ఊర్పు ఊపిరితీయ అదను లేదు—




దగ్గిరదగ్గిర ఇరవైసంవత్సరా లయింది సినిమాల పరిశ్రమ మనదేశము ప్రవేశించి, ఇప్పుడిప్పుడు బాగా వాడుకలోకి వస్తూంది. సినిమాలగురించి చెప్పాలంటే సవాలక్ష గ్రంథం అవుతుంది. కాని రెండుమాటలు చెప్పి ముగిస్తా.

సినిమా మహాత్తు, ప్రపంచమంతా మారుమోగుతూంది. వార్తాపత్రికల్లో చదివే విశేషాలు డ్రామాల్లో చూసే వేషాలు తెరమీదచూస్తే వాటికి జీవకళ వచ్చిందా అని అనిపిస్తూంది. 'పాథే గజెట్' అని వారం వారం సీమనుంచివచ్చే ఫిల్మునుచూస్తే, నేను చెప్పేమాట బోధపడుతూంది. సినిమా వ్యాపారానికి మంచి వీలైన పరిశ్రమ. ఒకమహానుభావుడు ఫ్రెడ్ ఫాలోస్ఫిలిప్ అన్నాడు. ఎక్కడికి ఫిల్ము వెళ్తే అక్కడ విదేశవ్యాపారం బాగాజరుగుతుంది అని.

సినిమాలకి పుట్టిల్లు అమెరికాలో హాలీవుడ్డు. అక్కడే వన్నెకెక్కిన నటకులు, డైరక్టర్లు ఉన్నారు. దీనికితోడు డబ్బు ఖర్చుపెట్టి పరిశ్రమలని పెంచేవాళ్లకు కరవులేదు. ఆలోచించిచూస్తే ఫిల్ములు మోటారుకారుల వల్లనే అమెరికాదేశం ప్రపంచాన్ని కొల్లగొట్టుతూంది. ఇకహాలీవుడ్డు అనే ఊరుసంగతిచూచామా, డోలర్లలో మునిగి తేలుతూంది అన్నమాటే. అందుకే సినిమాలకి హాలీవుడ్డు ఆదర్శమైంది.

అయితే హాలీవుడ్డులోకూడా ఫిల్ములు తయారుచేయటానికి ఎంతో ప్రయాసపడతారని తెలుస్తూంది. ఒక సినిమా కార్ఖానా ఉంటే, అనేకశాఖలు ఉంటాయి. మొదటిది డైరక్టర్ల డిపార్టుమెంటు. ఇక అస్టుడైరక్టర్, సినేరియో ఎడిటరు, కాస్టింగు డైరక్టరు, లొకేషన్ మేనేజరు, ఫిల్ముఎడిటరు, ఛాయాపటాధికారి అని అనేకమైన శాఖ లుంటాయి. మొదట డైరక్టరు ఒక కథను ఎంచుకుంటాడు. అది ఫిల్ముగా తయారైతే జనానికి రుచిస్తుందా, డబ్బు బాగా వస్తూందా అని ప్రశ్నలువేసి చూస్తాడు. ఈ పరీక్షఘట్టకి కథ ఆగిందా, పని సాగించారన్నమాటే. వెంటనే, సినేరియో ఎడిటరు కథను ఫిల్ముపట్టికగా తయారు చేస్తాడు. ప్రతిసీనులో ఉండే ఛాయాపటాకృతి, వర్ణన, అలంకారం ఈవిషయాలన్నీ దానిలో వివరించి ఉంటాయి. ఆపట్టికను గురించి శాఖాధికారుల మీటింగు జరుగుతుంది. అప్పుడు, పట్టికలో కొంచెము మార్పులు జరుగతాయి. తర్వాత, పట్టికకి కాపీలు తీసి అన్నిశాఖల యజమానులకు పంచిపెడతారు. అప్పుడు నటకులను ఏర్పరుస్తారు. ఈ విషయంలో కాస్టింగు డైరక్టరుదే పని. అతని యిచ్ఛారాజ్యం. సమర్థుడైతే, అతడు కొరగాని నటకులను వన్నెమాలినవాళ్లగా చేయగలుగుతాడు.

ఇంతలో, రోజారోజుకి తీయవలసిన సీనులు, వానికైనం అంతా జాబితాలు తయారుచేస్తాడు అస్టుడైరక్టరు. ఫిల్ముకు కావలసిన సామగ్రి దుస్తులు రంగులు అన్నీ సమకూర్చటానికి అతడే జవాబుదారి. ఇకఎక్కడెక్కడ సీనులు తీయాలో ఆలోచించి ఏర్పాట్లుచేసేవాడు లొకేషన్ మేనేజరు. ఛాయాపటాల్ని తీయటానికి కెమెరా మేన్ ఉంటాడు. పటాలుతీసేటప్పుడు చూస్తే కొంచెం గమ్మత్తుగానే ఉంటుంది. అప్పుడే డైరక్టరు పస కనపడేది. ఒకవైపు కెమెరామేన్, మరొకవైపు నటకులు డైరక్టరుచేతిలో కీలుబొమ్మల్లాగ ఆడవలసిందే. చూడవలసిందేగాని ఆసంగతి చెప్పితే లాభం లేదు. ఇట్లా కొన్నివందలఅడుగుల పటము ఒకరోజుకు తయారుచేస్తారు. ఏనాటి కానాడు సాయంకాలమే కెమెరామేన్ తన లేబరేటరీలో పనిచేసి ఫిల్మును ఫిల్ముఎడిటర్ కు పంపిస్తాడు. ఇతడుకూడా చాలా ముఖ్యుడు. ఫిల్ములో ఉండే హంసపాదుల్ని అనవసరభాగాలని చూచి కత్తిరతో చక్కపెడతాడు.

డైరక్టరు సీనులన్ని పూర్తము చేసినతర్వాత, ఫిల్ముఎడిటరు తనవద్దవుండే రోజువారీ ఫిల్ముముక్కలని కలిపి, ఒకేఫిల్ముగాచేసి ప్రొజక్టరు (ప్రదర్శనయంత్రము) మీద శాఖాధికారులందరికి దానిని చూపిస్తాడు. అప్పుడు ఫిల్ము చాలా పెద్దదై ఉంటుంది. దాని సంగ్రహం చేయటానికి కొన్ని సీనులను తీసివేసి, వానిమధ్య, హెడ్డింగ్సు పేరులు కూర్చుతారు. ఆవెనక, శాఖాధికారులు కలిసి తిరిగి పరీక్షచేస్తారు. ఈ విమర్శనబట్టి యింకా మార్పులు జరుగుతాయి. కొన్నిసీనులు కలపటం కొన్ని తీసివేయటం కూడా జరుగుతుంది. ఇప్పుడు ఒకవిధంగా ఫిల్ముతయారైందనుకోవచ్చు. అప్పుడు రీల్సుగా ఫిల్మును విభజిస్తారు.

గవర్నమెంటు ఏర్పర్చిన బోర్డువారు ఫిల్మును తనిఖీచేసి, నిబంధనల ప్రకారం చూచి ప్యాసుచేస్తారు. ఇక ఫిల్ముమార్కెట్టుకు వస్తుంది. వేలకువేలు జనులు చూస్తారు. బాగుంటే ఆనందించి ఆదరిస్తారు. లేకుంటే తిట్టి నిషేధిస్తారు.

ఇంతకూ, మనవిచేసే దేమంటే మంచి ఫిల్ములయొక్క గొప్పతనము కేవలము నటకులమీదే ఆధారపడలేదని. పైనజెప్పిన వాళ్లంతా ముఖ్యులే. అందరికంటే కంపెనీ ప్రొప్రయిటరుయొక్క ధనవ్యయాన్నిబట్టి, ఫిల్ములుంటాయి. అమెరికాలో సినిమాధిపతుల సాహసంచూస్తే కడుపు చెరు వవుతుంది. ఇవాన్ జలైన్ ఫిల్మును తయారుచేసిన ఎడ్విన్ కారివ్ అనే ఆయన ఒకలక్షడాలర్లు ఖర్చుచేసి సీనులు తీయడానికి మోంటిరే ఒడ్డున అకేడియన్ అని ఒకగ్రామం కట్టించాడు. తిరిగి, ఒక అగ్నిప్రమాదంసీనుకోసం అకేడియన్ గ్రామాన్ని నిప్పుపెట్టి నిర్లక్ష్యంగా దగ్ధంచేశాడు. హోవర్డు హ్యూజన్ అనే యింకొక ప్రొప్రయిటర్ 3,000,000 మార్కులు ఖర్చుపెట్టి హెల్స్ ఏంజల్సు అనే ఫిల్మును తయారుచేశాడు. రెండుసంవత్సరాలు పట్టింది పూర్తికావటానికి. 40 యుద్ధనావలు ఈఫిల్ములో పనిచేశాయి.

పోయినసంవత్సరం లెక్కలు చూస్తే, ఒక్కహాలీవుడ్డులోనే రెండువందల కోట్లుడాలరులు ఫిల్మువర్తకంలో పెట్టుబడి పెట్టారని తెలుస్తుంది. ఇక అమెరికాలో ఎక్కడ చూచినా సినిమా శాలలే. పట్టణాల్లోనే 1300 ఉన్నాయి. వీటిని టాకీలగా (మాట్లాడే ఫిల్ములుగా) మార్చవచ్చు. మొత్తము, ఆదేశంలో యీవ్యాపారం చేసేవాళ్లసంఖ్య 20,000. కార్ఖానాల్లో పనిచేసేవాళ్ల సంఖ్య 75000 కి దాటింది. గొప్ప డైరక్టర్లకి నటకులకి జీతాలు చూస్తే వేలకు వేల డాలర్లమీద ఉంటాయి

హాలీవుడ్డు గురించి మాట్లాడి మనదేశం వంకచూస్తే ఏనుగుకి దోమకి ఉన్నంత తేడా కనబడతుంది. అయినా తేరిపారచూస్తే, ఏదోకొంచెం కృషిజరిగిందని చెప్పవచ్చు. ఫాల్కే అనేఆయన పుణ్యమంటా 1912 సం.లోనే బొంబాయిలో సినిమా కార్ఖానా వెలిసింది. తర్వాత 1919 లో కలకత్తా, 1924 సం.లో పంజాబు, 1929 లో మద్రాసు కార్ఖానాల్ని బయలుదేశాయి. మనదేశంలో మట్టుకు బొంబాయి కార్ఖానాలికి పెట్టిందిపేరు. దేశంలో ఉండే 65 కార్ఖానాల్లో బొంబాయిలోనే 21 ఉన్నాయి. ముఖ్యంగా ఇంపీరియల్, రంజిత్, కృష్ణా ఫిల్ముకంపెనీలపేర్లు దేశదేశాలకి దాటాయి. మనదేశంలో ఈవ్యాపారంచేసే కంపెనీల సంఖ్య 75.

సుమారు 318 సినిమా శాల లున్నాయి. ఈ 318 లో సుమారు 220 మదన్ థియేటరు వారివే. ఈ కంపెనీవారివల్లనే ఈపరిశ్రమకి గౌరవం వచ్చిందంటారు.

ఇక మన నటకుల జీతాలు చూస్తే చాలాతక్కువ. ఇంపీరియల్ లో ఉన్నప్పుడు సులోచనకి రు 3000 యిచ్చేవారు. సాగర్ ఫిల్ముకంపెనీలో బిబ్బోకి రు 750 మాత్రమే జీతం. డైరక్టరుల్లో భవనాని రు 1200 లు ఇంపీరియలు కంపెనీలో తీసేవాడు. ఇప్పుడు యింతజీతం తీసే డైరక్టరు లేనేలేడు. తక్కువజీతాలకి ఓర్చుకొని, పేరుకోసం ఆశపడకుండా పనిచేసిన డైరక్టర్ల వల్లనే మనదేశంలో సినిమా యింత అయినా అభివృద్ధి అవటం. ఫాల్కే, చౌదరీ, భవనాని, ఎజ్రామీర్, నిరంజన పాల్, షా, ప్రఫుల్లఘోష్, రాజాసాండో, ప్రకాశం మొదలైనవారిని అనుకోవాలి ఈకళకి వన్నెదెచ్చినందుకు. మనదేశంలో తయారుచేసిన ఫిల్ములు కొన్ని మాత్రం గొప్పపేరు సంపాదించాయి. పాతఫిల్ముల్లో గులేబకావలి, లంకాదహన్, పతిభక్తి అనే ఫిల్ముల్ని అందరు మెచ్చుకొన్నారు. ఈమధ్య తయారైనవాటిలో షిరాజ్, త్యాగము, దేవదాసి, అనార్కలీ, ఫాదర్ ఇండియా ఈఫిల్ములని, యితర దేశాల్లో ఎగబడి చూచారని తెలుస్తూంది. శ్రీమతి ఏణాక్షి రామారావు ఎమ్. ఎ, నటించిన 'ఆసియాజ్యోతి' ని లండనులో 10 నెలలుకాలం ముచ్చటగా చూచారంట.

అయితే మన ఫిల్ములకి చేతలో విదేశపు వాటికంటె చాలా మెరుగు తక్కువంటే నిజమే. దీనికి కారణం పెట్టుబడి డబ్బు తక్కువ. అందుకే హాలీవుడ్డు సంగతి జ్ఞాపకం ఉంచుకోవాలని చెప్పటం. కాని, హాలీవుడ్డు ఆదర్శంగా ఉండాలంటే అక్కడ ఉండే మితిమించిన వేషాలు, అసహ్యమైన చేష్టలు నేర్చుకోమని కాదు. మన సాంప్రదాయానికి అనుగుణంగా ఫిల్ములని తయారుచేసి దేశపరిశ్రమగా ఆదరించటం మనధర్మం. కళని క్రమమైనటువంటి శిక్షణలో పెట్టవలసుంది. అది అంతా మన నాయకుల దయ, మనప్రాప్తి.



జస్టిసుపక్ష 'ప్రధాన విప్పు' అగు
చెట్టినాడు కుమారరాజా గారు



కాంగ్రెసు అధ్యక్షులగు
సర్దార్ వల్లభభాయి పటేలు గారు



దివంగతులయిన
పండిత మోతీలాల్ నెహ్రూ గారు



చెన్నపురాంధ్ర మహా సభ — నాటకశాఖ



రావుసాహెబు బిరుదాలంకృతులగు పింజల సుబ్రహ్మణ్యము శెట్టిగారిని వేటపాలెము వారలు అభినందించు సందర్భమున తీయబడిన ఛాయాపటము



మారాబత్తుల సూర్యనారాయణ గారు



అల్లంశెట్టి అప్పయ్య గారు



కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి గారు



ఇట్టేంకి నరసింహమూర్తి గారు



నాగపూడి కుప్పుస్వామయ్య గారు, బి.ఏ.



కాశీభట్ట కృష్ణరాయశాస్త్రి గారు



కల్యాణానందభారతీ స్వాములవారు



యలమంచిలి శ్రీరాములు గారు



క్రొత్తపల్లి సూర్యారావు గారు

# బ్రాహ్మణు లెవరు? బ్రాహ్మణేతరు లెవరు?

ఇట్టింకి నరసింహమూర్తి గారు

"బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రా ఇతి చత్వారోవర్ణాః తేషాంవర్ణానాం బ్రాహ్మణ ఏవప్రధాన" ఇతి వేద వచనానురూపం స్మృతిభిరప్యుక్తం. తత్ర చోద్యమస్తి"

వజ్రసూచికోపనిషత్తు

బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులు అని నాలుగు వర్ణములనియు, అందుబ్రాహ్మణుడు ప్రధానుఁడనియు చెప్పు వేదవాక్యము లకనరిగా స్మృతులు మొదలైనవియు చెప్పుచున్నవి. అందు దోష మించుకయు లేదు. కాని ఆవిషయమై కొంత చర్చింపవలసియున్నది. ఏమన? ఇప్పు డుండు మనుష్యులు పూర్వానుసరణి నేయేవారు ఏయేజాతికి చెందినవారు? ఎందుచేత? ఇటుల నిర్ణయించ వీలున్న నిర్ణయించవలెను, సాధ్యపడని యెడల నది యటుండనిచ్చి జ్ఞానావరోహణకై వారి సహజావస్థనే ప్రశ్నించవలెను. ఈ క్రింది విషయముల శ్రద్ధగ గమనింపుడు.

"కోవాబ్రాహ్మణోనామ? కిం జీవః, కిం దేహః, కిం జాతిః, కిం జ్ఞానం, కిం కర్మ, కిం ధార్మిక" ఇతి.

బ్రాహ్మణుఁడు ఎవఁడు? (దేనివలన?) జీవుఁడా? అన జీవభేదముచేతనా దేహభేదముచేతనా వర్ణభేదముచేతనా జ్ఞానభేదముచేతనా కర్మభేదముచేతనా ధర్మానుష్ఠానభేదముచేతనా మనము విమర్శించవలసినది?

"తత్ర ప్రథమో జీవోబ్రాహ్మణ" ఇతిచేత్, న.

అందు ముందుఁజెప్పఁబడిన జీవభేదముచే బ్రాహ్మణుఁ డనుటకు వీలులేకున్నది. ఏలన,

అతీతానాగతానేక దేహానాం జీవస్యైకరూపత్వాత్ ఏకస్యాత్ కర్మవశాత్ అనేక దేహసంభవాత్ సర్వశరీరాణాం జీవస్యైకరూపత్వాచ్చ తస్మాత్ న జీవో బ్రాహ్మణః.

ఇదివఱకు గడచినవియు నిఁక రాఁబోవునవియు నగు ననేక దేహములు జీవునకు సమానములు. జీవుఁడొక్కఁడయ్యును కర్మాధీనతవలన ననేకదేహములఁ బుట్టుచున్నాఁడు. సమస్త దేహముల యందు జీవుఁ డొక్కరూపముననే యున్నాఁడు. కాన జీవత్వభేదముచే బ్రాహ్మణుఁడు కాలేదు.

"తర్హి దేహోబ్రాహ్మణ" ఇతిచేత్, న.

అయితే దేహభేదముచే బ్రాహ్మణుఁ డనిన నదియును కాదు.

ఆచండాలాదిపర్యంతానాం మనుష్యాణాం పాంచభౌతికత్వేన దేహస్యైకరూపత్వాత్ జరామరణ ధర్మాధర్మాది సామ్య దర్శనాత్ బ్రాహ్మణ శ్వేతవర్ణః, క్షత్రియో రక్తవర్ణః, వైశ్యః పీతవర్ణః, శూద్రః కృష్ణవర్ణః ఇతి నియమాభావాత్ పిత్రాది దహనే పుత్రాదీనాం బ్రహ్మహత్యాదిదోష సంభవాచ్చ తస్మాత్ న దేహో బ్రాహ్మణ ఇతి.

చండాలాదిపర్యంతముఁ గల మనుష్యదేహములు పంచభూతములతో మిశ్రమగుటవల్లను, సమస్తదేహము లొకటే రూపము ధరించియుండుటవల్లను ముసలితనము, మరణము, ధర్మము, అధర్మము మున్నగునవి యెల్లరకు సమానము లగుటవలనను బ్రాహ్మణుఁడు తెల్లనివాఁడు, క్షత్రియుఁడు ఎఱ్ఱనివాఁడు, వైశ్యుఁడు పచ్చనివాఁడు, శూద్రుఁడు నల్లనివాఁడు అని చెప్పు వేదవాక్య నియమము లేకుండుటవలనను తండ్రి మున్నగువారి దేహముల దహన మొనర్చుటచే పుత్రాదులకందఱకు బ్రహ్మహత్యాదిదోషము సంభవించుననుటచేతను, దేహభేదముచే బ్రాహ్మణుఁడనుటకు వీలులేకున్నది. పిత్రాదుల మరణమందు పుత్రుఁడు తద్వియోగమోహభ్రాంతిశోకనివారణకై పితృదేహమును దహనపరచవలయుననియు బాల్యప్రభృతి తన్నుపోషించిన పితృదేహమును కృతఘ్నతతో దహనపరిచినందున బ్రహ్మహత్యదోషము రాఁగా సమస్తమైనవారలు తద్దోష పరిహారార్థమై దానధర్మాదిసత్కర్మ లొనర్పవలయుననియు ప్రతీతి. ఇఁక శ్వేత, రక్త, పీత, కృష్ణ వర్ణములు స్థూలశరీరభేదముచేఁ గాక సూక్ష్మశరీరభేదముచే చెప్పఁబడుటయే వేదాభిప్రాయము. సత్కర్మ, సద్బుద్ధి, భూతదయ, అహింస, శమదమాదులతో గూడిన పరిశుద్ధాంతఃకరణ యే సూక్ష్మశరీరమం దుండునో అది దివ్యదష్టికి తెలుపుగాఁ గనుపించును. అటులనే శౌర్య ధైర్య సాహస కోపాదులతో గూడిన సూక్ష్మశరీరము ఎఱుపుగాను, యుక్తి ప్రయుక్తులు కపటము మొదలగువానితోఁ గూడిన సూక్ష్మశరీరము పచ్చగాను, క్రౌర్యము మోటుతనము జ్ఞానశూన్యతలతోఁ గూడిన అంతఃకరణ గల సూక్ష్మశరీరము దివ్యదృష్టికి నల్లగాను గనుపించును. దాని ననుసరించియే పూర్వులు సూక్ష్మజ్ఞానము గల బుద్ధిమంతులు న్యాయశాస్త్రములు రచించునట్టుగాను, శౌర్యధైర్యాదులు గలవారు ప్రజల రక్షణ శిక్షణాదులఁ గావించునట్టుగాను, యుక్తి ప్రయుక్తులు గలవారిని వాణిజ్యమునకును, మోటుతనము క్రౌర్యము గలవారిని పనిపాటులఁ జేయుటయందును, జ్ఞానాభివృద్ధికై పైజాతి శుశ్రూషాదిసంపర్కము లవసరమనియు నుడివిరి. దాని ననుసరించియే బ్రాహ్మణులు ముఖమునఁ గల్గిరనియు, బాహువులవలన క్షత్రియులు చేయఁబడిరనియు, ఊరువుల వైశ్యులనియు, పాదంబుల శూద్రులనియు చెప్పఁబడెను. పరిశుద్ధాంతఃకరణ గల స్థూలశరీర ముఖము జ్ఞానశాంతాదుల నుట్టిపడఁజేయును గాన దానిఁబట్టియే బ్రాహ్మణులును, శౌర్యధైర్యాదులు గలశరీరము బాహుబలమిశ్రితమయి ప్రజారక్షణ కనుకూలమగుట వానివలన క్షత్రియులును,

వాణిజ్యముకూర్చుండుటయే ప్రధానముగాన ఊరువుల వైశ్యులును, పాదములు పనులవలన కఠినాధికవ్యవహారము కలిగియుండుట దానిబట్టి శూద్రులును నిర్ణయింపఁబడవచ్చును. ఇప్పుడును ప్రజా రక్షణకై (పోలీసు) బాహుబలము గలవారినే నియమించుటయు న్యాయవిచారణకై (జడ్జి) మంచి సూక్ష్మబుద్ధిగలవారినే నియమించుటయు, మోటుపనము క్రౌర్యము గలవారే సమస్తనీచ కార్యములకు సిద్ధమవుటయు మనము దృష్టాంతముగాఁ జూచుచున్నాము. ఇప్పటి వర్ణములు దాని కేమాత్రము సంబంధపడవు. కోపమునచ్చిన మనుజుని ముఖాది అవయవములు ఎఱ్ఱబడును. సూక్ష్మశరీరము ఎఱ్ఱబడి స్థూలమునకు వెల్లడి యగుచున్నది. ఇటులనే గుణములవలన రంగులు మారును.

"తర్హి జాతి ర్బ్రాహ్మణ" ఇతిచేత్, న.

పోనీ కేవల బ్రాహ్మణజాతియను జాతిక్షేత్రముండే ఆజాతికిఁ గలిగిన జాతియే యన నదియును సరిపోదు. ఏలన,

తత్ర జాత్యంతరే ష్వనేకజాతి సంభవాత్ మహర్షయో బహవ స్సంతి ఋష్యశృంగో మృగ్యాః, కౌశికః కుశాత్, జాంబూకో జంబూకాత్, వ్యాసః కైవర్తకన్యాయాం, శశపృష్ఠా ద్గౌతమః, వసిష్ఠః ఊర్వశ్యాం, అగస్త్యః కలశేజాత" ఇతి శ్రుతత్వాత్ ఏతేషాం జాత్యావినాపి అగ్రే జ్ఞానప్రతిపాదితా ఋషయః బహవస్సంతి తస్మాత్ న జాతిః బ్రాహ్మణ" ఇతి.

ఒకవర్ణములోనే అనేకవర్ణములు కలుగుచుండుటవలనను, అనేకులు మహర్షులు—ఋష్యశృంగుఁడు లేడివల్లను, కౌశికుఁడు దర్భవల్లను, జాంబూకుఁడు నక్కవల్లను, వ్యాసుఁడు పల్లెదానయందును, గౌతముఁడు కుందేటి వీపునను, వసిష్ఠుఁడు ఊర్వశియందును, అగస్త్యుఁడు కుండయందును బుట్టినట్లు తెలియుచుండుటవలన వీరిలో జాతి సరియైనదిలేకయే జ్ఞానము కలుగఁజేయు ఋషులనేకు లుండుట వలన వర్ణము బ్రాహ్మణుఁడనుటకు వీలులేకున్నది. విశ్వామిత్రుఁడు రాజుగానుండియు వసిష్ఠునియందలి ఈర్ష్యచే తపస్సుచేసి, ఆజన్మలోనే బ్రహ్మర్షి యయ్యె. చదువుభేదమున ఈర్ష్యాసూయాదు లున్నంతవఱకు నెన్నివేల సంవత్సరములు తపస్సుచేసినను బ్రహ్మ 'నీవు రాజర్షివే అయితివి' అని అనుచువచ్చెను. చివరకు ఈర్ష్యాసూయాది యితరగుణములు నిరసించి, బ్రహ్మగుణములు గల్గిన హేతువుచేతనే 'బ్రహ్మర్షి' అని అనిపించుకొనియె. అందుచేత వృత్తి జ్ఞానభేదముచేతనే బ్రాహ్మణత్వము ధ్రువపడుచున్నది. కాని కేవల వర్ణముచేతనే చెప్పఁబడుచుండుట లేదు. వీర్యప్రధాన మన ఏవీర్యమున కెవరుపుట్టుచుండిరో యిప్పుడు ఎటుల నిర్ణయించనగును.

తర్హి జ్ఞానం బ్రాహ్మణ ఇతిచేత్, న. క్షత్రియాదయోపి పరమార్థదర్శినోభిజ్ఞా బహవస్సంతి తస్మాత్ న జ్ఞానం బ్రాహ్మణ" ఇతి.

కేవల మొకవిధమైన జ్ఞానము బ్రాహ్మణుఁ డనుటకును వీలు కాకున్నది. క్షత్రియాదులలో జనకుఁడు మొదలగువా రెందఱో పరమార్థము నెఱిఁగినవారు కలరు. వారిని (జనకాదులను) యితర గుణములుండుటచేతను వారిని బ్రాహ్మణు లనలేదు కాన నదియును కాదు.

తర్హి కర్మబ్రాహ్మణ ఇతిచేత్, న. సర్వేషాం ప్రాణినాం ప్రారబ్ధ సంచితాగామి కర్మసాధర్మ్య దర్శనాత్ కర్మాభిప్రేరితాస్సంతో జనాః క్రియాః కుర్వం తీతి తస్మాత్ న కర్మ బ్రాహ్మణః.

సమస్త ప్రాణులకు ప్రారబ్ధము, సంచితము, ఆగామి యను కర్మలు సమానములుగఁగనఁబడుచున్నందున కర్మముచేఁబ్రేరేపింపఁబడిన జను లాయాకర్మలకుఁ దగినకార్యములు చేయుచున్నందు నను కర్మ బ్రాహ్మణుఁ డనుటకు వీలుగాకున్నది. "కర్మ అన ఆకర్మ కాదు. మమ్ముఁగుఱించియే స్నాన, సంధ్య, హోమాద్యనుష్ఠానములు నిర్మింపఁబడినవి ; అదియే కర్మ" అన వీలులేదు. సత్కర్మ అందఱికి అవసరమే. జ్ఞానమునకు కర్మ ఆధారము. జ్ఞానమువలన సౌఖ్యము, అజ్ఞానమువలన కష్టము, అజ్ఞానసాధికకు సత్కర్మ సాధనము. అంతియకాని కర్మలనే చేయుచు జ్ఞానశూన్యముగా నుండుట తెలివితక్కువ. ఎటులన, చెఱకు తీయఁగానుండునన దానికి ఆధారమైనవేళ్లయం దెంత తీపిఉండునో యని వ్రేళ్లనే నమలుచుండు మూర్ఖునిపగిది జ్ఞానమునందు సుఖమున్న దన దాని కాధారమౌ కర్మలనే చేయుచు తృప్తిపడుచుండుట. కాన అందఱు వారివారి కనుకూల మగు సత్కర్మ లొనరించుచు, జ్ఞానగమ్యు లౌటయే ముఖ్యము.

తర్హి ధార్మికో బ్రాహ్మణ ఇతిచేత్, న. క్షత్రియాదయోపి హిరణ్యదాతారో బహవ స్సంతి తస్మాత్ న ధార్మికోబ్రాహ్మణ" ఇతి.

కేవల ధర్మాత్ముఁడు బ్రాహ్మణుఁ డనినయెడల కాదు. క్షత్రియాదులలోను అనేకదానములుచేయువారు కలిగినప్పటికి అటులనిపించుకొనలేదు. కేవల మవి ఒక్కొక్క మంచిగుణమునే వెల్లడిచేయును గాని బ్రాహ్మణుని జేయలేవు. ఇఁక గాయత్రీ ధారణ కలవార మగుటచే బ్రాహ్మణులమన్నను అందు గొప్పఅర్థము కలదు. పూర్వమునుంచియు వంశానుసరణిగా రావలెనన్న ఈ క్రిందివిషయముల గమనించుఁడు

గాయత్రీ మంత్రము

ఓమ్ తత్సవితుర్వరేణ్యాం భర్గోదేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్.

అర్థము—సాయనవిద్యారణ్యభాష్యము

యస్సవితానోస్మాకం ధియఃకర్మాణి ధర్మాది విషయానా బుద్ధిః ప్రచోదయాత్ ప్రేరయతి తత్ తస్య దేవస్య సవితుః సర్వాంతర్యామితయా ప్రేరకస్య జగత్స్రష్టుః పరమేశ్వరస్య, వరేణ్యం సర్వైరుపాస్యతయా జ్ఞేయం తథాచ సంభజనీయం భర్గః అవిద్యా తత్కార్యయో ర్భంజనా ద్భర్గః స్వయంజ్యోతిః పరబ్రహ్మాత్మకం తేజోధీమహి వయం ధ్యాయామః యః నః ధియః ప్రచోదయాత్ తత్ సవితుః దేవస్య వరేణ్యం భర్గః ధీమహి.

ఎవఁడు మనయొక్క ధర్మబుద్ధిని ప్రేరేపించుచున్నాఁడో అట్టి సకల కల్యాణకర్తయయిన పరమేశ్వరునియొక్క ఉపాసనార్హమైన పరబ్రహ్మాత్మకమైన తేజస్సును ధ్యానించెదము. ఇఁక ఓమ్, ప్రణవము ఓంకారము.

ఓమ్ తస్యవాచకః ప్రణవః. పాతంజలియోగశాస్త్రము.

ఓంకార ఏవేదగ్ సర్వ మోంకార ఏవేదగ్ సర్వం.

ఛాందోగ్యోపనిషత్తు.

సమస్త వేదములు శాస్త్రములు మొదలగున వన్నియు నిమిడ్చి దాఁచుకొనుపెట్టె ఓమ్. అందే అన్నిమంత్రముల సారము పట్టును. ఇంకను, తైత్తిరీ యారణ్యక రామానుజ మాధ్వ భట్ట భాస్కర మహీత భాష్యాదులందు కొంచె మించుమించు గాయత్రీ అర్థము అటులనే కలదు. ఆ అర్థమును బట్టి ఆ పరబ్రహ్మ నుపాసించుట కెవరి కధికారము గలదో యెవరికి లేదో ఆలోచించుఁడు. ఇటులనే సమస్తమును మనుజజాతికి సామాన్యము. ప్రపంచక పాఠశాలయందు జ్ఞానమును నేర్చుకొనుమనుజులు క్రింది తరగతులవారు (విశేషజ్ఞానము లేనివారు) పై తరగతుల విషయములు గ్రహించ లేరను నియమము కాని వారుకూడ పైస్థితికి (విశేషజ్ఞానులుగా) వచ్చినప్పుడు క్రిందివంకే చూడవలె నను నియమము ఎచ్చటను ఏమాత్రమును లేదు. జన్మలు ముఖ్యముగా ననేకము దాఁటవలె నను నియమము అంతకుముందే లేదు.

తర్హి కోవా బ్రాహ్మణో నామ?

అయిన మరి యెవఁడు బ్రాహ్మణుఁ డనువాఁడు?

ఉపనిషదభిప్రాయము.

యః కశ్చిదాత్మానం అద్వితీయం జాతి గుణ క్రియాహీనం షడూర్మి షడ్భావేత్యాది సర్వదోషరహితం సత్యజ్ఞానానందానంతస్వరూపం స్వయం నిర్వికల్ప మశేషకల్పాధార మశేషభూతాంతర్యామిత్వేన వర్తమాన మంతర్బహి శ్చాకాశవ దనుస్యూత మఖండానందస్వభావ మప్రమేయ మనుభవైకవేద్య మపరోక్షతయాభాసమానం కరతలామలకవత్సాక్షా దపరోక్షీకృ త్యకృతార్థతయా కామరాగాదిదోషరహిత శ్శమాదిగుణసంపన్నో భావ మాత్సర్య తృష్ణాశామోహాదిరహితో దంభాహంకారాదిభి రసంస్పృష్ట చేతోవర్తతే. ఏవము క్తలక్షణోయ స్సఏవ బ్రాహ్మణ ఇతి శ్రుతిస్మృతిపురాణేతిహాసానా మభిప్రాయః అన్యథా బ్రాహ్మణత్వసిద్ధి ర్నాస్త్యేవ.

ఎవ్వఁడేనియు అద్వితీయుఁడును, జాతి గుణ క్రియలు లేనివాఁడును, ముసలితనము చావు దుఃఖము మోహము ఆకలి దప్పి యను షడూర్ములును, పుట్టుట ఉండుట వృద్ధిబొందుట మారుట చిక్కుట నశించుట యను షడ్భావములు లేనివాఁడును, సత్యము జ్ఞానము ఆనందము అనంతము నైన స్వరూపము గలవాఁడును, సంకల్పమున వేరువ్యాపారము లేనివాఁడును, సమస్తకల్పముల కాధారుఁడును, సకలభూతంబుల కంతర్యామియు, ఆకాశమువలె లోపలను వెలుపలను వ్యాపించియుండువాఁడును, అవిచ్ఛిన్నమైన ఆనందము కలవాఁడును, అప్రమేయుఁడును, అనుభవము చే తెలియఁదగినవాఁడును, ప్రత్యక్షముగా ప్రకాశించువాఁడును నగు భగవంతుని కరతలామలకముగ నంతటఁ గాంచి కీటకభ్రమర న్యాయంబున భక్త్యాదుల నట్టివాఁడై, కృతార్థుఁడై ఆశ మున్నగు దోషములు వదలి శాంత్యాదులఁ గైకొని మోహమాత్సర్యాదులు లేనివాఁడై అహంభావము, దంభము మొదలగువానిని మనంబునఁజొఁఅనీయక యెవఁడుండునో అట్టిసకలసల్లక్షణయుతుఁడే బ్రాహ్మణుఁ డని శ్రుతిస్మృతిపురాణేతిహాసముల యభిప్రాయము.

అట్లుకాదేని బ్రాహ్మణత్వసిద్ధియే లేదు. కాన జన్మకన్న బ్రాహ్మణత్వమునకు గుణమే ముఖ్యకారణము. ఈ యర్థమునే బోధించు ఈ క్రిందిసంగతుల గమనించుఁడు.

యక్షః—రాజన్ కులేన వృత్తేన స్వాధ్యాయేన శ్రుతేనవా
బ్రాహ్మణ్యం కేనభవతి ప్రబ్రూ హ్యేత త్సునిశ్చితమ్ భా. ఆ.

రాజా! బ్రాహ్మణ్యము కులముచేతనా, వృత్తిచేతనా, అధ్యయనముచేతనా, ధర్మము వినుటచేతనా నిశ్చయముచెప్పు మని యక్షుఁ డడుగ,

ధర్మరాజః—శ్రుణు యక్షకులంతాత నస్వాధ్యాయో నచ శ్రుతం
కారణంవా ద్విజత్వేచ వృత్తమేవ నసంశయః ఆ.312.

యక్షుఁడా! బ్రాహ్మణ్యమునకు కారణము కులముకాదు, స్వాధ్యాయముకాదు, ధర్మము వినుటవలనకాదు, గుణమే ముఖ్య కారణము. ........

సర్పః—"బ్రాహ్మణః కో భవే ద్రాజన్ వేద్యంకించ యుధిష్ఠిర."

యుధిష్ఠిరుఁడా! బ్రాహ్మణుఁ డన నెవఁడు? తెలియఁదగిన విషయమేది? అని నహుషుఁ డడుగ,

యుధిష్ఠిరః—సత్యం దానం క్షమాశీల మానృశంస్యం తపోఘృణా
దృశ్యంతే యత్ర నాగేంద్రా సబ్రాహ్మణ ఇతి స్మృతః.

సర్పమా! సత్యము దానము ఓర్పు ఆచారము అహింస తపము దయ యెవనియందు కలవో వాఁడే బ్రాహ్మణుఁ డని శాస్త్రము చెప్పుచున్నది.

శూద్రేతు యద్భవేల్లక్ష ద్విజేతచ్ఛ నవిద్యతే
నవైశూద్రో భవేచ్ఛూద్రో బ్రాహ్మణో నచ బ్రాహ్మణః

పైలక్షణములు శూద్రునియందు కల్గిన బ్రాహ్మణుఁడు కాని శూద్రుఁడుకాఁడు. అవి బ్రాహ్మణునియందు లేనియెడల శూద్రుఁడు కాని బ్రాహ్మణుఁడు కాఁడు. అంతియకాని కొందఱు సచ్ఛూద్రుఁ డనియు, శూద్రసముఁడనియు సమర్థించుట అభిమానపూర్వకావేశముగాని కేవల నీతిబోధక భారతవేదాభిప్రాయము కాదని నొక్కిచెప్పవచ్చును. వర్ణపిశాచావేశము విపరీతమార్గమున భారతకాలమునాటికే పరిగణింపఁ బడుటచేతనే యక్షనహుషు లట్లు ప్రశ్నించి రని తెలియఁబడుచున్నది. కాన బ్రాహ్మణత్వమునకు యెన్ని విధముల విమర్శించినను గుణము ప్రధానము కాని కులముకాదు. ఒకవేళ జన్మప్రాధాన్యమన్నను, ఏబీజమున నెవరుపుట్టినది యిప్పుడు నిర్ణయించుట దుస్సాధ్యము. క్షేత్రప్రాధాన్యమన్న ఋషుల జన్మ దృష్టాంతముగాఁ గనఁబడుచున్నది. ఇది కొందఱి కహితముగ బాహ్యదృష్టికిఁ గాన్పించినను ఆత్మవిచారణగల ఆంతరంగిక దృష్టియుతులకు సమన్వయించకపోదు. మేము ఒకవర్ణమునందు అభిమానముంచి ఒకజాతిని దూషించవలెనను నభిప్రాయమున కాక సత్యము వెల్లడిచేయవలెననియే యిటుల ఉద్దేశము చూపితిమి. కాన వట్టినామమున కాశించక తద్గుణముల సాధించి జ్ఞానమును బొంది మీ రుద్ధరింపఁబడి యితరుల నుద్ధరించి ఐహికాముష్మిక సుఖంబుల గాంచుఁడు. వర్ణమతావేశముల కల్పింపక మనుష్యజాలివార మనిన సర్వసమతగల్గి సోదరభావమున లౌక్యవ్యవహారంబులఁ గావించుకొని జ్ఞానము సంపాదించి కొంచె మించుమించు ముందు వెనుకగ నందరు బ్రాహ్మణులెయై మోక్షమును చూఱగొన భగవంతుఁడు భారతీయులకు సద్బుద్ధి గల్పించుగాక.

# సాముద్రికము — దాని ప్రాచీనత

పూడిపెద్ది వెంకటరావు గారు

"ముద్రాభిస్సహవర్తతే ఇతి సాముద్రికమ్" అను వ్యుత్పత్తినిబట్టి సాముద్రికశాస్త్రముయొక్క విషయము గ్రాహ్యమగుచున్నది. సాముద్రికము రెండువిధములుగా కన్పట్టుచున్నది: హస్తసాముద్రికము, శరీరసాముద్రిక మనియు, ప్రాచీన కాలమునుంచియు సాముద్రికశాస్త్రమునందు మానవులకు ప్రవేశము గలదని వివిధపరిశోధనలవలనఁ దెలియుచున్నది. ప్రహ్లాదుఁడు, సముద్రుఁడు, కాత్యాయనుఁడు, వరాహమిహిరుఁడు, వరరుచి, నారదుఁడు మొదలగు పెక్కురు ప్రాచీనులు సాముద్రికశాస్త్రమునందు గ్రంథములను రచియించినటుల తెలియుచున్నది. చతుష్షష్టి కళలయందును సాముద్రిక మున్నత మగుస్థానము నాక్రమించి యున్నది. శ్రీరాముని హస్తమును చిన్నప్పుడు పరీక్షించి దమనకుఁడనువాఁడు రామునకు రాజ్యప్రవాసము గలుగునని చెప్పె నని విచిత్రరామాయణమునఁ గలదు. ఇది కవియొక్క చమత్కారము చేతఁ గల్పితమయ్యు కొంతవఱకు నమ్మకము గలిగింపక మానదు.

ఈ సాముద్రికశాస్త్రమును మొదట కనిపెట్టినవారు హైందవులగు నార్యులే. ఈజిప్టుదేశము నాగరకత నందకపూర్వమే యార్యులు సాముద్రికశాస్త్రమును వృద్ధిచేసిరి. ఈదేశమునుండియే యవనులు, గ్రీకులు, మొదలగువా రీశాస్త్రమును నారివారి దేశములకుఁ గొంపోయిరి. మనకుఁ బ్రమాణప్రాయమగు నథర్వవేదమున సాముద్రికశాస్త్రమునుగూర్చి కొన్ని యపూర్వవిషయములు గలవని పాశ్చాత్యదేశీయవిద్యాధికులు కొందఱు ప్రకటించిరి. ఇట్టి యన్యదేశస్థుల హస్తగతం బయిపోవుట శోచనీయము. అగస్త్యుఁడు దక్షిణాపథమునకు దీనిని దనతోఁ గొనిపోయెనందురు. మన పురాణములయందు నిద్ది చర్చింపఁడియున్నది. మన శాస్త్రకారులు పురుషునకు దక్షిణభాగ లక్షణములును, స్త్రీలకు వామభాగలక్షణములును, ముఖ్యములుగా భావించిరి. కాని పాశ్చాత్యదేశీయులు రెండుహస్తములనుబట్టి విషయనిర్ధారణ మొనర్చుచున్నారు. మన పూర్వులు పరీక్షింపని యనేకవిషయములను వీరు నిదర్శనపూర్వకముగా చర్చించిరి. మన యార్యులకు జ్యోతిషమునందున్న నమ్మకము సాముద్రికమునందు లేదు. కాలక్రమంబున నీ శాస్త్రము నశించుటకు కారణ మిదియే. కాని పాశ్చాత్యులు దీనితత్త్వమును బాగుగ నిర్ణయించుటకు రెండుకారణములు కలవు. వృక్షశాస్త్రజ్ఞుఁడు ఆకులనుబట్టి వృక్షముయొక్క సంగతినంతయు గ్రహించునటుల, సాముద్రికశాస్త్రజ్ఞుఁడుకూడ హస్తరేఖలనుబట్టి మనుష్యుని తత్త్వమును గ్రహియింపఁగలుగుచున్నాఁడు. శరీరతత్త్వమీమాంసకులు బుద్ధీంద్రియమునకును మన హస్తమునకును సన్నిహిత సంబంధ మున్నదని వచియించిరి. బుద్ధి సంచలించినపుడుగాని, చెడినపుడుగాని హస్తరేఖలుగూడ నస్పష్టములై కాలక్రమమున బుద్ధీంద్రియము పూర్వపుస్థితికి వచ్చునేని యారేఖలు మరల నుద్ధృతము లగునని పాశ్చాత్త్యవిద్వాంసులు చెప్పుచున్నారు. నఖములనుబట్టియు, వ్రేళ్ల కొనలనుబట్టియు నారోగ్యమును పరీక్షించుట మన కాచారమే. ఈ సాముద్రికమునుబట్టి ఎవ్వఁ డే యుద్యోగమునకుఁ దగియున్నాఁడో యనువిషయమునుగూడ నిశ్చయింప నగును.

ఈ శాస్త్రమును పాశ్చాత్యదేశములయందుఁ బ్రచార మొనర్చినవారలలో కెయిరో, విలియమ్ జి. బెన్‌హామ్, కేదరైన్ వార్, మేజర్ యెడ్వర్డు ఫెరిన్, హెన్రి రెమ్, కమ్‌టీ సి. డి. సెయింటుజెర్‌మైన్, శ్రీమతి రాబిన్సను మొదలగువారు ముఖ్యులు. వీరు ఒక్కొక్క రొక్కొక్కవిషయమునుగూర్చి ప్రత్యేకకృషిని సల్పి గొప్పగొప్ప గ్రంథములను రచియించియున్నారు. చేతినిబట్టి గ్రహముల నిర్ణయించుట పాశ్చాత్యులు క్రొత్తగఁ గనిపెట్టిన సిద్ధాంతము. దీనికే "ఏస్ట్రో-పామిస్ట్రీ" (Astro-Palmistry)అని పేరు. ఈ శాస్త్రము ననుసరించి నష్టజాతకములను రచియించుట సులభసాధ్యము. పాశ్చాత్యులు దీని విషయమయి సంస్థల నేర్పఱచి యనేకవిధముల కృషిని సలుపుచున్నారు. సాముద్రికమునుబట్టి శీలమును బరీక్షించుటకు వారికి ప్రత్యేకముగా కొన్ని పద్ధతులు గలవు.

మన దక్షిణదేశమునందుఁ దమిళభాషయందు అపూర్వమయిన కొన్ని రేఖాశాస్త్రములు గలవు. అగస్త్యనాడి, శుక్రనాడి, భృగునాడి, ధ్రువనాడి మొదలగు నాడీగ్రంథములు లుప్తప్రాయము లయినను, నేటికి నచ్చటచ్చట లభింపవచ్చును. ఇట్టి యుద్గ్రంథములను స్వీకరించి తగినరీతిని ముద్రించుటకు వలయు సౌకర్యములు మనకు లేవు. కావున దీనికి తగినరీతిని సంస్థల నేర్పఱచి ఈ యపూర్వ గ్రంథములను సంపాదించుట, పాశ్చాత్య గ్రంథములను తెనిగించుట, క్రొత్తవిషయముల కూర్చి విమర్శించుట మొదలగు పనులు మన యాంధ్రులపైన నున్నవి. ప్రజాబాహుళ్యమునందు నమ్మకము కుదిరినచో దీనికి మంచి యౌన్నత్యము లభించును. మనము చూచినంతవఱకు నీదేశములో నే డీశాస్త్రము బైరాగులయందును, ఎఱుకలవారియందును ప్రబలముగ నున్నది. ఇట్టివారు ధనమునే యాశించి నిజంబును గప్పిపుచ్చి యడిగిన వారికెల్ల చేయిచూచి యైశ్వర్యమును సూచించుచుందురు. ఇందువలన దీనికిఁ గలిగిన కొంచెముగౌరవముకూడ నశించు చున్నది. కావున సాముద్రికమును శాస్త్రయుక్తముగా నేర్చి పత్రికాదినిర్మాణ ప్రచారముల చేసినచో ననేకలాభములు గలుగును.

# కమల

శ్రీమతి ప. సౌభాగ్యవతమ్మ గారు

"ఏమండీ? మన కమల వాలకం బొత్తిగా బాగులేదు సుమండీ! మీ రిలా బెల్లంకొట్టినరాయిలా వూరుకుంటా రేమండీ?" అని సీతమ్మ అనెను.

జానకిరామయ్య:—"ఏం? యేంచేసిం దేమిటి?"

సీతమ్మ:—"అహా! నాకు తెలీ కడుగుతానుగాని వూళ్లేలాలా? వుద్యోగాలు చేయాలా? ఆడవాళ్లకు చదు వెందుకండీ? అబ్బబ్బ! పొద్దస్తమానం అదే చదువా?"

జా:—"అంతేగదా? నిన్నేంచెయ్యలేదుకదా? అది చదువుకుంటే నీ కేం పోయింది? నీ కిష్టమైతే నువ్వూ చదువుకోరాదూ?"

సీ:—"బాగుందండీ మరీన్ని! యింటింటెడు చాకిరీ చేసుకోలేక ఒక్కలు ముక్కలై చస్తున్నాను. అవతలిపుల్లతీసి యివతల వెయ్యకపోతే, ఆడదిగదా చీనిముద్దైలా ముక్కలౌతుం దనుకున్నారు? నేనుమాత్రం అమ్మకడుపున పుట్టలేదూ? అడ్డమైన చాకిరీచేసి వేళకి విస్తట్లో కుంభం దిమ్మరించడానికి నేనేం వంటలక్కనా? చాల్లెస్తురూ! మీరే ముద్దుచేసి దా న్నిలా మీరపెడుతున్నారు. ఛీ! ఛీ యింత సిగ్గూ బిడియం లేకపోవడ మేమిటమ్మా? యెక్కడా చూడలేదు! పోనిండిగాని, యెంత మేనమామకొడుకైనా, యెదిగి యీడువచ్చినపిల్లగదా? ఆమాత్రం తెలీదూ ఆకృష్ణారావుతో బావా! బావా! అని అదే పడిచవ్వడ మేమిటండి?"

జా:—"రామ రామ! దాని కేం తెలుసునే! పాపం! అమాయకురాలు. మన కమలా, కృష్ణారావు చిన్నప్పట్నుంచి ఒక్కకంచంలో తిని ఒక్క మంచంమీద పడుక్కుంటూ కలిసి మెలసి ఆడుకుంటూండేవాళ్లు. వాడితో మాట్లాడితే తప్పేమిటే? పాపం మాఅమ్మ తన అన్నకొడుకు కృష్ణారావుకు కమలనుయిచ్చి పెళ్లిచెయ్యాలని మాయేడ్చింది, గాని నేనే ఆపెళ్లి కాకుండాచేసి లక్షాధికారికొడుకు బియ్యే చదువుచున్నాడు పిల్ల సుఖపడుతుంది కదా అని ఆ అర్ధాయుష్షు ముండావాడి కిచ్చాను. దానిఖర్మ మిలాకాలిపోతుందని నా కేం తెలుసును? కృష్ణారావు కిచ్చుంటే బాగుండేది కాబోలు, వా డిప్పుడు మహారాజులా బియ్యే ప్యాసయి బియల్ చదువుకుంటున్నాడు, యింతకు దానిఖర్మం యిలాకాలిపోతేనేనేంచేసేది?"

సీ:—"ఎప్పుడో చిన్నప్పు డాడుకున్నారని, యీడువచ్చి మీదుమిక్కిలి తలచెడినపిల్ల, యిరవై యేళ్లపడుచువాళ్లతో మాట్లాడుతుంటే నలుగురు బుగ్గలు పొడిచీరండి! అయితే తలచెడినపిల్లకదా; చీరలూ, జాకెట్లు, నగలూ, యీ సింగారాలన్నీ యెందుకండీ? అబ్బెబ్బే! నలుగురిలో నగుబాట్లకోసరంగాని? యింతకూ నాకెందుకమ్మా? ఏమీ లేందే దా న్నూరికే కోనుకుటింటున్నానని మీ మేనత్త కృష్ణారావు వూళ్లో చాటిపోస్తున్నారట! పోనీ అలాని వూరుకుందామంటే యిరుగుపొరుగువా ళ్లందరు బుగ్గలమీద వేళ్లుపెట్టుకొని చోద్యంగా ఆడుకుంటున్న మాటలు వింటే నావొళ్లు చిల్లులుపడి తలెత్తుకోతిరగలేకుండా వున్నాను. మీకు చీమేనా కుట్టినట్లు లేదు కాబోలును? యిదుగో! దాన్ని కూకలేసి దాని చీరలూ, జాకెట్లూ, నగలూ తీసుకొని జెడవేసుకోకుండా, కృష్ణారావుతో మాట్లాడకుండా, బుద్ధిచెప్పి యీసానిఆవటం మానిపిస్తారా, లేదా? "మీచెల్లెలి ఆవటం మీకు బాగుంటే బాగుంది కాని నేనుమాత్రం నలుగురిచేతా బుగ్గపోట్లు మరిపడలేను సుమండీ! తరవాత మీ యిష్టం."

అని సీతమ్మ చరచర నడచి వంటింట్లోకి పోయింది, పాపం జానకిరామయ్య చాల మెత్తనిమనస్సు గలవాడే! మిక్కిలి బంధుప్రీతి కలవాడే! గాని బంధుప్రీతివల్ల భార్య కేమాత్రం కోపంవచ్చినా ఆ బంధుప్రీతిని మరచే తరగతి పురుషులలో ఒకడు. భార్య కోరినకోరికలు సహేతుకమైనా కాకపోయినా, న్యాయమైనా కాకపోయినా, నెరవేర్చక గత్యంతరం లేదని తలచువారిలో ఒకడు. యే కారణంచేతనైనా భార్యకు కోపంవస్తే జగమంతా అంధకారబంధురమని తోచి ఆకోపం శాంతించడానికి యెట్టికార్యమయినా చెయ్యడానికి వెనుకతియ్యని భార్యాసక్త (Henpecked husbands) భర్తలతరగతిలోనివాడు. ఇంక సీతమ్మ యెవ రేమనుకున్నాసరే, యెవరు దూషించినాసరే, యెవరు భూషించినాసరే, యివతలసూర్యుడు అవతలతిరిగినాసరే! తాను పట్టినపట్టు జరిగి తీరవలసిందే. ఆ సంగతిజానకిరామయ్యకు బాగా తెలుసును. జానకిరామయ్య కొంతసే పలా నిలుచుండి, "యిదుగో! చూడు! యెందు కలా పాములా బుస్సుకొడతావు? దానికలాగే బుద్ధిచెప్పతానులే" అన్నాడు. యింతలో ప్రక్కగదిలోంచి దీర్ఘనిశ్వాసంతో ఒక మూల్గు అతనికి వినిపించింది. పాపం గతుక్కుమన్నాడు. భార్య కోపం చల్లార్చడంలో మరణావస్థలో ఉన్న తండ్రి ప్రక్కగదిలో ఉన్నాడన్నమాటే బొత్తిగా మరచిపోయాడు. తనకూ, తనభార్యకూ జరిగిన ప్రసంగం తండ్రి విన్నాడేమో అని అతనికి భయంవేసింది. వెంటనే భార్యకు సంజ్ఞచేసి ప్రక్కగదిలో కెళ్లాడు.

## ౨

పట్టాభిరామయ్య మొదట చాల బీదకుటుంబంలోనివాడు. అతనిభార్య రుక్షణమ్మ చాలా ఉత్తమురాలు. కాలక్రమాన్ని పట్టాభిరామయ్య స్వయంకృషివల్ల వ్యాపారంలో రెండులక్షలకుపైగా ఆర్జించాడు. ఆయనభార్య రుక్షణమ్మ కాపురాని కొచ్చిన ఆరేండ్లకు జానకిరామయ్య పుట్టాడు. జానకిరామయ్య వెనుక పదేళ్లవరకూ రుక్షణమ్మకు కానుపు లేదు. నోములు, వ్రతములు, నిష్టలూ, చేయగా చేయగా, కమల అపురూపంగా జన్మించింది. కమల పుట్టినతర్వాత వారి ఐశ్వర్యం మరింత వృద్ధిచెంది యేవిధాన్నిచూసినా వారి కేలోపం లేకుండా సంసారం స్వర్గతుల్యంగా ఉండేది. రుక్షణమ్మగారికి ఒక అన్నదమ్ము డుండేవాడు. ఆయన కృష్ణారావు పుట్టిన మూడవయేట గతించాడు. నాటినుండీ కృష్ణారావును మేనత్త రుక్షణమ్మ చేరదీసి, తనకొడుకులాగే, పెంచింది. కమలకంటె కృష్ణారావు ఐదేళ్లు పెద్ద. జానకిరామయ్యభార్య సీతమ్మ కాపురాని కొచ్చేవరకూ పట్టారామయ్యగారి సంసారం యేకలతలూలేక అత్యంత సౌఖ్యప్రదంగా స్వర్గతుల్యంగా గడచిపోయింది. సీతమ్మ కాపురాని కొచ్చిన తరువాత కమలపెళ్లి ప్రస్తావన వచ్చింది. అప్పుడు కమలకు తొమ్మిదేళ్లు. రుక్షణమ్మ కమలను కృష్ణారావుకిచ్చి పెళ్లిచేయాలనిచాలా పట్టుపట్టింది. పట్టాభిరామయ్యకూడా సమ్మతించాడు. గాని జానకిరామయ్య "కట్టగుడ్డ, తిన తిండి, లేక మనపంచచేరిన కటికదరిద్రునికి కమలనిచ్చి, చానిగొంతు కోస్తారా?" అని దెబ్బలాడి వేరొక గొప్పసంబంధం కుదిర్చి పెళ్లిచేశాడు. పెళ్లైన ఆరునెలలకే కమల భర్త చనిపోయాడు. పాపం కమలకు భర్త చనిపోతే యెందు కేడ్వాలో తెలీలేదు. కాని తల్లి గుండెలుమోదుకొని యేడుస్తుంటే తానుకూడా యేడ్చింది. రుక్షణమ్మ నాటినుండి కమలకోసం బెంగపెట్టుకొని మంచంపట్టింది. యింతవరకూ అతులైశ్వర్య సౌఖ్యాలతో తులతూగుతున్న పట్టాభిరామయ్యగారికి నాటినుంచి సంసారం విషతుల్యమైపోయింది. భార్య జీవిస్తుందన్న ఆశలేదు. జానకిరామయ్య గయ్యాళిగంప భార్యకు పూర్తిగా వశుడైపోయి యితరచింతలు బొత్తిగా మరచిపోయాడు. తన ప్రాణసమానురాలైన కూతురు తలచెడి, గతిలేని దైపోయింది. తాను గతించినతరవాత సుకుమారి అమాయకురాలు అయిన కమలను, పరుషస్వభావ అయిన కోడలు సీతమ్మ నేపుకు తింటుందని ఆయన చాలా విచారించాడు. తానుకూడా వృద్ధుడైనాడు. అవయవపటుత్వం తగ్గింది. యింకా యెంతోకాలం జీవించడు పాపం. అతనికి గట్టిసంకటం వచ్చింది, యేంచేద్దామన్నా పాలుపోలేదు. అహోరాత్రములు అతని కదే విచారం పట్టుకుంది. భార్యకు పూర్తిగా వశుడైన జానకిరామయ్య ఆమెనుగూర్చి యేమీచెయ్యడని ఆయనకు బాగాతెలుసును. ఇంక, తాను జీవించిఉండగానే కమలను ముప్పతిప్పలాపెట్టి మూడుచెరువులనీళ్లు త్రాగిస్తున్న సీతమ్మ, తాను మరణించిన వెంటనే కమలను శానికంటె నికృష్టంగాచేసి నానాబాధలూ పెట్టుతుందని ఆయనకు దృఢంగా తెలుసును. యేమైతే అయింది,

లోకందేమనుకుంటే అనుసంది. తన ప్రాణాధిక అయిన కమా త్తె సుఖపడితే చాలు, అని తెగించి కమలను కృష్ణారావు కిచ్చి పెళ్లిచేస్తామనుకున్నా, "కూటికి గుడ్డకూ లేని కటికదరిద్రు" డని ఒకసారి తిరస్కరించి అవమానపరచిన కృష్ణారావుతో యేముఖంపెట్టుకొని తిరిగి పెళ్లిప్రస్తావన తేగలడు? పాప మతనికి గట్టి సంకటము వచ్చింది.

## 3

ఆరేళ్లు గతించాయి. యిప్పుడు కృష్ణారావు చెన్నపట్టణంలో బి యల్ చదువుతున్నాడు. పట్టాభిరామయ్య భార్య అంత్యప్రార్థనప్రకారం కృష్ణారావుకు చదువుచెప్పిస్తున్నాడు. కమల పెద్దపిల్లఅయినతరువాత యిప్పుడు కృష్ణారావు అంత తరచుగా పట్టాభిరామయ్యగారి యింటికి రాలేదు. అప్పుడప్పు డుత్తరాలు మాత్రం రాస్తూంటాడు, సెలవులకు వచ్చినప్పుడు ఆవూళ్లోనేవున్న తన తల్లిపుట్టింట్లో దిగి పట్టాభిరామయ్యగారింటికి చుట్టంచూపుగా అప్పుడప్పు డొస్తూంటాడు. కమల యౌవనవతైంది. ఆమె నవకోమలత తరుణాంగము లింకా చెందీచెందని పరిపూర్ణత్వంలో, లావణ్యామృతరసం వర్షిస్తూన్నాది. ఆకర్ణాంతవీక్షనేత్రాలు ధళధళ దీధితులతో కలకలలాడుతూ లక్ష్మికి నివాసయోగ్యాలై అవ్యాజానురాగకారుణ్య లలితభావోద్దీపకములై లావణ్యరసా లొలుకుతూ అమాయకమైన చిరునవ్వు నవ్వుతూన్నాయి. ఆమె గౌరోజ్వలదేహకాంతులు ధరించినదువ్వాలువలోంచి దోబూచు లాడుతున్నాయి. ఆమె ప్రత్యంగవిన్యాసంలోనూ అప్రయత్నంగా, సహజంగా, నూతనమైన లావణ్యరసవీచికలు పొంగి పొర్లుతున్నాయి. విద్యయందు ఆమెకు మిక్కిలి ఆసక్తిగలదని గ్రహించి పట్టాభిరామయ్య జానకిరామయ్య కిష్టం లేకున్నా యింటివద్దనే సంస్కృతం, యింగ్లీషు, ఆంధ్రం నేర్పడాని కొక వుపాధ్యాయునీ, సంగీతం నేర్పడాని కొక ఉపాధ్యాయునీ యేర్పాటు చేశాడు. ఆమె యిప్పుడు సంగీతసాహిత్యాలయందు మిక్కిలి ప్రజ్ఞావంతురా లైంది. విద్యా వ్యాసంగంలోను పితృసేవలోను కొంతవరకు తల్లిలేనిలోపం కమల మరచిపోయింది. ఆమెకు భర్త లేనిలోపమేమో యింకా అనుభవానికి రాలేదు. యీలా ఉండగా హటాత్తుగా పట్టాభిరామయ్యగారికి వాతం ముంచుకోవచ్చి నానాటికి రుగ్ణత హెచ్చయి బ్రతుకుతాడా లేడా అన్నట్లుంది. తండ్రీ తల్లికూడా తానే అయి అత్యంత గారాబంతో పెంచిన తండ్రి మంచంపట్టిందిమొదలు కట్టతెగిన ప్రవాహంలో దుఃఖం లోలోపల దిగమ్రింగుతూ అతనికి సకలోపచారాలు చేస్తూ నిద్రాహారాలు మాని సర్వకాల సర్వావస్థలలోనూ అతని మంచందగ్గరే కాలు చప్పుడు కానీక తిరుగుతూ వేళకు పథ్యం మందు యిస్తూండేది. ఒకనాడు పట్టాభిరామయ్య మందుత్రాగి కాస్త కన్నులు మూశాడు. మంచం తలకడనున్న కుర్చీమీద కూర్చుని చదవాలని కమల పుస్తకం విప్పిందిపాపం. లాభంలేకపోయింది. అవిరళంగా అశ్రువులు



ప్రవహించి దృష్టినిరోధంజేసి అక్షరాలు కనిపించలేదు. తండ్రికి తెలివివచ్చి చూస్తాడేమో అని పుస్తకం ముఖానికి అడ్డుపెట్టుకుంది. యెంతాపుకొన్నా ఆగకుండా కన్నీళ్లు కాల్వలై ప్రవహిస్తూనేఉన్నాయి. యింతలో కృష్ణారావు తటాలున లోపలికి తలుపుత్రోసుకొచ్చాడు. కమల త్రుళ్లిపడి లేచింది. వెంటనే తండ్రికి నిద్రాభంగం కాకుండా ప్రక్కగదిలోకెళ్లి వెక్కి వెక్కి యేడుస్తూ నిలబడిపోయింది. కృష్ణారా వాతురంగా ఆమెవద్దకు వచ్చి "యేం? కమలా! యేం జరిగిందో చెప్పవూ?" అని ఉద్వేగంతో అన్నాడు. కమల వెక్కి వెక్కి 'నాన్నగారికి' ...అని మరిచెప్పలేక గట్టిగా యేడ్చింది.

కృష్ణారావు:—"ఆ! ఆ! జబ్బుచేసిందా? యెప్పట్నుంచి? డాక్టరు యేమన్నాడు! యేజబ్బన్నాడు? మందిస్తున్నారా?" అని కంపిస్తున్న కంఠంతో తొందరగా ప్రశ్నపై ప్రశ్న అడిగాడు.

కమల:—కొంతసేపు మాట్లాడలేక యెలాగో దుఃఖం అడచుకొని "నెలరోజులై వాతంచేసింది. డాక్టరు జనార్దనరావుగారూ జిల్లాసర్జనూ కలసి మందు యిస్తూన్నారు. వాళ్లు భయంలేదంటున్నారు కాని నాకు దిగులుగా వుంది. ఇప్పుడు నాల్గురోజులై యెగూపిరికూడా ప్రారంభమైంది. హారం పడిపోయింది. బొత్తిగా కృశించిపోయారు. నువ్వెప్పు డొచ్చావు బావా?" అని అన్నాది.

కృ:—"యిప్పుడే బండి దిగొచ్చాను. మిమ్మల్నిచూదామని సామాను మా అమ్మమ్మగారియింట్లో పెట్టమని పంపి యిలా చక్కావచ్చాను. అయితే నా పత్తరం వ్రాశారుకారేం? నా కేసంగతి తెలీలేదు. మామని నిన్ను చూదామని మా వుబలాటంగా వచ్చాను. బా వేడీ?"

క:—"అన్నయ్య భోంచేసి పనిమీద యెక్కడకో వెళ్లాడు. పాపం నువ్వింకా భోంచెయ్యలేదు కాబోలు? భోంచేస్తావా?"

కృ:—"యింకా అమ్మనీ వాళ్లనీ చూళ్లేదు. అక్కడ భోంచేసి మామ లేచేసరికి వస్తా" నని కమలయొక్క శుష్కించిన ముఖం గుంటలుపడిన కళ్లూ కొంతసేపలా జాలిగా చూసి "యిదుగో! కమలా! చూడు! నీసంగతి చూస్తే నిద్రాహారాలు కేవలం లేనట్లుంది. యెందు కలా బెంగపెట్టుకొని నిద్రాహారాలు మాని వొంటికి తెచ్చుకుంటావమ్మా? మామయ్యకేం భయంలేదులే" అని యింకా యేమో చెప్పబోతూండగా ప్రక్కవరండాలోంచి సీతమ్మ "యేమే! కమలా! యిలా రా" అని అట్టహాసంగా పిలిచింది.

క:—బావా తరవాత నాన్నను చూడడానికి వస్తావుగదా?" అంది.

కృ:—"అలాగే వస్తానమ్మా, నీవుమాత్రం కాస్త ధైర్యం చిక్కబట్టి వొళ్లు జాగ్రత్తగాచూసుకో" అని కృష్ణారావు విచారపురస్సరంగా దీర్ఘమైన నిట్టూర్పు విడిచి వెళ్లిపోయాడు."

క:—వరండామీదకు పోయి "ఏం వదినా యెందుకు పిలిచారు," అంది.

సీతమ్మ:—"యెవ రేమనుకుంటారో అన్న భయమైనా లేకుండా యెవడితోనే అలా గ్గుసగుసలాడ్తూన్నావు?"

క:—మా మేనత్తకొడుకు కృష్ణారావు యిప్పుడే చెన్నపట్టణంనుంచి వచ్చాడు. అతని కేసంగతీ తెలీలేదట; మానాన్న నిద్రపోతూంటే అతనికి మెలుకువ వస్తుందని సావిట్లోకొచ్చి నాన్న జబ్బుసంగతి బావతో చెప్పుతున్నాను.

సీ:—"మాంచి మేనత్తకొడుకే! బాగుంది నీవాలకం. అయితే పొద్దస్తమానం మీనాన్నగదిలోనే కూర్చుని అలా యేడుస్తూంటే యింట్లో చాకిరీ నీఅబ్బా నాఅబ్బా యెవళ్లొచ్చి చేస్తారే? మనిషికి రాక మానుకొస్తుందా జబ్బు? యెందు కలా వూరి కేడుస్తావు? మీ నాన్న యెల్లప్పుడూ ఉట్టికట్టుకో వూగులాడ్తా డనుకున్నావా యేమిటి? కాలంచెల్లిన వృద్ధుడుకదా?" అంది. పాపం కమల వెక్కి వెక్కి యేడుస్తూ నిలబడిపోయింది. యింతలో గదిలోనుంచి" అమ్మా కమలా" అని నీరసమైన స్వరంతో పట్టాభిరామయ్య పిల్చాడు. కమల చటుక్కున చీర చెరగుతో కన్నీళ్లు తుడుచుకొని వెక్కిళ్లురాకుండా కష్టంమీద ఆపుకొని గదిలోకెళ్లింది.

పట్టాభిరామయ్య:—యేమమ్మా? నాతల్లీ! యేమైందమ్మా? అని జాలితో అంటుండగా అతని కళ్లల్లో నీళ్లు గిరగిర తిరిగాయి.

క:—"ఏంలేదునాన్నా, నీ వొంట్లో ఆయాసంగా ఉందని యేడుపు వచ్చింది" అంది. పట్టాభిరామయ్య సీతమ్మ కేకలతో మేలుకొని ఆమెమాటలన్నీ వింటూనే వున్నాడు.

కమల పెద్దపిల్ల అయిందిమొదలు కృష్ణారావుతో ఒంటరిగా మాట్లాడిన దారోజుననే. అంతకు పూర్వం కృష్ణారావు సెలవుల కింటికొచ్చినప్పుడుమాత్రం నలుగురిలో "యేం? కమలా! క్షేమంగా వున్నావా?" అంటే "యెప్పుడొచ్చావు బావా?" అని కుశలప్రశ్నలు జరిగేవి గాని వారెన్నడూ ఒంటరిగా మాట్లాడుకోలేదు. ఆమాత్రంకే తంటాలు పెట్టే నైజంగల సీతమ్మ, భర్తతో "కమల, కృష్ణారావుతో బావా! బావా! అని గుసగుసలాడుతుం దనీ లోకంలో నలుగురూ తన్ను బుగ్గపోట్లు పొడిచేస్తూన్నా" రని చాడీలు చెప్పింది పాపం. అది ఆమె నైజమింతేకాకుండా కమల సంగీతం పాడ్డం, చదువుకోవడం, ఆమె కేమీయిష్టంలేదు. తనకు పాటా చదువూ రాదు. కమలకుమాత్రం యెందుకురావాలి? కమల అత్తవారు పెట్టిన వీశెడు బంగారం నగలూ, మంచి మంచి విలువగల చీరలూ ఉన్నాయి,

తలచెడినపిల్ల కివన్నీయెందుకు ? పునిస్త్రీ ఐన సీతమ్మ ధరిస్తే బాగుంటుందిగాని ! ఆనాడు సాయంకాలమే మొదటి ప్రకరణంలో వివరించిన ప్రసంగం సీతా జానకిరామయ్యలకు జరిగింది. పాపం జానకిరామయ్య అనుమానం పడ్డట్లే తండ్రి అంతా విన్నాడు. ఆక్షణంనుంచి పట్టాభిరామయ్యకు జానకిరామయ్యపై అదివరకున్న ప్రేమంతా ఒకవిధమైన అసహ్యాంక్రింద మారింది. అతని ప్రేమ కంతకూ కమలయే కేంద్రస్థానమైంది. తత్క్షణమే అతని మనస్సులో ఒక దృఢమైన సంకల్పం పుట్టింది. రాత్రంతా అతడు నిద్రలో "కమలాచెయ్యి కృష్ణారావుచేతిలోపెట్టు. కృష్ణా ! మేము నిన్నిదివరకు చేసిన అవమానం మరచి మమ్మల్ని క్షమించి కమలను నాసర్వస్వంతో స్వీకరించవూ ? " అని కలవరించుచుండెను.

## ౪

మర్నాడు జానకిరామయ్య పనిమీద గ్రామాంతరం వెళ్లాడు. భోజనమైన తర్వాత కమలను యెంగిళ్లెత్తి పనులు చక్కపెట్టమనిచెప్పి సీతమ్మ అవతలవీథిలో రంగమ్మగారింటి కెళ్లింది. యింతలో పట్టాభిరామయ్య "కమలా ! యేం చేస్తున్నావమ్మా ? " అన్నాడు. కమల "యెంగి.ళ్లెత్తుతున్నాను నాన్నా " అంది.

పట్టాభిరామయ్య :—"ఒక్కసారిలా త్వరగా రామ్మా, " అన్నాడు. కమలరాగానే పట్టాభిరామయ్య "అమ్మా ! త్వరగాపోయి మనపొరుగింటి గోపాలరావు నాయుడుగారు భార్య భాగ్యలక్ష్మమ్మగారితో మానాన్నకు చాల జబ్బుగా ఉంది, మీ భార్యాభర్తలను ఒక్కసారి యిప్పుడే దయచేయమన్నారు, మీతో మాట్లాడాలని ఉందట అని చెప్పమ్మా " అన్నాడు.

కమల :—"ఏం చెప్తా ? " అని అనుకుని నాయుడుగారింటి కెళ్లింది. గోపాలరావునాయుడుగారు ఆవూళ్లో చాలా ధనికులు, ఉదారహృదయులు. ఆయన భార్య భాగ్యలక్ష్మమ్మగారు నిజంగా భాగ్యలక్ష్మియే. ఆ ఉదారదంపతులు యెన్నో అనాథకుటుంబాల కాశ్రయమిచ్చి పోషించేవారు, గొప్పహృదయంగలవారు.

కమల పోవునప్పటి కా ఉదారదంపతులు భోజనమొనర్చి పట్టాభిరామయ్యగారి రుగ్ణతగురించి, కమల దుస్థితిగూర్చి, సీతమ్మ పాషాణకఠినస్వభావంగురించి ముచ్చటిస్తూ విచారిస్తుండిరి. కమల సందేశాన్ని చెప్పగానే ఆదంపతులు పట్టాభిరామయ్యగారివద్దకుపోయి పెద్దవాడగుట నమస్కరించి ప్రక్కనున్న కుర్చీలపై కూర్చున్నారు. పట్టాభిరామయ్య కమల నావలకు పంపేశాడు.

ప:—"నాయుడుగారూ శ్రమయిచ్చినందుకు క్షమించండి.

నాయుడు :—"అయ్యో నాకేంశ్రమ ? తమ శరీరంలో నింపాదిగా ఉందా ? " అన్నాడు.

ప :—"ఏంనింపాది ! నేనింకా యెక్కువకాలం జీవించను. మాయింటి సంగతులుఅన్నీ తమ భార్యాభర్తలకు బాగా విశదమే. నేను గతించినతరువాత కమల పాట్లు యిలాయిలావుంటా యనలేను. ఆపిల్ల మీపిల్లకాని నాపిల్లకాదు. మీ కప్పగించి పోతున్నాను. దాని నెట్లైన రక్షించేభారం మీది. "

నా :—"కమలను కృష్ణారావున కిచ్చి పెండ్లిచేయరాదూ ? పాపం పిల్ల ఒకయింటిదై సుఖపడుతుందే ? కృష్ణారావుకూడా ఒప్పుకోకపో దనుకుంటాను, అతను చాల బుద్ధిమంతుడు, తెలివైనవాడు. "

ప :—"నేనూ అదే అనుకుంటున్నాను. కాని ఒకసారి తిరస్కరించి కూటికీ గుడ్డకు లేని కటికదరిద్రు డని అవమానపరిచిన కృష్ణారావుతో యే మొఖం పెట్టుకుని "నాకూతుర్ని పెళ్లిచేసుకో " అనగలను ? పోనీ ధైర్యంచేసి అన్నా వా డొప్పుకుంటాడో లేదో ? "

నా :—"ఆ భారం నామీద విడిచిపెట్టండి, నే నతన్ని బాగా యెరుగుదును, నామీ దతనికి చాలా గౌరవముంది. నే నతనితో మాట్లాడుతాను లెండి. యిన్నాళ్లు మీ రొప్పుకుంటారో లేదో అని వూరుకున్నాముగాని, యీ వుద్దేశ్యం యిదివరకే మావుభయులకూ వుంది. "

ప :—"మీ స్వార్థరహితఅవ్యాజానురాగానికి నా కృతజ్ఞతాపూర్వకవందనములు. యిన్నాళ్లూ తెగించలేక పస్తాయించాను. గాని, నేను బ్రతికుండగానే మాకోడలు దాన్ని పెడుతున్నా బాధలు, కత్తికోతలూ, మావాడి కాత్రభావం చూడగా నే నధోగతిపాలైనా సరే, లోకం యేమనుకున్నా సరే, నాజీవితసర్వస్వం, నానిధానం, నాముద్దుకూతురు, నాకమల, యేలాగైనా ఒకయింటిదై సుఖపడితే చాలునని దృఢమైన సంకల్పంపుట్టి, తమ రుభయులనూ పిలిపించాను. గాని నా కింకో అనుమానం గట్టిగా బాధిస్తుంది. యెన్నిపాట్లైనా పడుతుంది గాని కమల వప్పుకుంటుందో లేదో అని నాకు భయంగా ఉంది. "

నా :—"అవుననుమండీ అది గట్టిచిక్కేను. "

భాగ్యలక్ష్మమ్మ :—"నేను నాశాయశక్తులా ప్రయత్నించి పునర్వివాహం వప్పుకునేటట్లు చేస్తాను, మీరు బెంగపెట్టుకోకండి. ఆమెను నా కన్నకూతురుకన్న యెక్కువగా చూసుకుంటాను. మీ మనస్సులో యింకేమైనావుంటే చెప్పండి. "

ప :—"నేను బ్రతికివుండగానే, కమల వంటనున్న నగలు వూడదీసి లాక్కోవాలని మాకోడలు మా ప్రయత్నిస్తున్నది. మీరు దయచేసి నాభార్యతాలూకు నగలన్ని ఆసందువ, మీవద్ద నుంచవలెను. అందులోనే, కమల ప్రస్తుతం ధరించని నగలు మరికొన్ని ఉన్నాయి. కొన్ని ప్రానోట్లున్నాయి, నాకు రెండులక్షల యాభయి వేల రూపాయలు ఆస్తివున్నది. బ్యాంకులో ఒక్కలక్షా యాభయి వేలున్నూ, నోట్లపంగా లొంభయి వేలున్నూ. మిగతా పదివేలరూపాయలున్నూ జానకిరామయ్యకు వ్యాపారంనిమిత్తం యిచ్చాను. యీ యిల్లూ, జానకిరామయ్యకు వ్యాపారం కొరకు యిచ్చిన పదివేలరూపాయలు తప్ప లెక్కనదంతా కమల పేరనే విల్లువ్రాసి దానికి పెళ్లిఅయి, దానిభర్త చూచుకొనేవరకు, మిమ్మల్ని కమలకు గార్డియన్‌గా నియమించా లని ఉంది. దయచేసి నామనవి చెల్లించాలి ; మీరీవిషయంలో జోక్యం కలుగజేసుకోకపోతే వాళ్లు దానికేమీ దక్కనివ్వరు. నేను వీలువ్రాసినప్పటికీ కమలను బూకలించి అల్లరి పెట్టారని నాకు భయంగాఉంది. అలా జరక్కుండా మీరు శ్రద్ధతీసుకొని కొంచెం శ్రమపడాలి. మావా డిప్పుడు వూళ్లో లేడు, కోడలూ యెక్కడికో వెళ్లింది. అది యింటికిరాకుండా సంగతి రహస్యంగావుంచే న్యాయవాదిని పిలిపించండి ; వాళ్ల కీసంగతి తెలిస్తే కమల నసలే బ్రతకనివ్వరు. నేను పోయినతర్వాత కమలా కృష్ణారావుల కెట్లైన వివాహంచేసి, ఒకయింటివాళ్లనుచేసి, వాళ్లిద్దరకూ తల్లిదండ్రులు మీరే అయి రక్షించాలి. యీభారం అనాథశరణ్యులు, అగతికగతికులు అయిన మీరు వహించి మృతింపనున్న నాఆత్మకు శాంతికూర్పుడని, మిమ్ములను దీనంగా వేడుకుంటున్నాను, యిదియే నాఅంత్య ప్రార్థన " అని రొగ వూపిరితో జాపోనుకుంటూ ఆయాసంగా అన్నాడు.

నా. భాగ్య :—"మీరింత చెప్పాలా ? మీరు చెప్పినా చెప్పకపోయినా, కమల కాస్తి యిచ్చినా యివ్వకపోయినా, మేమే కొంత అరణమిచ్చి కమలకు పునర్వివాహం చేద్దామని అనుకున్నాము.

వెంటనే వకీలును రప్పించి పట్టాభిరామయ్య కోరినట్లు విల్లు వ్రాయించారు. పట్టాభిరామయ్య వణుకుచేతులతో వంకరటింకర అక్షరాలతో యెలాగో సంతకం చేశాడు. ఆవెంటనే నగలూ నోట్లు వున్న సందువాతో వీలు నాయుడుగారి యిల్లు చేరింది. పట్టాభిరామయ్య సంతృప్తిసూచకమైన దీర్ఘనిశ్వాసం విడిచాడు. న్యాయవాది వచ్చినప్పుడే భాగ్యలక్ష్మమ్మ కమలను తమయింటికి తీసుకుపోయింది. న్యాయవాదీ నాయుడుగారూ గుమ్మం దిగుతున్నప్పుడు సీతమ్మ తిరిగి యింటికివస్తూ చూసింది. నాయుడుగార్ని ఆమె యిదివఱ కెరుగును ; కాని యిదివర కెన్నడు న్యాయవాదిని చూడలేదు. తనయింటి కెన్నడూరాని నాయుడుగా రెందుకొచ్చారో అని ఆశ్చర్యపడింది. కమల యింటికి రాగానే "వూళ్లో షికారుకూడా తిరుగుతున్నావే ? నీ సిగ్గు బొగ్గులుగాను " అని కళ్లెఱ్ఱచేసి ఒక వురుము వురిమింది.



క:—భాగ్యలక్ష్మమ్మగారియింటికి పిలుస్తే వెళ్లాను.
సీ:—మనింట్లో కొచ్చినవా ళ్లెవరే ?
క:—నాయుడుగారు నాయుడుగారిభార్య నాన్నగార్ని చూడ్డాని కొచ్చారు.

సీ:—ఇంకెవరు వచ్చారే ?

క:—నాకు తెలీదు.

సీ:—"తెలీదేం! ఆయనరానీ చెప్తాను. సరే షికాయింపా ? యిల్లూడ్చి పొయ్యిలో నిప్పెయ్యి " అంది. యింతట్లో డాక్టరుగారొచ్చి రోగిని చూశాడు. చాలాతీవ్రముగా కొట్టుకుంటున్నది. కమలను పిలిచి "యేమమ్మా నాన్నగారు అలసినట్లున్నారు. నిద్రపట్టలేదు కాబోలు. నేనిచ్చినమందు దయచేసి యిచ్చారా ?" అన్నాడు.

క:—"మందు దయచేసి యిచ్చాను గాని, వాంతైపోయిందండీ. యివాళ నాన్నగారు నిద్రపోలేదు " అంది.

డా:—"సాధ్యమైనంత కస్తూరీనుకోవాలి. యిప్పుడే మరొకమందు పంపుతాను అగత్యమైతే నన్ను కబురుచేయండి " అని యివతలకు రాగానే కృష్ణారావు యెదురుపడి,

కృ:—"నమస్కారమండీ డాక్టరుగారూ ! నేనోసంగతడుగుతాను దాచక నాతో ఉన్న దున్నట్లు చెప్పాలి. మామయ్యగారి కెలావుంది, యేమైన ఆశవుందా?" అన్నాడు.

డా:—"అయ్యో ! రోగి ముసలివాడు. రోగం గడ్డైనదే. నే నేంచెప్పగలను? నా ప్రయత్నంలో నేమీ లోపంలేకుండా మందిస్తున్నాను, ఆపైని భగవంతుడున్నాడు. సెలవు " అన్నాడు. కృష్ణారావు విచారంగా మేనమామగదిలో కెళ్లాడు.

ప:—కృష్ణా ! వచ్చా ? రా నాయనా అని చేయిపట్టుకొని, నిన్ను మేము యిదివరలో చేసినపరాభవం మఱచిపో నాయినా అని నీరసంగా అన్నాడు.

కృ:—పరాభవాని కేముంది మామా ? నేను దరిద్రుణ్ణిగానా మీ పంచ చేరలేదా ?

ప:—"అయ్యో వెఱ్ఱివాడా, నేనుమాత్రం పుట్టినప్పుడు దరిద్రుణ్ణికానా నీకంటె మరీ దరిద్రుణ్ణి, భగవదనుగ్రహంవల్ల నువ్వుకూడ గొప్పవాడవు కాకూడదూ ? నిన్ను కమలను విడిచి వెళ్లిపోతున్నాను, దానిభారం నీదిసుమా నాయినా? " అని నీరసంతో మరి మాట్లాడలేక కన్నులుమూశాడు. ఆరాత్రి పట్టాభిరామయ్యను సంధిచేసి మూడోనాడు కమలను, బంధువులను, దుఃఖసముద్రంలో ముంచి, యీ లోకం విడిచిపెట్టాడు.

2

పట్టాభిరామయ్య గతించి సంవత్సరం అయింది. కమల యిప్పుడు పూర్తిగా మారింది. యింటిచాకిరీ వంటలక్క అయింది. ఆమెధరించిన కొద్దిపాటినగలూ యిప్పుడు సీతమ్మను అలంకరించుతున్నవి. సహజంగా అప్రయత్నంగా యెప్పుడూ చిరునవ్వు నవ్వుతున్న ఆమె ముఖమునం దిప్పుడు ముచ్చటకైనా నవ్వు కనిపించలేదు. ఆమె తనూలత పుష్టిహీనమై శోషిల్లిన వల్లరిలా శుష్కించినప్పటికీ మాసిన ముదుకవస్త్రంలో నూతనలావణ్యంతో మేఘాలమరుగున ప్రకాశించు వెన్నెల్లా వెలుగుతున్నది. ఆ నిత్యానందహాసప్రపూర్ణ గౌరకాంత్యుజ్వలకిరణప్రసారకములై, యిదివఱకు అమాయకములై కలకల నవ్వుతున్నా నేత్రాలు "ప్రపంచ మింత దుఃఖభాజనమైనదా ?" అని కరుణాప్రపూర్ణవిషాదభావములను వెదచల్లుతూ జాలి గొలుపు నవ్వు నవ్వుతున్నాయి. పుష్పపరాగాచ్ఛాదిత పద్మదాల్లాగ పరిష్కృతములై, ఆమె కేశదామములు ధూళిధూసరితములై ముఖకమలంపై యెగురుతున్నాయి. యిప్పుడామె పుస్తకాలు బూజెక్కుతున్నాయి. సీతమ్మసహాయంవల్ల వీణ అటకెక్కింది. సీతమ్మ ఫ్రెండు లోకాభిరామాయణాని కెళ్లినప్పుడప్పుడు భాగ్యలక్ష్మమ్మగారు కమలను కలుసుకొని మాట్లాడుతుండేవారు. ఒకనాడు భాగ్యలక్ష్మమ్మగారు కమలనుచూచి, "కమలా పాపం నువ్వుపడుతున్నపాట్లు చూస్తే నాకు చాలా జాలిగా వుంది. హాయిగా పెళ్లిచేసుకొని సుఖపడరాదూ ? అడవికాచిన వెన్నెల్లా నీ సౌందర్యం వృథాగా పాడుచేసుకుని యెందు కిలా బాధపడాలి ? "

క:—పూర్వజన్మాన్ని కొరనోములునోచి పుట్టిన నాకు పెళ్లిసుఖ మేమిటండీ ? బ్రహ్మ యిలా నానొసట వ్రాశాడుగదా ! అనుభవించక తప్పుతుందీ ! యింటా వంటా లేని ఆచారంచేస్తే పాపంకాదండీ.

భాగ్య:—"బ్రహ్మ నొసటవ్రాయడ మేమిటి ? లోకంలో యెన్నిజాతులేవు ? యెన్నికులాలు లేవు ? వాళ్లందరినొసళ్లా వ్రాయక బ్రహ్మ మీ కులానికే యీ వ్రాత వ్రాశాడా ? పునర్వివాహాలు చేసుకుంటూన్న తక్కినజాతులవాళ్లందర్లో చేసుకోని మీజాతి యెన్నోకొంత తవుకుంది ? వుల్లా వసా ? నువ్వే ఆలోచించి చెప్పు ? వాళ్లందరూ అధోగతిపాలైపోయి మీజాతివాళ్లొక్కళ్లే స్వర్గంలో పుట్టికట్టుకు పుయ్యా లూగుతారా ? "

క:—"నిజమే ! కాని మాశాస్త్రాలు ఆచారాలు అలాగేడుస్తున్నాయి."

భాగ్య:—చదువుకొన్న నువ్వే అలా అంటా వేమిటి ? " అదేదో నాకు బాగా రాదుకాని "నష్టేచ మృతేచ క్లీబేచ"--అని భర్తదేశాంతరం లేచిపోయినా, చనిపోయినా, నపుంసకుడైనా, తిరిగి పెళ్లిచేసుకోవచ్చునని అర్థమిచ్చే శ్లోకం వుందట, వీరేశలింగంపంతులుగారు స్త్రీ పునర్వివాహం శాస్త్రవిరుద్ధం కాదని సప్రమాణంగా నిదర్శనంచూపి రూఢిపర్చారుకారూ ? సంస్కృతం ఇంగ్లీషు చదువుకున్న దానివి నీకు మాత్రం తెలీదూ ? "

క:—అవునులెండి కులక్రమాగతంగా సనాతనంనుంచీ వొస్తున్న ఆచారాలు మంటగలిపి నేనిప్పుడు క్రొత్తగా యెలా ప్రవర్తించేది ? "

భాగ్య:—వెఱ్ఱిదానా; కులక్రమాగతమైన యీ సనాతనాచారాలవల్ల లోకంలో యెంతమంది నీలాగ నీకంటె అధికంగా దుర్భరమైన బాధలుపడుతూ అధోగతిపాలైపోతున్నారో నీకు తెలీదూ ? యీ దురాచారాలవల్ల నే యెంతమంది తప్పుత్రోవలుత్రొక్కి భ్రూణహత్యలు చేస్తున్నారో, యెంతమంది ఆత్మహత్యలు చేసుకుంటున్నారో, మనకళ్లతో మనమే చూడలేదూ ? యిట్టి ఘోరపాపాలకు మూలకందమైన దురాచారాల్ని రూపుమాపడం పాపమా ? దేశానికి సంఘానికి నష్టకష్టాలు తెచ్చిపెట్టి, అసంఖ్యాకులైన మన సోదరీమణులను పాపకూపంలో దింపి నాశమొనరిస్తున్న యిలాంటి దురాచారాల్ని అనుసరించడమే పాపమని నా ఉద్దేశం. చదువుకున్న నువ్వు నీ సోదరీమణులకు మార్గదర్శకురాలవై దీక్షాకంకణమును ధరించి కార్యరంగమున కురుకుట నీవిధి. అలా చెయ్యకపోవడమే పాపమేమో అని నాకనిపిస్తున్నది." కమల తలవంచుకొని ఆలోచిస్తూ నిలబడిపోయింది. యేమీ ప్రత్యుత్తరం చెప్పలేకపోయింది. కాలి బొటనవ్రేలితో కొంతసేపు నేలపై వ్రాస్తూ "నాకు వేళైపోయింది మావదినవచ్చేసరి కింట్లోలేకపోతే కోప్పడ్తుంది. నే పోతా " నంది.

భాగ్య:—అన్నట్లు మీ బావ కృష్ణారావు కెలావుంది, యీమధ్య జబ్బు




చేసిందట పాపం ! " అంది. కమల గతుక్కుమన్నది "ఆ ! ఆ ! కృష్ణారావుకి జబ్బా " అంది.

భాగ్య:—"యేమీ నీకు తెలీదూ ? నువ్వు కృష్ణారావుని చూడలేదూ ? "

క:—"నాకేం తెలీదండి. యీమధ్యనే బి. యల్. ప్యాసయి వచ్చాడు. ప్లీడరీ యీవూళ్లోనే చేస్తాడు అని మాఅన్నయ్య అన్నాడు. మానాన్నపోయింతర్వాత కృష్ణారావు మాయింటికి రానేలేదు. అతని కేంజబ్బుచేసిందండి ?

భాగ్య:—అయితే అతని పెళ్లిమాటలసంగతీ నీకు తెలియదన్నమాట.

క:—నాకేంతెలియదండి పెళ్లిచేసుకుంటున్నాడా ?

భాగ్య:—యీమధ్య జడ్జీగారు వెయ్యిరూపాయలు యెదురిచ్చి కూతుర్నిస్తానన్నారట, మీబావ చేసుకోనన్నాడట. నెలరోజులక్రిందట మాయింటి కొచ్చాడు. మాఆయన ప్రాక్టీసు యెప్పుడు ప్రారంభిస్తా వంటే నేను ప్రాక్టీసుచేయనన్నాడట. యేమంటే, యేంలేదు నాకిష్టంలే దన్నాడట. జడ్జీగారు పిల్లనిస్తానన్నారట చేసుకోనన్నావట యేమి అంటే, నాకు పెళ్లీవద్దు గిళ్లీవద్దు సన్యాసినయిపోతా నన్నాడట. యేమిటో అతనివాలకం వింతగా కనుపించింది సుమా. పాపం అప్పటికే చాల చిక్కిపోయి, మొగం కళ్లు గుంటలుపట్టి యెన్నాళ్లయిరో తిండీ నిద్ర లేక దీర్ఘవిచారంతో కనుపించాడు.

క:—అతని కిప్పుడు జబ్బని యెవరుచెప్పేరండి.

భాగ్య:—మాయింటి డాక్టరు చెప్పేడు.

క:—యేజబ్బన్నాడు?

భాగ్య:—ఫలానాజబ్బు అని చెప్పటను వీలులేదట, మందు త్రాగడట, ఆహారం తినడట, అర్ధరాత్రి వేళ ఒకడే వూరుఅవతల తోటలంటా దొడ్లంటా స్మశానాలంటా వూరికే వెఱ్ఱివాడిలాగ తిరుగుతాడట. యిప్పుడు మూడ్నాళ్లనుంచీ తిరుగలాడలేదట. మరికొద్దిరోజు లిలా నిద్రాహారాలులేకపోతే ఆకలితో శుష్కించి పిచ్చెత్తి చచ్చిపోతాడని డాక్ట రంటున్నాడు. యెవ రెంత బ్రతిమాలినా ఆహారం తినడట; తల్లితోనైనా మాట్లాడడట! పాప మావిడ నెత్తీనోరూ కొట్టుకొని యేడుస్తుందట. ఆమెఖర్మం యేలావచ్చిందో చూడు. యిన్నాళ్లు కటికదారిద్రం అనుభవించి, తీరా కొడుకు చేతికందా డనగానే యిలావచ్చిపడ్డా వీ విపత్తు. రామ రామ! కమల కళ్లల్లో నీరు గిఱ్ఱున తిరిగాయి.

క:—"అతన్నోమాటు చూడాలనుందండీ. వాళ్లయింటికెళ్లి తే మావదినా అన్నయ్యా కోప్పడతారు, యేంబుద్ధండీ!" అంది.

భాగ్య:—"అలా అయితే మాయింటికి మామోటారుకారులో పడుకోబెట్టి కృష్ణారావును తీసుకురమ్మని మా ఆయనతో చెప్తానులే, రేపు మీవదిన వూళ్లో లోకాభిరామాయణాని కెళ్లగానే యిక్కడకు చక్కారా చూద్దువుగాని. నీవూ అతనూ చిన్నప్పట్నించీ చాలా అన్యోన్యంగా ఉండేవాళ్లుగదా నువ్వు బతిమాల్తే ఆహారంతింటాడేమో? అతన్ని బ్రతికించిందాన వౌతావు" అంది. కమల కృతజ్ఞతాపూర్వకంగా నమస్కరించి అతివిచారంగా యింటి కెళ్లిపోయింది.

## ౬

కృష్ణారావుకి చిన్నప్పటినుంచీ కమలనే పెళ్లాడాలనిఉండేది, కాని కమలకు పెళ్లికాగానే అతడు భరింప శక్యముకాని హృదయవేదన అనుభవించాడు. ఆమె యందలి ప్రేమ యెప్పటికీ మరవలేకపోయాడు. నాటినుండి మామగారింటికి తరచు వెళ్లుట మానుకున్నాడు. కమల భర్తపోయినవార్త విన్నప్పటినుండీ కమల వప్పుకుంటే పునర్వివాహం చేసుకుందా మనుకున్నాడు! కాని కమల సమ్మతించునని అతనికి ఆశ లేకపోయింది. కమలమీది ప్రేమచేతనే యెన్నిసంబంధాలు వచ్చినా వప్పుకోలేదు. కమలావియోగసంతాపంవల్ల, అతడు చాలవరకు శుష్కించినమాట నిజమే కాని కమలతో భాగ్యలక్ష్మమ్మగారుచెప్పినంత ఘోర మేమీ జరుగలేదు. అది ఆమె యొక్క సదుద్దేశపూరిత కల్పనకథ. కమల యెన్నివిధాల బోధపరచినా లొంగలేదు. యింక ఆమెను కృష్ణారావుపైనున్న ప్రేమనే ఆయుధంగాజేసి తన సత్కార్య కదనమందు జయంపొందడానికి యీకథ భాగ్యలక్ష్మమ్మ కల్పించింది. నాయుడుగా రింతకుముందే కృష్ణారావుతో మాట్లాడినారు! "కమల సమ్మతిస్తే సంతోషంగా పెళ్లి చేసుకుంటా" నని కృష్ణారా వన్నాడు. ఆ మర్నాడు యథాసమయానికి సీతమ్మ లోకాభిరామాయణానికి వెళ్లింది. ఒకగదిలో మంచంమీద ముఖంతప్ప తక్కిన శరీరమంతా కప్పుకొని, కృష్ణారావు పండుకొని ఉండెను. భాగ్యలక్ష్మమ్మ కమలచెవిలో మెల్లిగా "యేలాగైనా బ్రతికించాలి సుమా?" అని అవతలి కెళ్లిపోయింది.

క:—కృష్ణారావు పండుకొన్న మంచందగ్గిరి కెళ్లి ఉద్రేకంతో "యిన్నాళ్లె జబ్బుగావుండి నాకు తెలియజేశావుకావేమి?" అంది.

కృ:—"నా యోగక్షేమాలగురించి తెలుసుకోడాని కంత అభిలాష వుందేమో" అని అన్నాడు.

క:—"అదేం? బావా! అలాఅంటున్నావు?" అని కన్నీళ్లు జలజల కార్చింది. కృష్ణారావు యేమి జవాబు చెప్పలేదు. కమల యేడుస్తూ "నేనేం చేశానుబావా? యిన్నాళ్లూ ఊళ్లోనే ఉండి మాయింటి కొక్కసారైనా రాలేదు. సరేగదా, యిప్పుడు కొండంత జబ్బుచేసి "యేం తెలియజేశావు" వంటే అలా అంటున్నావు. నీయోగక్షేమాలు వినడానికి నాకభిలాష లేకపోతే మరెవరికుంటుంది?" అంది. కృష్ణారావు కీ నాటకమాడ్డం చాలకష్టంగాతోచింది. కమల యేడుస్తూ "నేనేం చేశానుబావా" అన్నప్పుడు అమాంతంగా మంచంమ్మీంచి లేచి తన రెండుచేతులలోనూ ఆమెను తనహృదయమునకు చేర్చుకొని "యేడ్వకమ్మా"! అని బుజ్జగించాలని బుద్ధిపుట్టింది గాని, వెంటనే భావ గోపనం గావించుకొని "మరేంలేదు! నేను సన్యాసినైపోవాలని బుద్ధిపుట్టింది. అలాంటప్పుడు బంధువులందర్నీ మరవడానికి ప్రయత్నించకపోతే సర్వసంగత్యాగి నెలా అవుతాను చెప్పూ?" అన్నాడు.

క:—నీకు సర్వసంగత్యాగఖర్మ మేమొచ్చిందిబావా?

కృ:—మాఅమ్మతప్ప నా కీ లోకంలో నాఅన్నావాళ్లెవరున్నారు? మాఅమ్మేనా యింకా విశేషకాలం జీవించదు. మరెవరికోసం ఉద్యోగంచేసి ఉబ్బాంగి ఊరేగాలికేది? మొరడులావున్న నా ఒక్కపొట్టకోసం వూరికే తాపత్రయంపడి చచ్చేకంటే సర్వసంగత్యాగినై, ఉన్న నాల్గురోజులు రామా! కృష్ణా! అని కాలం గడిపితే ముక్తివుంది. మాఅమ్మపోతే నాకోసం యేడ్చేవాళ్లెవరున్నారు?

క:—"బాగుందిబావా! నీమాటలూ నువ్వూన్నూ! నీకేం లోటైంది! యవ్వనం లోటా? రూపం లోటా? విద్య లోటా? అప్సరసల్లాంటి పిల్లల్ని కట్నాలతోకూడా యిచ్చి పెళ్లిచేసుకోమని చెప్తూన్నారట. మహారాజులా నీమనసు కొచ్చిన పిల్లని చేసుకొని కడుపునిండా కడిపెడు పిల్లల్ని కని సంసారం తామరతంపరలా వృద్ధిఅవుతూంటే నీ కెంత సంతోషం? చూచేవాళ్లకు మా కెంత సంతోషం? అంతేగాని పది కాలాలు గడపిన పండువిరాగిలాగ యిలాంటి వోగాయత్తపుమాటలాడ్తావేం? నీకోసం యేడ్చేవాళ్లెవరూలే రేం? అవును! నీ కలావుంది, నువ్వంటే చిన్నప్పట్నించీ మాఅన్నకంటె యెక్కువగా ప్రేమిస్తూన్న నన్ను మరచిపోయావుగాని, నీకు జబ్బుచేసిందని విన్నపట్నుంచీ నేనెంత దిగులుపడి యేడుస్తూన్నానో నీకేం తెలుసును? అవునుగాని జడ్జీగారు పదివేలు కట్నంతో పిల్లనిస్తామని చెప్పవస్తే వద్దన్నావట నిజమేనా?

కృ:—"ఆ! నిజమే."

క:—"నీకేం పిచ్చిపట్టిందా యేమిటి? ఆపిల్ల కేం లోపం అని చేసుకోనన్నావు? పిల్ల రంభలా ఉంటుందటే, మంచి బుద్ధిమంతురాలటే?"

కృ:—"యేమో నాకంటికి రంభలా కనిపించలేదు?"

క:—"అలాఅయితే నీకంటికి రంభలాకనిపించే పిల్లనే చేసుకోరాదూ?"

కృ:—"ఆరంభ నన్ను తిరస్కరిస్తుందేమో అని నాకు భయంగావుంది, నారంభ వప్పుకుంటే కళ్లకద్దుకొని మరీచేసుకోనూ? నేననుభవిస్తూన్న యీఘోరనరక యాతన యీక్షణం శాంతించి ఆనందమయసుఖస్వర్గధామాని కెగిరిపడనూ అని" ఉద్రేకంతో అన్నాడు. కమల ఆశ్చర్యంగా కృష్ణారావువంక చూసింది. ఆమె కింకా నిజం బోధపడలేదు. "ఓహో! ఇదా నీజబ్బుకీ నిద్రాహారాలు లేకుండా వెఱ్ఱివాళ్లాగ అర్ధరాత్రుళ్లుకూడా తోటలంటా దొడ్లంటా తిరగడానికి కారణం?" అని అమాయకపునవ్వునవ్వుతూ "ఆ రంభ చీవూరేనా?" అంది.

కృ:—"ఆ! యీవూరే?"

క:—"అయితే నాయుడుగారు చాల మంచివారు. ఆయనతో చెప్పితే ఆయన ఆ రంభ తల్లితండ్రులతో మాట్లాడి సంబంధం కుదురుస్తారులే, దానికోసం యింత శెం గెందుకు?"

కృ:—"ఆ శెం గెందుకా! ఆ పిల్లతల్లి తండ్రు లెవ్వరూ లేరు. నాయుడుగారు కాదుగదా! బ్రహ్మదేవుడు చెప్పినా ఒప్పుకొనే రంభకాదు. ఆ రంభకే స్వయంగా "అయ్యో! పాపం, చిన్నప్పట్నుంచీ నన్నే ప్రేమించి స్వప్నంలోనూ జాగ్రదవస్థలోనూ సర్వకాల సర్వావస్థల్లోనూ, నారూపమే హృదయపీఠంలో గాఢంగా హత్తించి సంతుష్టనయనాల్తో చూస్తూన్నాడు, నాపేరే జపిస్తూ పలవరిస్తూ, నాకోసమే నిద్రాహారాలు మాని శుష్కించి శల్యమై చావసిద్ధంగా ఉన్నాడు. నేను కనికరించకపోతే వీ డింక బ్రతకడు" అని నాపై జాలిపుట్టి అవ్యాజప్రేమామృతధారలు నాపై వర్షించి, ఆమెయే "కృష్ణారావూ! నీకేం భయంలేదు, నిన్నేలుకుంటా" నని నన్నురక్షించాలిగాని లేకపోతే నా జీవితాశ సున్నే. "ఏప్రేమబలం యింతవరకూ మాట్లాడ్డానికి నాకు శక్తిచ్చిందో ఆప్రేమబలమే లేవడానికి కూడా శక్తిచ్చుంటే ఆ ప్రేమభిక్షా ప్రాణభిక్షపెట్టి నన్నురక్షించవూ? అని బతిమాలి ఉండును" అని ఆశాసందేహాలు పెనగులాడు చూపుల్తోచూస్తూ ఊరుకున్నాడు. కమలగుండె దడదడకొట్టుకొన్నాయి. ఉచ్ఛ్వాసనిశ్వాసాలు అతిత్వరగా వేడిగా వెడలుతున్నాయి. కృష్ణారావువేపు చూస్తూన్న దృష్టులు క్రిందికి వాలాయి. వొళ్లు పులకరించింది, ఆమె స్వభావంలో ఒక నూతన పరివర్తన కలిగి యిదివర కిలా నెన్నడూ అనుభవించి యెరుగని నూతనభావవికారాంతరంగా లామెహృదయం కలగుండుపరచి, భయం, సిగ్గూ, ఒకవిధమైన వెఱ్ఱిఆనందం ఒక్కుమారే కలిగి ఆమెను తన్మయావస్థలో ముంచేశాయి. అప్పు డామె తాను విధవనన్నమాట పూర్తిగా మరచిపోయింది. ఆమెతనువెల్ల నఖశిఖపర్యంతం కంపిస్తూ నిలబడిపోయింది. కృష్ణారావా ప్రేమసూచక చిహ్నములుచూసి ఆనందంపట్టలేక, "నాప్రాణాధికా!"—అని యేమో అంటూండగా, కమల అదరిపడి చటుక్కున

సుమ్మంవరకూ పరుగెత్తేసరికి, కృష్ణారావు మంచంమీద చేతులాని కొంతవరకులేచి, "కమలా నన్ను మృత్యువునోట" అని సగంమాటలోనే సమ్మసిల్లినట్లు తిరిగి మంచంమీద దబ్బున పడిపోయాడు. కమల చటుక్కున ఆగి వెనక్కి తిరిగిచూసే టప్పటికి కృష్ణారావు కన్నులుమూసి నిర్జీవునివలెకనుపించాడు. పాపం ఆమెకు ఆపాద మస్తకం కంపమెత్తింది. వెంటనే మంచంవద్దకుపోయి "బావా! బావా! నాతో మాట్లాడవూ? నావైపు చూడవూ?" అని కంపితస్వరంలో యేడుస్తూ పిలిచింది. కృష్ణారావు మాట్లాడలేదు. ఆమె మహాఆత్రంగా యిటూ అటూ చూసి ప్రక్కనున్న బల్లమీద ఒకవెండిచెంబు కనిపిస్తే వెంటనే ఆచెంబు అందుకొని అందులో నీళ్లు కృష్ణారావు ముఖంమీద చిలకరిస్తూ "బావా! బావా!" అని గట్టిగా యేడ్చింది. కృష్ణారావు లాసిగా కళ్లువిప్పిచూసి "వుస్సూ" అన్నాడు. చేత్తోదాహం అని సంజ్ఞచేశాడు. కమల మంచంమీద కూర్చుని అతనితల మెల్లిగాయెత్తి నీళ్లు పొయ్యడానికి ప్రయత్నించింది గాని వీలుపడలేదు. యింక విధిలేక చెంబు క్రింద పెట్టి రెండుచేతుల్తో అతన్ని తనవక్షమునకు చేరవేసుకొని మెల్లిగా వంగి క్రింద




చెంబు తీసుకొని నోటపెట్టింది. అప్పుడు ఆమె హృదయంలో దడ కృష్ణారావు వీపుకు తగులుచుండెను. ఆమె తనువెల్లకంపించి చెమటలు పట్టింది. కృష్ణారావు నీళ్లు మెల్లగాత్రాగి "అమ్మా!" అన్నాడు. కమల "బావా? కొంచెం నెమ్మదిగా ఉందా?" అంది. కృష్ణారావు చాలా నీరసంగా "కడుపులో అదేమిటో గాభరాగా వుంది" అన్నాడు.

క :—"రెండు పళ్లు తినరాదూ" అంది.

క :—"నువ్వు తినమంటే తింటా" నన్నాడు.

క :—"తల వంచుకొని" మెల్లిగా అతన్ని మంచంమీద పడుకోపెట్టి బల్లపై నున్న పళ్లను తెచ్చి కృష్ణారావు చేతి కియ్యబోయింది.

కృ :—"అబ్బే నేను తినగలనూ? నువ్వే నీళ్లు పట్టినట్లు పళ్లుకూడా తినిపించాలిగాని?" అన్నాడు.

క :—"సిగ్గుతో తలవంచుకొని" "నన్నిలా అన్యాయంచేసి పాపంలో దించడం నీకు ధర్మమేనా?" అంది.

కృ :—"ఏంపాపం? నన్ను బ్రతికించడం నీకుపాపంలా తోస్తే నాఖర్మానికి నన్నువిడిచిపెట్టి ఆ పళ్లు పట్టుకెళ్లిపో, నేనొద్దన్నానా! నా ముండప్రాణంకోసం నిన్నంత ఘోరపాపం మూటకట్టుకోమంటానా!" అని అవతలకు ముఖం త్రిప్పుకున్నాడు. కమల సిగ్గుతో తలవంచుకొని పళ్లెంలోని ద్రాక్షపళ్లుతీసి అతని నోట్లో పెట్టింది.

కృ :—"చూడూ! కమలా! యీ వొక్కరోజూ నాకు నువ్వుతినిపిస్తే మాత్రం యేంలాభం! ప్రతిరోజూ యిలా తినిపిస్తానంటే తింటాను" అన్నాడు.

క :—"పోనిస్తూ! మా నేర్చుకుపోయావు! తిందూ!"

కృ :—"అలాక్కాదు నువ్విలా అంటేనే తింటాను అన్నాడు.

క :—"అలాగేలే" అని తలవంచుకొని చిరునవ్వు నవ్వుతూ అతనినోట్లోను ద్రాక్షపండు పెట్టింది."

కృ :—"అయితే కమలా! నువ్వు నాకుతినిపించావు, నీకు నేను తినిపించొద్దూ అని కమల నోటివద్ద పండుపెట్టేడు. కమల సిగ్గుతో ముఖం అవతలకు త్రిప్పుకుంది.

కృ :—"అలాఅయితే మరి నేతి న్న" న్నాడు.

క :—"చిరునవ్వు నవ్వుతూ" చిన్నపిల్లవాడిలాగ బాగుం దీ ముకాపెం? మావదిన వచ్చేసరి కింటలేకుంటే నాకు లగ్గాష్టకాలైపోతాయి. వేగిరంతిందూ! నే పోవాలి" అంది.

కృ :—"మొదట నువ్వు పండుతిను, తరవాత ఆలోచిద్దాం" అని ఆమె నోట్లో ద్రాక్షపండ్లుపెట్టి "యిదిగో! కమలా! యిటు చూడు! యీ వేళనుంచి మరి మీ అన్నయ్యగారింటికి నిన్నొదలను తెలిసిందా!" అన్నాడు.

క :—"అన్నయ్య వదిన నన్ను చంపెయ్యరూ?" అంది.

కృ :—"యేడ్చారులే! కమలా బాగా జ్ఞాపకం తెచ్చుకో; ఓనాడు మీ నాన్నగారు నాయుడుగార్ని ఆయనభార్యను పిలమన్నారట, జ్ఞాపకముందా?"

క :—"ఆ! వుం దైతేనేమి?"

కృ :—"ఆవేళే నాయుడుగార్ని నీకు గార్డియన్‌గా నియమించి అతనికి నిన్నొప్పగించి యెలాగైనా మ నిద్దరికీ పెళ్లిచేయాలని బతిమాలారట, మీనాన్నగారు యిపుడు నాయుడుగారు నిన్ను నాకిచ్చేశారు, యీవాళనుంచి నీవు నాదానవు. మీవదినా మీఅన్నయ్య కాదుగదా. బ్రహ్మదేవుడొచ్చినా నాసొత్తు నే విడువను.




తెలిసిందా, అందుకు ప్రమాణం యిదుగో" అని గాఢముగా కౌగిలించుకొని కమలనొసటిపై ముద్దెట్టుకున్నాడు.

క :—కమల విడిపించుకొన ప్రయత్నించింది.

కృ :—"ఓహో, నిన్నింత సులువుగా విడిచిపెడ్తాననుకున్నావా యేమిటీ? పెదవులతో ప్రమాణంచేస్తేనేగాని నిన్నొదలను" అన్నాడు.

క :—"సిగ్గుతో తలవంచుకొని చిరునవ్వు నవ్వుతూ "అలాగేలెండి" అంది.

కృ :—"ఓహో యీక్రొత్తమాట యెక్కడ నేర్చుకొన్నావు! కమలా! అలాగే లెండంటే చాలదు, ప్రమాణంకూడా చెయ్యాలి.

క :—"రెండుచేతులతో మొఖంకప్పుకొని ముద్దుపెట్టబోయి సిగ్గుతో వెనక్కి తగ్గిపోయింది.

కృ :—"కమలా నీవు ప్రమాణంచేసేవరకు వూపిరితిరక్కుండా ముద్దుల వర్షం కురిపిస్తా" నని ఆమెపెదవులపై ముద్దులవర్షం కురిపించాడు.

క :—అతని కౌగిటినుండి తప్పించుకోడానికి పెనుగులాడింది.

కృ :—నవ్వుతూ "అబ్బే! అదుత్తమాట, నువ్వుకూడా నేనుచేసినట్టు ప్రమాణం చేయాలి, నే నొదలాలి" అన్నాడు.

క :—కృష్ణారావు నుదుటిపై ముద్దుపెట్టి సిగ్గుచేత రెండుచేతుల్తో ముఖం కప్పుకొని, మా అన్నయ్య వదినా నన్ను చంపెయ్యరూ?

కృ :—"నిన్ను చంపడానికి మీఅన్నయ్య మీవదినా ఎవరు? మీనాన్న నాయుడుగార్ని నీకు యజమానిచేసి పత్రంవ్రాసిస్తే?" అన్నాడు. యింతలో భాగ్యలక్ష్మమ్మగారు వరండాలోంచి "ఒకయాజమాన్యపత్రమే కాదండోయి మీకింకా తెలీదు కాబోలు. పదివేలూ, యిల్లూతప్ప తక్కినదంతా కమలపేర విల్లు వ్రాశారు మీ మామయ్యగారు" అని గట్టిగా నవ్వింది.

క :—సిగ్గుతో తలవంచుకొని "అయితే మీరందరు కలసి చేసిన కుట్రనా యిది, అని కృష్ణారావు చెంపపై చిరుదెబ్బకొట్టి భాగ్యలక్ష్మమ్మగారివద్దకు పరుగెత్తి పారిపోయింది.

# గులాబీరంగుచీర, గుమ్మటంలాంటి విగ్రహము

టి. మోహనరావు గారు

ప్రత్యక్షంగా కనిపించింది. గులాబీరంగుచీరా, గుమ్మటంలాంటి విగ్రహం. ముద్దులొలుకుతూండే ముఖం, మురిపాల మొగ్గలాంటి ముక్కు. ముద్దులకోసమే చేసినట్టుంది మోవి. కాంత రూపం చూస్తేనే చాలు, కవిత్వం పుడుతుంది. అంతచక్కంది. అలా ప్రత్యక్షంగా కనిపించింది కలలో. నన్నుచూస్తూంటే కన్నుగీటాను; కలకలనవ్వింది. చేసన్న చేశాను; దగ్గిరికొస్తూ వుంది. ఇంతలో పాడు కోడి కొక్కురోకో అని కూసింది. " రేపు కనిపిస్తానులెండి " అని గిర్రున తిరిగి పారిపోయింది నాముద్దుగుమ్మ.

తెల్లవారుజాముకల తప్పకుండా నిజమవుతుం దంటారు. కలల్లో కనిపించడమేకాని వినిపించడం తిరుచుగా వుండ దంటారు. కాబట్టి ఇది తప్పకుండా నిజమే అవుతుంది. ఈవాళ తప్పకుండా నాకు కనిపిస్తుంది అని దృఢనిశ్చయం చేసుకున్నాను.

*　　*　　*

అర్ధరూపాయి జేబులో వేసుకొని అలా కాఫీక్లబ్బుకు వెళుతూవుంటే కనిపించింది గులాబీరంగుచీర,గుమ్మటంలాంటివిగ్రహమున్నూ. మొగం అటువైపు వుంది. కాఫీసంగతి గాలికి విడిచిపెట్టాను. గబగబా నడిచాను. ఇంతలో గులాబీరంగుచీర ఒక బస్సెక్కిపోయింది. 'అన్నా! చేయిజారిపోయిందే' అని అటూ యిటూ చూచేసరికి మరో బస్సొచ్చింది. సరే అని దానిలో ఎక్కాను. ముందు కనిపిస్తూఉంది ముద్దుగుమ్మ ఉన్నా బస్సు. పందెం వేసినట్లు పరిగెడుతున్నాయి బస్సులు. 'పోనీ పోనీయ్' అని పురికొల్పుతూండేవాడిని మా బస్సువాడిని. మొఖాన్ని దుమ్ము మొత్తేస్తున్నా, కంకర్రాళ్లు కంట్లోపడుతూన్నా, ఆబస్సుమీద దృష్టిమాత్రం పైకి పోనీలేదు...ముందుబస్సు ఎక్కడా ఆగలేదు: ముద్దుగుమ్మ ఎక్కడా దిగలేదు అని ధైర్యం చేసుకొన్నాను. రైలుస్టేషనుదగ్గి రాగింది బస్సు. బస్సువాడికి నాలుగణా లిస్తూవున్నాను. గులాబీరంగుచీర గేటులోంచి ప్లాటుఫారంమీదికి వెళ్తూంది.

వేశాను ఒక్కులగువు గేటుకాసి. టిక్కెటుకలక్టరు అడ్డీశాడు. 'బాబూ బాబూ చాలాపనుంది' అని ఒక రెండణాలు వాడిచేతిలో పెట్టి ప్లాటుఫారంమీది కెళ్లాను. ఆ గన్నేరుచెట్టుకింద కూర్చొనుంది నా ముద్దుగుమ్మ. అన్నా దొరికిం దని పెద్దవూపిరితీసి అటువైపు వేశా నడుగులు మెల్లిగా. కాళ్లు తడబడుతున్నాయి. గుండె దడదడ లాడుతూంది. కవీశ్వరులు వ్రాసిందంతా నిజమే అని బోధపడ్డా దప్పుడు. కష్టంతో కళేబర మీడ్చుకుంటూ ఎదుటికి వెళ్లాను.

ముఖం చూచేటప్పటికి మొగంమొత్తేసింది. గుభాలున గుండె కుమిలిపోయింది. శ్రీహరీ అని చతికిలబడ్డాను.

పారల్లాగపళ్లూ, పొడుంబుర్రలాగ ముక్కూ, కాఫీగింజల్లాగ కళ్లూను! అసహ్యం! పరిగెడుతూ బయటపడ్డాను.

అయ్యో నాముద్దుగుమ్మా, ఆరణాలు కర్చయిందే అని అనుకున్నాను.

*　　*　　*

కడుపులో ఆకలి కనకనలాడుతూంది. కాఫీఅయినా ఒక కప్పు తాగుదామని (జేబులోఉన్నాది రెండణాలేగా) అలా కాఫీ హోటేలువైపు నడుచుకుంటూ పోయాను. ఇరవై బారల దూరంలో ఉంది కాఫీహోటేలు. కాఫీహోటేల్లోనుంచి వచ్చి ఒక మగాడూ ఒక స్త్రీ అక్కడున్న జట్కా ఎక్కారు. గులాబీరంగుచీర గుమ్మటంలాంటి విగ్రహమేను. జీవదంతంలాంటి శరీరం. కొంచెందూరంగానున్నా ముక్కుమాత్రం పట్టిచూచాను. ముచ్చటయిన ముక్కే. ముద్దుగుమ్మలాంటి ముక్కే. అది అబద్ధమయిందిగాని ఇదిమాత్రం నిజమే అనుకున్నాను. తెల్లవారుజాము కల తేలిపోతుందా! ముద్దుగుమ్మ కనిపిస్తాను లెండి అని మోసం చేస్తుందా! గబగబ పరిగెట్టాను గాని గాలిలాగ ఎగిరిపోతూవుంది జట్కా.

పక్కనేవుంది బైస్కిల్‌షాపు. పారేశాను రెండణాలు. ఒకగంటసేపటిదాకా బైస్కిల్ బాడుగికి తీసుకున్నాను. పడ్డాను బైస్కిల్‌మీద బహుపరాక్రమమంతా చూపి. పిక్కబలంకొద్దీ తొక్కడం ఆరంభించాను. కొట్టినగంట కొడుతూనే వున్నాను. పంజాబ్ మెయిల్‌లాగ పరిగెడుతూవుంది నా బైస్కిల్......

కంటబడ్డాది మళ్లీ జట్కా. మగవాడు ముందుకూర్చున్నాడు. ఈమె యిటువైపు కూర్చుంది. ఒకరి కెదురుగా ఒకరు కూర్చొని మాటలాడుకుంటున్నారు. సగంమొఖం నాకు చక్కగా కనిపిస్తూనే వుంది. ముక్కూ కన్నూ ముద్దుగుమ్మవే. నావైపే వుం దొకకన్ను. బైసికిల్ జోరుతగ్గించి బండికి పదడుగులదూరాన్నే నడిపిస్తూ వున్నాను. అతనితో మాటలాడుతూనేవుంది గాని కన్నుమాత్రం నామీదనుంచి తప్పించలేదు. కలలో ముద్దుగుమ్మగూడా అలాగే చూసింది. మెల్లిగా ధైర్యంచేసుకొని బైస్కిల్‌మీదనుంచే కన్నుగీటాను ఒక్కసారి. వాళ్లమాటల్లోనే ఏదో మిష పెట్టి పకాపకా నవ్వింది. నాముద్దుగుమ్మ నవ్వే. నామనసు గంతులేస్తూంది. సమయం చూసుకొని తల ఊపాను. పక్కున నవ్వింది. నాహృదయం తుప్పున తుళ్లింది. ఆహా! ఏమి అందం!

అలా అప్పుడప్పుడు నవ్వుతూనేవుంది. నన్ను చూస్తూనే వుంది. అతనితో మాటలాడడంమాత్రం మానలేదు. అవును మరి. లేకపోతే అనుమానం పడడూ! నేనుగూడా అతనిదృష్టి నామీద లేనప్పుడు కన్నుగీటుతూనే వున్నాను. చిన్నచిన్న చిరునవ్వులు నవ్వుతూనే వున్నాను. ముఖంలో హావభావాలు కనబరుస్తూనే వున్నాను. కనిపిస్తాను లెండి అన్నందుకు కనిపించి కళ్లునింపుతున్నా వని అనుకుంటూనే వున్నాను.

ఆసీల్ గేటుదగ్గి రాగింది బండి. జట్కావాసు డబ్బు కడుతూన్నాడు. ఆయ నలా చెట్లవైపు వెళుతూన్నాడు. నేనూ బైసికిల్ దిగి మెల్లిగా బండిదగ్గిరి కెళ్లాను. హృదయం తటతట కొట్టుకుంటూంది. ఒక మోస్తరు సిగ్గూ కలిగింది. ఎలాగైతేనేం ధైర్యంచేసుకొని—తలవంచుకునే—' రేపుకనిపిస్తానులెండీ ' అని యిలాజట్కాలో ఎగిరిపోతుంటే న్యాయమేనా ? " అన్నాను శృంగారరసధ్వనులతో నాముద్దుగుమ్మతో.

" ఎవరబ్బాయ్ నువ్వూ ! ఎవరనుకొని కూస్తావున్నావ్ " అనివచ్చింది ఫిరంగిమోత లాగ ప్రత్యుత్తరం.

నిర్ఘాంతపోయి తలెత్తి చూశాను. ఆ కళ్లనుండి చింతనిప్పులు రాల్తూన్నాయి. ఒక్కకన్ను నాదిక్కే చూస్తూంది గాని ఇంకొక్కన్నుమాత్రం మరొకదిక్కు చూస్తూంది. ఈకన్నే యింతసేపూ నేను చూచింది.

అన్నా ! మెల్లకన్నురా దేవుడా! అని బైస్కిల్ మీదపడి పక్షిలా గెగిరిపోయాను. వెనకనుంచి ఆ మగాడు తిడుతూన్నా తిట్లు తారం మధ్యం మంద్రం అయి మహావకాశంలో మాయమైపోయాయి.

వాళ్లమాటల్లో వాళ్లు నవ్వుకుంటూవుంటే నన్నూ నా కన్నుగీటునూ చూచి నవ్విం దనుకున్నానుగదా! అన్నా మెల్లకంటి ప్రభావం! అయ్యో ! పాపం ఆకన్నేంచేసింది !...

బైసికిల్ వాళ్లకిచ్చి పాడుముండారోజు అని పడతిట్టుకుంటూ 6 మైళ్లూనడిచి అస్తమయం అయేవేళ కిల్లు చేరుకున్నాను. ఆర్థిక దురవస్థవల్లనూ, ఆ స్త్రీపాస్త్రీ అనుకున్న నా అర్థరూపాయీ అన్యథా ఖర్చయినందువల్లనూ, ఆవేళంతా నిరాహారదీక్ష అయింది, ఆసంగతంతా ఎందుకులెండి.

గులాబీరంగుచీర గుమ్మటంలాంటి విగ్రహం నాకొంపకూల్చేసింది అమాంతంగాను.



## భావగీతములు

కరి నారాయణాచార్యులు గారు

ఒక నతాంగి వసంతకాలోదయమునఁ
జండచక్రీకృతాత్మకోదండదండుఁ
బంచసాయకుఁ గాంచి విభాసమాన
లలితసౌరభయుతసుమాంజలి ఘటించె.

(పుష్పదళనారి భంగము కావలెనని భావము)

రమణి యొక్కతె వాసంతసమయమందుఁ
బుష్పితారామసీమకుఁ బోయి యచట
సౌరభాంచితనైజనిశ్వాసవాయు
వులను విడువక యల్లన మెలఁగుచుండె.

(భృంగాగమనభీతిచేత నని భావము)

తరుణి యొక్కతె తృషచే నిదాఘువేళ
స్వర్ధునిం జేరి యమృతసవర్ణమైన
తజ్జలంబును దోయిటఁ ద్రావఁబూని
పానమును మానెఁ జూచుచు దేనివలనో ?

(కరపద్మకాంతి క్రాంతిచే రక్తమనుశంక కలిగెనని భావము)

ప్రశ్నసంస్మృతవిరహసంత్రస్తఁ డగుచు
గృతకతుకనేత్రమీలనలీలఁ దైన
రాఘవుఁడు పూర్ణచంద్రుఁ జిరంబుఁ జూచు
జాయ కన్గవ మూసెఁ జేదోయి నపుడు.

(కనకమృగముంబలె, మృగాంక మృగమునుగూడ నీవె
యాచించు ననుభీతిచేత ననిభావము)

అంగజాతుర యయి పరిష్వంగలోల
యయ్యు లలితాంగియైన క్షీరాబ్ధికన్య
' చూడకుము ! చూడకుము ! నాథ ! సుందరాంగ ! '
యనుచుఁ బల్కెను నారాయణున కదేమొ ?

(హరి చూచినచో నేత్రీభూతుఁడును, సహోదరుఁడును
నైన చంద్రుఁడు చూచునని భావము)

విదుషి యా నొక్కకామిని విభునిగూడి
మణిమయంబైన మంటపమధ్యమందుఁ
గ్రీడఁదేలుచు నేర మొక్కింతలేక
వాని దన్నెఁ దా నాత్మీయ పాదములను.

(స్వప్రతిబింబమును జూచి వనితాంతర మను భ్రాంతిచేత నని భావము)

ఇందుశేఖరు శిరమునం దిమ్ముమీఱ
నలరు మందాకినిని వెస నార్య చూచి
యలఘుతరమానవతియై ధవాంగకమున
నొక్కచోఁ జుంబనముఁ జేసె నోర్వలేమి.

(శ్రోభాతిశయముచే సవిషమైన కంఠము చుంబితమైనదని భావము)

తొలుత సంభ్రమ మంతయు బలిమిఁ ద్రావి
పిదప నాతఁడ దేలొకో విడిచిపెట్టె
గోకవక్షోజల విరహవ్యాకులముల
నెఱుఁగఁడేమొకొ ! యమ్మునీశ్వరుఁ డొకింత.

(పానము జేయబడ్డ చంద్రుఁడు మరల విడిచిపెట్టఁబడెనని భావము)

రమ్యసౌధస్థలమున విరహిణి యొకతె
విగతసర్వాంబుధరశరద్వేళయందుఁ
బండుకొని, దేవదానవకుండలీంద్ర
కలశజలధుల నిందించె గాఢగతిని.

(వీరలచేఁ జంద్రుఁ డుద్భవించెనుగదా యని భావము)

సుదతి లీలాసరోజముఁ జూచుచుండ
నొక్క మధుకరమైన లేకున్న, నహహా !
కామవివశమిళింద మొక్కటి సలీల
భృంగియను శంకమై నందుఁ బ్రీతిఁ బ్రాలె.

(కమలమందు దృక్కాంతిని జూచుటవలన ననిభావము)

ఆంధ్రీకరణము

